# కమ్యూనిస్టుల ఐక్య సంఘటన అన్వేషణ

(తృతీయ సంపుటి-సి)

# నక్సల్బరీ పర్వం

డి. వి. సుబ్బారావు

కాంతిరేఖ ప్రచురణలు

ఫోన్ : 58109

చిలువూరు - 522 332

కమ్యూనిస్టుల ఐక్యసంఘటన అన్వేషణ
నక్సల్బరీ పర్వం
ప్రచురణ నం. 5,
డిశెంబరు, 2000



ప్రతులకు :

1. అన్ని "విశాలాంధ్ర" బుక్ షాపులలోను - విజయవాడ, హైదరాబాద్ etc.
2. అన్ని "ప్రజాశక్తి" బుక్ షాపులలోను - విజయవాడ, హైదరాబాద్ etc.
3. మైత్రి బుక్ షాపు, విజయవాడ—మసీదు రోడ్డు.
4. స్పందన బుక్ షాపు, విజయవాడ - మ్యూజియం రోడ్డు.
5. నవోదయ బుక్ షాపు, విజయవాడ-ఏలూరు రోడ్డు.
6. డి.వి. సుబ్బారావు, చిలువూరు - 522 332, గుంటూరు జిల్లా.
   Ph. No. 85109

వెల : రు. 60-00

ముద్రణ :
డి. బి. ప్రింటర్స్
విజయవాడ-520 002

# ప రి చ యం

కమ్యూనిస్టు ప్రణాళిక షుమారు 150 సంవత్సరాల క్రితం ప్రచురిత మైంది. ఆనాటినుండి అతివాద ఆలోచన అనేక ఐరోపా దేశాల్లో వివిధ స్థాయిల్లో మార్క్సిజం ప్రభావంవల్ల వేళ్ళూనింది. చిన్న చిన్నవి, కొన్నిసార్లు ఉధృతంగా కూడ, ఉద్యమాలు తలెత్తినాయి. చివరికి రష్యాలో 1917 అక్టోబరు విప్లవంలో లెనిన్ కార్మికవర్గం రాజాధ్యికారాన్ని సంపాదించింది.

మార్క్సిజం ప్రభావం అక్టోబరు విప్లవం తర్వాత, ఆసియాదేశాలకు కూడా వ్యాపించింది. ముఖ్యంగా చైనా, ఇండియాలో ఈ ప్రభావం చాలా బలంగా నాటుకుంది. ఐరోపా దేశాల మాదిరిగానే, ఈ దేశాలలో కూడ అతివాద సిద్ధాంతాల ప్రాతిపదికపై చిన్న పెద్ద ఉద్యమాలు తలెత్తడం, కొంతవరకు ముందుకెళ్ళడం, ఆ తర్వాత అంతరించడం జరుగుతూ వచ్చింది. భారతదేశంలో గదర్ ఉద్యమం, దీనికి తార్కాణంగా పేర్కొనవచ్చు. ఇలా ఏర్పడిన శలవేళ్ళలో నగ్జలిజం ఒకటి. భారతదేశంలో పశ్చిమ బెంగాల్లో ఒక ప్రాంతంలో, భూమిలేని పేదరైతాంగం అక్కడి భూస్వాములకు వ్యతిరేకంగా ప్రారంభించిన పోరాటమే నగ్జల్‌బరీ పోరాటం.

ఈ పోరాటం ప్రపంచ చరిత్రలో అధిక ప్రాధాన్యత లేకపోయినా మన దేశంలో మాత్రం సైద్ధాంతిక చర్చలకు ఎత్తుగడలను గూర్చి తీవ్రమైన అభిప్రాయ భేదాలకు దారితీసిన పోకడలకు కారణమైంది.

ఈ ఉద్యమం పుట్టుపూర్వోత్తరాలను గూర్చి, మనదేశంలో అతివాద రాజకీయ పార్టీలమీద ఈ ఉద్యమం యొక్క ప్రభావాన్ని గూర్చి డి.వి. సుబ్బారావుగారు చాలా వివరంగా ఈ పుస్తకంలో చర్చించారు. ఈ చర్చలో నగ్జల్‌బరీ ఉద్యమంలో వచ్చిన పరిణామాలను, వామపక్షాలలోను (ముఖ్యంగా సి.పి.ఐ., సి.పి.ఐ.(యం), నగ్జల్ ఉద్యమంలోను వచ్చిన వివిధ గ్రూపుల అభిప్రాయాలను వివరించారు. ఇందుకు శ్రీ సుబ్బారావుని అభినందించాలి.

ఈ ఉగ్రవాద ఉద్యమం ఒరిస్సా, ఆ తర్వాత ఆంధ్రలో శ్రీకాకుళం, తెలంగాణా, అక్కడనుండి ఆంధ్రకు సరిహద్దుగావున్న కన్నడ, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ రాష్ట్రాలకు కూడ కొంతవరకు వ్యాపించింది. కాని ఆంధ్రలో మాత్రం అదొక రాజకీయ శక్తిగా పెరిగింది.

ఈ గ్రంథంలో శ్రీ సుబ్బారావుగారు పొందుపరిచిన పరిశీలన వామపక్షాల యొక్క మార్క్సిస్టు సిద్ధాంత అవగాహనతో కూడినది. కాని ఉద్యమం యొక్క స్వరూపాన్ని, అసలు భారతదేశంలోని వామపక్ష ఉద్యమాల ప్రగతి పరిణామాలను అంచనా వెయ్యడానికి కొన్ని మార్క్సిస్టు మౌలిక సూత్రాలను మరల మనం జ్ఞాప

కం చేసుకోవాలి. అంతేగాక వాటిని 20వ శతాబ్దపు చరిత్ర కాంతిలో చూడాలి. ఈ సందర్భంగా కొన్ని సమస్యలను స్థూలంగా చూద్దాం

నగ్జల్ ఉద్యమం భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా ఉద్భవించింది. అయినపుడు దాని గమ్యం కాపిటలిస్టు ఆర్థిక వ్యవస్థా, లేక సోషలిజమా? సోషలిజమే అయితే కాపిటలిజాన్ని కాదని, ఫ్యూడలిజం నుండి సోషలిజంలోకి దూకుట సాధ్యమేనా?

యంత్రాలతోను, యాంత్రిక వాతావరణంతో కూడిన ఆర్థిక వ్యవస్థతో సంబంధంలేని వ్యవసాయ శ్రామికవర్గం ఆయుధాలను చేబట్టి, వాటిని వినియోగించే విప్లవ చైతన్యం కలిగి వుంటుందా? అలాంటి విప్లవ పోరాటానికి కావలసిన ప్రజా భూమికను (Mass Bese) నిర్మించుకోగలదా?

భారతదేశంలో వామపక్ష ఉద్యమం సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఐక్యంగా పోరాడింది. కాని స్వాతంత్ర్యానంతరం ఈ ఉద్యమం, ముందు రెండుగా ఆ తర్వాత నగ్జల్ ఉద్యమ రూపంలో ఎన్నో శకలాలుగా విచ్ఛిన్నమైంది. వ్యక్తుల చుట్టూ పరిభ్రమించే గ్రూపులుగా కుంచించుకు పోయింది. వ్యక్తి ప్రాధాన్యత కంటే ఉద్యమం ముఖ్యం అనే చైతన్యం లోపించడాన్ని ఇది సూచించదా? ఇది ఫ్యూడలు నాయకత్వ లక్షణంగాదా? ఈ పరిణామం ఫ్యూడలిజం నుండి సోషలిజంలోకి గంతు వెయ్యాలనుకొని, చతికిలబడి దెబ్బతినడంవల్ల కలిగిన ఫలితం గాదా ?

క్లుప్తంగా చెప్పాలంటే సామాజిక పరిణామానికి చెందిన చారిత్రక భౌతిక వాద సూత్రాలను, ఈ సూత్రాలలో జెప్పిన ఆర్థికశక్తుల చోదకశక్తిని విస్మరించి, ఒక్కొక్క నాయకుడు ఒక్కొక్క సిద్ధాంతాన్ని ప్రతిపాదించి అడవులలో సోషలిజాన్ని నిర్మించే సుష్క ప్రయత్నం కొరకు ప్రాణాలొడ్డడమే గదా ?

ఈ ప్రశ్నలకు సమాధానం కావాలంటే మరికొన్ని ప్రశ్నలను కూడా మనం ఎదుర్కోవాలి.

అమెరికా పాశ్చాత్య దేశాల పారిశ్రామిక స్తోమతను ఎదురించి, ఏడు దశాబ్దాలు నిలబడి వలసదేశాల విముక్తి పోరాటాలకు బాసటగా నిలిచిన సోవియట్ యూనియన్ సోషలిస్టు వ్యవస్థ ఎందుకు కుప్పకూలిపోయినాయి? వలస దేశాల విముక్తికి దోహదం చేయటం వరకే సోవియట్ యూనియన్ చారిత్రక పాత్ర అని అనుకుందామా?

ఏ ఒక దేశంలోనైనా సోషలిజం నిర్మించవచ్చు అనే లెనిన్ సూత్రీకరణ ఈనాటి ప్రాపంచీకరణ (Glolealisateon) పరిస్థితులలో ఏ విధంగా అవగాహన చేసుకోవాలి?

అక్టోబరు విప్లవానికి ముందు రష్యా అర్థ ఫ్యూడలు దేశంగా వుంది. కాబట్టి సోషలిస్టు వ్యవస్థకు అనువైన పరిస్థితులున్నాయా? అనే అనుమానానికి సమాధానంగా

లెనిన్ రష్యాలో ఆనాటికే కాపిటలిజం విప్లవానికి కావలసిన కనీసపు మేరకు అభి వృద్ధి చెందిందని, సోషలిస్టు వ్యవస్థాపనకు కావలసిన మౌలిక పరిస్థితులున్నట్టు లెనిన్ ఆనాటి ప్రపంచ విప్లవోద్యమాలకు నచ్చచెప్పాడు. అయితే దారితప్పి వెళ్ళి నట్లుగా వెనుదిరిగి ప్రధాన రాస్తాకు (Main line) వచ్చినట్లు రష్యా ఎందుకు విపణి వీధి వ్యవస్థ (Market aconcmy)కు మారింది?

రష్యాలో 70 సంవత్సరాలు సోషలిస్టు పాలన తర్వాత కూడ శ్రామికవర్గం (Proletariat) తగినంతగా అభివృద్ధి చెందక పోవడంవల్ల ఆ వ్యవస్థ అస్థిరతకు గురైనదా? అంతేనా లేక గోర్బచేవ్ వ్యక్తిగత తప్పిదాల వల్లా? వ్యక్తులే చరిత్ర చోదక శక్తులైతే మార్క్సిజాన్ని మనం తిరిగి వ్రాయవలసి ఉంటుంది.

చైనాలో 1949వ సంవత్సరంలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడింది. ఆ తర్వాత కొద్ది కాలానికే రష్యాతో సరిహద్దు తగాదా పెట్టుకుంది. అంతర్జాతీయ సిద్ధాంతానికి కట్టుబడి ఉండే రెండు కమ్యూనిస్టు రాజ్యాల మధ్య ఇలాంటి గిల్లి కజ్జాలు పొడసూపుట చూచి ప్రపంచమంతా విస్తుపోయింది. అంతేగాకుండా రాజ్యాధి కారాన్ని చేపట్టిన కొద్ది కాలంలోనే చైనా కమ్యూనిస్టు పార్టీ మావోకి దైవత్వ ముద్రను వేసింది. ఈ సందర్భంలో బ్రిటిషు కమ్యూనిస్టు సైద్ధాంతికవేత్త రజనీ పామీదత్తు ఒక విశ్లేషణ ఇచ్చాడు. చైనా ఫ్యూడలు సమాజం కావడంవల్ల పారి శ్రామికవర్గం అక్కడ (Proletenat) లేదు. అందుచేత ఆ పార్టీకి అంతర్జాతీయత లోపించిందని వివరించాడు.

ఈ వివరణను విస్తరించితే, సోషలిస్టు వ్యవస్థ తిరోగమించి మార్కెటు వ్యవస్థకు మరలడానికి, నక్సల్ ఉద్యమంగాని, భారతదేశంలో వామపక్షాలు ప్రజ లలో వేళ్ళూని బలమైన భూమికను ఏర్పరచుకోలేక పోవడానికి కారణాలు కనిపించ వచ్చు. భారతదేశంలో వామపక్షాలు బలపడాలంటే పారిశ్రామికవర్గం (Proleta- riat or industrial working class) బలపడాలి. ఈ బలం ముందు సంఖ్యా పరం (Quantilatue)గా ఉండాలి. దానికి దేశం పారిశ్రామిక దిశలో అభివృద్ధి చెందాలి. ఈ అభివృద్ధికి దోహదం చేసినపుడే వామపక్షాలు తమ మనుగడను బల పరుచుకొని సామాజిక పరిణామానికి దోహదం చెయ్యగలవు. అప్పటి వరకు వారు తమ అస్థిత్వం నిలబెట్టుకోగలరేమోగాని, గణనీయమైన పాత్ర నిర్వహించడం మాత్రం సాధ్యంకాదు. ఈ మౌలిక విషయాన్ని ఎంత తొందరగా వారు గ్రహిం చితే అంత మంచిది. గ్రహించడమేగాక ఆచరణలోకి తేవాలి కూడా.

ఆఖరి విషయం. అసలు మార్క్సిజాన్ని యధాతథంగా ఆమోదించాలి సిందేనా, లేక సమకాలీన ప్రపంచ పరిస్థితులను బట్టి ఏదైనా క్రొత్త పరిశీలన చెయ్యాలా' అనేది ఇంకొక ముఖ్యమైన అంశం. మార్క్సిజం అంటే వేదంలాగానో ఖురాను బైబిలు మాదిరి పవిత్ర గ్రంథం అనే భావం చాలామందికి కలదు. పైకి అంగీకరించకపోయినా లోలోపల ఇలాంటి భావాలకు లోనైన మార్క్సిస్టులు చాలా

మంది ఉన్నారు. విచిత్రం ఏమిటంటే అలాంటి భావం అసలు మార్క్సిజానికే వ్యతిరేకం. ప్రతిదీ మారుతుందనేది ఒక ముఖ్యమైన గతితార్కిక సూత్రం. "మార్పు తప్ప అన్నీ మారతాయి". కొన్ని ఉదాహరణాలని పేర్కొందాం.

కాపిటలిజం వున్నంతకాలం యుద్ధం అనివార్యం అని లెనిన్ ఒకనాడు చెప్పాడు. కాని అణుబాంబుల యుగంలో ఆ సూత్రాన్ని ఎవరైనా సమర్థించ గలరా?

సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెంది ప్రపంచీకరణ జరిగే ఈ యుగంలో వెనుకబడిన దేశాలు వేగంగా అభివృద్ధి చెంది ముందున్న దేశాల స్థాయిని చేరుకునే అవకాశాలు పెరిగాయి. కొన్ని దశాబ్దాల తర్వాత వ్యత్యాసాలు తగ్గి ప్రపంచమంతా క్రమంగా మారి ప్రపంచవ్యాప్తమైన విప్లవాన్ని సమీపిస్తుందని ఆశించవచ్చు.

అదేవిధంగా సాంకేతికాభివృద్ధి వలన మానవ శ్రమశక్తియొక్క ఉత్పాదకత (**Productivity**) పెరిగి, సామాజిక ప్రయోజనాలను ఇప్పటికంటే ఎక్కువగా తీర్చగలిగే పరిస్థితులు ఏర్పడే అవకాశం గోచరిస్తోంది. ముఖ్యంగా శ్రామిక వర్గం నిరంతరం శ్రమించే భౌతిక పరిస్థితుల నుండి విముక్తి చెంది మానవ స్థాయిలో జీవించడానికి కావలసిన ఆర్థిక స్తోమతను పొందే సూచనలు కూడా కనిపించు తున్నాయి. ఈ దశలో సంపదను ప్రోగు చేసుకునే పేరాశ (greed) బలహీన పడి దోపిడి తత్వం క్రమంగా పసలేని శక్తిగా మారుతుంది.

ఇలాంటి మార్పులు ఆర్థికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా ఎన్నో రాగలవు. వాటిని కొత్త దృక్కోణంను పరిశీలించాలి. ఈ పరిశీలనలో గణనం లోకి తీసుకోవలసిన అతి ముఖ్యమైన అంశం సాంకేతికాభివృద్ధి.

ఈనాడు మనం చూస్తున్న సాంకేతికాభివృద్ధి మార్క్స్ కాలంలో లేదు. ఆనాడున్న సాంకేతికాభివృద్ధిని, ఉత్పాదకతను ప్రమాణంగా తీసుకుని, మార్క్స్ తన పరిశీలన చేశాడు, దాని నుండి కాపిటలిజం పతనమౌతుందన్నాడు. కాని మార్క్స్ కాలం తర్వాత సాంకేతిక ప్రగతి కాపిటలిజం యొక్క స్వభావాన్ని, దాని జీవితకాలాన్ని, దాని పరివర్తనా విధానాన్ని మార్చింది. ఇది ఈనాటి గోడమీద వ్రాత. ఈ విషయం మార్క్స్ పరిశీలనలో లోపించింది. దానిని పూరించినపుడే ఈనాటి సామాజిక పరిణామాన్ని అవగాహన చేసుకోగలము. అదే సరియైన మార్క్సిస్టు అవగాహన, గతితార్కిక పరిశీలన.

ప్రొఫెసర్ వి. వి. కృష్ణారావు
భౌతిక శాస్త్రం (Rtd.)
ఆంధ్ర లయోలా కాలేజి, విజయవాడ.

అక్టోబరు,
2000

# రచయిత తొలిపలుకులు

"కమ్యూనిస్టుల ఐక్యసంఘటన అన్వేషణ" గ్రంథావళిలో "నక్సల్బరీ పర్వం" తృతీయ సంపుటిలోని మూడవ భాగము. భారత కమ్యూనిస్టు ఉద్యమ గంగా, యమున స్రవంతుల వలెనె నక్సలిజం "సరస్వతి" స్రవంతిగా నెంచబడింది.

అత్యంత పురాతన భారత సమాజం, వేటాడి జీవించే ఆటవిక తెగల నుండి ఆధునిక ఆటం పారిశ్రామికోత్పత్తి శక్తులవరకు అన్ని దశల జీవన విధానాలు గలదై వందకోట్లకు చేరింది. కమ్యూనిస్టు శ్రేణులు సామాజిక న్యాయం కొరకు సోషలిస్టు విప్లవ మహాయజ్ఞాన్ని నిరవధికంగా చేస్తూ యీ నెలలో వజ్రోత్సవం జరుపుకొనబోతున్నవి. ఈ మహాయజ్ఞంలో ఎందరో మహానుభావులు సమిధలుగా ఆత్మత్యాగం చేశారు. అందరికీ విప్లవ జోహార్లు.

కమ్యూనిస్టు ఉద్యమానికి దిక్సూచికగా ఉండే విప్లవపంథా, కార్యక్రమం, రాజకీయ విధానం లేకుండానే మూడు దశాబ్దాలు వర్గపోరాటాలు జరిగాయి. యుద్ధానంతర వలస స్వాతంత్ర్య విప్లవ పోరాటాల వెల్లువలో ఉజ్వలంగా లేచిన తెలంగాణా రైతాంగ సాయుధ విప్లవ పోరాట మహాకెరటం, పున్నప్రా- వయలార్, తెభాగా ఉపకెరటాలు ప్రప్రథమంగా విప్లవపంథా, కార్యక్రమాల సమస్యలను ఎజెండాలోనికి తెచ్చాయి.

ఆదేశాలంతో భారత విప్లవం "రష్యా పంథా" లేక "చైనా పంథా" అనుసరించాలా అనే యాంత్రిక సైద్ధాంతిక చర్చలలో మితవాద, అతివాద, ఉగ్ర వాదాలుగా కరుడుగట్టిన మూడు శ్రేణులుగా రూపొందాయి. ఫలితంగా 1964 లో కమ్యూనిస్టు ఉద్యమం చీలి సి.పి.ఐ., సి.పి.ఐ.(ఎం)లు ఏర్పడినవి. అచిరకాలంలోనే సి.పి.ఐ.(ఎం)ని నియో సంస్కరణవాదం చేబట్టిందని, దానిలోని ఉగ్రవాదులు చీలిపోయి 1968లో సి.పి.ఐ. (ఎం.ఎల్)గా ఏర్పడ్డారు. కమ్యూనిస్టు శ్రేణులన్నీ తరతమ భేదాలతో 1951 నాటి కార్యక్రమం, ఎత్తుగడల పంథాకు కట్టుబడి వున్నామని చెబుతూ, మారిన రాజకీయ పరిణామాల వాస్తవిక ప్రభావంలో ఆచరణలో వాటి అమలును అలమారీలలో భద్రపరచారు. కార్యక్రమ సిద్ధాంతం-ఆచరణల మధ్య అఘాతం ఎంత విస్తరించినా, చూడదలచక చూడలేకపోయారు. అర్థశతాబ్దం తరువాత పునాదులు కదలిపోయి, బీటలువారుటతో పునరాలోచన, కార్యక్రమాలకు అతుకులు వేయుట ప్రారంభమైంది.

5. నక్సల్బరీ పర్వంలో దాని అవతరణ, అందుకు జాతీయ, అంతర్జాతీయ నేపథ్యం, సిద్ధాంతం, ఆచరణ, వివిధ ధోరణులు, పరిణామాలు, వివిధ గ్రూపులు

ఏర్పడుట పరిశీలన, అధ్యయనం చేయుట జరిగింది. అంతేగాక నక్సల్బరీ వివిధ గ్రూపుల మధ్య ఐక్యత, సహకార ప్రయత్నాలు నత్తనడకలో పురోగమనం సాగింది. ఈ పరిణామాలన్నిటినీ పాఠకుల ముందుంచబడినది.

6. మార్క్సిస్టు–లెనినిస్టు విప్లవ కమ్యూనిస్టు శ్రేణులు 1990 దశకంలో సంక్షోభంనుండి బయటపడి, ఏకాభిప్రాయంకల మౌలికాంశాలకే నిర్ణయాత్మక ప్రాముఖ్యత నిచ్చుటతో పునరైక్యతాక్రమం ఆచరణలోనికి వచ్చి, కొన్ని విజయాలు చేకూరుటతో భవిష్యత్తు ఆశాజనకమైంది.

7. అర్థశతాబ్దం క్రితం అణువిచ్ఛేదన జరిగింది. అన్ని శాస్త్రాలలో పూర్వ మౌలిక సిద్ధాంతాలన్నీ త్రోసివేయబడి నూతన సిద్ధాంతాలు రూపొందిన ఫలితంగా పారిశ్రామిక సాంకేతికశాస్త్ర విజ్ఞానమే మరో నూతన ఉత్పత్తిశక్తిగా అవతరించింది. ఉత్పత్తిశక్తుల నిర్వచనమే పునరాలోచించవలసిన పరిస్థితి ఏర్పడింది.

8. నేడు జాతీయ, అంతర్జాతీయ ఆర్థిక, రాజకీయ, సైద్ధాంతిక ఆలోచనా విధానాలలో విప్లవాత్మక మార్పులువస్తున్నప్పుడు, బీటలువారిన ఆలోచనా పునాదుల లోనే ఆచరణలను తాజాపరచే ప్రయత్నాల విజయం ప్రశ్నార్థకమే అగుతుంది. సైద్ధాంతిక ఆలోచనా విధానాలలో సాంప్రదాయ పరిధుల నధిగమించి, సాహసంతో శాస్త్రీయ విధానాలను రూపకల్పన చేయాలి. ఈ నూతన సహస్రాబ్ది ప్రారంభంలోనే పునరైక్యమై నూతన ప్రజాస్వామ్య సోషలిస్టు భారతాన్ని నిర్మించే పంథాని చేపట్ట గలరని ఆశిద్దాము.

డిశెంబరు, 2000.

దేవినేని వేంకట సుబ్బారావు

# విషయసూచిక

# 12

# నక్సల్బరీ పర్వం

## 1

## అంతర్జాతీయ రాజకీయ పరిణామాలు

ప్రపంచ ఆర్థిక సంక్షోభానికి దారితీసే పరిస్థితులన్నీ 1964 నుండి నాలుగు సంవత్సరాలలో వేగంగా విషమించాయి, పెట్టుబడిదారీ ఆర్థిక శాస్త్రవేత్తలు, సంక్షోభాన్ని నివారించే నూతన మలుపు పెట్టుబడిదారి విధానంలో వచ్చిందని పురోగమనానికి ఉత్పత్తి శక్తులకు అవకాశాలు అభివృద్ధి చెందినవనుట కల్లయని తేలింది. బ్రిటిష్ పౌండు, తదితర 24 దేశాల కరెన్సీల విలువ తగ్గుటతో, డాలరు విలువ తగ్గుట, పెట్టుబడిదారి విధానంలో సంక్షోభ పరిస్థితి యేర్పడినది. పౌండు సంక్షోభంతో ప్రారంభమైన ఆర్థిక సంక్షోభం సంవత్సరంలో ప్రపంచ పెట్టుబడిదారి విధాన సంక్షోభమైంది.

గత 20 సంవత్సరాలలో పెట్టుబడిదారి విధానం మూడుసారులు సంక్షోభంలో పడిపోయి, సరుకుల విలువలు మార్కెట్టులో అమ్మకాలు లేక మురిగిపోయాయి. మొదట సంక్షోభం 1948-52, రెండవది 1957-58, మూడవది 1964-65-67 లలో వచ్చి, అన్నిదేశాలకు వ్యాపించింది. ఈ మూడవ సంక్షోభం, ప్రపంచ సాధారణ ఆర్థిక సంక్షోభ పరిస్థితులలో వచ్చింది.

పెట్టుబడిదారి వుత్పత్తి వాస్తవానికి 1963-1966 లలో మెరుగై కొంత పెరిగింది, కాని అభివృద్ధిరేటు 1967 నుండి పడిపోయింది. ఉత్పత్తి పెరుగుదల ప్రధానంగా సైనికఖర్చు పెరుగుట, ఆయుధోత్పత్తి పోటీ పెరుగుటతో పెరిగిందని చెప్పవచ్చును. మరో ముఖ్యకారణం వియత్నాం యుద్ధం, ఆయుధాలకు మార్కెట్టు పెరుగుట వలన జరిగింది. వియత్నాం దారుణ మారణ యుద్ధకాండతో ప్రధానంగా అమెరికా అర్థిక పరిస్థితి బాగా మెరుగుపరచుటతోపాటు, జపాన్, కెనడా, ఆస్ట్రేలియాలకు అమెరికా నుండి ఆయుధాల కాంట్రాక్టులు లభించాయి. యుద్ధ కారణంగా పెరిగిపోయిన ఆయుధాల వుత్పత్తి, వినియోగం, విదేశీ అప్పులు, ద్రవ్యోల్బణం విదేశీ వ్యాపారంలో తరుగుదలకు మరిన్ని సరుకులు ఎగుమతులు చేయుటద్వారా సరిచేయబడినవి. అదేకాలంలో, పెట్టుబడిదారి విధాన అభివృద్ధి అసమానత ఫలితంగా ఇటలీ, జపాన్‌లు యీ కాలంలో పురోగమించాయి. పెట్టుబడిదారి దేశాల మధ్య, గుత్తపెట్టుబడిదారుల గ్రూపులమధ్య వైరుధ్యాలు పెరిగిపోయాయి.

కాపిటలిస్టు ప్రపంచంలో అత్యద్భుత వుత్పత్తి విజయాన్ని అనగా 14:1 శాతపు పారిశ్రామిక ఉత్పత్తి అభివృద్ధిని 1955-66 లకు మధ్య జపాన్ సాధించింది. ఇదే కాలంలో కాపిటలిస్టు ప్రపంచం 5.4 శాతపు అభివృద్ధి రేటును మాత్రమే సాధించింది. ఇటలీ, ఫ్రాన్స్, బ్రిటనులను మించిపోయింది. జపాన్ యీ విజయాన్ని అమెరికా తదితర యూరోపియన్ దేశాలలో వచ్చిన సాంకేతిక విప్లవ విజయాలను, అమెరికా గుత్తపెట్టుబడితో సంయుక్త పారిశ్రామిక వాటలను, నూతన పారిశ్రామిక సాంకేతిక పరిజ్ఞానాన్ని దిగుమతి చేసుకొని సాధించింది.

జపాన్ సాధించిన విజయాలకు కారణాలను సి. పి. ఐ (యం) 8వ, పార్టీ కాంగ్రెసుకు సమర్పించిన పొలిటికల్ ఆర్గనైజేషనల్ నివేదికలో యిలా సూచించింది. టోకియో "ఎకనమిస్టు" శ్రామికోత్పత్తి శక్తి జపాన్‌లో బ్రిటన్‌లో కంటె 97.3, పశ్చిమ జర్మనీ కంటె 87.5, ఫ్రాన్సు కంటె 59.6 శాతాం పైగావుంది. వేతనాల స్థాయి బ్రిటన్‌లో కంటె 20.0, పశ్చిమ జర్మనీ కంటె 12.2 ఫ్రాన్సు కంటె 33.4 శాతాలు తక్కువగా వున్నవి. అమెరికాతో పోల్చిన శ్రామిక వుత్పత్తి శక్తి 20.0, వేతనాలు 73.3 శాతాలు తక్కువగా వున్నవి. ఈ పరిస్థితులలో ఆటోమాషన్, తక్కువ వేతనాలు, నిరుద్యోగం వంటి ఆయుధాలను మలచుకొని ఆశ్చర్యకర యీ విజయాలను సాధించింది.

ఆయుధీకరణతో యుద్ధ సామాగ్రి సప్లయి ఆర్డర్స్‌తో పరిశ్రమలు ఉత్పత్తి శక్తి సామర్థ్యాన్నంతా వినియోగించుటతో, ముఖ్యంగా ఆయుధాలు పరిశ్రమలు గుత్త పెట్టుబడిదారుల ఆధ్వర్యంలో వున్నందున విపరీత లాభాలను సంపాదించాయి. సంక్షోభ గడ్డు సమస్యలు చిన్నపరిశ్రమలపై, వలసదేశాలపై త్రోసివేసారు. అమెరికన్ కార్పోరేషన్‌ల లాభాలు 1963 లో 59,400 మిలియనులుగా వున్నవి, 1966 కు 83,000 మిలియన్ డాలరులకు పెరిగాయి. అవే 1968 మొదటి మూడు మాసాలలో వుత్పత్తిని బట్టి సాలుకు 88,200 మిలియనులకు పెరిగే సూచనలు స్పష్టమయ్యాయి. అంటే, 12.4 శాతం సాలుకు సంపాదించాయి.

ఈ విధంగా, ఆర్థిక సంక్షోభం, యుద్ధానికి బడ్జెటులో, యితరత్రా కేటాయించిన నిధులతో నేరుగా సంబంధం కలిగి వుంది. సంక్షేమ ఆశా చిత్రాన్ని యుద్ధ ఖర్చులు పెంచుకు పోవటంతో, ప్రజలు—గుత్త పెట్టుబడిదారుల మధ్య వైరుధ్యం పెరిగిపోయింది. సంక్షేమం, అందరికి వుద్యోగాలు అన్న మోసపూరిత విధానం బట్ట బయలు అయింది. రాజ్యాల మధ్య సంఘర్షణలు తీవ్రమయ్యాయి. ఈ నేపథ్యంలోనే 1967 ద్రవ్య సంక్షోభం, పౌండు విలువ తగ్గించుట, ఫ్రెంచి ఫ్రాంక్ సంక్షోభంలో పడిపోవుట అర్థం చేసుకొనవలసి వుంటుంది. బ్రిటన్ తన సామ్రాజ్యవాద విదేశ ప్రయోజనాలను కాపాడుగొనుటకు, వలసలలో చేయు దోపిడి, సెమి వలసలలో వ్యాపారంలో, పెట్టుబడులతో చేయు దోపిడి, తన రక్షణ మిలిటరీ వ్యయాన్ని పూడ్చుకొనలేక పోవుటతో పౌండు విలువను యిష్టం లేక

పోయినా తగ్గించుకొనవలసి వచ్చింది. ఇదే పరిస్థితి ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీలతో యేర్పడుటతో అవి కూడ ఫ్రాంక్ మార్క్ విలువలను తగ్గించుకొనవలసి వచ్చింది. క్రమేణా 24 దేశాలు వాటి కరన్సీ విలువలను తగ్గించుకొనవలసి వచ్చింది. ఈ ద్రవ్య విధానాలలో ప్రపంచ గుత్త పెట్టుబడిదారీ, కార్పోరేషను వర్గాలు బలపడి నవి. పెట్టుబడిదారి వర్గాలు యీ భారాన్నంతా కార్మికవర్గం, నగర, గ్రామీణ మధ్య తరగతి, బడుగు వర్గాలపై మోపుట, సామాజిక కనీస సౌకర్యాలకు కేటా యింపులు తగ్గించుట ద్వారా, తాము సంక్షోభం నుండి బయటపడుటకు ప్రయత్నం చేయుటతోపాటు, ఆటోమాషన్, నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించి, రేషనలైజేషన్ వగైరాల ద్వారా ప్రయత్నించింది. ఈ విధంగా సంక్షోభం నుండి పూర్తిగా బయటపడినారని చెప్పజాలకపోయినా, గణనీయ విజయాలను పొందారని మాత్రం చెప్పగలము. వీటిని బట్టి వొకటి స్పష్టం. నేటి పెట్టుబడిదారి వర్గాలు ఆర్థిక సంక్షోభాన్ని తట్టుకొని, తమ్ము రక్షించుకొనగల శక్తి పూర్తిగ కోల్పోలేదనుట స్పష్టం. కార్మికవర్గం, పురోగామి శక్తులు తమ కార్యక్రమాలు, ఎత్తుగడలు రూపొం దించునపుడు, ఈ ముఖ్యాంశాన్ని తప్పని సరిగా పరిగణలోనికి తీసుకొనవలసి వుంటుంది.

యుద్ధ సన్నాహాలు, ఆయుధోత్పత్తిపై "గాలి బెలూన్"లా బలిసిపోయిన అమెరికా ఆర్థిక, ద్రవ్య విధానం, ప్రత్యర్థి పెట్టుబడిదారి పద్ధతులతో పోటీ చేయ జాలకపోయింది. ముఖ్యంగా జపాను సరకులు మార్కెట్టుకు విపరీతంగా వచ్చి పడుటతో తమ పరిశ్రమల రక్షణ చర్యలుగా దిగుమతులపై అనేక పరిమితులు, నిషేదాలు చేపట్టవలసి వచ్చింది. జపాన్ మోటారు పరిశ్రమ 1967లో అమెరికా ఎగుమమతులతో 877 బిలియనుల డాలర్లు కాగా దాని ఎగుమతులు 294 మిలియను డాలర్లు మాత్రమే. పశ్చిమ యూరపు నుండి ఉక్కు దిగుమతులు 1400 మిలియ నులు కాగా ఎగుమతులు 720 మిలియనుల డాలర్లు. అంచేత ఉక్కు దిగుమతు లకు కోటా పరిమితులు విధించారు. ఈ రెండు ఆటోమొబైల్, ఉక్కు దిగుమతుల లోనే 763 మిలియను డాలర్ల లోటును అమెరికా యెదుర్కొనవలసి వచ్చింది. ఇదీ అమెరికా ఆర్థిక పరిస్థితి. బ్రిటన్ పౌండు విలువను తగ్గించిన తరువాత కొంత మెరుగైన సంక్షోభ పరిస్థితి వెనుకాడలేదు. సంక్షోభ భారాన్ని సామాన్యునిపై త్రోసి వేయసాగి ది. వ్యక్తి ఉత్పాదక శక్తి రేటు 3.8 శాతం 1967తో పెరిగినా వేతనాలు స్తంభింపజేసారు. రిటైల్ కొనుగోలు 6 శాతం తగ్గిపోయింది. అదే విధంగా, జర్మనీ ఫ్రాంక్ విలువ తగ్గించుటతో జర్మన్‌లో కూడ ఆర్థిక మాంద్యం వచ్చింది. అమెరికా దిగుమతులపై యే మాత్రం పరిమితులు, నిషేదాలు విధించినా, బ్రిటన్ యూరోపియన్ దేశాలు దాసోహం అవవలసి వస్తుంది. అమెరికా దిగుమతు లపై యెట్టి పరిమితులు విధించినా, నేటి పరిస్థితులలో అంటువ్యాధిలా వ్యాపించి ప్రపంచ పెట్టుబడిదారి విధానాన్ని సంక్షోభ తీవ్రతకు గురి చేస్తుంది. అమెరికా తన

బంగారు నిల్వలలో 60 శాతాన్ని యిప్పటికే కోల్పోయింది. క్రమేణా రోజు రోజుకు సంక్షోభ భారాన్ని ద్రవ్య విధానాలను చేబట్టి ప్రజలపై మోపే శక్తి సన్నగిల్లింది. ప్రెసిడెంటు జాన్సన్ పరిస్థితి చక్కబెట్టుటకు చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి. ఈ పరిస్థితులలో అమెరికా నిలబడ జాలక డాలరు విలువను తప్పకుండా తగ్గించ వలసి వస్తుందని, ఫలితంగా పెట్టుబడిదారి ప్రపంచం సంక్షోభంలో పడిపోతుందని భయం ఆవరించింది. కార్మిక వర్గంపై యీ సంక్షోభ భారాన్ని మోపుటకు, అధిక పన్నులు, అత్యధిక ధరలతో వారి జేబులు ఖాళీ చేస్తున్నారు. సమ్మె వెల్లువ, అమెరికా లేబరు డిపార్ట్‌మెంటు అంచనా 1966లో 1.8, 1967లో 2.9 మిలియనులు సమ్మెలలో పాల్గొన్నారు.

## వెనుకబడిన దేశాల ఆర్థిక విధానాలపై ఆర్థిక సంక్షోభ ప్రభావం

నూతనంగా స్వాతంత్ర్యం పొందిన, తదితర వెనుకబడిన దేశాలు ముఖ్యంగా సామ్రాజ్యవాదపు దేశాల "ఆర్థిక సహాయం" అనే అధికవడ్డీలతో కూడిన అప్పులపై ఆధారపడిన అభివృద్ధి అంతా "సంక్షోభంలో" పడిపోయింది. ఈ దేశాల ఎగుమతుల, దిగుమతుల వ్యాపారం అత్యంత అననుకూల షరతులు సామ్రాజ్యవాదదేశాలు తమ ఆర్థిక సంక్షోభాన్ని ఎగుమతి చేయుటకు బలవంతాన రుద్దుట చేసాయి. ఎగుమతులకు అతిచౌకధరలు, దిగుమతులకు అత్యధికధరలు వొప్పందాలలో విధించారు. ఫలితంగా దోపిడీ రెండువిధాలుగా సాగింది. రూపాయి విలువను సామ్రాజ్యవాదశక్తులు బలవంతాన తగ్గించునట్లు చేసి, మన ఎగుమతులను అతిచవకగా పొందగలిగాయి. మనదేశ అప్పు రూపాయి విలువను తగ్గించిన ఫలితంగా 50 శాతం మన విదేశ అప్పులు వొక్కసారిగా పెరిగిపోయాయి. మన కొత్త పరిశ్రమలకు కావలసిన మౌలిక యంత్రసామాగ్రికి చెల్లించవలసిన మొత్తాలు అదేవిధంగా పెరిగిపోయాయి. మరో వైపున మన ఎగుమతులు కారుచౌకగా 50 శాతం తక్కువ ధరకే వారు పొంద గలుగుతున్నారు.

ఆదేశాలంలో సంక్షోభఫలితంగా విదేశ "సహాయం" గణనీయంగా తగ్గుటయే గాక, షరతులలోకూడ కఠినం, అత్యంత అననుకూలం చేయబడినవి. విదేశ అప్పులను, విదేశ కరెన్సీలలోనే చెల్లించాలని, మన రూపాయలలో చెల్లింపులు అంగీకరించనందున మనదేశంతో వారు కొనుగోళ్ళు బాగా పడిపోయాయి. ప్రతి వెనుకబడిన దేశంలో, అత్యంత ఖరీదైన అభివృద్ధిని మనదేశంపై రుద్దాయి.

పశ్చిమదేశాల ఖరీదైన "సహాయం"పై ఆధారపడిన దేశాల అభివృద్ధి కార్యక్రమాలు దినదినగండంగా కష్టాలకు లోనయ్యాయి. పెరుగుదల రేటు "ఈకాఫె" దేశాలలో 1966కు 1965 రేటులో సగానికి పడిపోయింది. పైగా యీ దేశాలలో ఆర్థికాభివృద్ధి "దైవాధీనంగా" తొలకరి వర్షాలపై ఆధారపడిన వ్యవసాయపు వృత్తుల పైనే ఆధారపడివుంది. ఈ ప్రాంతాలలో 1964 తొలకరి వర్షాలు మామూలుగా

వుండుటతో వ్యవసాయ వుత్పత్తులు రెట్టింపుకు పెరుగుటతో పరిస్థితి కొంత మెరుగైంది.

ఇటీవల సంవత్సరాలలో యీ దేశాలకు పశ్చిమదేశాల గుత్త పెట్టుబడివర్గాలు పెట్టుబడి ఎగుమతి, అధికవడ్డీ రేటులలో దిగుమతి అయింది. ముడిసరుకుల మార్కెట్టును చెప్పుచేతలలో వుంచుకొనే ప్రయత్నాలు యెక్కువయ్యాయి. ముడి సరుకుల ధరలు, వ్యాపార వొప్పందాల షరతులు అన్నీ "ధరల కుంభకోణాల"తో అన్ని మార్గాలలో అంతర్జాతీయ గుత్త పెట్టుబడిదారివర్గాల ఆర్థిక సంక్షోభభారాన్ని నూతన స్వాతంత్ర్యదేశాల ప్రజలపై త్రోసివేయు ప్రయత్నాలు దేశంలో క్లిష్టపరిస్థితులు యేర్పడుటకు కారణభూతమయ్యాయి. వలస, అర్ధవలస, నూతన స్వాతంత్ర్య దేశాలలో భారతదేశం యీ భారాన్ని యెక్కువగానే భరించవలసివచ్చింది.

ప్రపంచ ఎగుమతులలో 1953లో 27 శాతంగా వున్నవి. 1966కు వెనుకబడిన దేశాలలో 19.3 శాతానికి తగ్గిపోయాయి. ఈ అంతర్జాతీయ గుత్త పెట్టుబడిదారి సామ్రాజ్యవాద శక్తులు అసమాన విదేశ వ్యాపారరూపంలో చేసే దోపిడి హిమాలయోన్నతమైంది. సంవత్సరానికి 2500 మిలియనుల డాలర్లు వెనుకబడిన దేశాలు సామ్రాజ్యవాద దేశాలకు అసమాన విదేశ వ్యాపారంలో దోపిడికి లోనై కోల్పోతున్నారు. ఫిబ్రవరి 1968లో ఢిల్లీలో జరిగిన "అంక్టాడ్" సమావేశానికి సెక్రటరీ జనరల్ నివేదిక ప్రకారం ఎగుమతి, దిగుమతి ధరలలో తేడా 1954లో 13 శాతం కాగా, 1961-64లలో 13,400 మిలియనుల డాలర్లు అసమానవ్యాపార వొప్పందాల కారణంగా వెనుకబడిన దేశాలు కోల్పోయాయి. ఈ విధంగా సంక్షోభపు భారాన్ని వెనుకబడిన దేశాలను దోపిడి చేయుటద్వారా, పాక్షికంగా సంక్షోభాన్ని దాటుటకు ప్రయత్నించారు. కొంతవరకు సఫలీకృతులయ్యారు.

వెనుకబడిన దేశాల విదేశ అప్పులు 1955-65 మధ్య 10,000 మిలియను డాలర్లుగా వున్నది 40,000 మిలియను డాలర్లుగా పెరిగిపోయినవి. వీటిపై ప్రతి సంవత్సరం చెల్లించవలసిన వడ్డీ వగైరాలు 500 నుండి 4000 మిలియను డాలర్లకు పెరిగిపోయాయి. ఈ దశాబ్దపు చివరకు వెనుకబడిన దేశాల సంవత్సర ఆదాయం మొత్తం అప్పుల వాయిదాలు చెల్లించుటకే సరిపోవును. ఐక్యరాజ్యసమితి ఈ దశాబ్దాన్ని వెనుకబడిన దేశాల అభివృద్ధి దశాబ్దంగా పరిగణించాలని ప్రకటించుటను, వాస్తవం హాస్యాస్పదం చేసింది.

ఈ విధంగా ప్రపంచ పెట్టుబడిదారీ విధాన సంక్షోభం, అభివృద్ధి చెందిన, చెందని దేశాల మధ్యగల వైరుధ్యాన్ని తీవ్రతరం చేసింది. ఇది పెట్టుబడిదారి సామ్రాజ్యవాదం, అననుకూల షరతులు విధించి దోపిడీని మరింత యెక్కువ చేయుటకు దారితీసింది. ఆర్థిక స్తబ్దత యేర్పడింది. ఈ దేశాలలో పారిశ్రామిక బూర్జువా వర్గంలో కొన్ని సెక్షనులు, సామ్రాజ్యవాద ఆధిపత్యానికి వ్యతిరేకంగా పోరాడుటకు ముందుకు రాసాగాయి. ఒకవైపున సామ్రాజ్యవాదం మరింత భారాన్నిమోసే

ప్రయత్నాలు చేస్తున్నది, మరోవేపున ప్రజలు మరో మార్గంలేక పోరాటానికి ఉద్యుక్తు లగుతున్నారు. పెట్టుబడిదారీ విధాన ఆర్థిక సంక్షోభ భారం పెరిగిపోవుట నుండి విముక్తి పోరాటాలను చేపట్టవలసిన తప్పనిసరి పరిస్థితులను కల్పించు తున్నారు.

వెనుకబడిన దేశాలలోని ప్రజాసామాన్యం, వారి ఆర్థిక విధానం పారిశ్రామికీ కరణ జరగాలనే బలమైన వాంఛ పెట్టుబడిదారీ సంక్షోభంమోసే అదనపు భారాన్ని ప్రతిఘటించునట్లు చేస్తున్నది. గుత్త పెట్టుబడిదారులు చేసే యీ ప్రజా దోపిడికి ప్రతి ఘటన పెరగసాగింది. మాజీ వలసలలోని సామ్రాజ్యవాదులు తమ సంక్షోభభారాన్ని మాజీవలసలపై త్రోసివేయజాలరు. "సహాయ"మనే వడ్డీతోకూడిన అమెరికా అప్పే గాక సోషలిస్టు దేశాలు యిచ్చే అప్పు, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రతిఘటనను బలపరుస్తుంది. ఇదంతా పెట్టుబడిదారీ ఆర్థికవిధాన సంక్షోభాన్ని పొడిగించుటయే గాక, తీవ్రతరంకూడ చేస్తుంది. మరోవేపున సోషలిస్టు దేశాలు వెనుకబడిన దేశాలకు చేసే "సహాయం" సామ్రాజ్యవాద శక్తుల మధ్య పోటీని, వైరుధ్యాన్ని పెంచి పోషిస్తుంది.

అంతర్జాతీయ రాజకీయ పరిస్థితులలోని నూతనాంశాన్ని సి. పి. ఐ. (యం) 8వ, పార్టీకాంగ్రెసు యిలా పేర్కొన్నది. "మన పార్టీ 7వ, 8వ, పార్టీ కాంగ్రెసుల మధ్యకాలం ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం 1957, 1960లలో ఆమోదించిన పత్రాలలోని అవగాహనలు సరియైనవని రుజువైందని, అది యిచ్చిన వర్గ విశ్లేషణ సరియైనదని 8వ పార్టీ కాంగ్రెసు స్పష్టం చేసింది. ప్రపంచం, సోషలిస్టు, పెట్టుబడి దారీ మూడు ప్రపంచాలుగ, పక్షాలుగ చీలుట, ప్రపంచవర్గ శక్తుల బలాబలాలలో సోషలిస్టు పక్షానికి అనుకూలమైన మార్పు వచ్చిందని, సామ్రాజ్యవాదం, వలస వ్యవస్థ సంక్షోభంలో పడిపోయాయని, ఈ యుగంలో నాలుగు వైరుధ్యాలమధ్య సంఘర్షణ కేంద్రీకృతమైందన్నది. ఈ కాలపు ప్రధాన లక్షణము ప్రపంచ స్థాయిలో పెట్టుబడిదారీ విధానం ధ్వంసమై సోషలిజంలోనికి పరివర్తనగా నిర్వచించబడింది. శాంతిని కూలదోసే దురాక్రమణ శక్తిగా అమెరికా సామ్రాజ్యవాదం ఉద్భవించింది, ప్రపంచానికి తానే రక్షకభటునిగా తలంచుచున్నది. ప్రపంచ శక్తుల బలాబలాలలో శాంతి, ప్రజాస్వామ్యం, సోషలిజంలకు అనుకూలంగా మార్పు వచ్చింది. ఈ విశ్లేషణ అంతా సరియైన మార్క్సిజం-లెనినిజంల శాస్త్రీయంగా చేసిన, మనం వున్న యీ యుగ "విశ్లేషణగా రుజువయిందని[1]" కాంగ్రెసు నివేదిక వివరించింది.

ప్రపంచ, దేశ సంస్కరణవాదం ప్రపంచ సామ్రాజ్యవాదం నిరపాయకర మయినదిగా చేయబడిందని, శాంతి, సంప్రదింపులు, సహజీవనంతో పూర్తిగా రూపు

1. పొలిటికల్-ఆర్గనైజేషనల్ రిపోర్టు. (ఆంగ్లంలో) సి. పి. ఐ. (యం) సి.సి. 8వ కాంగ్రెసు, ఏప్రిల్ 1969 (ఆంగ్లంలో) పే. 28.

మాపవచ్చని చెప్పసాగింది. ఈ దృక్పథం విప్లవోద్యమాన్ని శక్తిహీనంగా, అప్రమత్తతలోనికి దించి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జీవన్మరణ పోరాటం సాగించవలసిన అవసరాన్ని తోసిపుచ్చుతుంది.

వియత్నాం విముక్తి పోరాటంలో అమెరికా దురాక్రమణ శక్తులు పొందిన ఘోరపరాజయానికి చరిత్రలో మరో ఉదాహరణ లేదు. ఇదే ప్రపంచ సోషలిస్టు, జాతీయ విముక్తి పోరాట శక్తుల బలాన్ని, పోరాటపటిమను మొత్తం ఉద్యమాన్ని సరియైన దృక్పథం, మార్గదర్శికత్వం వహిస్తున్నది. అమెరికా నౌకా, విమాన, భూ సైన్యాలు 5 లక్షలు పైగా, మరో 10 లక్షలు వారి తొత్తుల సైన్యాలు అపజయాల తరువాత అపజయాలను పొంది, వారి ఆశలను అడియాసలు చేసాయి. ప్రపంచ విముక్తి, సోషలిస్టు శక్తుల అకుంఠిత ధైర్యసాహసాలను బ్రహ్మాండశక్తిని ప్రదర్శించాయి. అమెరికా దురాక్రమణ శక్తులు ప్రపంచ అణుయుద్ధ ప్రమాదాన్ని తెచ్చిపెట్టే విధానాలు ప్రపంచ ప్రజలకు స్పష్టమయ్యాయి.

వియత్నాం విజయాలు, అమెరికా ప్రపంచ ఆధిక్యతా గౌరవాన్ని మంటగలిపాయి. సామ్రాజ్యవాదశక్తుల కూటములను, ఒప్పందాలను అమెరికా ప్రపంచనాయకత్వంపై, దాని మిత్రులకుగల ఆశలు అడియాసలయ్యాయి. ప్రపంచవలస విముక్తి ఉద్యమాలకు, పోరాటానికి నూతనోత్సాహాన్ని, మార్గదర్శికత్వాన్ని యిచ్చి తోడ్పడినవి.

## సామ్రాజ్యవాదం ప్రపంచ వ్యాప్తంగా 'ఊబి'లో దిగబడుట, వైరుధ్యాలు తీవ్రతరమగుట.

కేంద్ర వైరుధ్యం తీవ్రతరమగుట, జాతీయ వలస విముక్తి వుద్యమాలు భీకరముగా కొనసాగించుట, ముందుకు పురోగమించుట గత నాలుగు సంవత్సరాల నుండి కొనసాగుతున్నది. అభివృద్ధి చెందిన దేశాలలో బూర్జువా వర్గం, కార్మిక వర్గాల మధ్య వైరుధ్యం తీవ్రతరమైంది. అదేవిధంగా సామ్రాజ్యవాద దేశాలమధ్య, గుత్తపెట్టుబడిదారీ వర్గాల మధ్య కూడ వైరుధ్యం తీవ్రతరమైంది. ఇది అంతా విప్లవ ప్రతిఘటనకు తోడ్పడింది. కార్మికవర్గం ప్రజలపై సామ్రాజ్యవాదులు తమ ఇచ్చాను సారం పన్నులు వేయుట కష్టసాధ్యమైపోయింది. అనుభవం కలిగిన నాయకత్వమే సరియైన సూచనల యిచ్చి యీ పని చేయగలదు.

ఈనాడు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని దేశాలు విప్లవ పోరాట వెల్లువలకు తావులయ్యాయి. ప్రపంచంలోని వైరుధ్యాలన్నీ, ప్రపంచ సామ్రాజ్యవాదపు అత్యంత బలహీనమైన కీలక లింకులలో ప్రజ్వరిల్లుతున్నవి. జాతీయ విముక్తి పోరాటాలకు ఉత్పత్తి శక్తుల విముక్తికై పోరాటాలకు పిలుపు యివ్వబడింది. సోషలిస్టు వ్యవస్థ నిర్మాణం, దాని అభివృద్ధి, మాజీ వలస దేశాలతో సహా అన్ని దేశాలలోని అణగారిన ప్రజాసామాన్యాన్ని, కార్మికులు, రైతులను పోరాటానికి ప్రోత్సాహపరుస్తున్నవి.

వియత్నాం విముక్తి పోరాటం, అమెరికా సామ్రాజ్యవాద వ్యతిరేక, నిరోధించే ప్రతిఘటనా పోరాటంగా, అది ప్రపంచ పోలీసు శక్తిగా ఆధిక్యత నెలకొల్పాలనే ప్రయత్నాలకు గండి కొట్టింది. వలసదేశాల విముక్తి విప్లవాలకు యెంతో నైతిక బలాన్ని, ప్రోత్సాహాన్ని యిచ్చింది.

దక్షిణ అమెరికాలో "డొమెకన్" దేశప్రజలు, విద్యార్థుల జాతీయ విముక్తి విప్లవ పోరాటాలు, రైతాంగపు ప్రజాప్రదర్శనలు, ఆ దేశాల ప్రజాసామాన్యం భూస్వామ్య విధానాన్ని, సామ్రాజ్యవాద దోపిడిని, వెనుకబాటుతనాన్ని, దారిద్ర్యాన్ని నాశనం చేయుటకు ఈ విప్లవ పోరాటాలు చేపట్టుటకు సిద్ధంగా వున్నారని స్పష్టం చేస్తున్నాయి" అని లాటిన్ అమెరికా ప్రజల ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు సెక్రటేరియట్, మే 1965వ ప్రకటించింది. అప్పటినుండి కొన్ని క్లిష్ట పరిస్థితులలో వెనుకాడవలసి వచ్చినా, అనేక దేశాలలో విప్లవోద్యమాలు పురోగమించాయి. నికరగువా, హైతిలలో ప్రజలు నేరుగా సాయుధ ప్రతిఘటనా పోరాటాన్ని సాగించుతున్నారు. కొలంబియాలో గెరిల్లా పోరాటం సంవత్సరాలు కొలది సాగుతున్నది. స్థలవలన గెరిల్లా ఎత్తుగడలు అనుసరించుచున్నవారి సాయుధ పోరాటం, సంఖ్యాబలంలో ఎంతో యెక్కువగా వున్న శత్రుసైన్యాలను యెదిరించి చాలాకాలం పోరాడగల శక్తిని కలిగివుంది. పెరూలోకూడ గెరిల్లా పోరాటాలు 1965లో ప్రారంభమయ్యాయి. వెనిజులాలో అలాగే కొనసాగుతున్నవి. అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగుతున్న విముక్తి విప్లవ పోరాటాలను అణచివేయుటకు ఆ దేశాలలోని కీలుబొమ్మల సహాయంతో సైనిక నగ్న నిరంకుశ ప్రభుత్వాల పాలన సాగించుతున్నది.

ఆఫ్రికాలో జాతీయ నాయకులు విద్రోహం చేయుటతో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలు కష్టనష్టాలకు గురియగుటయేగాక, సంస్కరణవాద భ్రమలను యెక్కువ చేయగలిగాయి. అయినా ఆఫ్రికాలో ప్రతిఘటన నిర్విరామంగా కొనసాగుతూనే వుంది. అంగోలా, గినీ, మొజాంబిక్‌లలో పోర్చుగీసు సైనిక సామ్రాజ్యవాద శక్తులను, వారి పునాదులను గెరిల్లాలు కదిలించివేస్తున్నారు. కాంగోలో చెలరేగిన విముక్తి విప్లవ పోరాటాలు, పొరుగుదేశాల పెక్కింటిలో గెరిల్లా పోరాటాలకు నైతిక బలాన్ని, ప్రోత్సాహాన్నిచ్చాయి. జింబాబ్వేలో తిరిగి విప్లవ విముక్తి పోరాటాలకు కారణభూతమయ్యాయి. దక్షిణ ఆఫ్రికా, దక్షిణ రొడీషియాలలో జాతీయ విముక్తి పోరాటాలు వర్ణవివక్షతకు వ్యతిరేక పోరాటాలు విజృంభించాయి. నైజీరియాలో ముడిసరకుల సప్లయిలకు సుక్షేత్రాలైన భూములను తిరిగి వలస పాలనలోనికి తేవాలనే అమెరికన్, బ్రిటిష్, పశ్చిమజర్మనీ సామ్రాజ్యవాదుల ప్రయత్నాలు విఫలమయ్యాయి.

ఐక్యరాజ్యసమితి సెక్రటరీ జనరల్, అమెరికా ప్రెసిడెంటు యిద్దరూ 1967 ప్రారంభంలో మూడవ ప్రపంచయుద్ధం త్వరలోనే వచ్చే అవకాశాలు ఎక్కువగా

వున్నవని ప్రకటించారు. మే 14న యూథాంట్ "నేను పొరపాటు అయితే కావచ్చు కాని నేడు మనం మూడవ ప్రపంచయుద్ధ ప్రారంభదశను చూస్తున్నామని నేను భయపడుతున్నాను" అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అదేరోజున యీ పత్రికా నివేదిక ప్రకటించబడిన రోజుననే, అమెరికా ప్రెసిడెంటు జాన్సన్ తన కుమార్తెకు యిలా చెప్పారని అన్నారు. "చరిత్రలో మీ నాన్న మూడవ ప్రపంచయుద్ధం ప్రారంభించినవానిగా పేర్కొనబడతాడని[1]" అన్నట్లు చెప్పారు.

**"నాటో యూరోపియన్"కామన్ మార్కెట్టు"ప్రపంచ పెట్టుబడిదారుల వైరుధ్యాల, సంఘర్షణల కేంద్రమైంది.**

ప్రపంచ ఆధిపత్యానికై అమెరికా మొదటిమెట్టుగా పెట్టుబడిదారీ ప్రపంచంపై, పోటీలతో వైరుధ్యాలు తీవ్రతరమగుతున్న దశతో ఎదురులేని నాయకత్వాన్ని సంపాదించ ఉబలాట పడుతున్నది. శాస్త్ర, సాంకేతిక రంగాలలో అమెరికా గుత్త పెట్టుబడిదారీ వర్గాలు ఆధిపత్యం, పురోగమనం సంపాదించుటతో పశ్చిమ యూరపు, జపాన్, కెనడా, లాటిన్ అమెరికాలలో తీవ్ర ఆర్థిక దాడి ప్రారంభించింది. యూరపుకు 1967లో అమెరికా పెట్టుబడి ఎగుమతి 17,500 మిలియనులు కాగా అందులో 4500 మిలియన్ డాలర్లు బ్రిటన్‌కు, 3400 మిలియనుల డాలర్లు పశ్చిమ జర్మనీకి, 1800 మిలియనుల డాలర్లు ఫ్రాన్స్‌కు ఎగుమతి చేయబడినవి. అమెరికా కంపెనీలు పశ్చిమ యూరపులో 95 శాతం మార్కెట్టును అదుపుతో, 80 శాతం కంప్యూటర్ల వుత్పత్తిని, 50 శాతం ట్రాన్సిస్టర్ నిర్మాణం, 50 శాతం కారుల వుత్పత్తిని అదుపులో వుంచుకొన్నవి. పశ్చిమ జర్మనీలో 40 శాతం ఆటోమొబైల్, 40 శాతం టెక్నికల్ గ్లాస్ వుత్పత్తిని, 35 శాతం ఆయిల్ వుత్పత్తిపై ఆధిపత్యం కలిగి వున్నవి.

జపాన్ కమ్యూనిస్టుపార్టీ పత్రిక కథనం ప్రకారం 1961 తరువాత జపాన్ విదేశాలలో పెట్టుబడులు పెట్టుటలో గణనీయంగా అభివృద్ధి సాధించింది. గతంలో 300 నుండి 400 మిలియనుల డాలర్లు సాలుకు సగటున పెట్టుబడి జరుగుతుండగా, నేడు 500 నుండి 600 మిలియనుల డాలరులకు పెరిగింది. ఇవి 1968కి 5598 మిలియనుల డాలర్లు మొత్తమైనవి. వీటిలో 70 శాతం అమెరికాకు, అందులో 64 శాతం అప్పులుగాను, 60 శాతం సాంకేతిక పరిజ్ఞానంగాను అయి వున్నవి. అమెరికా గుత్త పెట్టుబడిదారీ వర్గాలు అత్యంత వేగంగా అభివృద్ధి రేటు గల రంగాలలో, నూతన పరిశ్రమలలో, "పెరిగే పరిశ్రమ"లలో చొరబడుటకు ప్రయత్నిస్తున్నారు. జపాన్‌లో అట్టి 41 పరిశ్రమలు అమెరికాలోని ఎనిమిది గుత్త పెట్టుబడి

1. పొలిటికల్-ఆర్గనైజేషనల్ రిపోర్టు (ఆంగ్లంలో) సి.పి.ఐ(యం) సి.సి. 8వ కాంగ్రెసుకు సమర్పించినది. ఏప్రిల్ 1969 సి.పి.ఐ.(యం) పబ్లికేషన్ పే. 69.

దార్ల గ్రూపులకు చెంది వున్నవి.

అమెరికా గుత్త పెట్టుబడిదారి వర్గాలు దేశంలో మార్కెట్టు కుదించుకు పోవుటతో అమెరికా సరుకుల దిగుమతికి వొత్తిడిని జపాన్‌పై యెక్కువ చేసింది. ముఖ్యంగా దిగుమతులను సరళీకృతం చేయమని చేప్తున్నది. ఫోర్డ్, జనరల్ మోటార్సు, క్రిస్లర్‌ల వంటి గుత్త ఆటోమొబైల్ కార్పొరేషనులు, జపానులో పెరిగి పోతున్న ఆటోమొబైల్ మార్కెట్టుపై కన్ను వేసాయి. ఫలితంగా జపాన్ ప్రభుత్వం సాలుకు 1000 యూనిట్లుగా వున్న ఆటోమొబైల్ దిగుమతులను 1971లో 70,000 యూనిట్లకు పెంచుటకు ఆమోదించింది. ఇటలీలో కూడ 2180 మిలియను డాలర్ల విదేశ పెట్టుబడిలో 46 శాతం, అమెరికా పెట్టుబడులుగా వున్నది. ఈ రెండు దేశాలలో అమెరికాతో పోల్చినపుడు కార్మిక వేతనాలు చాలా తక్కువగా వుండుటతో, లాభాల ఆశయే యెక్కువైంది. ఈ విధంగా విదేశాలకు అమెరికా పెట్టుబడి ఎగుమతి చేయబడుట, వివిధ దేశాల గుత్త పెట్టుబడిదారుల మధ్య ఆర్థిక ప్రయోజనాల వైరుధ్యాలు పెరిగి పోవుటకు కారణమైంది. ప్రపంచ ఆధిపత్యాన్ని సంపాదించాలనే అమెరికా రాజకీయ విధానం వైరుధ్యాలను, సంఘర్షణలను పెంచింది. అదే కాలంలో ప్రపపంచ మార్కెట్టుకై పోరాటాలు తీవ్రతతం కాగా, దేశీయ మార్కెట్టులోనికి చొరబడి పోవాలనే ప్రయత్నాలు పరస్పరం వివిధ శక్తులు సాగించుటతో నూతన వ్యాపార వర్గాల కూటములు, కలయికలు. పోటీ వ్యాపార గ్రూపులు వాటి ప్రభావ ప్రాంతాల విస్తరణకై జరిగే తీవ్ర ప్రయత్నాలు ప్రపంచాన్ని వ్యాపారం కొరకు విభాగాలుగ చేయు ప్రయత్నాలు జరుగుచున్నవి.

ఇదే అమెరికా, యితరులు ముఖ్యంగా, ఫ్రాంసుల మధ్య పశ్చిమ యూరోపియన్ మార్కెట్టులకై తీవ్ర పోటీ, సంఘర్షణలకు కేంద్రమైంది. అమెరికా, జపాన్‌లలో స్వేచ్ఛా మార్కెట్టుకై చేయు ప్రయత్నాలలో కూడ యీ సంఘర్షణలు తీవ్రమయ్యాయి. జపాన్, పశ్చిమ జర్మనీలు అదే కాలంలో అమెరికా మార్కెట్టుకై చేయు ప్రయత్నాలు, ఘర్షణలు తీవ్రమగుటలో, యూరోపియన్ కామన్ మార్కెట్టులో బ్రిటన్, స్థానానికై చేయు ప్రయత్నాలు అన్ని కలసి, ప్రపంచాన్ని మార్కెట్టులకై విభజించే నూతన ప్రయత్నాలు, అందుకై వివిధ వ్యాపార గుత్త కూటములు యేర్పడుట, రాజకీయ ప్రభావ ప్రాంతాల విస్తరణకై ఎవరికి వారు తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నారు. అమెరికా, యూరోపియన్, ఆసియన్ గుత్త పెట్టుబడిదారి వర్గాల పోటీ, సంఘర్షణలు ప్రధానంగా యూరోపియన్ యూనియన్, నాటో సంస్థలు కేంద్ర స్థానాలుగ చేసుకొన్నవి.

ఫ్రెంచి-అమెరికాల మధ్య పెరుగుతున్న వైరుధ్యాలు, వ్యాపార సంఘర్షణలపై, అధికార వర్గాలు "ఫ్రాన్స్‌పై డాలరు వలస పెత్తనం, మొత్తం యూరప్‌పై పెత్తన ప్రమాదమున్నది, యిది వాస్తవమైనది, యిది తూర్పు (రష్యా) నుండి వచ్చుటలేదు" అనే అభిప్రాయాన్ని కలిగి వున్నారు. ప్రపంచ మార్కెట్ల విష

యంలో గత రెండు సంవత్సరాలలో అనేక సంఘర్షణలకు ఫ్రాన్సు, అమెరికాలు తలపడినవి. ఫ్రాన్స్ విదేశ వ్యాపారం మౌలికంగా ఆర్థికాంశాలు దెబ్బతిన్నది. రెండవ అంశంగా, యూరపు యూనియన్ ఆరు దేశాలకు ఎగుమతి మార్కెట్టుల రక్షణాంశాలు పైకి వచ్చాయి. అయితే ఫ్రెంచి గుత్త వర్గాలలో ఒక వర్గం అమెరికా పెట్టుబడి తో బ్రహ్మముడి వేసుకొన్నది, అమెరికా భాగస్వాములతో యూరోపియన్-అట్లాంటిక్ ఐక్యతా పరిధిలో మరింత సహకారాన్ని నెరపాలని కోరుతున్నది.

ఈ వైరుధ్యాలు, సంఘర్షణలకొక ముఖ్యకేంద్రం యూరోపియన్ కామన్ మార్కెట్టు, అందులో ప్రధాన సంఘర్షణలు అమెరికా-ఫ్రెంచి వర్గాలమధ్యనే జరుగుతున్నవి. ఆర్థికంగా యూరోపుపై ఆధిక్యతను సంపాదించాలని కలలు కంటున్న అమెరికాకు ఫ్రాన్సు నుండే ప్రధాన ప్రతిఘటన ఆర్థికంగా, రాజకీయంగా ఎదురౌతున్నది. బ్రిటన్ నుండి యూరోపియన్ కామన్‌మార్కెట్టులో చేరి, యూరోపులో గణనీయమైన పాత్రవహించ ప్రయత్నించుచున్నది. అయితే, బ్రిటన్ రెండవ ప్రపంచ యుద్ధానంతరం వలసలను కోల్పోయి, ఆర్థికంగా, రాజకీయంగా ఎంతో బలహీనపడి, అమెరికా మరో రాష్ట్రంగా అయిందనే పేరు సంపాదించింది. అంచేత బ్రిటన్‌కు ఆశవున్నా, ఆచరణలో చేయగలిగినది అంతగాలేదు. యూరోపియన్ కామన్ మార్కెట్టు ఆరుదేశాలు బ్రిటన్‌ను తమ యూనియన్‌లో చేర్చుకొన కోరుట లేదు.

సరళీకృత అంతర్జాతీయ వ్యాపారం, టారిపులు తగ్గించుట, లేక రద్దుచేయుట లను గురించి ప్రతిదేశం కబుర్లు చెప్పుతున్నా, మార్కెట్టు కంట్రోలు చేయుటకై ప్రతిదేశం చేపడుతున్న చర్యలు, వారి దేశీయ మార్కెట్లు రక్షణలకై వుద్దేశించబడి నవే అయివుంటున్నవి. అమెరికా తరగిపోతున్న విదేశీ వ్యాపార నిలవలు, పశ్చిమ యూరోపియన్ దేశాల ముఖ్యంగా జర్మన్‌దేశ సరుకులు తనదేశ మార్కెట్టులో దిగుమతియై తీవ్రపోటీ చేయుట, తన స్వదేశ మార్కెట్టు రక్షణకై చర్యలు చేబట్టవలసి వచ్చింది.

యూరోపియన్ కామన్ మార్కెట్టులో కూడా టారిఫ్‌లు రద్దు చేయుటతో, వారి ప్రత్యర్థి గుత్తపెట్టుబడివర్గాలపై పోరాడుటకు బాగా అభివృద్ధి చెంది, అర్గనైజు అయివున్న గుత్తపెట్టుబడివర్గాలు, అత్యంత అనుకూల పరిస్థితులలో వున్నవి. ఫ్రెంచి గుత్తపెట్టుబడివర్గాలు పశ్చిమ జర్మనీ గుత్తపెట్టుబడివర్గాలతో పోల్చితే బలహీనంగా వున్నవి. ఇప్పటివరకు రక్షణలు పొందుతున్న వర్గాలు అవి రద్దు అయిపోవుటతో, కామన్‌మార్కెట్టులో వాటి ప్రయోజనాలకు ప్రమాదం యేర్పడుటతో సంఘర్షణలకు దిగక తప్పుటలేదు.

యూరోపులో తమ స్థానాన్ని పదిలపరచుకొనుటకు ఫ్రెంచి గుత్తపెట్టుబడి వర్గాలు టారిఫ్ రద్దుచేయక తప్పలేదు. బలోపేతమైన ఫ్రెంచి కార్మికోద్యమం పోరాట వెల్లువలో అధిక వేతనాలను, యితర రాయితీలను పొందుటతో, ఫ్రెంచి గుత్తపెట్టు

బటి వర్గాలు పోటీచేయుశక్తి అంతబలంగా యూరోపియన్ కామన్‌మార్కెట్టులేదు. ఈ పరిస్థితిని అధిగమించుట ఫ్రెంచి గుత్తవర్గాలు దిగుమతులపై ఆంక్షలు విధించి ఎగుమతులు అదే కాలంలో పెంచుటకు ప్రయత్నించుతు, దిగుమతి కోటాపద్ధతిని ప్రవేశపెట్టారు. దీనికి అంతర్జాతీయ వ్యాపార ప్రత్యర్థులు, ముఖ్యంగా, బ్రిటను, అమెరికాలనుండి తీవ్రప్రతిఘటనను ఎదుర్కొనవలసి వచ్చింది, వారూ ప్రతిచర్యలు చేబట్టారు.

మార్కెట్లకై యీపోటీ, సంఘర్షణ తీవ్రతరమై అమెరికా తన దేశీయ మార్కెట్టులోనే పశ్చిమ జర్మనీ, జపానుల పోటీని ఎదుర్కొనవలసి వచ్చింది. అంచేతనే, అది తన భాగస్వాములపై అత్యధిక వత్తిడిచేసి వారిదేశ మార్కెట్టులలో ప్రవేశాన్ని తేలికగా పొందజూస్తున్నది. ఆటో ఇంజన్లు జపాన్ దేశీమార్కెట్టులో దిగుమతి చేసుకొనుటకు అమెరికా గుత్తపెట్టుబడి వొత్తిడిని తీవ్రతరం చేసాయి. జపాను దిగుమతులను సరళీకృతం చేయాలని మరోవైపున వొత్తిడి చేస్తున్నవి. ఈ వొత్తిడి తీవ్రతర మగుటను కొన్ని జపాను పత్రికలు "జపాను-అమెరికా సంబంధాలు సహకారం నుండి సంఘర్షణకు పరిణామంగా" చిత్రించాయి.

కెన్నెడీ సంభాషణ ఘట్టాలు, అమెరికా పెట్టుబడిదారి ప్రపంచానికి నిర్ణయాధికార ఆధిపత్యం వహించాలనే తనకలలు కల్లలైనవని పలికి, పెట్టుబడిదారి ప్రపంచంలో ప్రయోజనాల, ప్రభావాల ప్రాంతాలను కామన్‌మార్కెట్టులో కేటాయింపుల అవగాహనలకు వచ్చుటకు సిద్ధంగా వున్నట్లు కన్పడుతున్నది. వియత్నాంలో సైనిక దురాక్రమణ, ప్రపంచకలలు విదేశీ వ్యాపారంలో తరుగులు పెరిగిపోయి, కల్లలైనాయని గుర్తించక తప్పలేదు. విదేశీ వ్యాపారంలో తరుగు 1967లో 3500 మిలియను డాలర్లకు చేరుకొన్నది. దాని బంగారం నిలవలు 10,3000 మిలియను డాలర్లు, గత 32 సంవత్సరాలలో అత్యంత కనిష్ట నిల్వలకు చేరుకొన్నవి. గుత్తపెట్టుబడిదారుల ఆధిక్యత, ఆర్థికతను సైనికీకరణం చేయుట, విపరీత సైనిక ఆయుధఖర్చు, విదేశీ వ్యాపారంలో విపరీత తరుగుద౦, యేదో వొక రూపంలో తన జూనియర్ భాగస్వాముల నుండి అమెరికా విపరీతంగా అప్పులు చేయవలసి వచ్చింది.

ఈ సంఘర్షణలే కరెన్సీ విషయాలలో గూడ ఎదుర్కొవలసి వచ్చింది. ఫ్రెంచివారు ప్రపంచ ద్రవ్య సంస్కరణలు జరగాలని పట్టుపట్టుతున్నారు, ఆవిధంగా డాలరు, పౌండులు రిజర్వు కరెన్సీల స్థాయినుండి దిగజార్చ ప్రయత్నిస్తున్నారు. రిజర్వు కరెన్సీ స్థాయి అమెరికా పెట్టుబడుల ఎగుమతిని సులభతరంచేసి, అంతర్జాతీయ మార్కెట్టులో నిర్ణయాత్మక ఆధిక్యతను చేకూర్చుతుంది. యూరోపియన్ కామన్ మార్కెట్టులో అమెరికాశక్తిని ఎదుర్కొనగల స్థాయికి ఫ్రాన్సు ఎదిగింది. అది డాలరు విలువను తగ్గించాలని పట్టుపట్టుతున్నది. బంగారు నిల్వలు బాగా పెరిగిపోవుటతో ఫ్రాన్సు అంతర్జాతీయ ద్రవ్యవిధానాలలో బంగారం స్టాండర్డు తిరిగి ప్రవేశ

పెట్టుటగాని లేక బంగారు ఖరీదు పెంచాలంటున్నది. రెండూ డాలరు విలువను తగ్గించే చర్యలుగానే వున్నవి. కరెన్సీ విధానంపై సంఘర్షణలోనికి తీవ్రమైన సంఘర్షణా రూపంగా సామ్రాజ్యవాద శక్తులలో పరిగణించబడుతున్నది.

పౌండు విలువను తగ్గించుట, ఫలితంగా బంగారం ప్రవాహంగా వచ్చిపడుటతో డాలరు ప్రమాదంలో పడుట, డీగాల్ అమెరికాపై దాడిచేయుటకు మంచి అవకాశం లభించింది. తన వుపన్యాసంలో డీగాల్ "డాలరు అధిక్యరపై దాడిచేసి, "డాలరు ద్రవ్యోల్బణాన్ని యూరపుకు ఎగుమతి చేస్తున్నారని" అన్నాడు. అంతర్జాతీయ ఎగుమతి, దిగుమతి వ్యాపారంలో అమెరికా ఎదుర్కొంటున్న "తరుగుదల" గత ఎనిమిది సంవత్సరాలుగ అమెరికా పశ్చిమ యూరపుకు చేసిన పెట్టుబడి ఎగుమతికి సరిసమానంగా వుందని అన్నారు. ఆర్థిక సహకార అభివృద్ధి సంస్థ నవంబరు 30, 1967 లో మంత్రుల సమావేశంలో ఫ్రాన్స్, అమెరికాలు అంతర్జాతీయ ద్రవ్య విధానం, బంగారం ధరలు సమస్యల తీవ్రంగా సంఘర్షించాయి.

అమెరికా అంతర్జాతీయ వ్యాపారంలో "తరుగుదల" విపరీతంగా పెరిగి పోవుట, ప్రపంచ పోలీసు రక్షణ చర్యల కారణంగా పెరిగిపోయిన భారాన్ని భాగ స్వామ్య దేశాలు ముఖ్యంగా పశ్చిమ జర్మనీ పంచుకొనవలసి వుందని కోరసాగింది. ఈ సంఘర్షణలు విదేశాంగ విధాన పరిధులకు విస్తరించాయి.

"నాటో" అమెరికా ఆధిక్యతను పెంచుకొనే వొక సాధనంగా ఫ్రాన్సు అవ గాహనగా వుంది. శక్తివంతమైన యు.యస్.యస్.ఆర్.తో సైనిక సంఘర్షణలకు, ప్రమాదాలకు నాటో దారి తీస్తున్నది. అది ఫ్రాంసు సార్వభౌమాధికారాన్ని నీరు గార్చుతున్నది, అమెరికా వాంఛ, విధానాలకు తలవొగ్గునట్లు చేస్తున్నది.

ఫ్రాంసు 1966లో పేరుకు "నాటో సైనిక సంస్థ" నుండి నిష్క్రమించింది, తన దేశం నుండి 'నాటో' సైన్యాలు ఉపసంహరించబడాలని కోరింది. ఇది "నాటో సైనిక కూటమి"కి పెద్ద అపజయం, సామ్రాజ్యవాద పక్షంలోని అంతర్గత సంఘర్షణల తీవ్రతకు వొక దర్పణము.

అమెరికా, తన వియత్నాం యుద్ధంలో "నాటో" కూటమి సైన్యాలను తనకు మద్దతుగా సమీకరించుటలో వైఫల్యాన్ని ఎదుర్కొంది. అంతేగాక, వియత్నాం, ఇజ్రేల్లపై జరిపిన అమెరికా సైనిక దురాక్రమణలకు తీవ్ర నిరసలను ఫ్రాంసు తెలియజేసింది.

ఫ్రాంసు, అమెరికాల మధ్య తీవ్ర సంఘర్షణలకు, పశ్చిమ జర్మనీని బహి రంగంగా అమెరికా బలపరచుట, అనుమానాస్పదమైంది. యూరప్పై అమెరికా తన రాజకీయ, సైనిక నాయకత్వాన్ని బలబరచుకొనుటకు జర్మనీతో ప్రత్యేక స్నేహ, సహకార సంబంధాలను పెంచుకొంటున్నది. ఆ విధంగా పశ్చిమ యూరపుపై ఆధిక్యత, నాయకత్వం పెంపొందించుకొన్నది. పశ్చిమ జర్మనీని సైనికంగా బల వత్తరం చేయుట, ఆ రెంటింటి మధ్య అటంశక్తి భాగస్వామ్యం, జర్మనీ ఉద్దేశ్యాల

యెడల అనుమానాలను కలుగ జేస్తున్నది. అవి పరస్పర విరుద్ధంగా వున్నవి. పశ్చిమ జర్మనీ గుత్త పెట్టుబడిదారీ వర్గాలు ప్రమాదకరమైన సైనిక బలాన్ని అభివృద్ధి చేసుకొన్న దృష్టిలో, డీగాల్ రక్షణ చర్యలు తన సహచర మిత్రుని ఆధిక్యతకు వ్యతిరేకంగా, బహిరంగంగా "ఓడర్-నెస్సే"ని జర్మనీ సరిహద్దుగా గుర్తించి, "సోవియట్ యూనియన్‌తో స్నేహ సంబంధాలను డీగాల్ నెలకొల్పుకొన్నాడు. పీపుల్స్ చైనాతో కూడ డీగాల్ స్నేహ సంబంధాలను నెలకొల్పుకొన్నాడు.

ఫ్రాంసు అమెరికాను ప్రతిఘటించుటకు ఆరుగురి గ్రూపును రూపొందించింది. పశ్చిమ జర్మనీ "నాటో"తోనే వుంది. ఫ్రాకను నాటోను వదలివేసి, నాటో సైన్యాలు తమదేశం వదలి వెళ్ళాలని వొత్తిడి చేయసాగింది. ఆ విధంగా ఫ్రాంసు, జర్మనీతో పోటీ పడుతున్నా యూరోపియన్ కామన్ మార్కెట్టులో ఆర్థిక భాగస్వాములుగ తలంచుతు, యూరోప్‌లో అమెరికన్ ఆధిక్యతను వ్యతిరేకించుతు, కామన్ మార్కెట్టులోనికి బ్రిటన్ ప్రవేశాన్ని వ్యతిరేకించుతున్నది. అమెరికా, జర్మనీ చాల దగ్గరి సంబంధాలను రూపొందించుకొన్నవి యిద్దరూ బ్రిటన్‌ను యూరపియన్ మార్కెట్టులోనికి తెచ్చుటకు ప్రయత్నించుచున్నారు. ముఖ్యంగా కామన్ మార్కెట్‌లో ఫ్రాన్స్ ఆధిక్యతను ప్రతిఘటించుటకై చేస్తున్నారు. డాలర్, పౌండ్‌ల విలువలను తగ్గించుట-డీవాల్యుయేషన్‌కై వొత్తిడిచేయుట చూచాము. ఆ విధంగా ఫ్రాంకును బలపరచదలచారు. నవంబరు 1968 ఘటనలతో "కార్మికుల తిరుగుబాటు" ఫ్యాక్టరీల ఆక్రమించుటతో బ్రిటన్, అమెరికాలు డీగాలును బలపరచి, ఫ్రాంక్‌ను పునరుద్ధరించి పశ్చిమ జర్మనీని హెచ్చరించాయి. కారణం ఫ్రాన్స్ ఫ్రాంక్ విలువను తగ్గించి, కార్మికుల జీతాల కోతలను పెంచి పెట్టుబడిదారీవర్గం విధించినట్లయితే, పెంచి కార్మికవర్గపు విప్లవ పోరాటాలు వెల్లువలై తమ అస్తికతకే ముప్పురాగలదని దేశ విదేశీ గుత్తపెట్టుబడిదారీ వర్గాలు భీతిల్లిపోయాయి. అంచేతనే అట్టి పనిని చేపట్టలేదు. ఫ్రాంక్ విలువ నిలువబెట్టుటకై జరిగే పోరాటమే పారిస్ నగర పోరాటమయింతి. అదే యూరోపియన్ యూనియన్ మార్కెట్ పోరాటమయింది.

జర్మన్ గుత్తపెట్టుబడివర్గాలు ఫ్రాంక్ విలువను తగ్గించమని వొత్తిడిచేసి, వాస్తవానికి జర్మనీ ఫైనాన్స్ మినిష్టరు స్ట్రాస్ ఫ్రాంక్ విలువను పారిస్ తగ్గించుచున్నదని ప్రకటనకూడ చేశాడు. వాణిజ్యంలో అదనపు విలువలను పోటీతో జర్మనీ ప్రధానంగా చూడజాలక పోవుటలో వారి అంచనాలకు వ్యతిరేకంగా ఫ్రాన్స్ పనిచేయుటతోపాటు మరోరకంగా చేసినట్లయితే ఫ్రాన్స్ రాజకీయ సంక్షోభం తిరుగుబాటులకు కార్మికవర్గం దారితీసి వుండేదని గ్రహించలేకపోయింది. ఇదే విషయాన్ని బ్రిటన్, అమెరికాలు పరిగణలోనికి తీసుకొని డీగాల్‌ను బలపరచి 70 దశాబ్దపు సంక్షోభాన్ని తాత్కాలికంగా నివారించగలిగారు.

ఫ్రాన్స్‌లో నవంబరు 1968 ఘటనలపై "కామర్స్" పత్రిక యిలా వ్యాఖ్యానించింది. "కామన్ మార్కెట్టు అధికారవర్గాలు గుప్తంగా వుంచదలచిన పరిణామా

లను, కరెన్సీ సంక్షోభం పైకితెచ్చింది. చారిత్రక ఫ్రాన్స్, జర్మనీ పోటీ ప్రధాన సమస్యగా పైకివచ్చింది. అదే కామన్ మార్కెట్టులోనూ ప్రధాన సమస్య అయింది. ఆంగ్లో జర్మన్ పోటీ, సంఘర్షణ అట్లాంటిక్ మైత్రిలో నూతనాంశము. అమెరికా దాని ప్రత్యేకతను పరిగణలోనికి తీసుకొన్నట్లు కనిపించుతున్నది. అమెరికా ట్రెజరీ సెక్రటరీ, ఫోర్డ్ ఫౌలర్ పరోక్షంగా జర్మనీ బాధ్యతా రాహిత్యాన్ని హేళన చేశాడు. జర్మన్ ఆర్థికమంత్రి స్ట్రాస్, ఫ్రాన్స్ తన కరెన్సీ ఫ్రాంక్ విలువను తగ్గించుట తగ్గింపకపోవుటయే విదేశీ ప్రభుత్వానికి సంబంధించిన విషయం కాదని అన్నారు. జర్మనీ రాజకీయ ఆధిక్యతా నాయకత్వం అమెరికాకు రుచించకపోవుటవలననే అంత త్వరగా ప్రెసిడెంటు జాన్సన్, ఫ్రాంక్ విలువను తగ్గించు విషయమై ఫ్రాన్స్ చేబట్టిన విధానపు విజయాన్ని ఆకాక్షించుతూ, అమెరికా పూర్తి సహకారం వుంటుం దంటూ డీగాల్‌కు టెలిగ్రాం సందేశాన్ని పంపారు. డీగాల్ ఫ్రాంక్ విలువను తగ్గించకుండా వుండే చారిత్రాత్మక నిర్ణయం చేయకముందే జాన్సన్ సందేశం పంపించాడు.[1]

అంతర్గత వైరుధ్యాలు, పోటీలు, ఘర్షణల వొత్తిడులతో సామ్రాజ్యవాద దేశాలు, గుత్తపెట్టుబడిదారివర్గాలు కూటములుగా, ప్రతికూటములుగా యేర్పడుట జరుగుచున్నది. ఇటీవలి పరిణామాలను వొక జాతి లేక మరికొన్ని జాతులవైపు మొగ్గుటగా వ్యాఖ్యానించుట పొరపాటు అవుతుంది. అవి వాటి మధ్యగల శత్రు వైరుధ్యాన్ని, వైరుధ్యాలను సామ్రాజ్యవాద శక్తులు తీవ్రతరం చేస్తున్నవని, నూతన తాత్కాలిక కలయికలకు దారితీస్తున్నవని తెలియజేస్తున్నవి.

**సామ్రాజ్యవాదం - సోషలిజంల మధ్యగల వైరుధ్యం తీవ్రతరమగుట.**

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ప్రపంచ సామ్రాజ్యవాదాల మధ్య ఉన్న వైరుధ్యమే యీ యుగ సంపూర్ణకాలంలో వుండే కేంద్ర వైరుధ్యం, అదే ప్రధాన వైరుధ్యం; తీవ్రమైనదీ, లోతయినదిగా వుంది.

యుద్ధానంతర దశాబ్దంలో అమెరికా సామ్రాజ్యవాదం తన ప్రధాన దాడిని సోవియట్ యూనియన్‌పై కేంద్రీకరించింది. సోవియట్ యూనియన్ ప్రభావాన్ని అరికట్టుట, యూరోపియన్ సోషలిస్టు దేశాలను విముక్తి చేయుట, సోవియట్‌ను వ్యాపార దిగ్బంధనం చేయుట అనే నినాదాలతో సైనిక కేంద్రాలను నిర్మించింది. యూరపులో "శాంతి, వొప్పందాలు"కు సోవియట్‌తో సంప్రదింపులు అంటూ,దాడిని తరువాత చైనా ప్రజా రిపబ్లిక్‌పై కేంద్రీకరించి చైనా విస్తరణ అరికట్టుట, ఐక్యరాజ్యసమితిలో దానిస్థానాన్ని నిరాకరించుట, మిత్రదేశాలు చైనాతో వ్యాపారం చేయుటను నిషేధించు ప్రయత్నాలు సాగించింది.

---

1. పొలిటికల్ ఆర్గనైజేషనల్ రిపోర్టు. సి. పి. ఐ (యం) 8వ పార్టీ కాంగ్రెసుకు సి. సి. సమర్పించినది. (ఆంగ్లంలో) పే. 54-55 లలోని ఉదహరింపు.

యూరపులో పశ్చిమ జర్మన్ ఫాసిస్టులను సాయుధులను చేయ అమెరికన్ సామ్రాజ్యవాదం సమకట్టి, తూర్పు యూరపు సోషలిస్టు దేశాల పునర్నిర్మాణానికి అడ్డంకులు కలుగజేస్తూ, ఆ దేశాలలోని అభివృద్ధి నిరోధక శక్తుల విద్రోహ చర్య లను ప్రోత్సహిస్తు, ఆ దేశాల భద్రతకు, ప్రపంచ శాంతి, భద్రతలకు వ్యతిరేకంగా కుట్రలు సాగించింది. యుద్ధానంతర ఒడంబడికలలో నిర్ణయమైన జర్మన్ సరిహద్దు లను పశ్చిమ జర్మనీ వ్యతిరేకించి గుర్తించకుండునట్లు ప్రోత్సహిస్తూ, సోషలిస్టు తూర్పుజర్మనీకి అస్థికతకే ప్రమాదం తెచ్చిపెట్టుతూ, సంఘర్షణ పరిస్థితులను పెంపొందిస్తుంది.

జకోస్లావేకియాలో విప్లవ ప్రతీఘాతక, అభివృద్ధి నిరోధక దౌర్జన్య హింసా ఫాసిస్టు శక్తులను ప్రోత్సహించి, కుట్రలతో సాయుధ తిరుగుబాటును తెచ్చింది. అయిదు వార్సా ఒప్పంద సోషలిస్టు దేశాల సైన్యాలు ప్రవేశించి, తిరుగుబాటును అణచివేయ వలసిన తప్పనిసరి పరిస్థితులను కల్పించింది. తిరుగుబాటు అణచివేయ బడినా, విప్లవ ప్రతీఘాతక శక్తులు పూర్తిగ అణచివేయబడలేదు. జకోస్లావియా సంక్షోభం, సామ్రాజ్యవాద కుట్రలు, ఎత్తుగడలు స్పష్టం చేయుటయేగాక, సోష లిస్టు ప్రభుత్వం ప్రజలనుండి దూరమగుట ప్రారంభమై, అభివృద్ధి నిరోధక చర్య లకు అవకాశాన్ని గూడ కలుగజేస్తుందని, దాని పునర్విచార అవసరాన్ని తెలియ జేస్తున్నది.

ఉత్తర సోషలిస్టు వియత్నాంపై అమెరికా సామ్రాజ్యవాదం నగ్నసైనిక దురాక్రమణ సాగిస్తూనే వుంది. సోషలిస్టు కొరియా ప్రజారిపబ్లిక్ అమెరికన్ సామ్రాజ్యవాద దురాక్రమణ భయాందోళనలకు లోనగుతూనే వుంది. దక్షిణ కొరి యాలో లక్షలకొలది అమెరికా సైనికులు, కేంద్రాలలో సమీకరించబడి దురాక్రమణ చర్యలకు వేచియున్నారు. కొరియా ప్రజల ఐక్యతను, దక్షిణ, ఉత్తర కొరియా విలీ కరణకు వ్యతిరేకంగా జపాన్‌తో కలిసి అమెరికా కుట్రలు పన్నుతున్నది.

దక్షిణ అమెరికాలో క్యూబా సోషలిస్టు రిపబ్లిక్‌పై అమెరికా సైనిక, ఆర్థిక, వ్యాపార దిగ్బంధన సాగుతూనే వుంది క్యూబాను అమెరికా సైన్యం దురాక్రమణ చేసి, ఆక్రమించుకొనుటకు సిద్ధంగా వుందని భయాందోళనలు గొల్పే ప్రచారం సాగుతూనే వుంది.

ప్రజా చైనాను, అమెరికా సైనిక, నావికా, విమానదళాల సైనిక కేంద్రాలు చుట్టుముట్టియే వున్నవి. దేశంలో భాగమైన తైవాన్, అమెరికా దురాక్రమణ క్రింద జంగ్‌కైషెక్ పాలనలో వుంది.

ఈ విధంగా యీ యుగపు వైరుధ్యాలన్నీ కేంద్రీకృతమై తీవ్రతరమైనవి. ఉత్తర వియత్నాం, జకోస్లావేకియా సైనిక దురాక్రమణల ప్రమాదంలో వున్నవి. అభివృద్ధి చెందిన దేశాలలో బూర్జువావర్గాలకు, కార్మికవర్గానికి గల వైరుధ్యం తీవ్రతరమైంది. అదేకాలంలో సామ్రాజ్యవాద దేశాలమధ్య సంఘర్షణలు కూడ యెక్కువయ్యాయి.

ఇవన్నీ విప్లవ పోరాటాల తీవ్రత యెక్కువైనకొలదీ, వివిధ వైరుధ్యాలు తీవ్రతరమై సంఘర్షణలకు దారితీస్తున్నవి.

సోషలిస్టు, జాతీయవిముక్తి, శాంతి, ప్రజాస్వామ్యశక్తులు సామ్రాజ్యవాద శక్తులను త్రిప్పికొట్టుతున్నవి. అయితే, ప్రతిదశలో యీ జగన్నాథ రథచక్రాల విప్లవ పురోగమనాన్ని వెనుకకు త్రిప్పికొట్టు, సామ్రాజ్యవాద, దేశీయ అభివృద్ధి నిరోధక శక్తుల ప్రయత్నాలు సాగుతూనే వున్నవి. ఈ స్థితిలో గత నాలుగు సంవత్సరాలుగా సోషలిస్టు ప్రపంచ వ్యవస్థలో వచ్చిన చీలికలు విస్తరించి, మరింత ప్రమాదకరంగా పరిణమించుట మరువజాలము. ప్రపంచ సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనలో వచ్చిన చీలిక అత్యంత దురదృష్టకరము, విచారణీయమూ అయింది. అతివాద, మితవాద సంస్కరణ వాదాలు రెండూ ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలో నిర్మాణ పాత్రకంటె మిన్నగా విచ్ఛిన్నకర పాత్రనే నిర్వహించాయని, యీ శతాబ్దిచివరి దశాబ్దపు చరిత్ర నిస్సందేహంగా రుజువుచేసింది.[1] అంచేతనే సామ్రాజ్యవాదం దెబ్బకాచుకునే దశనుండి, దెబ్బతీసే చొరవ దశకు పురోగమించుటకు అవకాశం లభించింది. ప్రపంచ కమ్యూనిస్టు, అభ్యుదయకర శక్తుల వైఫల్యమే యిందుకు ప్రధాన కారణము.

సంగ్రహంగా, సి.పి.ఐ. పశ్చిమ సామ్రాజ్యవాదంలో సంక్షోభం వేగంగా అభివృద్ధి చెందుతున్నదని; "ప్రపంచ కరెన్సీ విధానంపై యూరోపియన్ గుత్త పెట్టుబడిదారి వర్గాలు పోటీతో ప్రత్యర్థులుగ" వున్నారని సూత్రీకరించింది. "కొన్ని దేశాలలో "ఆర్థిక మాంద్యము" ప్రారంభమైందని, "ద్రవ్య సంక్షోభం"లో పడినవని, అంచేత ప్రభుత్వ గుత్త పెట్టుబడికి వ్యతిరేకంగా విస్తృత వర్గపోరాటాలు తప్పనిసరిగా తీవ్రతరమౌతాయని" నిర్ధారణకు వచ్చింది. సి.పి.ఐ. (యం) "పెరుగుదల రేటు బాగా తగ్గి" అంటు జాడ్యమైన పరిస్థితులలో "పారిశ్రామిక తిరోగమనం" జరిగిందని, పెట్టుబడిదారి విధానానికి అతి చెడ్డ సంక్షోభ సంవత్సరాలని, "ఆర్థిక సంక్షోభం నేరుగా యుద్ధ ఖర్చులకు, ఆర్థిక విధానము గుత్త సాంప్రదాయీకరణకు సంబంధం కలిగియుందని" వివరించింది. "సామ్రాజ్యవాదం అణచివేయబడుతున్న జాతుల మధ్యగల వైరుధ్యం ప్రపంచంలో ప్రధానమైనదిగా పైకి వచ్చిందని" అందుకు "ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలో విజృంభించుచున్న స్వాతంత్ర్యోద్యమాలు, ప్రజా విప్లవోద్యమాలు, కార్మిక పోరాటాల వెల్లువలను" నక్సల్బరీ మార్క్సిస్టు–లెనినిస్టులు పేర్కొన్నారు. సామ్రాజ్యవాదపు దాడిపై కమ్యూనిస్టు శ్రేణులలో మౌలిక భేదాభిప్రాయాలు లేవు.

---

1. పి.కె. మూర్తి (1997) సెమినార్ పత్రం 1, సిగ్నిఫికెన్స్ అండ్ రిలవెన్స్ ఆఫ్ నక్సల్బరీ పీజెంట్స్ రివల్యూషనరీ మూమెంట్, జనశక్తి నం. 2 నం.3 సెప్టెంబరు 10, 97 పే 61.

# 2

# జాతీయ రాజకీయ పరిణామాలు

భారత ఆర్థిక సంక్షోభం, అర్ధ భూస్వామ్య వ్యవసాయ సంబంధాలు, పెట్టుబడిదారి విధాన పంథాలో అభివృద్ధి సాగుటలోని వైరుధ్యాలు, యీ క్రింది అంశాల వలన తీవ్రతరమగుట సంభవించింది. అవి : ప్రపంచ పెట్టుబడిదారి మార్కెట్టుకు భారత ఆర్థిక విధానం ముడివేయబడి వుంది. అంచేత ప్రపంచ ఆర్థిక విధానం సంక్షోభంపై ఆధారపడి వుంది. ప్రపంచ మార్కెట్టులోని "ఆటు–పోటు"లలో ఇండియా ఎగుమతులు, దిగుమతులు పెట్టుబడిదారి దేశాల నుండే చేసుకొనవలసి వుంది. బడా పెట్టుబడిదారి దేశాలతో వ్యాపారం చేసే బలహీన భారతదేశం భాగస్వామిగా వుంది. అంచేత, అసమాన వ్యాపార షరతులతో, విచక్షణతో నిరంతరం దోపిడీ చేయబడుతున్నది. ప్రపంచ పెట్టుబడిదారి సంక్షోభం నేపథ్యంలో, ఆర్థిక విధానాలను మార్చి, సంక్షోభ భారాన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలపైకి నిర్దిష్టంగా మోపితే, భారతదేశ సంక్షోభం తీవ్రతరం అవుతుంది. విదేశ అప్పులు భరింపలేని, చెల్లించలేని భారాన్ని పెంచి, దారిద్ర్యాన్ని ఆకలి బాధను పెంచేస్తున్నవి, సంక్షోభాన్ని తీవ్రతరం చేస్తున్నది. ఈ అప్పులు, విధించిన షరతులు మన పెట్టుబడిదారులు మన మార్కెట్టుపై, దిగుమతుల ప్రత్యామ్నాయాలను ఉత్పత్తిచేసి, ఆధిపత్యాన్ని చేజిక్కించుకొనే అవకాశాన్ని మృగ్యం చేస్తున్నవి. విదేశ పెట్టుబడిదారులతో భాగస్వాములగునట్లు బలవంతం చేస్తున్నవి. పెట్టుబడిదారి విధాన పంథా పరిమితులలో, దేశీయ మార్కెట్టును రూపొంచించి, విస్తరించే అవకాశాలను కుదింప చేయుటయేగాక రోజురోజుకి పెరుగుదల రేటు తగ్గిపోయి ఆర్థిక మాంద్యానికి దారితీస్తున్నది. వ్యవసాయ అధికోత్పత్తులకు ఆటంకంగా వున్న భూస్వామ్య వ్యవసాయ సంబంధాలను రూపుమాపుటలో వైఫల్యమే ఆహారపదార్థాల తరుగుతో దేశం "ఆకలి, కరువుల"కు ఆలవాలమగుట, పరిశ్రమలకు కావలసిన ముడి సరుకుల వుత్పత్తులు జరుగక పోవుటలో వైఫల్యం, పూర్తిగా తొలకరి వర్షాల పైనే త్రోసివేయజాలము. ఉత్పత్తి సాధనాల కేంద్రీకరణ కొద్దిమంది చేతులలో చేరుట, వారే సమాజ ఉన్నత వర్గాలగుట, పతాన్నభుక్కులు, అసంఖ్యాక శ్రామికుల శ్రమ ఫలితాన్ని పెట్టుబడిదారులకు దోచిపెట్టే నేటి నూతన ఆధునిక ఆర్థిక విధానమైన ద్రవ్యోల్బణాన్ని పెంచి, పోషించే విధానాన్ని అధికార వర్గాలు చేబట్టుట, బడా పెట్టుబడిదారి బూర్జువా వర్గాలకు అనుకూలమైన ధరల నిర్ణయ విధానాన్ని ప్రభుత్వం అనుసరించుట, ప్రభుత్వ ప్రజారంగాల పరిశ్రమలలో అసమర్ధత, అరాచకం, వనరుల దోపిడి, అంచగొండితనం మొదలైన ఉత్పత్తికి వుపయోగపడని, అనవసరంగా శ్రమ, ముడిసరుకులను "దండుగ" చేయుటతో, ఎంతో పెట్టుబడి పెట్టిన భారీ పరిశ్రమలు అదనపు విలువను సృష్టించి, పెట్టుబడిని సృష్టించకపోగా విపరీత నష్టాలను కలుగజేస్తున్నవి.

ఆర్థిక సంక్షోభాన్ని ఆహ్వానించుచున్న మౌలిక అంశాలుగా వీటిని చెప్పవచ్చును.[1]

ఆర్థిక సంవత్సరాలముందే తలసరి ఆదాయం పెరుగుట ఆగిపోయి స్తబ్దతకు చేరింది. వాస్తవానికి 1965-66లలో 7 శాతం పడిపోయింది, ఆదే 1966–67తో మరో 0.7 శాతం అనగా మొత్తం 7.7 శాతం పడిపోయింది. ఈ విధంగా తలసరి ఆదాయం, జాతీయ ఆదాయం పెరుగుదల ఆగిపోవుట అంటే అర్థం, అభివృద్ధి ఆగిపోవుట, మార్కెట్టు విస్తరణ ఆగిపోవుట, అనగా దేశీయ మార్కెట్టుపైనే ప్రధానంగా ఆధారపడే భారత పెట్టుబడిదారి విధానాభివృద్ధి ఆగిపోవుట. ప్రజల కొనుగోలు శక్తి పడిపోవుటతో అస్తవ్యస్తంగావున్న భారత పారిశ్రామిక వుత్పత్తులకు, మార్కెట్టు కుదించుకుపోయి, ఉత్పత్తులు కొనుగోలుశక్తికి మించిపోయి, గోడవునులు నిండిపోవుట, సంక్షోభం వికృతరూపం ధరించుట జరిగింది.

ప్రపంచ పెట్టుబడిదారి విధానంలో సంక్షోభం ప్రత్యక్షం కాకముందే, మార్కెట్టు మాంద్యం, అంతకుముందే మార్కెట్టులో గిరాకి తగ్గుదల వచ్చాయి. అంటే గిరాకి తగ్గుదల, మార్కెట్టు మాంద్యం, సంక్షోభం అవతరణ క్రమంగా అర్థం చేసుకొనవలసి వుంటుంది.

పారిశ్రామికీకరణకు ఆటంకం కలుగుట, పారిశ్రామిక ఉత్పత్తి తరిగిపోవుట దీర్ఘవ్యాధిగా పరిణమించిన నేపథ్యంలో జరిగింది. ఉత్పత్తిరేటు పడిపోవు వైఖరి 1965–67లలో పారిశ్రామిక ఉత్పత్తి సూచిక 68 శాతానికి పడిపోవుటతో స్పష్టమైంది. పారిశ్రామిక ఉత్పత్తి సామర్థ్యం తగ్గిపోవుట 38 శాతం మాత్రం వుత్పత్తి శక్తిలో వినియోగింపబడుటతోను విశదమైంది. యిది ప్రత్యేకంగా కొన్ని ఎన్నిక చేసిన పరిశ్రమలలో జరిగింది. అనేక పరిశ్రమలలో విస్తృతంగా ఆర్థిక మాంద్యం కన్పించింది, పరిశ్రమలలో పెట్టుబడి పెట్టుట పడిపోయింది. వినిమయ వస్తువుల వుత్పత్తి గణనీయంగా తగ్గిపోయింది, వివిధ వస్తువుల వుత్పత్తి 28 నుండి 18.0 శాతం వరకు పడిపోయింది.

సంక్షోభపు తీవ్రత వివిధ పరిశ్రమలలో ఉత్పత్తి సరుకుల నిలువలబట్టి స్పష్టమగుతుంది. అనేక పరిశ్రమలలో ఉత్పత్తి పడిపోయినా సరుకుల నిలవలు పెరిగిపోవుట దీనినే తెల్పుతుంది. ఈ సంక్షోభంలో పెద్దగా దెబ్బతిన్నది చేతిమగ్గాల వుత్పత్తులు, అనేకమంది నిరుద్యోగులయ్యారు. పారిశ్రామిక కార్మికులు, ముఖ్యంగా చిన్నపరిశ్రమలలోని కార్మికులు నిరుద్యోగులై సంక్షోభభారాన్ని యెక్కువగా మోయవలసి వచ్చింది. ఈ పరిస్థితులలో ప్రభుత్వ సహాయంకూడ పెద్ద పరిశ్రమలకే లభించింది. తయారైన సరుకులు మార్కెట్టునుండి విడుదల కాకపోవుటతో, చిన్న పరిశ్రమలు వుత్పత్తినే కొనసాగించలేకపోయారు. అనేక పరిశ్రమలు మూతబడి

---

1. సి. పి. ఐ. (యం) 8వ పార్టీ కాంగ్రెసులో సి. సి. సమర్పించిన "పొలిటికల్ ఆర్గనైజేషనల్ రిపోర్టు, 1969" (ఆంగ్లంలో) పే. 71.

పోయాయి, కొన్ని దివాళా తీసాయి. ఈ విధంగా చిన్నపరిశ్రమలు, అందులో పని చేసే కార్మికులే సంక్షోభభారాన్ని అధికంగా మోయవలసి వచ్చింది.

విదేశీయ సహాయంపై ఆధారిత ఆర్థికవిధానం, సంక్షోభ భారాన్ని మనపై అధికంగా త్రోసివేయుటకుతోడ్పడింది. వాస్తవానికి విదేశఆర్థికసంక్షోభభారాన్ని ఇండియా భరించుటకు ఆమోదించుటపైనే, విదేశ సహాయం లభించుట ఆధారపడివుంది. అమెరికా వొత్తిడిచేసి, రూపాయి విలువను తగ్గించునట్లుచేసి, తన సంక్షోభభారాన్ని భారతదేశంపై త్రోసివేసింది. నిజానికి రూపాయి విలువ తగ్గించుట, సంక్షోభ భారాన్ని మనపై త్రోసివేయుటకు వొక సాధనంగా అయింది. విదేశ "ఆర్థిక సహాయం"పై ఆధారపడుట కొనసాగితే, "విదేశ మారకద్రవ్య సంక్షోభం, బహువార్షిక ఎడతెగని" అంశంగా కొనసాగుతుంది—దీర్ఘవ్యాధి అగుతుంది, దీనికి సంబంధించినదే మరో అంశం. ఆర్థిక సహాయం-కొన్ని బంధనాలతో కలిసే వుంటుంది. రాజకీయ బంధనాలు అటువుంచి, సహాయం అనే అప్పులు, గ్రాంటులు, కొన్ని ప్రత్యేకపనులు లేక ప్రాజెక్టులకే-అందులో ప్రదర్శన ప్రాధాన్యత కలవాటికేనని వేరుగ చెప్పవలసిన అవసరంలేదు.

మన ఆర్థికవిధానంపై మోపబడుతున్న బ్రహ్మాండభారాన్ని మన కాంగ్రెసు నాయకులు ఎగుమతి దిగుమతుల తరుగుదల చెల్లింపుల సంక్షోభంగా పేర్కొంటున్నారు. భారతప్రభుత్వ 1968–69 బడ్జెట్టు గణాంకాల ప్రకారం, ప్రభుత్వపు విదేశీ అప్పుల మొత్తం రు. 6225 కోట్లు. ప్రభుత్వం దేశంలో చేసిన అప్పులలో విదేశాల అప్పులు 1 శాతంగా 1955–56లో వుండేవి, మార్చి 1966కు 32 శాతానికి పెరిగిపోయాయి. రూపాయి విలువను తగ్గించుటతో విదేశ అప్పు వొక్కసారిగా 57.5 శాతం పెరిగిపోయింది. భారతదేశ అప్పులో విదేశ అప్పు శాతం 32 నుండి 45కు పెరిగిపోయింది. నాటి ధరలలో జాతీయ ఆదాయంలో 1966–67కు విదేశ అప్పు 20 శాతానికి పెరిగిపోయింది.

ఈ విధంగా విదేశ అప్పులకు చెల్లింపుల భారం, ద్రవ్యోల్బణం లెవీలు అన్నీ కలిసి, భవిష్యత్తులో అభివృద్ధికి ఆటంకాలయ్యాయి. ఈ చెల్లింపులకు మన ఎగుమతుల ఆదాయాన్ని ముందుగానే తాకట్టు పెట్టుచున్నవి. అంచేత, మన విదేశ మారక ద్రవ్య సంపాదన, మన పారిశ్రామికీకరణకు అవసరమైన యంత్రాలను యూరోపియన్ పోటీ మార్కెట్టులో కొనుగోలు చేయగల మన శక్తిని, అప్పులకు చెల్లించవలసి వచ్చుటతో, తిరిగి అప్పులు చేయవలసి వస్తున్నది.

ఒక దశాబ్దకాలంలో 1957 నుండి 1967 వరకు, లాభాలుగా కాని, రాయల్టీసుగా కాని, 600 కోట్ల రూపాయలు పైగా విదేశాలకు వెళ్ళాయని ప్రభుత్వ అధికార అంచనాలు తెల్పుచున్నవి. విదేశ ప్రవేటు పెట్టుబడికి రోజు రోజుకు అధికంగా యిచ్చే రాయితీలు, అదికోరే అధిక రేటు లాభాలు, భారతదేశపు స్టెర్లింగు నిల్వలు

రోజు రోజుకు తరగిపోవుట, ప్రధానంగా లాభాలు, జీతాలు, పెన్షనులు రూపంలో ఎగుమతి అగుటతోకూడ స్టెర్లింగు నిల్వాలు హరించుకుపోతున్నవి. విదేశీ చోపిడి దారులు విధించే లెవీలు మరీ ఘోరంగా వున్నవి. వాస్తవానికి మనదేశానికి దిగుమతి అగుతున్న విదేశ పెట్టుబడి వారు మనదేశంలో సంపాదించిన లాభాలతో కొంత భాగమే తిరిగి యిక్కడ పెట్టుబడిగా పెట్టుతున్నారు. నిజానికి మనకి వచ్చే విదేశ పెట్టుబడి, విదేశ ద్రవ్యం, స్టెర్లింగు, డాలర్లు కావు. అంచేత, వారి యంత్రాలకు మనం చెల్లించవలసిన విదేశ ద్రవ్యం కొరకు, మనం వారినుండి, సహాయమనే అప్పు, వడ్డీతోకూడిన దానిని తీసుకొనవలసి వుంది.

భారతదేశపు విదేశ అప్పులకు చెల్లించవలసిన మొత్తాలు 1960-61-1965-66 మధ్య మూడు రెట్లు పెరిగాయి, అదే కాలంలో ఎగుమతుల ఆదాయాలు నాలుగో వంతు మాత్రమే పెరిగాయి. అప్పులకు చెల్లింపులు 1960-61 లో ఎగుమతుల ఆదాయంలో 8 శాతంగా వున్నవి 1965-66కు 20 శాతమైనవి. నాల్గవ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఎగుమతులలో 28 శాతం లేక ప్రణాళికకు అవసరమైన విదేశ వనరులలో 36 శాతముగా వుందని, ఐక్యరాజ్యసమితి సర్వే అంచనా వేసింది. దేశపు విదేశ మారకపు ద్రవ్య స్వేచ్ఛా సంపాదనలో దగ్గరి దగ్గరిగా 50 శాతం అప్పుల వాయిదాల చెల్లింపులకు, ఆహార ధాన్యాల దిగుమతులకు 1967 లో 242 కోట్లుగా వుంది. డిశెంబరులో భారతదేశం చేయవలసిన విదేశ రుణం 1000మిలియనుల డాలర్లు అవుతుందని, అప్పులకు చెల్లించవలసిన వాయిదాల మొత్తం 500 మిలియనుల డాలర్లు అనగా 375 కోట్లు అవుతుందని మొరార్జీ దేశాయి ప్రకటించారు. కొత్తగా చేయబోయే అప్పులో 50 శాతం అప్పుల వాయిదాల చెల్లింపులకే అయిపోతుంది. అంతర్జాతీయ పోటీ మార్కెట్టులో మన పరిశ్రమలకు కావలసిన యంత్ర సామాగ్రినికొనే ప్రశ్నయే వుదయించదు. పరిశ్రమల మెయింటనెన్స్ దిగుమతులు గుత్త పెట్టుబడి వర్గాల యిష్టమొచ్చిన ధరలకు, "సహాయ" షరతుల ప్రకారం వారి నుండే కొనవలసి వుంటుంది. ఇది అంతర్జాతీయ మార్కెట్టులో మనం కొనగలిగిన స్వతంత్ర ప్రతిపత్తిపై దెబ్బ తీస్తుంది, అనవసర ఖర్చులు అధికంగా పడుతవి. ఆర్థిక సంక్షోభం కారణంగా భారత దేశం వాయిదా చెల్లింపులు కట్టజాలక, చెల్లింపులను వాయిదా వేయాలని అర్థించవలసి వుంటుంది. ఇది వొక రకంగా అంతర్జాతీయ "దివాళా"గా నెంచాలి. భారతదేశం 98 మిలియనుల డాలరులు "అప్పు రిలీఫ్" పొందింది. రూపాయి విలువ తగ్గింపును యీ నేపథ్యంలో అర్థం చేసుకొనవలసి వుంటుంది. ఈ చర్య మన అప్పును 57.5 శాతం వొకేసారి పెరుగునట్లు చేయుటయే గాక, మనం చేసుకొనే దిగుమతులకు 50 శాతం అదనంగా చెల్లించునట్లు చేసింది, ముఖ్యంగా పారిశ్రామికీకరణకై దిగుమతి చేసుకొనే యంత్రాలను యీ అదనపు చెల్లింపులకు గురి అగుతవి. అదే విధంగా మనకు యిచ్చే "సహాయ"మనే అప్పు ఖరీదు పెరిగిపోతుంది.

దేశం "సంక్షోభం"లో పడుట అనేది, విదేశ మారకద్రవ్యం లోటువలన, లేక తొలకరి వర్షాలు అదునులో పడనందు వలన యేర్పడినది కాక, దేశ ఆర్థిక, రాజకీయ మౌలిక పునాదులు కదలిపోవుట వలన యేర్పడుతున్నది. సంక్షోభ ఫలితంగా, మన ఎగుమతులకు మార్కెట్టు ఎక్కడ దొరుకుతుందాయని శోధించుట ప్రారంభమైంది. ఇది ఆరోగ్యకరమైన ఎగుమతి విధానం కాదు, మన అవసరాలకు మించిన అదనపు ఉత్పత్తులను ఎగుమతి చేయుటకు ప్రయత్నించుట, మన అవసరాలు తీరకపోయినా "విదేశ ద్రవ్య కరువు"ను ఎదుర్కొనుటకు చేయు ఎగుమతులు. పరిశ్రమలను కనీస స్థాయిలోనైనా కొనసాగించుట బూర్జువా-భూస్వామ్య ప్రభుత్వం యీ ఎగుమతులుచేస్తుంది. అందుకు విదేశాలు అనేక రాయితీలనుకూడ యిస్తున్నవి. కంట్రోళ్ళు, ధరల కంట్రోలు అనేక ముడిసరుకులుకు తీసివేయుటో లేక సడలించుట చేసింది. సామాన్యునిపై భారాన్ని త్రోసివేసి, పెద్ద తిమింగలాలకు లాభాలను నికూర్చుతున్నది. సంక్షోభం పేరుతో ప్రవేటు పెట్టుబడిదారీ వర్గాలకు మరింత స్వాతంత్ర్యాన్ని యిచ్చి, లైసెన్సు విధానాన్నికూడా ఎత్తివేసింది. ప్రణాళికలను నీరుగార్చి, జనరల్ ప్రచారాన్ని సాగిస్తూ, ప్రభుత్వ, ప్రజారంగాలను సవతిబిడ్డలుగా చూస్తున్నది. అదే పేరుతో సామ్రాజ్యవాదుల కోరికల పోటీని ఆమోదిస్తున్నది. సమ్మెలు జాతివ్యతిరేక చర్యలుగా సామ్రాజ్యవాదుల కోరికపై గుర్తించింది. అదే సంక్షోభం, బూర్జువాలలోని కొన్ని వర్గాలు, సామ్రాజ్యవాద వ్యతిరేకతతో తలపడి సంఘర్షణలకు దిగునట్లుకూడ చేస్తున్నది. ఇదే, సోవియట్ యూనియన్ సామ్రాజ్యవాదాలమధ్య, తమ ప్రయోజనాలను కాపాడుకొనుటకు వారు మధ్యస్థపాత్ర వహించునట్లు చేస్తున్నది. పాలక వర్గాలలో, పారిశ్రామికులలో సైనికఖర్చు విపరీతంగా పెరిగిపోతున్నందున పారిశ్రామిక, వ్యాపార అవకాశాలు తగ్గిపోతున్నందున చైనాతో సంప్రదింపులు ప్రారంభించుట అవసరమనే అభిప్రాయాలు వినపడుతున్నవి. సంక్షోభమే సామ్రాజ్యవాదం. సోవియట్ యూనియన్‌ల మధ్య "దోబూచులాడే" విధానాన్ని ఆర్థిక సంప్రదింపులలో అవలంబించునట్లు చేస్తున్నది.

సంక్షోభ సంవత్సరాలు ప్రజా సామాన్యానికి చెప్పలేని దుర్భర పరిస్థితులను తెచ్చిపెట్టాయి. రూపాయి విలువ తగ్గించుట, ద్రవ్యోల్బణం, దేశవిదేశ అప్పులు పెరిగిపోవుట అన్ని ప్రజల నిత్యావసరాల ధరలను విపరీతంగా పెంచేశాయి. ఈ ధరల పెరుగుదల **1965–66లో 8.7 శాతం, 1966-67లలో 15.8 శాతం** అనగా సంవత్సరానికి **12** శాతం పెరిగాయి. టోకుధరలు **1964-65లో** సూచిక, **152.67** కాగా, **1966-67లో 191.3**, సెప్టెంబరు **1967** నకు **221.5** పెరిగిందని ప్రభుత్వ గణాంకాలే తెలియజేస్తున్నవి. వినియోగధరల సూచిక **1949** ఆధారం **100**నుంచి **1964లో 152, 1966లో 184** కాగా అక్టోబరు **1967**కు **217** అయింది, జూన్ **1968** కు **1.4** శాతం అనగా షుమారు **220**కు పెరిగింది. ఇదే కాలంలో నిజవేతనాలు జీవన వేతనా లుతగ్గుతూనే ఉన్నవి. ఈ రెండింటిని సమగ్రంగా చూస్తేనే

జీవితమెంత దుర్భరమయింది తెలుస్తుంది. ఈ విధంగా సంక్షోభభారం సామాన్యు నిపై త్రోసివేయబడింది. ఇదే రాజ్యం, పెట్టుబడిదారివర్గాలు రెండూ కలిసిచేసే ప్రజా సామాన్యపు సమిష్టి దోపిడి.

దీనికితోడు, ప్రభుత్వ లెక్కల ప్రకారం 1965లో 24.7 లక్షలు, 1967తో 27.4 లక్షలు, 1968 ఫిబ్రవరిలో 27.99 లక్షల రిజిస్టర్డు నిరుద్యోగులున్నారు. ప్రభుత్వ లెక్కలలోనికి రానివారు మరెందరో వున్నారు. పెరిగిపోయే నిరుద్యోగము, జీవనవ్యయం, పడిపోయే నిజవేతనాలు కార్మికవర్గం విస్తృతంగా సమ్మెలలో పాల్గొనునట్లు చేస్తున్నది. గత ఐదుసంవత్సరాలలో వివిధ పరిశ్రమలు సమ్మెలు కారణంగా నష్టపోయిన పనిదినాలు 1962లో 6.12, 1963లో 3.27, 1964లో 7.72, 1965లో 6.99, 1966లో 13.85 మిలియనులుగా ఉన్నవి. తాత్కాలిక లెక్కల ప్రకారం 1967లో 9.92 మిలియనులు పనిదినాలుగా అంచనా వేసారు. నెలల కొలది కొన్ని 4½ మాసాలవరకు 1968లో దీర్ఘకాల సమ్మెలు, లాకౌట్లు జరిగాయి. వార్తాపత్రికల ఉద్యోగుల, కేంద్రప్రభుత్వోద్యోగుల సమ్మెలు ప్రధానంగా చెప్పుకొనదగినవి. సంక్షోభ వొత్తిడి కారణంగా ప్రభుత్వం ఉద్యోగులు, కార్మికులతో సంప్రదింపులకుకూడా సిద్ధంకాక సమ్మెలను తానే తెచ్చిపెట్టుచున్నది. [1]

సంక్షోభం ప్రజలు, సామ్రాజ్యవాదం ముఖ్యంగా అమెరికాసామ్రాజ్యవాదాల మధ్యగల తీవ్రవైరుధ్యాన్ని బట్టబయలు చేయటమేగాక, అది ప్రజాసామాన్యపు జీవన ప్రమాణాలకు నేరుగా యెంతటి ప్రమాదకారిగా పరిణమించిందో అందరికీ తేటతెల్లం చేసింది. ప్రజలకు కాటక పరిస్థితులను, లక్షలకొలది ప్రజాసామాన్యానికి దుర్భర జీవన, కరువుకాటకాలను మన దేశంలో యేర్పడుటకు నేరుగా కారణమయింది.

**రాజకీయ పరిస్థితి :**

కాంగ్రెసు స్వతంత్ర పెట్టుబడిదారీ విధాన పంథాలో భారతదేశంలో ఆర్థికాభివృద్ధిని గావించజాలదనే తన 7వ పార్టీ కాంగ్రెసు అవగాహన రుజువయిందని, సి.పి.ఐ.(యం) 8వ పార్టీ కాంగ్రెసు పొలిటికల్ ఆర్గనైజేషనల్ నివేదికలో స్పష్టం చేసింది. (పే. 119) అంతేగాక "ఆర్థిక సంక్షోభం తీవ్రతరమై, రాజకీయ సంక్షోభపు ప్రాథమిక దశకు దారితీసిందనికూడా మేము గుర్తించామని" పేర్కొన్నది. నివేదిక ఆర్థిక సంక్షోభపునైజం, లక్షణాలపై మూడు ముఖ్య అంశాలను పేర్కొన్నది. ఒకటి, సంక్షోభపు దీర్ఘకాలపు నైజాన్ని రెండు, పెట్టుబడిదారీ విధాన పంథాలోని ఆర్థికాభివృద్ధి, అత్యంత తీవ్రమైన సంక్షోభం కన్నా తీవ్రమైన సుడిగుండంలో చిక్కుకున్నదని, మూడు ప్రస్తుత ఆర్థిక సంక్షోభం లేక పెట్టుబడిదారి విధాన మాంద్యం, సాధారణ ఆర్థిక విధాన తిరోగమనంగా తప్పుగా అవగాహన చేసుకొన

1. సి.పి.ఐ. (యం) 8వ పార్టీ కాంగ్రెసు నివేదిక. పే. 103-7.

రాదని, ప్రపంచ పెట్టుబడిదారి విధాన సంక్షోభంలో విడదీయజాలని భాగమని, పెట్టుబడిదారి వ్యవస్థ మొత్తంగా వినాశనంవైపు పురోగమిస్తుందని" నివేదిక స్పష్టం చేసింది.

నాల్గవ పంచవర్ష ప్రణాళిక ఆచరణలో వదలి వేయబడి, విదేశ ప్రవేటు కంపెనీలకు సింహద్వారాలు తెరువబడినవి.

"ఆహార, వనరుల సంక్షోభంలో, విదేశ మారకద్రవ్య, ప్రణాళికల సంక్షోభంలో, వొక్క మాటలో ప్రభుత్వ దేశ, విదేశాంగ శాఖలలో సంక్షోభం యేర్పడింది" అని నివేదిక వుదహరించింది వాస్తవమైందని సంతృప్తిపడింది.

ప్రజల, పారిశ్రామిక కార్మికుల, గ్రామీణ ప్రాంతాలలో రైతాంగపు, వ్యవసాయ కూలి, యితర బడుగు వర్గాల అసంతృప్తి పెరిగిపోవుట అందరి దృష్టిని ఆకర్షించింది. అయినా ప్రభుత్వం అలక్ష్యంచేసి, జాతీయస్థాయిలో సమ్మె వచ్చేటట్లు రెచ్చగొట్టింది. రెండు మాసాలు పత్రికలు ప్రభుత్వ ప్రకటనలను బాయికాట్ చేసాయి. అతి వేగంగా ప్రభుత్వం అణచివేత చర్యలు ప్రారంభించుటతో అఖిల భారత ప్రభుత్వోద్యోగుల వొకరోజు సమ్మె నిరసనను, ప్రభుత్వం నిషేధించుతూ ఆర్డినెన్స్‌ను ప్రకటించింది. గుడ్డల మిల్లులలో, ఇంజనీరింగు పరిశ్రమలలో నెలల కొలది సమ్మెలు జరిగాయి. అనేక రాష్ట్రాలలో వివిధ పరిశ్రమలలో ఆందోళన, నిరసన ప్రదర్శనలు, సమ్మెలు జరిగాయి. ఆర్థిక సంక్షోభం ప్రజల జీవితాన్ని దుర్భరం చేయుటతో కార్మిక, కర్షక, నగర, గ్రామీణ బడుగు వర్గాల ప్రతిఘటన వివిధ రూపాలలో సాగించారు.

ఈ అన్నిటి కారణంగా, యేర్పడిన రాజకీయ సంక్షోభం, శక్తివంతంగా బహిరంగంగా, ఎన్నికల అనంతరం మరింత తీవ్రంగా ప్రకటితం కాజొచ్చింది. పాలకపార్టీ కాంగ్రెసు అగ్ర నాయకులు రాజకీయ సంక్షోభం, ఆర్థిక సంక్షోభాన్ని వెన్నంటి బహిర్గతమగుటను, లేదని బుకాయించసాగారు, కాని వాస్తవానికి రాజకీయ అస్థిరతకూడ, దూరదృష్టి కల వారికి ఎట్టెదుట కన్పడుతూనే వుంది. అంతేగాక, ఎనిమిది రాష్ట్రాలలో కాంగ్రెసేతర ప్రభుత్వాలు యేర్పడుట కంటే, కాంగ్రెసు బుకాయింపులు తప్పనుటకు, మరొకటి ఉదహరించ నవసరంలేదు.

కేంద్ర, రాష్ట్ర సంబంధాలు మరింత సంఘర్షణలకు లోనగుతూ, దేశ ఫెడరల్ రాజ్యాంగ నిర్మాణాన్ని ప్రశ్నించుతూ, దేశ అనైక్యతకు పరిస్థితులు దారి తీస్తున్నవి. ఈ పరిణామాలన్నింటి నుండి రెండు నిర్దిష్ట వైఖరులు స్పష్టమగుతున్నవి. ఒకటి అత్యంత ప్రమాదకరమైన ఏకచ్ఛత్రాధిపత్య రాజ్యాంగం, ప్రభుత్వం, అన్ని ప్రజాస్వామ్య, స్వపరిపాలన అధికారాలను, ఉప జాతులకు, రాష్ట్రాలకు లేని బలమైన కేంద్ర ప్రభుత్వం యేర్పరచాలనే వైఖరి, రెండవది, తరతమ వివిధ అభిప్రాయాలుగల వైనప్పటికి, రాష్ట్రాలకు పూర్తి స్వపరిపాలనా అధికారాలు గల సిస

లైన ఫెడిరల్ రాజ్యాంగం, ప్రభుత్వం యేర్పడాలనే వైఖరులు ప్రస్ఫుటమైనవి. పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధి సంక్షోభంలో పడుటతో, యీ రెండు వైఖరులు రాజకీయ సంఘర్షణలకు లోనగుట, అదే పరిస్థితులలో రాజకీయ సంక్షోభం యేర్పడితే, యీ సంఘర్షణలు మరింత తీవ్రమై రాష్ట్రాలకు స్వపరిపాలన మరిన్ని రాజకీయ, ఆర్థిక అధికారాలు కావాలనే ఆందోళనలు పెరిగి, ఫెడరల్ వ్యవస్థను అక్షరాల అమలు చేయాలనే ప్రజోద్యమాలు అభివృద్ధి చెందుటకు పెక్కు అవకాశాలు యేర్పడినవి అంచేతనే, సి.పి.ఐ.(యం) నివేదిక, "రాజకీయ సంక్షోభపు ప్రాథమిక దశలో దేశ మున్నదని" నిర్వచించుట అత్యంత సబబైనదని, బూర్జువా నాయకత్వాలు ఎంత బోకరించినా, సత్యాన్ని దాయలేరని తెల్పుచున్నది.

సి.పి.ఐ. రాజకీయ నివేదిక, ప్రభుత్వం మితవాద, ప్రజా వ్యతిరేక, ప్రజాస్వామ్య వ్యతిరేక విధానాలు అవలంబించుతుందని చెప్పటకు గుత్త పెట్టుబడిదారి వర్గాలు అభివృద్ధి చెందుట, వారి చేతులలో రాజ్యాధికారం కేంద్రీకరింపబడుటతో స్పష్టమగుతున్నది. అధికార మహాల నోబిస్ కమిటి, మొనాపలీస్ కమిషన్ నివేదికలు దీనినే స్పష్టం చేస్తున్నవని సి.పి.ఐ. నివేదిక పేర్కొన్నది.

స్వాతంత్రానంతర కాలంలో యీ దశకం అనేక విధాల రాజకీయంగా కొత్త నిర్ణయాత్మక పరిణామాలు కలిగినవి. దేశం, వొక కొత్త మలుపులోవుంది. ఈ కాలంలో అమెరికన్ నియో వలస విధాన వొత్తిడి, దేశంలోని అభివృద్ధి నిరోధక శక్తుల వొత్తిడితో కలిసి ద్విగుణీకృతమైంది. మరోవైపున ప్రజోద్యమాలు, ప్రజా పోరాటాలు ఎక్కువయ్యాయి. కాంగ్రెసు గుత్త అధికారం బ్రద్దలైంది. ఎన్నికలలో దాని పునాదులు కదలిపోయాయి, ఎనిమిది రాష్ట్రాలలో అధికారాన్ని కోల్పొయింది. కేరళ, పశ్చిమ బెంగాలులలో వామపక్ష, ప్రజాస్వామ్యశక్తులు అధికారంలోనికి వచ్చుటతో, కాంగ్రెసుకు ప్రధాన తిరోగమన దెబ్బతగిలింది, అమెరికా ఆశలు అడియాశలయ్యాయి. అయితే కాంగ్రెస్ అపజయాలతో వామపక్ష శక్తులతోపాటు, అభివృద్ధి నిరోధక మితవాద, మతవాద శక్తులు బలాన్ని పెంపొందించుకొన్నాయి. వామపక్షశక్తులు యీ ప్రమాదకర విషయాన్ని మరువరాదు. మితవాద అభివృద్ధి నిరోధక శక్తులలో స్వతంత్రపార్టీ, జనసంఘం బలపడినవి. మితవాద అభివృద్ధి నిరోధక శక్తులు పెరిగి తమ బలాన్ని కాంగ్రెసు వర్గాలు, శక్తుల నుండి పొందగలిగినా, వామపక్ష శక్తుల ముఖ్యంగా సి.పి.ఐ., సి.పి.ఐ(యం)ల మధ్యగల అనైక్యత, అభిప్రాయభేదాలు, సంఘర్షణలు కారణంగా, కాంగ్రెసు నుండి అసంతృప్తి చెందిన వర్గాలు మితవాదంవైపు ఆకర్షించబడినవి. అంతేగాక, కాంగ్రెసుపై వామపక్ష శక్తుల ప్రభావం బలహీన మగుటతో, కాంగ్రెసు కూడా మితవాదం వైపు మొగ్గు చూపుతున్నది. ఎన్నికలముందు అన్నిరాష్ట్రాలలో కాంగ్రెసే అధికారంలో వున్నందున

ఎనిమిది రాష్ట్రాలలో మినహా, మిగతా రాష్ట్రాలలో అధికారానికి రాగలిగింది. అంతే గాక, కాంగ్రెసుకు ప్రత్యామ్నాయంగా ప్రతిపక్ష పార్టీలు కలిసి, సమిష్టి కార్యక్రమాన్ని రూపొందించుకొనజాలక పోయాయి.

ఇండియా-పాకిస్తాన్ యుద్ధం యీ కాలంలోని రాజకీయ పరిణామాలలో అతి ముఖ్యమైనది. ఆసియాలో నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలమధ్య అత్యంత దురదృష్టకరము, ముఖ్యంగా తృతీయ ప్రపంచ దేశాలకు, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రపంచ శక్తులకు పెద్ద దెబ్బ, అదేకాలంలో, సామ్రాజ్యవాద శక్తులు తమకుట్రలు, కుతంత్రాలు సాగించుటకు మంచి అవకాశం లభించింది. అనేక శతాబ్దాల సమిష్టి చరిత్ర, సంస్కృతి, భాషలు, జాతీయ పునర్నిర్మాణ అవసరాలు, రెండు దేశాల మధ్య స్నేహ, సహకార, శాంతి సంబంధాలు పెంపొందించుకొనవలసిన చారిత్రక అవసరమెంతో వుంది. దీనికంతటికి విరుద్ధంగా అయూబ్‌ఖాన్, పాకిస్తాన్ ప్రభుత్వం అమెరికా సామ్రాజ్యవాదుల ప్రోత్సాహముతో, వారి ఆయుధ సంపత్తి బలంతో ఆశ్చర్యం గొల్పే విధంగా తృటిలో శ్రీనగర్‌ను ఆక్రమించాలని సైనిక ప్రణాళికతో యుద్ధాన్ని ప్రారంభించి, మొత్తం వుపఖండాన్ని యుద్ధజ్వాలలో ముంచెత్తే ప్రమాదాన్ని తెచ్చిపెట్టింది. భారత దేశభక్తసైన్యం, ప్రజలు ఎనలేని త్యాగాలతో, పాకిస్తాన్, అమెరికా సామ్రాజ్యవాదుల దుష్టప్రయత్నాలను వమ్ముచేసారు. భారత దేశంలో బ్రహ్మాండమైన సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజోద్యమం అభివృద్ధి చెందింది. బ్రిటన్, అమెరికా, తదితర సామ్రాజ్యవాద శక్తుల వ్యతిరేకత పెరిగిపోయి, ప్రజలకు దూరమయ్యారు. పాకిస్తాన్ అపజయం, నిజానికి అమెరికా, అమెరికన్ ఇండియన్ లాబివర్గాల అపజయంగా పరిణమించి, ప్రజలలో అప్రతిష్టపాలయ్యారు. సోవియట్ రష్యా చొరవతో ఇండియా-పాకిస్తాన్‌ల మధ్య టాష్కెంట్ వొడంబడిక జరిగి, యుద్ధ పరిస్థితులు అంతమై, సాధారణ పరిస్థితులు యేర్పడుటకు అవకాశాలు యేర్పడినవి.

ఇండియా-పాకిస్తాన్‌ల మధ్య రష్యా చొరవతో "కాల్పుల విరమణ" జరిగిన వెంటనే, సామ్రాజ్యవాద వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ప్రజావుద్యమం వెల్లువగా సాగుతు, "స్వశక్తిపై ఆధారపడుట", "క్విట్ కామన్‌వెల్తు" నినాదాలతో అభివృద్ధి చెందుతున్న ప్రజోద్యమాలకు, కాంగ్రెసు నాయకత్వం చెలియలికట్టలు వేయ ప్రారంభించింది. నిజానికి యీ సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజోద్యమాల వెల్లువను ముందుకు తీసుకొని పోవుటలో వామపక్ష శక్తులు వైఫల్యం చెందాయని చెప్పవలసి వుంది. అందుకు ముఖ్యకారణం, వామపక్ష శక్తులలో అనైక్యత ముఖ్యంగా కమ్యూనిస్టు వుద్యమం చీలికలతో చిన్నాభిన్నమై శక్తిహీనమైన దగుటగా చెప్పాలి. మరో కారణం, సంయుక్త సోషలిస్టుపార్టీ, ప్రజాసోషలిస్టు పార్టీలు, అనాసక్తితో యే విధంగా పట్టించుకొనకుండా, సామ్రాజ్యవాద శక్తుల తెరవెనుక, బహిరంగ ప్రోత్సాహాన్ని చూడనిరాకరించి, త్రోసిపుచ్చారు. అయినా అనేకమంది జాతీయ కాంగ్రెను

వాదులు, ప్రజలు సామ్రాజ్యవాద శక్తులకు తమ వ్యతిరేనితను స్పష్టంగా చాటి చెప్పారు. చైనా ప్రభుత్వం అవకాశవాద వైఖరి అవలంబించి. పాకిస్తాన్‌ను బల పరచి, సామ్రాజ్యవాద శక్తుల పన్నాగాలకు బలాన్నిచేకూర్చి, సామ్రాజ్యవాద వ్యతి రేక ఐక్య ప్రజాసంఘటన రూపొందుటకు వ్యతిరేకంగా, పరోక్షంగా పనిచేసింది, దాని సామ్రాజ్యవాద వ్యతిరేకత కూడ అవకాశవాదానికి అతీతంకాదని రుజువు చేసింది.

"అత్యవసర పరిస్థితిని" ప్రకటించి, భారత రక్షణచట్టాన్ని, తదితర ప్రత్యేక అధికారాలను ప్రత్యేకంగా ప్రజాస్వామ్య ప్రతిపక్షాలపై వినియోగించనని యిచ్చిన వాగ్దానాలన్నిటిని తోసిబుచ్చి, భిన్న అభిప్రాయాలను క్రూరంగా అణచివేయుట ప్రభుత్వం చేబట్టింది. ప్రజాసంఘాలకు చెందిన కార్మిక, కర్షక కార్యకర్తలను వేల కొలది మందిని డిటెన్యూలుగా అరెస్టుచేసి,జైళ్ళలో విచారణ లేకుండా నిర్బంధంలో వుంచింది. వామపక్షాలు, ప్రజాస్వామ్య పార్టీలు, ప్రత్యేకంగా కార్మిక సంఘాలు యీ ప్రభుత్వ దాడికి గురి అయ్యాయి. పోలీసు దౌర్జన్యాలు, కాల్పులు సర్వసాధా రణ మయ్యాయి,

అత్యవసర పరిస్థితి కాలంలో పాలకపార్టీలో నిరంకుశత్వ, ప్రజాస్వామ్య వ్యతిరేక ధోరణులు పెచ్చరిల్లి పోయాయి. ప్రభుత్వ అగ్రనాయకులకు విశేషాధి కారాలు యివ్వబడినవి. అత్యవసర పరిస్థితిని వుపసంహరించు కొనేముందు, చట్ట వ్యతిరేక చర్యల నివారణ బిల్లు, చట్టంగా ఆమోదింప జేసుకొనుట, దేశరక్షణ చట్టాన్ని మరో ఆరుమాసాలు పొడిగించుట పాలకపార్టీ చేసింది. కేరళలో 1965లో భారతదేశరక్షణ చట్టం పేరుతో నిర్బంధచర్యలు కొనసాగించుట, ఎన్నికలు జరు పుట, ఎంతటి ప్రజాస్వామ్య వ్యతిరేకచర్యో అందరకు తెలిసిన విషయం. ఆ ఎన్ని కలలో కాంగ్రెసు ఘోర అపజయాన్ని పొందగా, నూతనంగా ఎన్నికైన అసెంబ్లీ సమావేశం జరుగకుండానే, ప్రజాస్వామ్య సూత్రాలన్నిటికి వ్యతిరేకంగా అసెంబ్లీ రద్దు చేయబడింది. దేశంలోని ప్రజాస్వామ్య శక్తులన్నీ యీ చర్యను ఖండించాయి. కేరళ ఎన్నికలు కాంగ్రెసు, కేంద్రప్రభుత్వ అగ్రనాయకుల ప్రతిష్టకు భంగం పెద్దగా కలిగించాయి. అది స్పష్టంగా, భారత రక్షణ చట్టం పేరుతో జరిపిన నగ్న నిర్బంధకాండకు వ్యతిరేకంగా ప్రజలు యిచ్చిన తీర్పు. మాజీ అటార్నీ జనరల్ బహిరంగంగా కాంగ్రెసు పాలన "రాజ్యాంగబద్ధ నిరంకుశత్వంగా" మారు తున్నదని వ్యాఖ్యానించారు. అత్యవసర పరిస్థితి, నిర్బంధకాండ, భారత రక్షణ చట్టం ప్రయోగించి చేబట్టిన అణచివేత కార్యక్రమాలు, మన ప్రజాపుద్యమాల పురో గతిని అడ్డుకొనజాలక పోవుట చెప్పుకొనదగిన విషయం. కాంగ్రెసు ప్రజలలో బల హీనపడింది, ప్రత్యేకంగా ప్రజోద్యమాలు బలపడినవి.

కాంగ్రెసులో వివిధ అభిప్రాయాలు, దృక్పథాలు, వైఖరులు చేబట్టినవారు

గ్రూపులుగా యేర్పడుట, బలహీనపడుట, పతనం ప్రారంభమైంది. వివిధ స్థాయిలలో పాలకపార్టీలో ఆర్థిక, రాజకీయ అభిప్రాయభేదాలు పెరిగిపోయి గ్రూపులుగా రూపొందాయి. గ్రూపులమధ్య పోరాటాలు తీవ్రం కాజొచ్చాయి. కాంగ్రెసులోని అగ్రనాయకులు వెనుకవుండి నడుపుతున్నారంటూ అనేక ఆరోపణలు వచ్చాయి. ప్రధానమంత్రి పదవికై పోరాటం, ఇందిరాగాంధీ-మొరార్జీదేశాయ్‌ల మధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలతో గ్రూపులు లోలోన పోరాటాలు సాగిస్తున్నవి. ఈ పోరాటంలో మొరార్జీదేశాయ్ వోటమికి కారణం, నెహ్రూ విధానాల పెక్కింటికి వ్యతిరేకంగా వున్న దేశాయికి, ప్రధానమంత్రి పదవి కట్టబెట్టుటకు చాలామంది పార్లమెంటు సభ్యులకు యిష్టంలేదు. "నెహ్రూ సాంప్రదాయాన్ని" కొనసాగించాలనే అభిప్రాయంలో వున్నారు. అభివృద్ధి నిరోధకుల వత్తిడులకు ఇందిరాగాంధి తలవొగ్గుటతో గత ఎన్నికల తరువాత, మొరార్జీదేశాయ్ ఉపప్రధానిని చేయుటకు అంగీకరించుటతో రాజీవొప్పందానికి అవకాశాలేర్పడినది. దీనితో కాంగ్రెసులోని అభ్యుదయకర శక్తులు నిరుత్సాహంతో నిర్మాణం లేకుండా పోయాయి. మితవాద శక్తులు మరింత చురుకుగా పనిచేసి, కాంగ్రెసు వర్కింగు కమిటీలో తమ బలాన్ని మరింత పెంచుకొనగలిగారు.

కాంగ్రెసులో చీలికల వాతావరణంలో గణనీయమైన చారిత్రకాంశం పశ్చిమ బెంగాల్ కాంగ్రెసులో మొదటినుండి వామపక్ష రాజకీయాలను అభిమానించే శక్తులు బలంగానే వున్నవి. వామపక్ష అభిమానులైన బెంగాల్ ప్రజాసామాన్యంలో కాంగ్రెసు-వామపక్షాలమధ్య చీలిపోయి వున్నారు. వారికి జీవితమే ప్రజాసామాన్యంలోని యీ చీలికను యెలా సరిచేయాలా అనే ఆలోచన, సాధారణ ప్రజాస్వామ్యవుద్యమాన్ని ఎలా విస్తృత పరచాలనే ఆలోచన కలిగింది. అజయ్‌ముఖర్జీ విశ్వాసపాత్రులైన కొంతమంది సహచరులతో బయటకువచ్చి, నిర్ణయాత్మక పాత్రను, కాంగ్రెసును ఎన్నికలలో వోడించుటలో వహించారు. తరువాత వారిలో కొంతమంది ఐక్యసంఘటనకు ద్రోహంచేసినా, ఆ ఘటన రాజకీయ ప్రాముఖ్యత యిసుమంతైనా తగ్గలేదు. కాంగ్రెసు యీ విధంగా బలహీనపడుటతో నిర్మాణయుతమైన వామపక్ష వుద్యమాలు కాంగ్రెసువారిని, వారి అనుచరవర్గాన్ని ప్రజాస్వామ్య వుద్యమంలోనికి ఆకర్షించుటలో విజయం పొందాయి. కాంగ్రెసు అగ్రనాయకత్వం, ఎన్నికలలో ప్రజల తీర్పును శిరసావహించక, కాంగ్రెసేతర మంత్రివర్గాలను కుతంత్రాలతో వొకటి తరువాత మరొకటిగా అన్నిటిని కూలద్రోసారు. వారు "కూలద్రోయు" వ్యూహాన్ని అన్ని సాంప్రదాయ ప్రజాస్వామ్య సూత్రాలకు, రాజ్యాంగ చట్టానికి వ్యతిరేకంగా చేసారు. పశ్చిమ బెంగాల్‌లో తమ కుట్రలన్నీ విఫలమగుటతో, గవర్నరు కార్యాలయం ద్వారానే తమ లక్ష్యాన్ని సాధించారు. ఈ పరిణామాలన్నిటిలో ప్రజాశక్తుల బలహీనత, వామపక్ష ఐక్యత లేకపోవుట అందరికి స్పష్టమైంది.

మితవాద పార్టీలలో జనసంఘం, స్వతంత్ర పార్టీలు ఎన్నికలలో ఎక్కువ స్థానాలలో గెలుపొంది బలపడినవని, యింతకుముందే పేర్కొనుట జరిగింది. మితవాద అభివృద్ధి నిరోధక శక్తులు అత్యంత ప్రమాదకరంగా బలపడుటను లోతుగా అధ్యయనం చేయవలసి వుంది. ప్రజాస్వామ్య ఉద్యమ బలహీనత, దేశంలోని అనేక ప్రాంతాలలో వామపక్ష శక్తులే లేకపోవుట, ముఖ్యంగా హిందీ భాషా ప్రాంతాలలో, మాజీ సంస్థానాలలో వామపక్షాలు లేకపోవుట, మితవాద అభివృద్ధి నిరోధక శక్తులు బలపడుటకు ప్రధాన కారణంగా చెప్పవచ్చును. జనసంఘం, స్వతంత్ర పార్టీలు వామపక్షాలు లేకపోవుటను, ఉన్నా నామమాత్రంగానే వుండుటను అవకాశంగా తీసుకొని, కాంగ్రెసుకు ప్రత్యామ్నాయ పార్టీగా యు.పి.లో బలపడ ఎత్తులు వేస్తున్నది. ఇందుకు మతతత్వ శక్తులు, రాష్ట్రీయ స్వయం సేవక సంఘాన్ని వినియోగించి, కల్లోలాలు సృష్టించుచున్నది. రాంచీలో మతకల్లోలాలే ప్రత్యక్ష నిదర్శనము. అనేక రాష్ట్రాలలో జనసంఘం సమర్థవంతంగా మతచాందసత్వాన్ని, కాంగ్రెసు వ్యతిరేక ప్రజాసామాన్య చైతన్యాన్ని వినియోగించుకొని విస్తార ప్రజాసామాన్యంలోనికి చొచ్చుకొనిపోయి తన బలాన్ని పెంచుకొనకలిగింది. జాతి పునర్నిర్మాణానికి తన శక్తినంతా వినియోగించగలనని ప్రజలను నమ్మించగలిగింది. కాంగ్రెసు, వామపక్ష శక్తులు లేని శూన్యంలోనికి తేలికగా విస్తరించగలిగింది. తాము మాత్రమే వివిధ స్థాయిలలో కాంగ్రెసును వోడించగలమని ప్రచారం ముమ్మరంగా సాగించింది. ఈ విధంగా కార్మికవర్గంలోనికి, కార్మిక సంఘాలలోనికి తన కార్యకలాపాలను విస్తరించుకొన్నది. యు.పి., మధ్యప్రదేశ్‌లలో వ్యాపార వర్గాలలోనికి ముఖ్యంగా చిన్న చిన్న వ్యాపార వర్గాలలోనికి బాగా చొచ్చుకొనిపోయి బలపడింది. బీహారులో కూడ ఇదే విధంగా బలపడింది.

ముస్లిం ప్రజాసామాన్యం, ప్రత్యేకంగా సరిహద్దు రాష్ట్రాలలో ప్రత్యేకంగా అనేకరకాల నిర్బంధాలకు లోనగుతున్నారు. ఫలితంగా, వారిలో తమకు రక్షణ లేదనే అభిప్రాయం ప్రబలిపోతున్నది. పాకిస్తాన్ నుండి వచ్చిన చొరబాటుదారులను తరిమివేయాలనే ముస్లిం ప్రజాసామాన్యం అనేక వొత్తిడులకు, కష్టాలకు గురి అగుతున్నారు.

భాషా సమస్య యీ దశకంలో అత్యంత వివాదాంశమై, ఆందోళనలు, ప్రత్యాందోళనలు, ప్రభుత్వ కాల్పులలో 100 మందికి పైగా చనిపోవుట ఆ సమస్య తీవ్రతను తెలియజేయుటయేగాక, జాతుల జీవన ముఖ్య సమస్యల యెడల జాతీయ ప్రభుత్వం ఎంత అలసత్వాన్ని, వైఫల్యాలను ప్రదర్శించుచున్నదో స్పష్టమగుతుంది. జాతీయ ప్రాముఖ్యతగల సమస్య, భవిష్యత్తులో అదే రాజకీయ పరిణామాలకు మూలకారణం కాగల అవకాశం వుంది.

అధికార భాషా చట్టం, తత్సంబంధ తీర్మానం రెండు వైపుల నుండి వ్యతిరేకతను పొందింది. అందులో యీ రెండు వైఖరులు భిన్నమైనవి. దక్షిణాదిన

ముఖ్యంగా తమిళనాడులో హిందీ పాలనా భాషగా తమపై బలవంతాన రుద్దబడుతున్నదని, ఉత్తరాదిన ముఖ్యంగా హిందీ మాట్లాడు రాష్ట్రాలలో ఇంగ్లీషు పాలనా భాషగా శాశ్వతం చేయ ప్రయత్నిస్తున్నారనే బలమైన దురభిప్రాయాలు, యీ ఉద్యమాలకు, వ్యతిరేక ఉద్యమాలకు ప్రధాన కారణంగా చెప్పవచ్చును. అంతేగాక, అధికార భాషా చట్టం, తీర్మానం, పార్లమెంటు ఆమోదం పొందినవని, అందరి ప్రజల ఆమోదం పొందజాలకపోయాయి. కొంతమంది కాంగ్రెసు అగ్రనాయకులే వాటిని హృదయపూర్వకంగా అంగీకరించలేకుండా వున్నారు. అయితే దానికి ప్రజా వ్యతిరేకత ప్రబలుటకు గతంలో కాంగ్రెసు ప్రభుత్వాలు, నాయకులు చేసిన తప్పులు, వైఫల్యాలు, సృష్టించిన గందరగోళాలే కారణమని చెప్పవచ్చును. అవే వారిలో అనుమాన భూతాలను నాటినవి.

కాంగ్రెసు పాలన వైఫల్యాలలోనికి మనం వెళ్ళనవసరం లేదు. అవి అందరకు తెలిసినవే. అయితే మూడు ప్రధాన వైఫల్యాలు, వివిధ ప్రాంతాల జాతీయ భాషలు అనగా ఇంగ్లీషు నుండి మాతృభాషలలోనికి పరిపాలనను కొనసాగించుటకు అవసరమైన ప్రాథమిక, ముఖ్య చర్యలను కేంద్రం సమర్థవంతంగా చేబట్టలేదు. ఇది యూనియన్ స్థాయిలో పాలనను ఇంగ్లీషు నుండి హిందీలోనికి మార్పుచేయుటకు తోడ్పడి వుండేది. ఇంగ్లీషును ప్రాంతీయ భాషలతో తొలగించి, అన్ని స్థాయిలలో పాలనా భాషలుగ అన్ని రాష్ట్రాలలో చేయుట మౌలిక ముఖ్యవిషయమైనా అలాగే వుండిపోయింది. ఈ పనికి కేంద్రం హృదయపూర్వక సహాయం లేనిదే అసాధ్యమని అందరకు తెలిసిన విషయము. అంతేగాక, 1963లో త్రిభాషా పథకం అమలుపై నెహ్రూ యిచ్చిన వాగ్దానం అమలుచేయకపోగా, 1965 జనవరిలో కొన్ని తప్పుడు చర్యలు చేపట్టుటతో తమిళనాడులో భాషా వుద్యమం తీవ్రస్థాయికి చేరింది. పశుబలంతో దాన్ని అణచివేయు ప్రయత్నంలో 100 మంది ప్రాణాలు కోల్పోయారు. కమ్యూనిస్టు శ్రేణులు పోలీసు దమనకాండను ఖండించినా, వుద్యమంయెడల సృజనాత్మక వైఖరి చేబట్టలేక పోయాయి. జాతిమొత్తం ఆమోదం పొందిన నెహ్రూ వాగ్దానం అమలు చేయబడలేదు. అత్యవసర పరిస్థితి మిషతో, భాషాచట్టం 1967 వరకు వాయిదా వేయబడింది, వీటన్నిటి ఫలితమే నేటి సంక్షోభము.

హిందీని యూనియన్‌లో అనుసంధాన భాషగా ఇంగ్లీషు స్థానంలో ప్రవేశపెట్టవలసిందే. ఎంత తొందరగా ప్రవేశపెట్టితే అంతమంచిదే. అయితే, ఇది బలవంతాన యితర రాష్ట్రాలలో ప్రవేశపెట్టరాదు, అదే విధంగా ఇంగ్లీషును శాశ్వతంగా కొనసాగించరాదు. హిందీతోపాటు ఇంగ్లీషు అనుసంధాన భాషగా, హిందీయేతర భాషారాష్ట్రాలు కోరినంతవరకు కొనసాగవలసివుంది. హిందీ, ఇంగ్లీషులను పట్టుకొని కూర్చున్న యిద్దరూ రాష్ట్రాలలో మాతృభాషలో పరిపాలన సాగించాలన్న దానికి, హిందీ యూనియన్ అనుసంధాన భాషగా చేయాలనే ప్రయత్నాలకు హానినే

కలుగజేస్తున్నారు. ఇదే దురదృష్టకర విషయం. అందువలన మౌలిక సమస్య ప్రాంతీయజాతుల మాతృభాషలలో రాష్ట్రాలలో పరిపాలనను చేయు మార్పులను తీసుకొనిరావాలి. వీటితోపాటు అనుసంధాన భాషగా హిందీని అభివృద్ధిచేసి, ప్రవేశ పెట్టాలి. కాంగ్రెసేతర పాలనగల రాష్ట్రాలే, ఆ ప్రాంతీయ భాషలో పరిపాలనను ప్రవేశపెట్టుటకు కొంత చొరవను ప్రదర్శించుచున్నారు. కాంగ్రెసు పాలిత రాష్ట్రాలు గాలివాటానికి ఎదురు చూస్తున్నారు.

ఈ సందర్భంలో 10 కోట్లమంది ప్రజాసామాన్యము మాట్లాడే భాషయైన ఉరుదును తగురీతిలో అభివృద్ధి పరచుట మరువరాదు. ఈ విషయంలో కొన్ని హిందూ మతతత్వ శక్తుల వ్యతిరేకత, జాతీయైక్యతా వ్యతిరేకతకు దర్పణంగా నెంచాలి.

ఇటీవల, జనసంఘం ఆర్టికల్ 370ని రద్దు చేయించి జమ్మూ-కాశ్మీరులలో అల్లర్లు సృష్టించ ప్రయత్నించగా, యితర మతశక్తులు దాని ప్రజ్వలింపజేయ ప్రయత్నిస్తున్నవి. మరోవైపున పాకిస్తాన్ సామ్రాజ్యవాదుల శక్తుల ప్రోద్బలంతో "ప్లెబిసైటుఫ్రంటు" అల్లరులకు ఆజ్యం పోయచూస్తున్నది. ఈ పరిస్థితులలో "ప్రయోగంగా" నంటూ షేక్‌అబ్దుల్లాను శ్రీమతి ఇందిరాగాంధి విడుదల చేసింది. ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు కల్లోలాలను వినియోగించుకొన, కాచుకొని కూర్చున్నారు. అయూబ్‌ఖాన్, కాశ్మీర్ స్వయం నిర్ణయాధికారం అనే నినాదాన్ని చేబట్టాడు. మతతత్వవాదులు కొందరు అబ్దుల్లా విడుదల తప్పు అనే ఆందోళన మొదలుపెట్టారు. కాశ్మీర్ పూర్వజాలని ఇండియాలోని భాగమనే ప్రధానాంశం పరిధిలో కాశ్మీర్ సమస్యకు పరిష్కారం మాత్రం కనుగొనాలి. ఈ వాస్తవాన్ని షేక్ అబ్దుల్లా గుర్తించితే, పరిష్కారంకాని సమస్య లేవీవుండవు. భారత యూనియన్‌లో భాగంగా సాధ్యమైనంత వరకు కాశ్మీర్ స్వపరిపాలనా బాధ్యత, అధికారాలను విస్తరించుట సాధ్యము. కాశ్మీర్ ప్రజాసామాన్యం, సామ్రాజ్యవాదపు కుతంత్రాలనునగ్నంగా చూడలేక పోతున్నారన్న విషయం వాస్తవం, అంచేతనే వారి అసంతృప్తిని సామ్రాజ్యవాద శక్తు=, వేర్పాటువాద, విచ్ఛిన్నకర శక్తులు వినియోగించుకొంటున్నవి. అంచేత, పోరాటం ద్విముఖం, వేర్పాటువాదం, వారి నినాదాలకు వ్యతిరేకంగా, కాంగ్రెసు ప్రభుత్వ తప్పుడు విధానాలకు వ్యతిరేకంగా సాగవలసి వుంటుంది.

కేంద్ర-రాష్ట్రాల సంబంధాలు, ఎనిమిది రాష్ట్రాలలో కాంగ్రెసేతర ప్రభుత్వాలు యేర్పడిన నేపథ్యంలో జాతి జీవనంలో, జాతీయైక్యతలాంటి మౌలిక సమస్యలపై గాఢప్రభావాన్ని కలుగచేయగలవు. ఆర్థిక సమస్యలలో రాజ్యాంగం రాష్ట్రాలకు చాలా పరిమితులు విధించుతు, వాటి అధికారాలు, స్వపరిపాలనను కుదించి వేసింది. కేంద్రంలో కాంగ్రెసు ప్రభుత్వం తన అధికారాలను కాంగ్రెసేతర రాష్ట్రా

ప్రజాప్రభుత్వాలకు అన్నివిధాల గడ్డు పరిస్థితులను కల్పించుటకు, రాష్ట్రప్రభుత్వాలు గతంలో తమ కాంగ్రెసు ప్రభుత్వాలు వాగ్దానాలుచేసి, వదలివేసిన మంచి సంస్కరణలు తెచ్చుటకు విడతెగని ప్రతిబంధకాలు కలుగజేస్తున్నది. పశ్చిమబెంగాల్ రాష్ట్ర ప్రభుత్వానికి అంతకుముందు వాగ్దానంచేసిన ఆహారపదార్థాల సప్లయిలను సైతం చేయక యిబ్బందులపాలు చేస్తున్నది. కేరళలో కూడ యిదే జరుగుతున్నది. అన్ని రాష్ట్రాలకు యిచ్చే "ఓవర్ డ్రాఫ్టులను" సైతం, ఆర్థికశాఖామంత్రి మురార్జీదేశాయ్ నిరాకరించుతున్నాడు అదేకాలంలో కేంద్రంలో అత్యంత లోటుబడ్జెట్టుతో పాలన కావించుతు, కేంద్ర కేటాయింపులలో బాగా కోతలు పెట్టుచున్నాడు. ఆర్థిక సంబంధాలలో కేంద్ర-రాష్ట్ర ప్రస్తుత సంబంధాలు రాష్ట్రాల అవసరాలకు యేమాత్రం ఉపయోగకరంగాలేవు. కేంద్రం గవర్నరుల ద్వారా రాష్ట్ర పాలనలో కలుగజేసుకొంటూ, రాష్ట్ర ప్రభుత్వాలను కుంటిసాకులతో రద్దుచేయుటకుకూడ, చట్ట వ్యతిరేకంగా వినియోగించుకొంటున్నది. పశ్చిమబెంగాల్ గవర్నర్ ధర్మవీర్ ప్రయత్నాలు దీనినే రుజువు చేస్తవి.

సంగ్రహంగా, భారత ఆర్థిక, అర్థవ్యూహలు వ్యవసాయ సంబంధాల సంక్షోభంతోపాటు, పెట్టుబడిదారి విధానాభివృద్ధిలోని వైరుధ్యాలు, సంక్షోభ తీవ్రతకుదారి తీసాయి. ప్రపంచ పెట్టుబడిదారి విధానం సంక్షోభంలో పడకముందే, మనదేశంలో మార్కెట్టు మాంద్యం, తదనంతరం సంక్షోభం ప్రారంభమైంది. విదేశీయ సహాయంపై ఆధారిత ఆర్థిక విధానం, సంక్షోభభారాన్ని ప్రజలపై త్రోయుట జరుగుచున్నది. దేశం సంక్షోభంలో పడుట విదేశ మారకద్రవ్య లోటు, అనావృష్టిలతో గాక, దేశ ఆర్థిక, రాజకీయ మౌలిక పునాదులు కదలిపోవుటతో ఏర్పడింది. సంక్షోభంతో ప్రజల-అమెరికా సామ్రాజ్యవాదుల మధ్యగల వైరుధ్యం తీవ్రతరమగుటయే గాక, ప్రజా సామాన్యపు జీవనప్రమాణాలు పడిపోవునట్లు చేసి, వారి జీవితాన్ని దుర్భరం చేసింది.

కాంగ్రెసులో అభిప్రాయభేదాలు కలవారు గ్రూపులై, బలహీనములగుటతో పతనం కూడ ప్రారంభమైంది. జీవనప్రమాణం పడిపోవుటతో ప్రజా పోరాటాలు ఇనుమడించాయి.ఇదే ఇటీవలకాలంలో ఇండియా-పాకిస్తానులమధ్య యుద్ధం,రాజకీయ సంక్షోభాన్ని తీవ్రతరం చేసింది. కాంగ్రెసులో చీలికల వాతావరణమేర్పడింది. దురదృష్టకరంగా యిదేకాలంలో కేంద్ర రాష్ట్ర సంబంధాలు విషమించాయి.

# 3

# నక్సలిజం అవతరణ

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో భారత కమ్యూనిస్టు ఉద్యమం విడదీయని వొకభాగము. అంచేతనే, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ విజయాలచేతనే గాక, అపజయాలతోగూడ భారత కమ్యూనిస్టు ఉద్యమం ప్రభావితమైంది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ నాయకత్వం, సంస్థలనుండి మార్గదర్శికత్వాన్ని, సలహాలను, సహాయ, సంహీభావ, సౌభ్రాతృత్వాలనేగాక అవాంచనీయ ట్రాట్స్కీయిజం, టిటోయిజం, స్టాలినిజం, కృశ్చేవిజం, మావోయిజం, లిన్‌పియావోయిజాలలోని అంశాల ప్రభావం, అప్పుడప్పుడు నేరుగా ఆయాధోరణుల దిగుమతులకు గురైంది. ఈ ప్రభావాలు తరతమ భేదాలతో భారత వివిధ కమ్యూనిస్టు శ్రేణులలో, వివిధ స్థాయిలలో కొనసాగుతూనే ఉన్నవి.

భారత కమ్యూనిస్టు ఉద్యమం వొక్కమాటలో చెప్పాలంటే వివిధ కాలాలలో "సంస్కరణవాద", "అతివాధ అవకాశవాద", "ఉగ్రవాద అవకాశవాద", ధోరణులతో సతమతమైపోయింది. మోసపూరిత అభ్యుదయ కబుర్లు చెబుతూ సంకుచిత, అభివృద్ధినిరోధక దీర్ఘ కాల దృక్పథంతో ఆచరణ సాగించిన బూర్జువా రాజకీయాల వుచ్చులో ఒక వర్గం పడితే, వర్గపోరాటం, విప్లవ పోరాటాలంటూ, ఆచరణలో రాజీ "మేజువాణి" పోరాటాలు సాగించుతూ మరోవర్గం, రైతాంగ సాయుధ వ్యవసాయ విప్లవ తిరుగుబాటులను, అధికారం హస్తగతం చేసుకొనే పోరాటాలుగ వ్యాఖ్యానించుతు "శత్రువులను ఖతంచేయుట" అనే వ్యక్తిగత హింసావాదాన్ని మూడోవర్గం చేబట్టి, మొత్తంమీద కమ్యూనిస్టు శ్రేణులన్నీ ప్రజోద్యమాలను, ప్రజా విప్లవ పోరాటాలను బలపరచే నిర్మాణయుతమైన ఐక్యపోరాటాలను, ఉద్యమాలను నిర్మించకుండా, వివిధస్థాయిలలో విప్లవవర్గాలైన కార్మికవర్గం, వ్యవసాయ కూలీలు, రైతులు, వివిధ మధ్యతరగతి వర్గాలలో వున్న కొద్దిపాటి ఐక్యతను విచ్ఛిన్నంచేసి, అన్ని వర్గాలలో అనైక్యతను పరోక్షంగా పెంపొందించారు.

నాల్గవ సార్వత్రిక ఎన్నికలలో జాతీయ కాంగ్రెసు ఘోరపరాజయంతో ఎనిమిది రాష్ట్రాలలో కాంగ్రెసేతర ప్రభుత్వాలు యేర్పడినవి. బెంగాల్, కేరళలలో సి పి.ఐ. (యం) ఆధ్వర్యంలోని వామపక్ష లౌకిక ప్రజాస్వామ్య శక్తుల రాష్ట్ర ప్రభుత్వాలు యేర్పడినవి. ఆరు కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలు యెడల అవలంబించవలసిన వైఖరులపై సి. పి. ఐ; సి. పి. ఐ. (యం) ల రాష్ట్ర నాయకత్వాలు ప్రత్యేకంగా, కమ్యూనిస్టు పార్టీల ఆధ్వర్యంలోని రాష్ట్ర ప్రభుత్వాల యెడలను రాష్ట్ర కేంద్ర కమ్యూనిస్టుపార్టీల నాయకత్వాలు చర్చించి ఆచరణ

విధానాలను నిర్ణయించు కొన్నవి. సి.పి.ఐ. నాయకత్వం కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాల మార్పుచెందే కాలంలోని తాత్కాలిక ప్రభుత్వ దశగాను, విశ్లేషించి, నైజాన్ని నిర్ధారణచేసి, కేంద్ర కాంగ్రెసు ప్రభుత్వాన్ని కూలద్రోయుటకు గాను పిలుపు నిచ్చింది. ఆ విధంగా కేంద్రంలో సంకీర్ణ ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుట తొలి చర్యగా చెప్పసాగింది. కేంద్రంలో సంకీర్ణ ప్రభుత్వం అనే కేంద్ర నినాదాన్ని చేబట్టింది. ఈ విధమైన "పార్లమెంటరీ తిరుగుబాటు కుట్రలు, ఎత్తుగడలు మొదలైన బూర్జువా విధానాలు పూర్తిగా తప్పని, అతిగా వేసిన అంచనాలని వర్తమాన చరిత్ర ఋజువు చేసింది. బెంగాల్, కేరళలలో కమ్యూనిస్టుల ఆధ్వర్యం లోని రాష్ట్ర ప్రభుత్వాలను "ప్రజల సమస్యలను పరిష్కరించుటకు తగిన అధికారములు గల ప్రభుత్వాలుగా కాక పోరాడే ప్రజల చేతులలోని ఆయుధాలుగాను," స్పష్టమైన వర్గ పరిభాషలో, అట్టి ప్రభుత్వాలలో పాత్ర వహించుట, జనతా ప్రజాస్వామ్య నిర్మాణానికి అవసరమైన కార్మికవర్గాన్ని దాని మిత్రులను ప్రజాస్వామ్యాన్ని మరింతగా సమీకరించుటకై జరిగిన నిర్దిష్ట పోరాట రూపంగా[1]" తదనంతరం సోషలిజానికి పురోగమించుటలో వొక దశగా సి.పి.ఐ(యం) ఆచరించింది. ఒకటి, రెండు మాసాలలోనే సి.పి.ఐ.(యం)లోని "ఉగ్ర సాహసిక వాదులు" తాము "సిసలైన విప్లవకారులమంటూ" పార్టీ రాజకీయ విధానాన్ని చేబట్టిందని, పార్టీ పంథాని, ఐక్యసంఘటనలలో పార్టీ పాత్రని "నియో రివిజనిస్టు" పంథాగా విశ్లేషించి, పార్లమెంటరీ పంథా చేబట్టిన ఫలితంగా రూపొందిందని వివరించి, "అసెంబ్లీ ఎన్నికలను బహిష్కరించండి" అనే నినాదాన్ని ప్రచారంలో పెట్టారు.

బెంగాల్, కేరళ రాష్ట్ర ప్రభుత్వాలను వివిధ పార్టీలు వివిధ రకాలుగా విశ్లేషించి, భిన్న అవగాహనలకు వచ్చి వివిధ భ్రమలకు లోనయ్యాయి. రాష్ట్రాల రాజకీయాధికారాన్ని, అన్ని అధికారాలు కేంద్ర ప్రభుత్వంలోనే కేంద్రీకరించబడి నందున, పేరుకు మాత్రమే గల రాష్ట్రాల స్వపరిపాలనాధికారాల యెడల వివిధ పార్టీలు భిన్న అభిప్రాయాలు కలిగి యుండుటయేగాక, కొన్ని పరస్పర విరుద్ధ అభిప్రాయాలను కూడ కలిగియున్నవి.

కాంగ్రెసుపార్టీ 1967 సార్వత్రిక ఎన్నికలలో మొత్తంమీద పదకొండు రాష్ట్రాలలో వోడిపోయింది. స్వల్ప మెజారిటీతో కేంద్రంలో అధికారాన్ని నిలుపు కొనగలిగినా, యీ పరిణామాలు కాంగ్రెసులో అంతర్గత కీచులాటలను, వైరుధ్యాలను తీవ్రతరం చేసాయి. నిర్మాణయుతంగా ప్రజలు మరింత మిలిటెంటు పోరాటాలు చేపట్టసాగారు. తీవ్ర పోరాటాల రూపమైన ఘెరావోలను చేబట్టారు. కేంద్ర ప్రభుత్వోద్యోగులు లాఠీచార్జిలు, నల్ల చట్టాలను ధిక్కరించి, చారిత్రాత్మకమైన పోరాటా

---

1. న్యూసిట్యుయేషన్ అండ్ పార్టీ టాస్క్స్, సి.పి.ఐ.(యం) కలకత్తాలో సి.సి. 16 ఏప్రిల్ 1966 న, నివేదిక (ఆంగ్లంలో) పే. 70.

లను సాగించారు.

ఈ పరిణామాలన్నిటిని అభివృద్ధి చెందుతున్న విప్లవ పరిస్థితి పరిపక్వం చెందుతున్నట్లుగా, సి.పి.ఐ.(యం)లో అతివాదులు విశ్లేషించి, నాయకత్వం నయా రివిజనిజాన్ని అనుసరించుతున్నదని తీవ్రంగా వ్యతిరేకించి విడిపోయే మార్గాలలో పయనించారు. ఇది ప్రధానంగా బెంగాల్, ఆంధ్రప్రదేశ్‌లలో కొన్ని ప్రాంతాలలో ప్రాక్షనులు లేక ముఠాలు, గ్రూపులుగా యేర్పడి చీలికల మార్గంలో పయనించారు, ప్రోత్సహించారు.

## రాజకీయ ముఖ్య పరిణామాలు :

అంతర్జాతీయ సామ్రాజ్యవాద కూటమిలో ఆర్థిక, రాజకీయ సంక్షోభం అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతున్నదని, పి.పి.ఐ. తన 8వ, పాట్నా పార్టీ కాంగ్రెసు ఆమోదించిన రాజకీయ తీర్మానంలో వివరించింది. ఈ విశ్లేషణకు మద్దతుగా, ఐక్యరాజ్య సమితి, ఐరోపా ఆర్థిక అధ్యయన సమీక్ష 1965-67 లలో పారిశ్రామిక అభివృద్ధి రేటు బాగా పడిపోయిందని తెలియజేసిన దానిని వుదహరించింది. యూరపులోని వైరుధ్య గుత్త పెట్టుబడివర్గాల మధ్య ప్రపంచ కరెన్సీ, స్టెర్లింగులు, బంగారు, టారిఫ్ విధానాల వొప్పందాలు, యూరోపియన్ కామన్ మార్కెట్టు విధానాలపై అభివృద్ధి చెందుతున్న పోటీ, వారిని శతృవర్గాల చేరువకు చేర్చిందని అంచనా వేయబడింది. ఈ పరిస్థితి గుత్తపెట్టుబడి వర్గాలపై వర్గ పోరాటం విస్తృతం, వేగవంతం చేస్తుందని తలచబడింది. ఈ అవగాహనను బలపరచుటకు, పాకిస్తాన్ నేత అయూబ్ ఖాన్ అమెరికా విధానాలకు రబ్బరు సీలు వేయుటను తిరస్కరించుటను తీర్మానం వుదహరించింది.

సి.పి.ఐ.(యం) 8వ, పార్టీ కాంగ్రెసు కేంద్ర సమితి, దాజకీయ నిర్మాణ నివేదిక 1964-69, రెండవ ప్రపంచ యుద్ధం తచువాత వచ్చిన "ఆర్థిక సంక్షోభాలలో మూడవది 1964-65 లలో ప్రారంభమై 1967 నాటికి ప్రపంచ పెట్టుబడిదారి దేశాలన్నిటికి వ్యాపించిందని తెలిపింది. ఇంకా, గత నాలుగు సంవత్సరాలలో పెట్టుబడి విధాన శాస్త్రవేత్తలందరి అంచెనాలను తలక్రిందుచేస్తూ ప్రపంచ ఆర్థిక సంక్షోభాలకి దారితీసే అంశాలన్నీ ముందుకు త్రోసుకొచ్చిన పరిస్థితులు యేర్పడినవని తెలిపింది. పౌను విలువ తగ్గిపోవుట, తత్ఫలితంగా 24 దేశాలలో పైగా, ముఖ్యంగా స్టెర్లింగు ప్రాంతంలో కరెన్సీ విలువ పడిపోయి, బంగారం ప్రవాహంగా ప్రవహించవలసి వచ్చిందని నివేదిక పేర్కొన్నది. ఫలితంగా డాలరు విలువ కూడ పడిపోవుటలో ప్రపంచ పెట్టుబడిదారి విధానం తీవ్ర సంక్షోభంలో పడిపోవుతున్నదని నివేదిక స్పష్టం చేసింది.

సి.పి.ఐ.(యం) రాష్ట్ర శాఖలోని ముఖ్యమైన వాటిలో వొకటైన ఆంధ్ర పార్టీ పాలకొల్లు ప్లీనంలో, పార్టీ కేంద్ర సమితి మధురైలో ఆమోదించిన చిత్తు

సైద్ధాంతిక విధాన పత్రము 52 మంది అనుకూలంగాను, 150 మంది వ్యతిరేకంగాను వోటు చేయుటతో వీగిపోయింది. సి.పి.ఐ.(యం) ఆంధ్ర శాఖలో నాలుగింట మూడువంతులు "ఉగ్ర అతివాదులు"గ నూతన రాజకీయ విధానాన్ని చేబట్టారు. అదే ప్లీనంలో అంతర్జాతీయ రాజకీయ అవగాహనపై కొల్లా వెంకయ్య ప్రవేశ పెట్టిన నివేదిక, ప్రపంచ సామ్రాజ్యవాదం ఆర్థిక సంక్షోభంలో మునిగి పోయిందనే అంచనాను, అతివాదులు తదుపరి నక్సలైట్లుగా పిలువబడినవారు యేకగ్రీవంగా ఆమోదించారు.

స్థూలంగా, భారత కమ్యూనిస్టు ఉద్యమంలోని మూడు స్రవంతులలోని మూడు శ్రేణులు, అంతర్జాతీయ సామ్రాజ్యవాదం, గుత్త పెట్టుబడిదారి విధానం ఆర్థిక సంక్షోభంలో మునిగి పోబోతున్నతన్న ఆవగాహనలో మౌలిక భేదాభిప్రాయాలు లేవు.

## నక్సల్బరీ వ్యవసాయ భూముల పోరాటం :

వ్యవసాయ సాయుధ విప్లవ పోరాటంగా పేర్కొంది, 1970 దశకంలో మరోసారి కమ్యూనిస్టు శ్రేణులలో నూతన ఆలోచనా విధానాలకు, మార్క్సిస్టు-లెనినిస్టు కమ్యూనిస్టు వుద్యమం రూపొందుటకు మూల కారణమైన నక్సల్బరీ వ్యవసాయ భూముల సాయుధ పోరాటాన్ని గూర్చి స్థూలంగా తెలుసుకొందాము.

డార్జిలింగు జిల్లాలోని పర్వత ప్రాంత సిలిగురి రెవెన్యూ సబ్ డివిజనులోని నక్సల్బరి, ఖరిబరి, సిలిగురి, పణిదేవ పోలీసు స్టేషనుల ప్రాంతం సాయుధ రైతాంగ గెరిల్లా భూ పోరాటాలకు కేంద్రమైంది. నక్సల్బరీలో 1960 లోనే పోలీసు స్టేషను యేర్పరచబడింది. సిలిగురి రెవెన్యూ సబ్ డివిజనులో 44 టీ తోటలలో 25 వేలు వ్యవసాయ కార్మికులు పని చేస్తున్నారు. వీరితో తూర్పు బెంగాల్ నుండి కాందిశీకులుగ వచ్చినవారు అధిక సంఖ్యాకులుగ వున్నారు. ప్రజలలో కాందిశీకులు గణనీయంగానే వున్నారు. వారు వ్యవసాయ భూములు కొనుక్కొని; యిళ్ళు కట్టుకొని చాలాకాలంగా వ్యవసాయం చేసుకొంటున్నారు. ఈ ప్రాంతంలో 174 వేలకు పైగా 297 గ్రామాలలో విస్తరించి వున్నారు. ఫణిదేవలోని 2, ఖరిబరిలోని 3, నక్సల్బరీలోని 6, సిలిగురిలోని 5 గ్రామాలలో వారికి నివాస గృహాలు లేవు.

నక్సల్బరీ, ఖరిబరి, ఫణిదేవలలో 1961 జనాభా లెక్కల ప్రకారం 57.7; 73.2; 64.5 శాతం షెడ్యూల్డు తెగలకు చెందినవారు. ఆ గ్రామాలలో జనాభాలో 53.2, 55.1, 28 శాతం సగటున వ్యవసాయదారులుగ, వ్యవసాయ కూలీలుగ వున్నారు. తేయాకు తోటలు,అడవులలో కూలీలుగానే వున్నారు. నక్సల్బరి, ఖరిబరి, పణిదేవలలోని రైతులు ప్రధానంగా వ్యవసాయ భూములులేని ఆదివాసులు,సంతాల్, ఓరెనులు, ముండా, రాజబన్సీ తెగలకు చెందినవారు. సమాజంలో అత్యధిక దోపిడీకి గురి అవుతున్నవారు. జనాభాలోని షెడ్యూల్డు తెగలలో రాజబన్సీలు, ఆది

వాసులు 50, 25 శాతం, 2 నుండి 5 శాతం వరకు నేపాలీలు; తదితరులు కలసి 25 శాతం వున్నారు. కిసాన్‌సభ ప్రభావం ఆదివాసులలో ఎక్కువగా వుంది.

రైతులలో అత్యధికులకు భూములు లేవు, పాలు కౌలుదారులుగ వున్నారు. తరుచుగా భూముల నుండి తొలగింపులకు గురి అగుతున్నారు, నక్సల్బరీ పోలీసు స్టేషను ప్రాంతంలో 49.7 శాతం భూమిలేనివారుగ, పాలు కౌలుదారులుగ, 37.1 శాతం రైతుల స్వంత కమతాలుగ వుంది.

13.2 శాతం రెండు పద్ధతులలోను కలగలుపుగా వున్నారు. ఖరిబరి, ఫణిదేవలలో యిదే పద్ధతులలో వుంది. వ్యవసాయంలో వున్న పాలు కౌలుదారులు తరచుగా భూముల నుండి తొలగింపులకు గురి అగుతూనే వున్నారు. ఇదే ప్రధాన వ్యవసాయ సమస్యగా వుంది.

పూర్వం యీ ప్రాంతమంతా ఖాస్‌మహల్ ఎస్టేటు క్రింద ఉండేది. అంచేత ఏవిధమైన పక్కా రికార్డులు లేవు. కాయకష్టంతో యెంతో శ్రమపడి సాగులోనికి తెచ్చిన యీ భూములు బలవంతంగా జోతేదారులు అనబడే భూస్వాముల దురాక్రమణ కిందికి వచ్చాయి. అదేవిధంగా మేఖి,నీదీప్రాంత పడావు భూములన్నీ సాగులోనికి తెచ్చిన తదుపరి జోతేదారుల పాలబడినవి. ఖాస్‌మహల్ సంస్థాన భూములలో ఎక్కువభాగం 20-30 సంవత్సరాలు టీ తోటల యజమానులకు నామమాత్రపు కౌలుకు యివ్వబడినవి. టీ తోటల యజమానుల కౌలుకిందవున్న 2278 యకరాలలో 642 యకరాలలోను మరో టీ తోటల యజమానికింద 356 యకరాలు మాత్రమే ఉపయోగంలో వుంది. మిగతా భూమి అంతా పడావుగానే వుంది. ఇదే విధంగా వివిధ తోటల యజమానులు పేరుకుమాత్రమే కౌలుకు తీసుకొన్న ఎంతో భూమి పడావుగానే ఉంది.

జోతేదారుల దోపిడి, నిరంకుశత్వం విశృంఖలంగా కొనసాగుతున్నది, కాంగ్రెసు ప్రభుత్వాలు వారికే మద్దతునిస్తున్నవి. ఎస్టేటులస్వాధీనతా చట్టం 1953లో భూసంస్కరణల చట్టం 1955లో చేయబడుటతో నూతన పరిస్థితి ఏర్పడింది. రెవెన్యూ రికార్డులులేని కారణంగా, బినామీ లాలూచి భూముల బదిలీలు యెన్నో చేశారు. ప్రభుత్వభూము లెన్నిటినో జోతేదారులు స్వాధీనంలో ఉంచుకోగలిగారు. వీటితోబాటు బినామి మారకాలు, భూమి అమ్మకాలు, కౌలుదారులను విచ్చలవిడిగా, దౌర్జన్యంగా తొలగించివేయుట జరిగింది. కాంగ్రెసువాదులకు, ప్రభుత్వాలకు స్వార్ధ ప్రయోజనాలు యెన్నో వుండుటతో ప్రభుత్వం 19 వేల యకరాలు మాత్రమే స్వాధీనం చేసుకొనగలిగింది. అందులో 13వేల యకరములు మాత్రమే సాగుకు లాయికి అయినవి.

ఈ నేపథ్యంలో 1959లో విస్తృత రైతు ఉద్యమం ప్రారంభమైంది. వారి ప్రధాన కోర్కెలు అన్యాక్రాంతమయిన వారి భూములను వారికే యివ్వాలని, కౌలు

సాయుధ గెరిల్లా దళాలు వర్గ శత్రువుల నిర్మూలనా కార్యక్రమాన్ని చేబట్టుతవని స్పష్టం చేసారు. 1

సెప్టెంబరు 1968లో నక్సల్బరీ విప్లవ రైతాంగ సమావేశం జరిగింది. పార్టీ శాఖలు యేర్పాటు చేయుట, వర్గపోరాటాన్ని తీవ్రం చేయుట, వర్గ శత్రువులు, పోలీసులు, వారి ఏజంట్లు అవకాశాలున్నచోట్ల పోలీసులపై గూడ గెరిల్లా దాడులు చేయుట, మావో ఆలోచనా విధానాన్ని ప్రచారం చేయుట, సన్యాలు సూచించిన పంథాను సమావేశం పునరుద్ఘాటించింది. అదే కాలంలో చారుమజుందార్ దేశబ్రతి, 1 ఆగస్టు 1968 పత్రికలలో ఎత్తుగడలకు కొన్ని సూచనలు చేసారు. రాజకీయ ప్రచారంతోపాటు ఆర్థిక కోర్కెల సాధారణ నినాదాలను అశ్రద్ధ చేయరాదని, ఆ విధంగా విస్తృత ప్రజాసామాన్యాన్ని పోరాటాలలో సమీకరించకుండా, వెనుకబడిన రైతాంగ ప్రజాబాహుళ్యాన్ని రాజకీయ చైతన్యవంతులుగ, వర్గ శత్రువులను ద్వేషించే వారిగా చేయకుండా, కర్తవ్య నిర్వహణ అసాధ్యమగుతుందన్నారు. అయితే, ఆర్థిక సమస్యలపై ప్రజా పోరాటాలు సాగించుట, రహస్య పార్టీ యంత్రాంగం, పోరాడేముందే రైతాంగంలో రాజకీయ చైతన్యం కలిగించే ఎత్తుగడలు అనుసరించుట, యీ రెండింటి ఆచరణను అసాధ్యం చేసింది. ఆర్థిక పోరాటాల బహిరంగ స్వభావం, రహస్య పార్టీ యంత్రాంగపు రాజకీయ ప్రచారం ఆచరణలో అసాధ్యమగుటతో గందరగోళంలో పార్టీ పడిపోయింది. లిన్ పియావో విధాన ప్రభావంలో 1969 మధ్యలో చారుమజుందార్ "శతృవుపై ప్రజాబలాన్నంతటినీ కేంద్రీకరించి వినియోగించుటకు, వారిని సమీకరించుటకు గెరిల్లా పోరాటం వొక మార్గం. రైతాంగపు విప్లవ పౌరవ వర్గ శత్రువు నిర్మూలనతో పెంపొందుతుందని, ప్రజా సంఘాల ప్రజోద్యమాల నిర్మాణం, గెరిల్లా పోరాటాలు ప్రారంభించుటకు ముందు తప్పనిసరిగా జరుగవలసిన చర్య కాదనీ" సిద్ధాంతాన్ని, దేశబ్రతి 23 ఏప్రిల్ 1970లో ప్రతిపాదించారు. అంతేగాక తరువాత ఆర్థిక సమస్యలపై పోరాటాలు, గెరిల్లా చర్యలు కొనసాగుతాయనే విపరీత వివరణ కూడ యిచ్చారు.

నక్సలైట్లు ఎత్తుగడలు పూర్తిగా రూపొందకముందు 1967లో అస్పష్టంగా "విప్లవ కార్మిక తదితర వర్గాల విప్లవ పోరాటాలు పెంపొందించుటకు, ఆర్థిక తత్వాన్ని ప్రతిఘటించుటకు, యీ పోరాటాలన్నింటిని, వ్యవసాయ విప్లవమార్గంలో మలుచుట" కర్తవ్యంగా, డిసెంబరు 1967 "లిబరేషన్" పత్రికలలో సి.పి.ఐ.(ఎం) లోని విప్లవవాదులు ప్రకటించారు.

నగరాలలో "లిబరేషన్" డిశంబరు 1967 సంచికలోని ప్రకటన ననుసరించి విద్యార్థులను, కొంతవరకు కార్మికులను, నక్సల్బరీ రైతాంగ పోరాటాలకు మద్దతుగా సమీకరణ, ప్రదర్శన ప్రయత్నాలు జరిగినవి. అదేకాలంలో చారుమజుందార్ నగరాలలో కర్తవ్యాలను వివరించారు. విద్యార్థుల ధైర్యం, స్వలాభ ప్రయోజనాలు లేకుండా, విశ్వాసం "విప్లవానికి శక్తిగా రూపొందించగలవు" అని వుత్సాహం

---

1.—అదే—పేజీ 84

కనబరచారు. మొదటవారు రైతాంగంలో లీనమై, విప్లవ రాజకీయ ప్రచారం చేయాలి. "నేడు గ్రామాలకు వెళ్ళలేనివారు, నగరాలలో ప్రచార కార్యక్రమాన్ని నిర్వహించాలి. వారి లక్ష్యం, గ్రామాలలో రైతాంగ పోరాటాలకు మద్దతుగా నగరాలలో ప్రజాస్వామ్య పోరాటాలు నిర్మించాలి[1]" అని లిబరేషన్ పత్రికలో వివరించారు.

కలకత్తాలో మార్చి 1968లో నక్సలైట్లు ప్రజాస్వామ్య కన్వెన్షన్‌ని జరిపారు. దానిలో ప్రజాస్వామ్య పోరాట స్వభావాన్ని వివరించారు. రైతాంగ పోరాటాలకు మద్దతుగా పోరాటాలు చేబట్టుటతోపాటు, కార్మికవర్గం, వారి వర్గ ప్రయోజనాల రక్షణకు చురుకైన సమస్యను ఎంచుకొనాలన్నారు. అంతేగాక, ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టానికి వ్యతిరేకంగా, ఆటోమాషన్, రిట్రెంచిమెంటు, లాకవుట్లు, మూసివేతలకు వ్యతిరేకంగా వుద్యమాలు నిర్మించి కార్యక్రమం చేబట్టారు. అయితే చారు మజుందార్ విద్యార్థులు ప్రధానంగా రాజకీయ ప్రచారోద్యమాన్ని చేబట్టాలని, అది విద్యార్థి, యువజనుల రాజకీయ నిర్మాణ స్వరూపం తప్పనిసరిగా "రెడ్‌గార్డ్స్" రూపాన్ని పోలివుంటుందని సూచించారు.

చారుమజుందార్ "దేశవ్రతి" 21 ఆగస్టు 1969 సంచికలో "యువజనులకు విద్యార్థులకు పార్టీ పిలుపు" అనే వ్యాసంలో వారికొక నూతన పంథానిచ్చారు. వాస్తవానికి నక్సలైట్లు గత రెండు సంవత్సరాల అనుభవాలతో ఏప్రియల్ 1969లో సి.పి.ఐ.(యం.యల్.)గా యేర్పడినప్పుడు చేసిన చిత్తు నిర్మాణ సమీక్షా నివేదికలో నగరాలలో ఎత్తుగడల పంథా క్రమేణా రూపొందుట త్రోసివేయబడింది చిత్తు "పార్టీ అన్ని లీగలు అవకాశాలను వినియోగించుకొనుట నేర్చుకొని విప్లవ కార్యాచరణను అభివృద్ధి పరచుకొనాలి. ఎట్టి పరిస్థితులలోనూ, బహిరంగ పార్టీగ పని చేయరాదు" అని స్పష్టం చేసింది. అయితే ప్రజాసంఘాలను యేర్పాటు చేయాలా, లేదా అనే విషయాన్ని స్పష్టం చేయలేదు. కార్మికవర్గం "మన విప్లవంలో నాయకత్వపాత్ర వహించునట్లు చేయుట, ఆర్థిక, సాంస్కృతిక కార్యక్రమాలకే నగరాలలో కార్మికవర్గం పరిమితం కాకుండునట్లు చేయుట" పార్టీ తన మౌలిక ప్రధాన కర్తవ్యంగా నెంచుతుంది. అయితే కార్మికవర్గం అనుసరించవలసిన ఎత్తుగడల విధానం, మార్చి 1970 సి.పి.ఐ. (యం. యల్.) అత్యంత స్పష్టము, నిర్దిష్టం అయిన వివరణాత్మక విధాన ప్రకటనలో మాత్రమే చెప్పబడింది. "నేడు మనం శాంతియుత రక్తరహిత మార్గంలోకాదు పురోగమించవలసినది, గెరావోల్లు,పోలీసులతో సంఘర్షణలు, యజమానులతో సంఘర్షణలు, బారికేడ్సు, శత్రువులను, యేజంట్లను, పరిస్థితు

---

1 అభిజ్ఞాన్ సేన్ (1970) నక్సలైట్ టాక్టిక్స్ ఇన్ సిటీస్, నక్సల్బరీ అండ్ ఆఫ్టర్. వా II పే. 89.

అనుబట్టి తుదముట్టించు పంథాలో పురోగమించవలసి వుంటుంది.[1]

**బెంగాల్‌లో సంస్కరణ వాదానికి లేక రివిజనిజానికి వ్యతిరేకంగా కమ్యూనిస్టుపార్టీలో అంతర్గత పోరాటం.**

సంస్కరణ వాదానికి వ్యతిరేకంగా 1962లో జరిగిన పోరాటక్రమంలో కమ్యూనిస్టు పార్టీలో వివిధ గ్రూపులు ఏర్పడినవి, ఈ గ్రూపులు సి.పి.ఐ. (యం) యేర్పడిన తరువాత కూడ యేదోవొక రూపంలో కొనసాగినవి. బహుశా యిది బెంగాల్ ప్రత్యేక లక్షణంగా చెప్పవచ్చును. విప్లవ దృక్పదాన్ని చేబట్టిన కమ్యూనిస్టు శ్రేణుల కార్యక్రమం, పంథావంటి సమస్యలపై సి. పి. ఐ. (యం) నాయకత్వాన్ని విమర్శించుతు వచ్చాయి. డార్జిలింగు, సిలిగురి జిల్లాలు కొన్ని యితర ప్రాంతాల కమ్యూనిస్టు శ్రేణులు తమ అవగాహనల కనుగుణంగా రైతులను, టీ తోటల కార్మికులను సమీకరించ ప్రారంభించారు. వీరు సి.పి.ఐ.(యం) పత్రికైన "దేశహితైషి"ని; "మార్క్స్-ఎంజెల్స్ఇన్‌స్టిట్యూట్‌ను, తదితర వేదికలను తమ అభిప్రాయాలను ప్రచారం చేసుకొనుటకు వినియోగించు కొన్నారు. నాయకత్వాన్ని విమర్శిస్తూ మిలిటెంటు పోరాటాలను ప్రచారం చేసారు. "రివిజనిస్టు వ్యతిరేక పోరాట కమిటీని" యేర్పాటు చేసి పనిచేయ ప్రారంభించారు. వారి అభిప్రాయాలను మౌలికంగా విప్లవ పంథాలో, క్రమపద్ధతితో కమ్యూనిస్టు శ్రేణుల ముందుంచారు. "సి.పి.ఐ.(యం) నాయకత్వం వొకప్రక్క భిన్నాభిప్రాయాలకు హామీలనిస్తూనే, మరోప్రక్క విభేదిస్తున్న శక్తుల అభిప్రాయాలను కార్యకలాపాలను అణచటానికి అతివాద దుస్సాహసిక వాదులని ముద్రవేయుటకు, వ్యతిరేకంగా దాడి సాగించుటకు, అంతా చేసిందని" కూడ ప్రచారం చేశారు. ఆ సమయంలో రాష్ట్రకమిటీ సభ్యుడుగావున్న సుశితల్‌రాయ్ చౌదరికూడ సి.పి.ఐ.(యం) నాయకత్వంతో విభేదించారు. తన అభిప్రాయాలను నోటుగా చర్చల నిమిత్తం రాష్ట్రకమిటీకి పంపించారు. అదే క్రమంలో విభేదిస్తున్న వారిపై సి.పి.ఐ.(యం) నాయకత్వం "విప్లవశ్రేణులకు ప్రాతినిధ్యం వహిస్తున్నవారిపై క్రమశిక్షణాచర్యలను ముమ్మరం చేసిందని, అందువలన తాము విడిపోయామని" విప్లవకారులు ప్రకటించారు. విప్లవకారులకు వారి కార్యకలాపాలకు కేంద్రీకృత రూపం లేదు. వ్యక్తులుగానే వారి అభిప్రాయాలను ప్రచారం చేయసాగారు.[2] "వీరి కార్యకలాపాలు, రహస్య తిరుగుబాటు కార్యక్రమ స్వభావాన్ని కలిగివున్నవి. అంతర్గత పోరాట, నిర్మాణ స్వరూపాలలో, చర్చలలో, పార్టీ శ్రేణులను, ప్రజలను భాగస్వాములను చేసే వైఖరి లోపించింది. కార్యకలాపాలను పోరాటాన్ని సమన్వయం చేయు దృక్పథంలో మాత్రమే పనిచేశారు. అతివాద అవకాశవాద ధోరణిని, విప్లవ

---

1.—అదే—పే. 93.

2.—అదే—పే. 75-76

ప్రజాపంథా ధోరణి రెండింటిని ఆదితోనే ప్రతిబింబించారు. ఈ ద్వంద్వవైఖరే తదనంతర కాలంలో చీలికకు కారణమైంది.

సి.పి.ఐ.(యం) కేంద్రకమిటి 1967 ఆగస్టులో సోవియట్ యూనియన్‌లో రివిజనిజం, అంతర్జాతీయ రాజకీయ విధానాలపై ముసాయిదా సిద్ధాంత సమస్యలు, పార్టీ కార్యక్రమం, రాజకీయ విధానం కొన్ని మౌలిక సమస్యలు, బెంగాల్ కమ్యూనిస్టు విప్లవకారుల అతివాద పెడధోరణి అన్న మూడు సిద్ధాంతపత్రాలను ఆమోదించింది. నవంబరు 1967లో సి.పి.ఐ. (యం)లో విప్లవపంథాను చేపట్టిన వర్గాలు సమావేశమై అఖిల భారత విప్లవకారుల సమన్వయ కమిటిని యేర్పాటుచేశారు. వారు ఆమోదించిన వొక ప్రకటనలో యీ కమిటీకి నాలుగు కర్తవ్యాలను నిర్దేశించారు. అవి: 1) కార్మికవర్గ నాయకత్వంలో నక్సల్బరీ తరహా పోరాటాలను అభివృద్ధి పరచుట 2) ఆర్థికవాదాన్ని వ్యతిరేకించుతు, కార్మిక, కర్షక, తదితర నగర, గ్రామీణ బడుగువర్గాల పోరాటాలను వ్యవసాయ విప్లవ పంథాలో మలచి అభివృద్ధి చేయుట 3) సంస్కరణవాద, నయాసంస్కరణవాద వ్యతిరేక సైద్ధాంతిక పోరాటాన్ని సాగించుట, మావో ఆలోచనా విధాన ప్రాతిపదికపై విప్లవ శక్తులన్నిటిని ఐక్యపరచుట 4) మావో ఆలోచనా వెలుగులో విప్లవ కార్యక్రమాన్ని, ఎత్తుగడలను రూపొందించుటను ఆ కమిటీకి అప్పజెప్పింది.[1]

పశ్చిమబెంగాలులో అతివాద సాహసికవాదం రూపొంది, అభివృద్ధి చెందుటపై సి.పి.ఐ.(యం) కథనం యిలా వుంది.

ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీలో పాల్ఘాట్ 4వ పార్టీ కాంగ్రెసులో జరిగిన సైద్ధాంతిక పోరాటాన్ని మననం చేసుకొనవలసి వుంటుంది. నాడు సి.పి.ఐ. రాజకీయ, నిర్మాణ విధానాలను ప్రతిఘటించిన వర్గాలు తదనంతరం అంతర్గత పోరాటాన్ని వివిధ రూపాలలో కొనసాగించినవి. ఇండియా-చైనా యుద్ధకారణంగా తిరిగి ప్రజ్వరిల్లిన అంతర్గత పోరాట ఫలితంగానే సి.పి.ఐ. (యం) యేర్పడుట, యింతకు ముందే అధ్యయనం చేసివున్నందున ప్రస్తావించుటలేదు. అప్పటినుండి పార్టీకి వ్యతిరేకంగా, రహస్య పార్టీ యంత్రాంగం యేర్పరచబడింది. పరిమళదాస్‌గుప్తా వొక ప్రత్యేక గ్రూపును యేర్పాటుచేసి తన కార్యకలాపాలు కొనసాగిస్తూనే వున్నాడు. నాటి సంస్కరణవాద వ్యతిరేక పోరాటంలోకూడ కలవక విడిగానే వున్నాడు. తీవ్ర అతివాద నినాదాలిస్తూ అవకాశవాదాన్ని చేబట్టి, నిజానికి మితవాద వర్గాలను బలపరచారు. అత్యవసర పరిస్థితిలో పశ్చిమబెంగాల్ ఎలక్ట్రిసిటీ బోర్డు వర్కర్సు యూనియను సెక్రటరీగా, రక్షణ చందాలు, విరాళాలు వసూలు చేసారు. ఆగస్టు 1963లో వినయ్‌చౌదరి నాయకత్వంలో "దేశహితైషి" అనే బెంగాలీ వార

1. భారత విప్లవోద్యమము, కొన్ని గుణపాఠాలు, అనుభవాలు, (1999) జనశక్తి ప్రచురణ. పే. 76-77లు.

పత్రిక నడుపబడుతున్నది. ఉమ్మడి పార్టీలోనే యిది జరుగుతున్నది. అనతి కాలంలోనే 10 – 12 వేల ప్రతులకు విస్తరించింది. రాష్ట్ర కాన్ఫరెన్సులో శుషితల్, పరిమళ్, లతీఫ్, కనాయ్ (రహమాన్)లు తమ దృక్పధాలను ముతా మార్గాలలో ప్రచారం చేసారు. కాన్ఫరెన్సులో అనేక సవరణలు ప్రతిపాదించారు. ఆరుగురు మాత్రమే వారిని బలపరచారు. ఆ సవరణల సారాంశం, 1951 కార్యక్రమము, విప్లవ దశ, దేశం అర్ధవలస అనే అవగాహనను బలపరచుట, సోషలిస్టు విప్లవ దశయని, ప్రభుత్వ విధానాలను సామ్రాజ్యవాదం శాసించుచున్నదని, సూచించు చున్నవి, ఆ కాన్ఫరెన్స్ "దేశహితైషి"ని కమ్యూనిస్టుపార్టీ రాష్ట్ర కమిటి పత్రికగా ప్రకటించమని కోరుతున్నది. శుషితల్, నిరంజన్ బోస్, సరోజ్ దత్తు తదితరులు దీనిని అంగీకరించలేదు. వారు దానిని పార్టీ నిర్మాణానికి బయటనే వుంచి తమ అభిప్రాయాలకు వేదికగా చేయదలచారు.

బెంగాలులో సి.పి.ఐ.(యం)లో వివిధ దృక్పధాలు, అవగాహనలు గల వారు వివిధ గ్రూపుల నేర్పరచారు. ఒక గ్రూపు, విప్లవ సమితిలో పరిమళ్, లతీఫ్, కనాయ్, సుభాస్ బోస్, అజీజుల్, సాయి పాల్‌లు వున్నారు. శుషితల్ గ్రూపులో సుధీర్ భట్టాచార్య, అమూల్యసేన్‌లు వున్నారు. వీరు "చింతన" అనే పత్రికను పార్టీ కాంగ్రెస్ కాలంలో పార్టీ కార్యక్రమం సంస్కరణ వాదానికి ప్రతిబింబమని తీవ్రంగా ప్రతిఘటించుటకు వినియోగించారు. పార్టీ కాంగ్రెసు ముందు వీరు అరెస్టు చేయబడ్డారు. పార్టీ కాంగ్రెసులో సవరణలతో కార్యక్రమం ఆమోదించబడిన తరువాత యీ గ్రూపులన్నీ అంతమగునని తలచారు. అయినా "రివల్యూషనరీ కౌన్సిల్" తన విధానాలను, సంబంధాలను కొనసాగించింది. ఈ సమస్యను రాష్ట్ర కమిటి, 8 డిసెంబరు 1964లో చర్చించి, వొక కమిషన్‌ను పరిశీలనకు యేర్పరచింది. శుషితల్‌రాయ్ చౌదరి యిది సంస్కరణ వాదాన్ని ప్రతిఘటించుటకు బదులు క్రమశిక్షణ చర్య పేరుతో భిన్నాభిప్రాయాలను అణచి వేస్తుందని, ఆ విధంగా మిలిటెన్సీని అణచి వేస్తుందని వాదించారు. ఈ కమిషన్‌లోని యిద్దరి సభ్యులను ప్రభుత్వం అరెస్టు చేసింది. ఈ ఘటనల నివేదిక అందునప్పటికి ప్రభుత్వం పార్టీ నాయకత్వం, కార్యకర్తలు అరెస్టు కాబడ్డారు. జనవరి 1964 మధ్యలో 'మార్క్స్-ఎంజెల్స్' ఇనిస్టిట్యూట్ శుషితల్ నాయకత్వంలో యేర్పాటుచేసి పార్టీలో సిద్ధాంత చైతన్యాన్ని పెంపొందించుటకనే పేరుతో సమాచార డాక్యుమెంట్లు ప్రచురించుట జరిగింది.[1]

కమ్యూనిస్టు పార్టీలోని అతివాద శ్రేణులు సాధారణ మూకుమ్మడిగా అరెస్టులు కాబడుటతో "చింతన", "రివల్యూషనరీ కౌన్సిలు" తదితర గ్రూపులు

1. అన్ లెఫ్ట్ డీవియేషన్ ఆర్ లెఫ్ట్ అపస్వ్యావిజయం (1967) సి.పి.ఐ.(యం) కేంద్ర సమితి, ఆగష్టు 1967లో ఆమోదించినది. పే. 20.

తమ కార్యకలాపాలను ముమ్మరం చేసాయి. సి.పి.ఐ.(యం) నాయకత్వాన్ని నిందా, విమర్శలకు గురిచేస్తూ కరపత్రాలు, చిరు పుస్తకాలు, పార్టీ కార్యక్రమాన్ని తీవ్రంగా విమర్శించుతూ అనేక రచనలు వెలువడినవి. సిలిగురి గ్రూపు 1965 లో ఆరు సైక్లోస్టైల్ కరపత్రాలు విడుదల చేసింది. ప్రభుత్వం తన వాదనలను బల పరచుకొనుటకు వీటినే వుదహరించింది. హింసా, దౌర్జన్య చర్యలు చేపట్టారని నిందా ప్రచారం సాగింది. బయట వున్న పార్టీ నాయకత్వం క్రమశిక్షణా చర్యలు పేరుతో పార్టీ నుండి బహిష్కరించారు.

శషితల్‌రాయ్ చౌదరి గ్రూపు జైలులో కూడ కొనసాగింది. మే 1966 లో అరెస్టు అయిన కమ్యూనిస్టు పార్టీ నాయకులు కార్యకర్తలు ఎక్కువగా యీ గ్రూపులలోని వారే వున్నారు. శషితల్‌రాయ్ మిగతా గ్రూపుల వారిని జైలులోనే కలుసుకొని చర్చలు జరిపారు. మే 1966లో అందరూ విడుదల అయిన వెంటనే అన్ని గ్రూపుల కార్యక్రమాలను సమన్వయం చేసే ప్రయత్నం జరిగింది. రాజకీయ పాఠశాలలు నడుపుట అనే పేరుతో పార్టీతో తమ తమ గ్రూపుల రాజకీయాలను బలపరచుకొన్నారు. ఈ కార్యక్రమంలో మార్క్స్-ఎంజెల్స్ ఇన్‌స్టిట్యూట్‌ను వినియోగించుకొన్నారు. "నిరాహారదీక్ష సిద్ధాంతం" అనే కరపత్రంలో ప్రజల కొరకు ఎంతకాలం వేచి వుండాలి, ప్రజలుకాదు నిర్ణయించేది, దృఢచిత్తులైన కొద్ది మంది నిర్ణయిస్తారు" అని ప్రకటించారు.

మార్చి - ఏప్రిల్‌లో జరిగిన "బంగళాబంధు"లో రైల్వే కార్మికులు "దేశ హితైషి" వర్గాలకు దగ్గరయ్యారు. అ దులో ముఖ్యంగా సరోజ్‌దత్తా, నిరంజన్ బోసు, సంతోష్ బోసుల ప్రభావంలోనికి వచ్చారు. వీరు రెండు చిరు పుస్తకాలు ప్రచురించారు, మరో 21 పత్రాలకు ప్రణాళిక వేసుకొన్నారు. శాంతోష్ బోస్ "దేశ హితైషి" సుహృద్భావాన్ని వాటి ప్రచురణకై వినియోగించారు. వీరు వాటి అమ్మ కానికి, పంపిణీకి తోడ్పడ్డారు. ముఖ్యంగా సి.పి.ఐ.(యం) మహాసభలు, సమావేశా లలో ప్రదర్శనలలో అవకాశం కలుగజేసారు.

జూన్ 1966లో కా॥ పి. సుందరయ్య హాజరయిన రాష్ట్రకమిటి సమా వేశంలో రాజకీయ నిర్మాణ సమస్యలు వివరంగా చర్చించబడినవి. కొంతమంది చారుమజుందారుపై క్రమశిక్షణా చర్య తీసుకొనాలని ప్రతిపాదించారు. రాష్ట్రకమిటి యిది క్రమశిక్షణా సమస్య కాదని, రాజకీయసమస్యగా ముఖ్యప్రమాదం సంస్కరణ వాదం వలన ఏర్పడుచున్నదని, అతివాద సాహసికవాదమని, "దేశహితైషి"బోధనల యెడల కమ్యూనిస్టు శ్రేణులలో సానుభూతి కలుగుచున్నదని తలచింది. శషితల్ పార్టి సంస్కరణ వాదంపై పోరాటం జరుపకుండా పార్టీ శ్రేణుల మిలిటెన్సీకి వ్యతి రేకంగా పోరాడుతున్నాడనే వాదనను తీసుకొచ్చింది. సి.పి.ఐ. (యం) రాష్ట్రకమిటి సిలిగురి, నక్సల్బరీ రైతాంగం, రైల్వేకార్మికులు, సెంట్రల్ బ్యాంకి ఎంప్లాయీస్,

రాష్ట్ర ఎలక్ట్రిసిటీ కార్మికులు ముఖ్యంగా జాల్డక ప్రాజెక్ట్, జాల్పగురి, ఆలీపూర్‌లలో అతివాద సాహసికవాదుల విచ్ఛిన్నకర చర్యలపై అనేక వ్యాసాలు ప్రచురించింది. పార్టీ సమావేశాలలో వారి దృక్పధాన్ని వివరించలేకపోయారని, పార్టీ కార్యక్రమం ఆమోదించుతున్నారని, కాని కేంద్రకమిటీ వ్యాఖ్యలను, వివరణలను వ్యతిరేకించుతున్నారని విమర్శించింది.[1]

"సార్వత్రిక సమ్మెను పెటీబూర్జువా సాహసికవాద నినాదంగా వ్యతిరేకించారు. పార్టీని విచ్ఛిన్నంచేసి విప్లవకరపార్టీని నిర్మించమని పిలుపునిచ్చారు. ఆరు మాసాలలో సాయుధ గెరిల్లా పోరాటాలకు పిలుపునిచ్చారు. ఆలస్యం చేయరాదని విముక్తి ప్రాంతాలు ఏర్పడగలవని పిలుపునిచ్చారు. ఫణిదేవ, సిలిగురిలలో ఎన్నికలలో పాల్గొనినప్పటికీ, సాధారణ ఎన్నికలు ఫార్సుగా విశ్లేషించారు. స్వతంత్ర అభ్యర్థిగా నిలబడిన లతీఫ్‌ని పార్టీ అభ్యర్థికి వ్యతిరేకంగా బలపరచారు.

సి.పి.ఐ అనుసరించే "సంస్కరణవాదానికి వ్యతిరేకంగా సాగిన పోరాటానికి నాయకత్వం వహించినశక్తులు ప్రధానంగా మూడురకాలుగా వున్నారు. ఒకటి : రాజకీయ సైద్ధాంతిక అవగాహనలో మౌలికంగా సి.పి.ఐ.తో వుండి పలుకారణాలవలన డాంగేవర్గాలతో ఘర్షణలకు దిగినవారు, రెండు : సి. పి. ఐ. విధానాలతో కొన్ని నిర్దిష్టవర్గ సామరస్య విధానాలను, కార్యకలాపాలను వ్యతిరేకించుతూ నిర్మాణ రీత్యా తెగతెంపులకు సిద్ధపడినవారు. అయినా రాజకీయంగా, సైద్ధాంతికంగా కార్యాచరణలో సంస్కరణవాదాన్ని విడనాడుటకు సిద్ధంగాలేనివారు. సోవియట్ యూనియన్ సంస్కరణవాదాన్ని పూర్తిగా వ్యతిరేకించకుండా కొన్ని అంశాలను మాత్రమే విమర్శించుచున్నదని సి.పి.ఐ. (యం) పై విప్లవకారుల తీవ్ర విమర్శన వుంది. మూడో రకము: అంతర్జాతీయంగాను, ఆంతరంగికంగాను సంస్కరణ వాదాన్నుండి సంపూర్ణంగా తెగతెంపులు చేసుకొన్న తామొక్కరమే నిసలయిన విప్లవకారులమని, వారి అవగాహనగా ఉంది. అంతేగాక, "వారు సి.పి.ఐ.(యం) నాయకత్వం ఆడిన ద్రోహపూరిత నయా రివిజనిస్టు నాటకాన్ని చూడలేకపోయామనేవారు. నాయకత్వం, కార్యక్రమం, ఎత్తుగడలపంథా, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సమస్యపై చర్చను ఆరంభించలేకపోయారు. అది జరిగివుంటే నూతనంగా ఆవిర్భవించిన సిపిఐ (యం. యల్) పార్టీ విప్లవపంథాను అధికారికంగా స్వీకరించకపోయినప్పటికీ, పార్టీ శ్రేణులకు స్పష్టమయిన మార్గదర్శకత్వాన్ని అందించటానికి అది తోడ్పడి వుండేది. అది తరువాతదశలో వివిధ రంగాలలో నయా రివిజనిస్టు నాయకత్వానికి వ్యతిరేకంగా పోరాటాన్ని సాగించుటకు ఆధారపడదగిన ప్రాతిపదికగా పనిచేసి వుండేది.

అంతేగాక "అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సమస్యలపై తమ సైద్ధాంతిక

---

1. ఆన్ లెఫ్ట్ డీవియేషన్ ఆర్ లెఫ్ట్ అపర్చ్యునిజం (1967)సి.పి.ఐ. (యం) కేంద్ర సమితి ఆగస్టు 1967లో ఆమోదించినది. పే. 20–22.

వైఖరి యేమిటో తేల్చకుండా దాటవేసారు. ముసాయిదా కార్యక్రమంపై మా అభి ప్రాయ"మంటూ అక్టోబరు 3, 1964 నోటులో సి.పి.ఐ.(యం) నాయకులు యం. బసవపున్నయ్య యిచ్చిన వివరణ గమనించతగినది.[1] ఆ విధంగా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సమస్యలపై చర్చలు జరిపి నిర్ణయించజాలక పోయి నందుకు కారణాలను యీ విధంగా వివరించారు. అవి ప్రత్యేకంగా మరువ జాలనివి.

"జాతీయ, అంతర్జాతీయ అంశాలకు సంబంధించిన అనేక అంశాలపై అభి ప్రాయ భేదాలున్నవి. ప్రస్తుతం అంతర్జాతీయ వివాదాలు, సంఘర్షణలను అంచనా వేయుటలోకన్నా మనదేశంలోని విప్లవోద్యమానికి ప్రత్యక్షంగా సంబంధంగల సమస్యలపై అంగీకారం, ఐక్యత బాగా వుంది. క్రియాశీలకంగా మనం జాతీయ, అంతర్జాతీయ అంశాలన్నిటిని చర్చించుటలో కూరుకుపోయి, విజయవంతంగా దాని నుండి బయటపడలేక, అందులో మనం మనలను కోల్పోయే ప్రమాదాన్ని తెచ్చు కొనుటకు మారుగా, ప్రస్తుతానికి యీ రెండు రకాల చర్యలను వేరుచేయటమనే వివేకాన్ని ఎందుకు ప్రదర్శించకూడదు" అని నోటులో బసవపున్నయ్య వివ రించారు.

ఈ అంశంపై విప్లవకారులు సి.పి.ఐ. (యం) "నయా రివిజనిస్టు నాయ కత్వం, 1. సోవియట్ ఆధునిక రివిజనిజాన్ని పూర్తిగ తిరస్కరించుటకు తయారుగా లేదని, తొందరపడి పార్టీ వైఖరిని కమ్యూనిస్టు శ్రేణులపై రుద్దుటకు ప్రయత్నించిన ఎదురుతిరుగుతారని భయపడుతున్నారని, 2. సి పి.ఐ. (యం) నాయకత్వంలోని వివిధ సెక్షనులు తమలో తాము సరిచేసుకొన్నను సమస్యలున్నందున, అంతర్జాతీయ సమస్యలపై తక్షణమే నిర్ణయాలు తీసుకొన ప్రయత్నించుట, రాజకీయ పరిణిత, "క్రియాశీలత", "వివేకం" ప్రదర్శించుటగాక, వాయిదా వేయనిచో "నయా రివిజ నిస్టు నౌకకు కల్లోల జలాల సుడిగుండాలలో మునిగిపోయే ప్రమాదాన్ని" తెచ్చి పెట్టినట్లు అగుతుందని "పార్టీలోని కొన్ని వర్గాలకు విశ్వాసం కలిగించుటకు చేసిన ప్రయత్నంగా" విప్లవకారులు సి.పి.ఐ. (యం) వైఖరిపై వ్యాఖ్యానించారు.

అంతేగాక "నయా రివిజనిస్టులలోని రెండు వర్గాలు తమలోతాము వొక అవ గాహనకు వచ్చాయి." కొత్తగా ఏర్పడిన సి.పి.ఐ. (యం) అప్పటికప్పుడే సోవియట్ ఆధునిక రివిజనిజాన్ని ఆమోదించే వైఖరి చేబట్టుట, సాధ్యం కాకపోతే, స్పష్టంగా వ్యతిరేకించే వైఖరిని చేబట్టనివ్వరాదనేదే ఆ అవగాహన. రివిజనిజానికి వ్యతిరేకంగా పోరాటం, భారత విప్లవ పంథా, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం అనేక కీలక సమస్యలపై నిర్ణయాలు చేయకుండా, నాయకత్వం అన్ని జాగ్రత్తలూ తీసు

1. —అదే— పే. 65.

కొన్నది."[1]

అతి వేగంగా మారుతున్న జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులలో "1967 ఎన్నికల అనంతరం కేంద్ర కమిటీ ఆమోదించిన నూతన పరిస్థితి పార్టీ కర్తవ్యాలు అన్న నివేదికతో నక్సలిజం అవతరించింది" అని నంబూద్రిపాద్ పేర్కొన్నారు. అంతేగాక "చైనా కమ్యూనిస్టుపార్టీ-మా విభేదాలు" అన్న డాక్యుమెంటును ప్రకటించిన సి.పి.ఐ. (మార్క్సిస్టు) కేంద్ర కమిటి స్పష్టంగాను, బహిరంగంగాను చైనా పార్టీ వైఖరినుండి విడివడవలసి వచ్చింది. పార్టీలో తీవ్రమైన ఆంతరంగిక పోరాటం సాగింది. ఫలితంగా "నక్సలైట్లు" అన్న పేరిట ఒక స్పష్టమైన అతివాద సెక్టేరియన్ గ్రూపు ఏర్పడింది. చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని తాము విశ్వసనీయంగా అనుసరించుతామని ఆ గ్రూపు బహిరంగంగా ప్రకటించింది" అన్నారు.[2]

## శ్రీకాకుళంలో గిరిజన రైతాంగ సాయుధ భూ పోరాటం :

ఆగస్టు 1967లో సి.పిపి.ఐ. (యం) రాజకీయ సిద్ధాంత పత్రపు ముసాయిదా వెలువడింది. "పార్టీ శ్రేణులు దానిని చదవకముందే, రాష్ట్ర పార్టీ కార్యదర్శి, కేంద్ర కమిటీ సమావేశానికి పోయిన అదును చూసుకొని, కేంద్ర కమిటికి వ్యతిరేకంగా, రెచ్చగొట్టే విధంగా రెండు వ్యాసాలను చంద్ర పుల్లారెడ్డి వ్రాశారు. రాష్ట్ర కమిటీ సభ్యులుగా వున్న దేవులపల్లి వెంకటేశ్వరరావు, నాగిరెడ్డి, పుల్లారెడ్డి, కొల్లా వెంకయ్యలు పార్టీ బాధ్యులుగా తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వహించకుండా క్రమశిక్షణకు వ్యతిరేకంగా కరపత్రాలు, పోస్టర్లు వేసేవారిని ప్రోత్సహించారు. విద్యార్థి, యువజన ప్రాంతను నాయకులను ముసాయిదాకు వ్యతిరేకంగా ప్రచారం సాగించుటకు సాధనాలుగ వుపయోగించారు. రాష్ట్ర ప్లీనం సమావేశంలో తాము ప్రబోధిస్తున్న పొరపాటు అవగాహనకు మెజారిటీ రావటంతో మరింత గాడితప్పి విచ్చలవిడిగా పార్టీ విధానానికి వ్యతిరేకంగా కార్యకలాపాలను సాగించారు."[3]

ఆంధ్రలో నక్సలైట్ల పుట్టుక నేపథ్యాన్ని స్థూలంగా తెలుసుకొనవలసిన అవసరముంది. సి.పి.ఐ. (యం) 1964లో ఏర్పడిన నాటి నుండి భిన్న దృక్పధాలు వున్నట్లు కన్పడుతున్నది. అందుచేతనే, "చీలికల క్రమంలో అందుకు కారణమైన సిద్ధాంత సమస్యలు మరుగున పడినవి. ఆ సమస్యలు లోతుగా, సరిగా చర్చించ

---

1. భారత విప్లవోద్యమం. కొన్ని గుణపాఠాలు, జనశక్తి ప్రచురణ. పే. 65 – 66.

2. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. వర్తమాన ఎత్తుగడలపై పార్టీ పంథా : ఒక అధ్యయనం. పే. 6.

3. హనుమంతరావు, మోటూరి (1991) నక్సలిజం పుట్టుక, పరిణామం, పతనం. ప్రజాశక్తి బుక్‌హౌస్. పే. 10.

బడలేదు. ఫలితంగా పార్టీ శ్రేణులలో ఈ సమస్యపై స్పష్టత లేదు" అని విప్లవకారుల వ్యాఖ్యగా వుంది. అంతేగాక "ఆ విధంగా రివిజనిస్టుల నుండి నిర్ణయాత్మక తెగ తెంపులు, రివిజనిస్టులు విప్లవ శక్తులుగా స్పష్టంగా జరుగవలసిన విభజన తాత్కాలికంగా నివారించబడినదని"[1] విప్లవకారులు తదనంతర కాలంలో వివరించారు. మరో చీలికను సమర్పించుకొన్నారు.

సి.పి.ఐ. (యం) నుండి చీలిపోయిన విప్లవకారులు 1970 దశకంలో గిరిజన రైతాంగ సాయుధ భూ పోరాటాలు శ్రీకాకుళంలో చేపట్టుటకు గల నేపథ్య రైతు ఉద్యమ పోరాటాలను కొంత చూద్దాము.

కమ్యూనిస్టులు 1959 నుండి విశాల ప్రాతిపదికపై గిరిజన సంఘం, వారి కోర్కెలపై అనేక పోరాటాలు జరిపి బలమైన వుద్యమాన్ని నిర్మించారు. గిరిజన రైతాంగం అప్పులకు లోనై తమ ఆహార ధాన్యాదులను, యితర పంటలను, తాము అడవులలో సేకరించిన అడవి వుత్పత్తులను కారుచవకగా వడ్డీ వ్యాపారులకు, యితరులకు అమ్ముట సర్వ సాధారణంగా జరుగుతున్నది. అప్పులు తీర్చలేని గిరిజన వ్యవసాయదారులు భూములను వారికే స్వాధీనంచేసి, ఆ భూస్వాముల, వ్యాపారుల వద్దనే పాలేరులు, వ్యవసాయ కూలీలుగా పనిచేయసాగారు. అడవి వుత్పత్తులను అటవీ శాఖాధికారులు, షావుకారులు, వడ్డీ వ్యాపారులు, భూస్వాములు పేరుకు కొంత యిచ్చి కొంటారు అత్యధిక లాభాలకు బస్తీలు, నగరాలలో అమ్ముతారు. గిరిజనులు సాగుకు తెచ్చిన "పోడు భూములలో వ్యవసాయం చేయుటకు, అడవిలో దొరికే తేనె, కట్టెలు, వగైరాలు, మామూళ్ళు పేరుతో లంచాలు గుంజుట సర్వ సాధారణమైంది. అభివృద్ధి కార్యక్రమాలు అని సాగుతున్న వివిధ పనులకు వెట్టి చాకిరిని ఆఫీసర్లు, కంట్రాక్టర్లు వినియోగించుకొని ప్రభుత్వ ఖజానాను, అటు గిరిజనుల శ్రమశక్తిని విపరీతంగా దోపిడిచేసి, తమ బొక్కసాలు నింపుకొంటున్నారు. ప్రభుత్వం 1917 నాటి అస్పష్ట ఆటవిక చట్టాన్ని అమలు చేయుటలో గూడ అశ్రద్ధ చేస్తున్నది.

ఈ దోపిడికి వ్యతిరేకంగా గిరిజనులు గతంలో నేడు తిరుగుబాటులు చేస్తూనే వున్నారు. సాలూరు ఏజన్సీలో 1900లో బ్రిటిష్ ప్రభుత్వంపై తిరుగుబాటు జరిగింది. అణచివేయబడింది. పార్వతీపురం ఏజన్సీలో 1946 లోనే జాతీయ కాంగ్రెసులో వొక వర్గానికి నాయకత్వం వహిస్తున్న ఆచార్యా రంగా ఆధ్వర్యంలో ఆందోళన జరిగింది. గిరిజనులు పోరాడి వ్యవసాయ భూములు ఆక్రమించగా, వుద్యమానికి నాయకత్వం వహించిన వారు ద్రోహంచేయగా ప్రభుత్వ అధికారుల దయాదాక్షిణ్యాలకు, హింసా

---

1. భారత విప్లవోద్యమం-కొన్ని గుణపాఠాలు. జనశక్తి ప్రచురణ. పే. 67.

దౌర్జన్యాలకు గురి అయ్యారు. ప్రభుత్వం భూస్వాముల పక్షాన నిలబడి గిరిజనులపై అనేక కేసులు పెట్టి హింసించింది.

గిరిజన సంఘం యీ క్రింది కోర్కెలపై అనేక సంవత్సరాలుగా ఆందోళన, పోరాటాలు సాగించుతునే వుంది. ప్రధాన కోర్కెలు యిలా వున్నవి.

అవి : 1) గిరిజనుల నుండి గిరిజనేతరలు అన్యాయంగా స్వాధీనం చేసుకొన్న వ్యవసాయ భూములను తిరిగి యిచ్చివేయాలి. 2) బంజరు భూములను గిరిజనులకు పంచాలి. 3) చట్టవ్యతిరేక అన్యాయ మార్గాలలో పెరిగిపోతున్న గిరిజనుల అప్పులను రద్దు చేయాలి. 4) వ్యవసాయ పరికరాలు, ఎడ్లను ప్రభుత్వం యివ్వాలి. 5) న్యాయమైన ధరలకు అడవి వుత్పత్తులను ప్రభుత్వం కొనాలి. 6) గిరిజనుల వెట్టిచాకిరిని రద్దుచేసి, కొనసాగించే వారిని శిక్షించాలి. 7) గిరిజనులు ఇండ్లకు, అడవి కలపను వినియోగించుటకు ఆటంకాలుండరాదు. 8) వ్యవసాయ కూలీలకు, పాలేరులకు జీవన వేతనాలు నిర్ణయించి అమలు చేయాలి. 9) అటవీ వుత్పత్తులను గిరిజనులు అన్న పానీయముల కొరకు వినియోగించుటకు ఆటంకాలుండరాదు. నూతన కార్యక్రమాన్ని అమలు చేయుటకు తగిన వాతావరణాన్ని కలుగజేసి, విద్యా, సాంస్కృతిక చర్యలు చేపట్టాలి. 10) గిరిజన ప్రాంతాలను స్వపరిపాలన ప్రాంతాలుగా ప్రకటించాలి.

గిరిజనులు వారి పోరాటాలు ద్వారా సాధించిన విజయాలు యిలా వున్నవి. 1) గిరిజనేతరులు ఆక్రమించిన వ్యవసాయ భూములను 1951 లో పొందగలిగారు, వాటిని పండించుకొంటున్నారు. ఆ విధంగా 1967 నుండి 6 వేల 7 వందల యకరాలు తిరిగి పొందారు. అయినా యింకా పొందవలసిన భూమి ఎంతో వున్నది. 2) గిరిజనులు 1967 కు 1500 యకరాల అడవి భూములను ఆక్రమించి సాగు చేస్తున్నారు. 3) గిరిజనులు 1967 కు 2 లక్షల అప్పులు చెల్లించ తిరస్కరించారు. 4) వ్యవసాయ పనులకు అవసరమైన కలపను వుచితంగా పొందగలిగారు. 5) సంతలలోను, సహకార సంఘాలలోను తమ వుత్పత్తులకు తగిన ధరకు అమ్ముకొంటున్నారు. 6) వెట్టిచాకిరి నిర్మూలించబడింది. 7) కూలి, పాలేరుల వేతనాలు పెంచబడినవి. పాలేరుల వేతనాలు 3 నుండి 14–15 బస్తాలకు పెంచబడినవి. అదే విధంగా కూలిరేటు 12 రెట్లు పెంచబడింది. 8) దైనిక అవసరాలకు, గృహ నిర్మాణానికి కలపను ఉచితంగా పొందుతున్నారు. 9) పై విజయాల ఫలితంగా ప్రజా వెల్లువ ప్రారంభమైంది. కార్యకర్తలు ప్రజా చైతన్యాన్ని పెంపొందించారు. రాత్రి వయోజన పాఠశాలలు సాంస్కృతిక కార్యక్రమాలతో రాజకీయ చైతన్యం పెరిగింది.

కమ్యూనిస్టు విప్లవకారులపై సమస్యలపై చొరవతో పోరాటాలు సాగించి, గిరిజనసంఘాన్ని విస్తృత ప్రాతిపదికపై నిర్మించి, రాజకీయ చైతన్యాన్ని యివ్వగలిగారు. వ్యవసాయభూముల సమస్య, రాజ్యాంగం, స్వపరిపాలనా ప్రాంతాలపై రాజకీయ చైతన్యాన్ని గిరిజనులలో కలుగజేసారు.

ఈ సమస్యలు నూతన ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడినపుడు మాత్రమే పరిష్కారం కాగలవని ప్రచారం చేశారు. గిరిజన కమిటీలు, పాఠశాలలు ఏర్పాటు చేశారు· తెలంగాణా పోరాట అనుభవాలను వివరంగా ప్రచారం చేశారు.

## శ్రీకాకుళం పోరాటంపై వివరణలు, విమర్శలు ప్రతివిమర్శలు :

శ్రీకాకుళం పోరాటం నేరుగా అఖిలభారత కమ్యూనిస్టు విప్లవకారుల కేంద్ర కమిటి (ఎఐసిసిసిఆర్) మార్గదర్శకత్వంలో రాష్ట్ర విప్లవకారుల సమన్వయకమిటీని త్రోసిబుచ్చి జరుగుటతో వివాదాస్పద, భిన్నవైఖరుల సైద్ధాంతిక చర్చావేదికగా అయింది. రాష్ట్ర విప్లవకారుల సమన్వయ కమిటికి నాయకత్వం వహించే టి. నాగిరెడ్డి, దేవులపల్లి వెంకటేశ్వరరావు, సి. పుల్లారెడ్డి, కొల్లా వెంకయ్యలు తెలంగాణా పోరాట అనుభవం కలిగినవారు.

శ్రీకాకుళపోరాటం "ఎఐసిసిసిఆర్ స్థానిక శాఖ, ఎపిసిసిఆర్"ల మధ్య రాజకీయ సమస్యలపై చర్చలతోపాటు సైద్ధాంతిక వివాదాంశమైంది. స్థానిక శాఖను వదలి నేరుగా "ఎపిసిసిఆర్"ను తోసిబుచ్చి పైనుండి ప్రతిఘటన పోరాటాన్ని పురోగమన మార్గంలో సాగించమని కోరింది. దీనితో ప్రారంభమైన వివాదం, విస్తరించి కంచుకోటలో ప్రవేశించింది. ప్రధానమైన అభిప్రాయాలను ప్రస్తుతించుతూ టి. నాగిరెడ్డి యిలా వివరించారు.[1]

ప్రథమ సమస్య ప్రజాయుద్ధంలో అనుసరించవలసిన ఎత్తుగడలు. సాయుధ పోరాటం ఎప్పుడు ప్రారంభించాలి? ప్రతిఘటనగానే ప్రభుత్వ నిర్బంధ వ్యతిరేకంగా సాగుతుంది, ఇది ప్రజా ప్రతిఘటనగా ప్రారంభమవుతుంది. ఈ ప్రతిఘటననుండే ప్రతిఘటనదళాలు రూపొందుతవి. భూస్వాముల గూండాలు, పోలీసుల దౌర్జన్య దమనకాండలకు ప్రజా ప్రతిఘటనను అంతగా సి.పి.ఐ, (యం. యల్) పట్టించుకొనదు. ప్రజా వుద్యమాలులేని ప్రాంతాలలో దళాలను నిర్మించుట వారి విధానము, అదే దళాలను ప్రజలనుండి వేరుచేస్తున్నది.

రెండవ అభిప్రాయభేదము: ప్రజాయుద్ధం ఎల్లప్పుడూ వొక ప్రతిఘటన రూపంలోనే ప్రారంభమవుతుంది, వొక దాడి రూపంలో కాదు. అది వారి కోర్కెలు, ప్రయోజనాలకొరకు జరిగే పోరాటం, అది భూమి, అధికవేతనాలకొరకు కావచ్చు. ఆర్థిక కోర్కెలకై జరిగే పోరాటము ప్రభుత్వ, భూస్వాముల గూండాల దాడులను ప్రతిఘటించుటకు ప్రజలను సమీకరిస్తుంది. ఈ విధమైనప్రతిఘటనద్వారా ప్రజాసైన్య మేర్పడుతుంది.

---

1. నారాయణమూర్తి (1969) శ్రీకాకుళం కథనం నక్సల్బరీ అండ్ ఆఫ్టర్. నా 2 పే. 24.

ప్రజల కోర్కెలు, ప్రజా పోరాటాలకు సి.పి.ఐ.(యం.యల్) విధానాలలో చోటు, సంబంధంలేదు. ప్రతి భూస్వామిపై ప్రజావుద్యమాలు లేకుండానే, కోర్కెలు పోరాటాలకు సంబంధం లేకుండానే దాడులు చేయసాగారు. "వొక్కమాటలో చెప్పా లంటే మనది ప్రతిఘటనపంధా, వారిది దాడి పంధా" అని నాగిరెడ్డి వివరిం చారు.

మూడవ అభిప్రాయభేదము: ఇతర పోరాట రూపాలకు సంబంధించినది. సాయుధ పోరాటం మౌలిక పోరాటం. అత్యంత ప్రాముఖ్యతగలది. అయినా అది వొక్కటే పోరాటరూపం కాదు. అత్యున్నత పోరాటరూపమనుటలో సందేహంలేదు. ఉదాహరణకు శ్రీకాకుళంలో ఆయుధపోరాటం సన్నాహాలకు పునాది. ప్రజా చైత న్యాన్ని రూపొందించుటలో, యితర ప్రాంతాలకు సాయుధపోరాటాన్ని విస్తరించు టలో పురోగమనమార్గము. ఆయాప్రాంతాల పరిస్థితులనుబట్టి పోరాట రూపాలను చేబట్టవలసి వుంటుంది. వ్యవసాయ కార్మికుల వేతనాలు, పేదరైతులకు కౌలు, బంబరుభూముల పంపకం, ప్రభుత్వ భూముల ఆక్రమణ, విత్తనాలు, ఎరువులు సప్లయి ప్రధాన సమస్యలే కావచ్చు. అందుకైజరిపే పోరాటాల వివిధదశలలో సంత కాల మహజరులు, ప్రదర్శనలనుండి పరిస్థితులు, ప్రజల చైతన్యం, శతృవుల అణచి వేతల తీవ్రతలనుబట్టి పోరాటశక్తుల నిర్మాణశక్తి, బలాన్నిబట్టి, అందులో ప్రజల పాత్రనుబట్టి పోరాటరూపాలను ప్రజాచొరవే నిర్ణయించుతుంది. ప్రజలు నేరుగా పాల్గొనే పోరాటరూపమై వుంటుంది. భూసమస్య తదితర సమస్యలపైభూస్వాములు, ప్రభుత్వానికి అవసరమయితే వ్యతిరేకంగా ప్రతిఘటనాశక్తిని పెంపొందించే ప్రజా పోరాటరూపమై వుండాలి.

మార్క్సిస్టు-లెనినిస్టులు అన్ని ప్రాంతాలలో కమ్యూనిస్టుపార్టీ బలం, ప్రజా బలం, చైతన్యంతో సంబంధం లేకుండా యితరపోరాట రూపాలను పరిగణనలోనికి తీసుకొనకుండా, వొక్క సాయుధపోరాటంపైనే విశ్వాసం ఉంచుట జరుగదు. ఈ కారణంగానే పార్టీ ఐక్యతకు పిలుపునిస్తున్నారు. తీరప్రాంత జిల్లాలలో పార్టీ ఐక్య తకు, పార్టీశాఖలు దళాలు నిర్మించాలని భూస్వామ్య వ్యతిరేక పోరాటానికి పిలుపు యిచ్చామని నాగిరెడ్డి వివరించారు.

ఈ నేపధ్యంలో శ్రీకాకుళం సాయుధ చర్యలను యేవిధంగా అంచనా వేస్తు న్నారని విలేఖరి ప్రశ్నించగా యిలా సమాధానమిచ్చారు.

"పార్వతీపురం, అట్టి యితర ఏజన్సీ ప్రాంతాలలోని ప్రతి చర్య వెనుక అనేక సమస్యలపై, భూసమస్యతో సహా పేరుమోసిన దుర్మార్గ భూస్వాములపై రైతాంగం పోరాడిన ఉద్యమ ప్రాతిపదిక వుంది. మైదాన ప్రాంతాలలో అట్టి ప్రజా వుద్యమం కాని, విస్తృత ప్రజాసామాన్యం అట్టి పోరా టాలలో పాల్గొనుటగాని లేదు. అంచేత ఆ వుద్యమానికి దీర్ఘ కాలం మనగలిగిన

శక్తిలేదు. ప్రజా వుద్యమాన్ని నిర్మించుటయే మార్గం". శ్రీకాకుళం సాయుధ పోరాటాన్ని సి.పి.ఐ. (యం.యల్.) "జాతీయ విముక్తి పోరాటంగా", నక్సల్బరీ పోరాటాన్ని పెకింగ్ రేడియో "భూమికై సాయుధ రైతాంగ పోరాటం" అంటూనే, "బీజప్రాయంగా వున్న జాతీయ విముక్తి పోరాట"మని విశ్లేషించుటపై విలేఖరి ప్రశ్నింపగా, "ప్రతి సాయుధ పోరాటమూ వెనువెంటనే జాతీయ విముక్తి పోరాటం కాదు, బీజప్రాయ రూపం కావచ్చు. ప్రతి రైతాంగ పోరాటాన్ని అధికారం కొరకు జరిగే, జాతీయ విముక్తి పోరాటంగా చెప్పుట, ప్రజల మౌలిక సమస్యలపై చైతన్యాన్ని, కోర్కెలకై పోరాటాన్ని ప్రక్కదారులు పట్టించుటయే అగుతుంది. అనేక ప్రాంతాలలో అనేక విస్తృత రైతాంగ సాయుధ పోరాటాలు సమన్వయం, సంలీనం చేయబడిప్రజాసైన్యం రూపొంది జాతీయ విముక్తికి, జనతా ప్రజాస్వామ్యానికి పోరాడితే జాతీయ విముక్తి పోరాటమగుతుంది." అని సిద్ధాంతీకరించుతూ, శ్రీకాకుళం నమూనా చర్యలు సాయుధ పోరాటానికి దారితీస్తాయా, అని ప్రశ్నించగా "దారితీయవు" అని స్పష్టంచేసి, అందుకు కారణాలు యిలా వివరించారు.

కారణాలు రెండు: ఒకటి, ప్రజావాంఛ బలంగా, నిర్మాణంలో, ప్రజాసమీకరణలో ప్రదర్శించబడకుండా, దళ బలప్రయోగ చర్యలద్వారా అమలుచేయుట, ప్రజలను ప్రక్కదారులు పట్టించుటయే అగుతుంది. అసలు సమస్యలు మరుగున పడుతవి. రెండవది, ప్రజలే వారి విముక్తిదారులు. కమ్యూనిస్టులు నాయకత్వం వహించుతారు. అంటే అర్థం ప్రజలు స్వచ్ఛందంగా దళాలలో భాగస్వాములగుతారు. ముక్తిదాతలు ప్రజలుగాక మరెవ్వరోననే అపోహ కలుగునట్లు నక్సలైట్ల ఆచరణ వుంది. ఫలితంగా, ప్రజలు ఐక్యతా పునాది, నిర్మాణయుతంగా పోరాడుటకు బదులు ఆ పోరాటం మరెవ్వరో చేయచూస్తారు. ఆ విధంగా భూస్వాముల దోపిడి నుండి రక్షణకై ఎదురు చూస్తారు.[1]

ఈ అభిప్రాయాలు ప్రధానమైనవేగాక, తీవ్రమైనవి. అభిప్రాయ భేదాలపై "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." నాయకత్వంతో జరిపిన సంప్రదింపులలో "ఎ పి సి సి ఆర్"కు వైఫల్యమే ఎదురైంది. అంజేతనే, తనలాగా ఆలోచించే బెంగాల్, కేరళ తదితర రాష్ట్రాలవారితో కలసి విప్లవ కార్యక్రమంతో మరో విప్లవపార్టీ నిర్మాణం చేబట్టాలని నిర్ణయించినట్లు కనబడుతున్నది.

"మిస్టర్ నాగిరెడ్డి లేవనెత్తిన అంశాలను, ఆగస్టు 1967లో "అతివాద సాహసికవాదం లేక అతివాద అవకాశవాదం" అన్న తీర్మానాలలో పేర్కొన్నారు. వివాదాంశం మొత్తంగా నక్సల్బరీ రైతాంగ సాయుధ పోరాటాన్ని విముక్తి పోరాటంగా పరిగణించాలా లేదా, పాక్షిక పోరాటాలు, పార్లమెంటరీ పోరాటాలు జరిగే దశ లేకుండానే సాయుధ పోరాటాన్ని చేపట్టాలా అనేది ప్రధాన ప్రశ్న" అని కిసాన్

---

1 నారాయణమూర్తి (1969) నక్సల్బరీ అండ్ ఆఫ్టర్. వా. II పే. 27.

వర్కరు అన్నారు. అంతేగాక, "నాగిరెడ్డి అతని అనుచరులు, శ్రీకాకుళం కామ్రేడ్స్ ఆర్థికవాదం, సంస్కరణవాదం నుండి బయటపడి సాయుధ విముక్తి పోరాట పంథాను చేబట్టుటను నిరుత్సాహ పరచారు". అంతేగాక, "ప్రజాయుద్ధం అంటే, ప్రజల ఆర్థిక పోరాటాలకు రక్షణ కల్పించే పోరాటంగా చెప్పసాగారు" అని విమర్శించారు.

## పాలకొల్లు రాష్ట్ర సి.పి.ఐ. (యం) ప్లీనం సమావేశం:

ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు కమిటీ (మార్క్సిస్టు) ప్లీనం సమావేశం పాలకొల్లులో 13 జనవరి 1968న జరిగింది. సి. పి. ఐ. (యం) కేంద్ర కమిటీ మదురై మీటింగులో రూపొందించిన చిత్తు సిద్ధాంత పత్రాన్ని పాలకొల్లు ప్లీనరీ సమావేశంలో 158 మంది ప్రతినిధులు ప్రతికూలంగాను, 52 మంది అనుకూలంగాను, 8 మంది తటస్థంగాను వోటు చేయుటతో వీగిపోయింది.

2. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సి.పి.ఐ. (యం) ప్లీనం, అంతర్జాతీయ రాజకీయ అవగాహన, ముఖ్యంగా సి.పి.యస్.యు. మార్క్సిజం, సోషలిజానికి ద్రోహంచేసి, నూతన సంస్కరణవాదాన్ని ప్రవేశ పెట్టిందని, అంతర్జాతీయ కమ్యూనిస్టు, కార్మిక ఉద్యమాలను అదేమార్గం చేబట్టునటుల వొత్తిడి చేస్తున్నదని, సి. పి. ఐ. (యం) కేంద్ర కమిటి దీనిని శాస్త్రీయ మార్క్సిస్టు-లెనినిస్టు పంథాలో అవగాహన చేసుకొని, రాష్ట్రాలకు మార్గదర్శకత్వం వహించుటలో విఫలమైందని, తీవ్రంగా విమర్శించింది.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం శాంతి, శాంతియుత సహజీవనం, శాంతియుత ఆర్థికపోటీ, శాంతియుత సమాజ పరివర్తన సిద్ధాంతాలను చేపట్టుట, అమెరికాతో "రాజీపొత్తు" విధానాలకు దారితీసింది. సమాజం సోషలిజం లోనికి శాంతియుత పరివర్తన యుగమని విశ్లేషణచేసి సహకారాన్ని నెరపుటతో అమెరికా సామ్రాజ్యవాదం ప్రపంచ ఆధిపత్యాన్ని సంపాదించుటకు తోడ్పడిందని ప్లీనం విశ్వాసం. నూతన యుగ నిర్వచనము ఆచరణలో అమెరికా సామ్రాజ్యవాదానికి పట్టం కట్టుటకు వొక ముసుగుగా తోడ్పడింది. కేంద్ర సమితి ముసాయిదా సి. పి. యస్. యు. నాయకత్వాన్ని తీవ్రంగా విమర్శించి త్రోసిబుచ్చక, నూతన యుగ నిర్వచనానికి బలాన్ని చేకూర్చే మార్గాలను వెతికింది. రాష్ట్ర ప్లీనం సి.పి. ముసాయిదాను త్రోసిబుచ్చుతూ, సామ్రాజ్య వాదానికి భరతవాక్య యుగమని, సోషలిజం ప్రపంచ వ్యాప్తంగా విజయం పొందే యుగమని, ప్లీనం అతిశయోక్తిగా అంచనా వేయుట కూడ తప్పని యిప్పుడు మూడు దశాబ్దాల తరువాత అందరికి విశదమైంది. అయితే, వలస దేశాల విముక్తి వుద్యమాలన్నిటిని బలపరచుట ప్రపంచ కార్మికోద్యమ కర్తవ్యమని సరిగానే స్పష్టం చేసింది.

సామ్రాజ్యవాదాల సమూల నాశనంలో జాతీయ విముక్తి వుద్యమాలు మౌలిక, నిర్ణయాత్మక పాత్ర వహించుతున్నవని గుర్తించుటలో కేంద్ర కమిటి ముసాయిదా విఫలమైందని చైనా కమ్యూనిస్టుపార్టీ సాధారణ విమర్శను విప్లవ

కారులు పునరుద్ఘాటించారు.

2. ఈ యుగపు మౌలిక ప్రధాన వైరుధ్యం సామ్రాజ్యవాదానికి సోషలిజానికి మధ్యయని సోవియట్ కమ్యూనిస్టు నాయకత్వం, సామ్రాజ్యవాదం అణచబడుతున్న జాతుల మధ్యగల ప్రధాన వైరుధ్యానికి, అదే పెరుగుతున్న వైరుధ్యం అయినా దానికి ముసుగు వేయ ప్రయత్నిస్తున్నవి. ప్రపంచ విప్లవ విజయానికి నిర్ణయాత్మక పాత్ర వహించే జాతీయ విముక్తి విప్లవోద్యమాలను గుర్తించుటలో ముసాయిదా సిద్ధాంత పత్రం విఫలమైందని ప్లీనం విశ్వాసం. అంతేకాక సి. పి. యస్. యు. నాయకత్వపు తప్పుడు సిద్ధాంతానికి, దానిలో వైరుధ్యాంశాలను మార్క్సిజం-లెనినిజంలను అశాస్త్రీయంగా అవగాహన చేసుకొనుటవలన యేర్పడినదని, కారణాలు చెప్పుతూ సమర్థించ ప్రయత్నించింది.

3. ప్రపంచంలో అత్యంత బలీయం, నగ్న దోపిడీ అమెరికన్ సామ్రాజ్యవాదంతో వొప్పందానికి వచ్చే ప్రయత్నాలు చేస్తూ ప్రపంచ సోషలిస్టు వ్యవస్థను, సోవియట్ సోషలిస్టు వ్యవస్థతోపాటు భగ్నం, నాశనం చేసింది. అణగారిన వలస ప్రజాసామాన్యపు విప్లవ పోరాటాలకు ద్రోహం చేసింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ ఐక్యతను, ప్రపంచ శాంతిని కాపాడే వొకే వొక ఆయుధాన్ని నాశనం చేసింది.

4. శాంతియుత సహజీవనాన్ని సంస్కరణవాద నాయకత్వం దోపిడి వర్గాలతో సహజీవనంగా, అణచబడేవారు, అణచే వారి మధ్యసహజీవనంగా, పెట్టుబడిదారి వర్గం కార్మికుల మధ్య సహజీవంగా, వర్గ శత్రువులతో సర్వతోముఖ శాంతి, సహజీవనం, సహకారం పొత్తు విధాన రూపంగా మార్చింది. సి.పి.ఐ.(యం) సి.సి. ముసాయిదా "లెనినిస్టు విదేశాంగ విధానంలో శాంతియుత సహజీవనం తప్పనిసరి భాగమై, ప్రతి సోషలిస్టు దేశపు కర్తవ్యమైందని" విప్లవకారులు తీవ్రంగా విమర్శించారు. ఇది విద్రోహం తప్ప మరొకటి కాదన్నారు.

5. పెట్టుబడిదారేతర పంథాను బలపరచుట అనే పేరుతో సోషలిస్టు దేశాలు ప్రధానంగా సోవియట్ యూనియన్ నూతనంగా స్వాతంత్ర్యం పొందిన వెనుకబడిన దేశాలకు ఆర్థిక సహాయాన్ని చేయుట ఆయా దేశాలలో పెట్టుబడిదారి విధానాన్ని బలపరచుటగా రాష్ట్ర ప్లీనం తీవ్రంగా విమర్శించింది.

అమెరికా సామ్రాజ్యవాదం జాతీయ విముక్తి పోరాట వుద్యమాలను కుట్రలు, కుతంత్రాలతో, అభివృద్ధి నిరోధకుల ప్రతీఘాతక సాయుధ విప్లవ పోరాటాలతో రక్తపు చేరులలో ముంచ ప్రయత్నించుతుంది. విముక్తి విప్లవ పోరాటాలు చైనా విప్లవానుభవాలతో ప్రజాయుద్ధ పంథాను అనుసరించుతున్నవని రాష్ట్ర ప్లీనం విశ్లేషణ చేసింది.

జాతీయ రాజకీయ పరిస్థితిని పాలకొల్లు ప్లీనం యిలా వివరించింది.

రాష్ట్రపతి ఆమోదం పొందవలసి వుంది. రాష్ట్రపతి కాంగ్రెసుచే నియమించబడిన వాడు. బూర్జువా, భూస్వామ్య రాజ్యాంగ్యం కాంగ్రెసు కేంద్ర మంత్రిమండలిచే అమలుచేయబడుతున్నది. ఇట్టి పరిస్థితులలో కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలు ఎట్టి వాస్తవాధికారాలు లేకుండా కాంగ్రెసు నియమించిన గవర్నరుల ఆధ్వర్యంలో కాంగ్రెసు గుత్తపరిపాలనాధికారాలను ఏ విధంగా బద్దలుకొట్టగలదో అంతుపట్టకుండా వుంది.

"నూతన పరిస్థితి పార్టీ కర్తవ్యాలు" అన్న సి.పి.ఐ. (యం) మౌలికపత్రం "కేంద్రంలోని పాలకపార్టీ గుత్తాధికారాలను కలిగి బలమైనదిగా వున్నపుడు, కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలను, ప్రతిపక్ష పార్టీలను నేరుగా ఎదుర్కొనగలిగినబలాన్ని ఎనిమిది రాష్ట్రాలలో కలిగియుండుట వాస్తవం కాదు. రెండు పక్షాలు నేరుగా తల పడకుండా, ప్రతి తమ కదలికను, అడుగులను జాగ్రత్తగా, తమతమ ప్రభుత్వ విధానాలను రూపొందించుకుంటున్నవి"[1] అని పేర్కొన్నది. ఇట్టి పరిస్థితులలో సి.పి.ఐ. (యం) కాంగ్రెసేతర ప్రభుత్వాలను దేశంలో "ద్వంద ప్రభుత్వ స్థాయికి లేవనెత్తుట"ను విప్లవకారులు తీవ్ర విమర్శకు గురిచేసారు.

"మనం రాష్ట్రాలలోని కాంగ్రెసేతర ప్రభుత్వాలు, మద్రాసులోని డి.ఎం.కె, ఒరిస్సాలోని స్వతంత్ర పార్టీ, యు.పి.లోని జనసంఘం,హర్యానాలోని భూస్వాముల, కేరళ, బెంగాలులలోని ఐక్య సంఘటన ప్రభుత్వాలు కీలకపాత్ర వహించుటకు తగిన బలాన్ని పెంపొందించుకొంటూ, కేంద్ర అధికారాన్ని నేరుగా ఎదుర్కొనగలవని నమ్మవలసి వుంది."1 అంటే నమ్మజాలమని విప్లవకారుల పాలకొల్లు ప్లీనం విమర్శనగా వుంది,

**4.** కేరళ, పశ్చిమబెంగాల్ రాష్ట్ర ఐక్య సంఘటనల పాత్ర ఎట్టిది అన్న విషయంలో ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారుల పాలకొల్లు ప్లీనరీ సమావేశపు తీర్మానం కొన్ని నిర్దిష్ట ఆ అభిప్రాయాలను వెల్లడి చేసింది.

"కాంగ్రెసు వ్యతిరేక ప్రభుత్వాలలో చేరుట, ఐక్య సంఘటన ప్రభుత్వాలను కమ్యూనిస్టుల నాయకత్వంలో ఏర్పాటు చేయుట, వాటిలో నిర్వహించిన పాత్రలను పరిశీలించి, ముఖ్యంగా అభివృద్ధి నిరోధక శక్తులున్న ప్రభుత్వాలలో చేరుట, నిర్వహించిన పాత్ర పునర్విచారించవలసి వుందని పాలకొల్లు ప్లీనం అభిప్రాయం. అంతేగాక రాజ్యాంగ నిర్మాణంలో మౌలికమైన మార్పులు యీ ప్రభుత్వాలలో చేరి తీసుకొని రాగలమనే భ్రమలు లేవని ప్లీనం స్పష్టం చేసింది. సాధ్యమైనంత వరకు తక్షణ సమస్యలకు సహాయ, సహకారాలను అందించుటయే మంత్రివర్గాలలో వుండి చేయగలిగిన పని, ఆ విధంగా ఈ పాలకవర్గ పాలనను అంతం చేయుటకు రాజీలేని

---

1. ఆంధ్ర కమ్యూనిస్టుల పాలకొల్లు ప్లీనరీ సమావేశం, జనవరి 1968లో ఆమోదించిన తీర్మానం (ఆంగ్లంలో) పే. 65.

పోరాటాన్ని సాగించాలన్నది.

ఈ రెండు ప్రభుత్వాలు అఖిలభారత స్థాయిలో బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వాలపై ప్రత్యామ్నాయ కార్యక్రమ ప్రాతిపదికపై ప్రజోద్యమాన్ని రూపొందించే ఆయుధంగా వుపయోగపడిందా, బూర్జువా భూస్వామ్య ప్రభుత్వాన్ని అంతం చేయుటకు ఎలా తోడ్పడిందని ప్లీనం ప్రశ్నించింది. ఇటీవతి విజయాలు, అనుభవాలు, కార్యాచరణ కార్యక్రమము అఖిల భారత పరిస్థితిలో ఎలాంటి మార్పులు తీసుకొనిరాజాలకపోయినవి. ప్రత్యామ్నాయ కార్యక్రమాన్ని రూపొందించి బలమైన ప్రజోద్యమాన్ని నిర్మించజాలకపోయింది. కేరళలో 1957 లో నిర్మించినంతటి ప్రతిఘటనోద్యమాన్ని కూడా నిర్మించజాలకపోయింది.

"కాంగ్రెసేతర ప్రభుత్వాలున్న రాష్ట్రాలలో సైతం అసెంబ్లీలలో బయట ప్రత్యామ్నాయ కార్యక్రమ ప్రాతిపదికపై ఐక్య కార్యాచరణను రూపొందించజాలకపోయింది. ఇంతవరకు యే మౌలిక సమస్యపైనా ప్రజోద్యమాన్ని నిర్మించుటలో విఫలమైంది. ఆహార సమస్యపై ఆందోళనకు మించి మరేమీ చేయజాలకపోయిందని" ప్లీనం తెలిపింది.

కేంద్ర ప్రభుత్వం అనుసరించే ఆహార విధానంపై గూడ ప్రజా సమీకరణతో ప్రజోద్యమాలను రూపొందించే బదులు విజ్ఞప్తులు, విన్నపాలతో దొంగ నిల్వలు, దొంగ వ్యాపారంకు వ్యతిరేకంగా ప్రజోద్యమాలను రూపొందించుటలో విఫలులయ్యారు. ఇందిరాగాంధి గేటు వద్ద నిరాహారదీక్షలు చేస్తూ, ఉద్యమాలను నీరుగార్చారు.

"పశ్చిమ బెంగాలులో మాత్రం మన పార్టీ ఇతర ఉద్యమకారులకు భిన్నంగా రైతాంగం కోరే భూముల పంపకం సమస్యతోపాటు కార్మికుల కోర్కెలకై "ఘెరావో" గృహ లేక ఆఫీసు నిర్బంధ ఉద్యమాలను సాగించింది. కలకత్తాలో ట్రాంవే కంపెనీలో కార్మికులు, కేరళలో వేతన సమస్యలపై కార్మికులు, యాజమాన్యాన్ని "ఘెరావో" చేసే ఆందోళనలు చేసారు. కాని పార్టీకి ఈ పోరాటాలలో వాక నిర్దిష్ట దృక్పథం లేకపోవుటతో తదనంతర కాలంలో సంస్కరణవాదం పెరిగిపోయింది. ఫలితంగా అనేక విజయాలు అంతమయ్యాయి, చొరవను కోల్పోయి పోరాట వాడి, రాసిని కోల్పోయాయి.

"అజయ్‌ముఖర్జీ ముఖ్యమంత్రి కుట్రలు పన్ని, చైనా దండయాత్రకు స్వాగతం చెప్పామని నిందవేసి, మాపై నిర్బంధ విధానాన్ని, దాడిని సాగించుటతో మంత్రివర్గంలో కొనసాగాలా, లేదా అనే ప్రశ్న ఉదయించింది. మాపై దాడికి అన్నీ సిద్ధం చేసుకొన్నా సాహసించలేకపోయారు.

"సంక్షోభం నేడు తీవ్రమైంది. ప్రజల బాధాకర జీవితం దుర్భరమైంది, విస్తృతికూడ చెందింది. ప్రజాశక్తులు ఉద్యమం, కార్మికవర్గపార్టీ అన్నీ అనుకూల

పరిస్థితులలో వున్నవి. రాష్ట్ర అసెంబ్లీలు, కేంద్ర పార్లమెంటు రెండింటిలోను యినుమడించిన బలంతో ప్రజాప్రతినిధులున్నారు.

"మేము పార్టి మంత్రివర్గాలలో కొనసాగాలా లేదా, పార్టీ యేవిధంగా ప్రజోద్యమాలను నిర్మించాలనేదానిని పునరాలోచించాలని కోరుతున్నామని ప్లీనం తీర్మానించింది.[1]

5. ఆంధ్ర కమ్యూనిస్టుల పాలకొల్లు ప్లీనం సమావేశం, విప్లవ పంథాను తీర్మానంలో యిలా వివరించింది.

"ఇంతవరకు మనకు ప్రజాయుద్ధపంథా దృక్పథంలేదు. సి. పి. అధికార పత్రాలలో వివరించిన దృక్పథం సుదీర్ఘ చట్టబద్ధ, రహస్య కార్యాచరణల ప్రజా ఆందోళనతో మిశితమైన పార్లమెంటరీ కార్యాచరణ, పరిమిత ప్రజా పోరాటాలు, పారిశ్రామిక కేంద్రాలలో నిరవధికంగా తిరుగుబాటుకు వేచియుండుట, సామాజిక, ఆర్థిక దేశవిముక్తి ఆశించుట జరుగుతున్నది. మొదటిది ప్రజాసామాన్యంలో బలం సంపాదించాలనేదానిని అనేకసారులు పునరుద్ఘాటించుట, సాయుధ పోరాటానికి సంబంధం లేకుండా ప్రజాసంఘాలు, పార్టీ నిర్మాణం చేయాలనుట యిదే అభిప్రాయాన్ని బలపరుస్తుంది.[2]

"మన కేంద్ర కమిటి కేరళ, పశ్చిమబెంగాలులోని ఐక్య సంఘటన ప్రభుత్వాలు భారత ప్రజానీకపు ఆర్థిక సామాజిక విముక్తికి వ్యూహాత్మక ఆయుధాలుగా, సృజనాత్మకంగా రూపొందించి మనకు అర్పణ చేసింది.

"అటువంటి ప్రభుత్వాలలో మన పార్టీ భాగస్వామి అగుట, అత్యధికంగా ప్రజలను సమీకరించుటకు, మిత్రులను సంపాదించుటకు జనతా ప్రజాస్వామ్యం, తదనంతరం సోషలిజంవైపుకు పురోగమించుటకు జరిగే పోరాటంలో కార్మికవర్గానికి మిత్రవర్గాలను అత్యధికంగా సంపాదించుటకని చెప్పవలసి వుంటుంది.

సి.పి.ఐ (యం)ను నక్సల్బరీ విప్లవకారులు, చైనా తీవ్రంగా విమర్శించిన కారణంగా "కేంద్రకమిటి 1951 ఎత్తుగడల పంథాను పునరుద్ఘాటించుతు, నాటి సాయుధ పోరాట విధానానికి కట్టుబడి వున్నామని" చెప్పసాగింది. ఆ విధంగా 15 సంవత్సరాలు ఆ పంథాను పట్టుకొని బిగదీసుకొని కూర్చొని యేస్థాయిలోనూ ఆ సమస్యలపై చర్చలు జరుపకుండా చేసిన సి.సి. యిప్పటి ప్రకటనలు మమ్ము ఆశ్చర్యచకితులను చేస్తున్నవనుట వింతగా వుంది.

అంతేగాక ప్లీనం "వెనుకబడిన అన్ని దేశాలలో అత్యధిక ప్రజాసామాన్యాన్ని ప్రజాసంఘాలలో సమీకరించుట, పార్టీ నిర్మాణం, సాయుధ పోరాటంతో జోడించ

---

1. ఆంధ్ర కమ్యూనిస్టుల పాలకొల్లు, జనవరి 1968 ప్లీనం ఆమోదించిన తీర్మానం (ఆంగ్లంలో) పే. 56–58.

2. ——అదే—— పే. 59-60.

బడిందని మేము స్పష్టం చేయదలచాము" అని వివరించింది.

ఇంకా "మౌలిక వ్యవసాయవర్గాల ప్రజోద్యమాల సుదీర్ఘ సాయుధపోరాటం, కేంద్ర ప్రభుత్వంలో మౌలికమార్పులు తెచ్చుటకుగాక, పార్లమెంటరీ పోరాటాలు ముఖ్యంగా కాంగ్రెసేతర ప్రభుత్వం ఫలప్రదమైన కార్యాచరణ, కేంద్రంలో కాంగ్రెసేతర ప్రజాస్వామ్య ప్రభుత్వానికి దారితీస్తాయని తెల్పుతున్నది.

"పార్టీ మొత్తం కార్యక్రమంలో కేరళ, పశ్చిమబెంగాల్‌లలోని ఐక్యసంఘటన, రాష్ట్రప్రభుత్వాల ఫలప్రదమైన కొనసాగింపు, కేంద్రస్థానాన్ని ఆక్రమించింది. కేంద్ర కమిటీ తీర్మానం ఆ రెండింటిని పోరాట సాధనాలుగ ప్రజల చేతులలోని ఆయుధాలుగ వర్ణించింది. అంతేగాక ఇటీవల నంబూద్రిపాద్ "అవి భవిష్యత్తులో విప్లవ సాధనాలుగ" పత్రికా విలేఖరులతో పేర్కొన్నారు.

ప్లీనం "అసెంబ్లీ, పార్లమెంటులలో ప్రజాస్వామ్య పార్టీలు, కాంగ్రెసేతర ప్రజాస్వామ్య పార్టీలు పోరాటాలలోనే ప్రజాస్వామ్యశక్తుల ఐక్యత విస్తృతిచెంది, కేంద్రంలో కాంగ్రెసేతర పక్షాల ఐక్యసంఘటనా ప్రభుత్వ మార్గాన్ని సుగమం చేస్తుందని[1] వివరించింది.

6. ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులు పాలకొల్లు ప్లీనంలో ఐక్యసంఘటన అపై వెలిబుచ్చిన అవగాహనలు, వైఖరులు యిలా ఉన్నవి.

ప్లీనం సి.పి.ఐ. బొంబాయి కార్యక్రమం, ఎన్నికల విధానం, తదనంతర ఆచరణ కార్యకలాపాలపై వ్యాఖ్యానించుతూ "ఆచరణ కార్యక్రమాన్ని మార్చు కొన్నారని" అందుకు మద్దతుగా కొన్ని అంశాలను ఉపహరించింది. ప్రభుత్వాన్ని బడా వ్యాపార, భూస్వామి వర్గాల నాయకత్వంలో వుందని విశ్లేషణచేసి, అమెరికా వొత్తిడులకు లోనగుటతో స్వాతంత్ర్యానికి ప్రమాదం తెస్తున్నదని, కాంగ్రెసేతర ప్రభుత్వాలు జాతీయ ప్రజాస్వామ్య పోరాట సాధనాలని అంటూ సి.పి.ఐ(యం) తన విధానాలను మార్చుకొన్నదని విమర్శించింది.

"ఈ అంశాలన్నిటిపై, నక్సల్బరీ, వియత్నాం సమస్యలపై ఐక్యకార్యాచరణ, మన పంథాకు దగ్గరగానే సంస్కరణవాదుల (సి.పి.ఐ.) పంథా వున్నది. కేరళ, పశ్చిమబెంగాల్ ప్రభుత్వాలలో యిద్దరమూ కలిసే పనిచేస్తున్నాము. ఈ విధంగా మనకూ సంస్కరణవాదులకు మధ్యగల లక్ష్మణరేఖ కనుపించనిదైనది[2]"అయింది.

ఇంకా "మన ఐక్యసంఘటనా ఎత్తుగడలు సంస్కరణవాదులు ప్రజలలో తిరిగి బలబడుటకు ఉపయోగపడుతున్నవి. వారిపై సిద్ధాంత వ్యతిరేక పోరాటంలో, ఐక్య

---

1. నూతన పరిస్థితి పార్టీ కర్తవ్యాలు (1968) సి. పి. ఐ. (యం) సి. సి. తీర్మానం. పాలకొల్లు తీర్మానంలోని వుదహరింపు (ఆంగ్లంలో) పే. 79.

2. ఆంధ్ర కమ్యూనిస్టుల పాలకొల్లు ప్లీనం, జనవరి 1968 తీర్మానము (ఆంగ్లంలో) పే. 65-66.

కార్యాచరణలు, ప్రచారోద్యమాలు, వర్గసంఘాలలో, విచక్షణతో ఎన్నిక చేసిన సమస్యల యెడల జాగ్రత్త వహించాలి· మంత్రివర్గాలలో సంస్కరణ వాదులు [సి.పి.ఐ]తో కలిసి వుండుటతో, వారిని బూర్జువా ఏజంట్లుగా ప్రజలనుండి వేరు చేయుట కష్టము. కార్మికవర్గాన్ని వారినుండి వేరుచేయుటకై చేయు పోరాటము బలహీనపడుతుందని" ప్లీనం సి.పి.ఐ.(యం) విధానాన్ని విమర్శించింది.

"నూతన పరిస్థితి పార్టీ కర్తవ్యాలు" అన్న సి.పి.ఐ (యం) తీర్మానంలో "ప్రజా సమస్యలన్నిటిలో సి.పి.ఐ·తో ఐక్యకార్యాచరణకు ఆమోదించుతు" అదే కాలంలో "అన్ని ప్రజాసంఘాలలో, కాంగ్రెసేతర ప్రజాస్వామ్య రాష్ట్రప్రభుత్వాలలో, ఆసెంబ్లీ, పార్లమెంటులలో రాజీలేని సంస్కరణవాద వ్యతిరేక పోరాటాన్ని సాగించుట తమ విధానంగా స్పష్టం చేసింది. వాస్తవంగా చెప్పాలంటే యిది కాగితాలపై సంస్కరణవాద వ్యతిరేక పోరాటం, ఆచరణలో ఐక్యకార్యాచరణ, ఐక్య సంఘటన ప్రభుత్వంలో భాగస్వామ్యం తప్ప మరొకటిగాదు. ఈ విధానం సంస్కరణవాదాన్నే (సి.పి.ఐ.) బలపరుస్తుందని, ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారుల విమర్శనగా వుంది.

"భారత విప్లవంపై మనం, సంస్కరణవాదులు ఆమోదించిన మౌలికసమస్య లేదని" చిత్తు సి. సి. తీర్మానం చెప్పుట సరియైనది, వాస్తవం కాదని పాలకొల్లు ఆంధ్ర కమ్యూనిస్టు ప్లీనం స్పష్టం చేసింది, అంతేగాక, యీ అవగాహనలతో మనం సి.పి.ఐ.(యం) వారికి (సి.పి.ఐ.) చేరువగుతున్నామన్నది.

"సంస్కరణవాదంపై పోరాడునపుడు సంస్కరణవాద పొరపాట్లు నుండి జాగ్రత్తపడాలి. కాని సి. సి. ముసాయిదా అది తక్షణ ప్రమాదంగా చెప్పుతున్నది. విభేదించేవారిని అనుమానాస్పదులుగ చూస్తున్నది. ప్రతి చిన్న దానికి వారిపై దాడి, క్రమశిక్షణా చర్యల దండంతో దడిపించుతున్నది.

"పార్టీ యేర్పడినపుడు పూర్తి సైద్ధాంతిక, రాజకీయ ఐక్యత లేదనే నగ్న సత్యాన్ని గుర్తించాలి. అప్పటి నుండి తీవ్ర అభిప్రాయ భేదాలు వెలిబుచ్చబడుతూనే వున్నవి. అవి నేడు తీవ్రరూపం మాత్రమే ధరించాయి. కేంద్ర కమిటిని నిష్పక్షపాతంగా, వోర్పుతో కార్యక్రమం, ఎత్తుగడలు, తక్షణ రాజకీయ విధానాలపై, మౌలిక సమస్యలపై పార్టీలో అంతర్గత చర్చలను చేబట్టాలి. ఇది వొక్కటే పార్టీలో సైద్ధాంతిక, రాజకీయ ఐక్యత పెంపొందిస్తుంది, పురోగమన మార్గాన్ని చూపెడుతుంది. దీనికి విరుద్ధంగా, పార్టీలో శిలాసదృశ్య సైద్ధాంతిక, రాజకీయ పునాది ఐక్యత వున్నదని తలచుట పొరపాటు. సి. సి. అంతర్గత చర్చల ప్రయత్నం చేయక, క్రమశిక్షణా చర్యలకు ప్రాధాన్యత నిస్తున్నద"ని ప్లీనం అవగాహనగా వుంది.

జాతీయంగా, అంతర్జాతీయంగా సోషలిజం, సంస్కరణవాదం, సోషలిస్టు వవ్యస్థ, వలస విముక్తి వుద్యమాలు, ప్రజాయుద్ధ పంథాలు తీవ్రంగా చర్చించబడు

తున్న ప్రధాన మౌలిక సమస్యలు, మరికొంతకాలం చర్చించబడే సమస్యలు. ఈ పరిస్థితులలో "సి. సి. (సి.పి.ఐ.యం.) వీటిని పార్టీ నిర్మాణ పద్ధతులలో పరిష్కరించ చూచుట, పార్టీ శ్రేణులలో అసంతృప్తిని ప్రజ్వలింపజేసి, విచ్ఛిన్నతకు దారి తీస్తుంది. ఇట్టి పద్ధతులు అవలంబించుటతో యు. పి., నక్సల్బరీలలో పార్టీ విచ్ఛిన్నమగుట విప్లవకారులందరకు తెలుసు, వొక సంస్కరణ వాదులకు మాత్రమే సంతోషాన్నిస్తాయి.

"కలకత్తా పార్టీ కాంగ్రెసు సి.పి.ఐ.(యం) కేంద్ర కమిటీని అంతర్జాతీయ సైద్ధాంతికసమస్యలపై నిష్పక్షపాతంగా చర్చలుచేపట్టాలని కోరింది. ఆ నిర్ణయాలను పార్టీ త్రోసిబుచ్చి, తన స్వంత నిర్ణయాలనుచేసి, ముసాయిదాను చర్చలకు పార్టీ సభ్యులకు అందజేసి, వారు చర్చించి, సలహాలను, మార్పులను, చేర్పులను, తుది రూపానికి వినియోగించి, అధికార ముసాయిదాగా వార్తా పత్రికలకు అందజేయుటకు బదులు, పార్టీ సభ్యులకు పంపిన వెంటనే వార్తా పత్రికలకు విడుదల చేయుట పొరపాటు. అంతేగాక మన రాష్ట్ర కమిటి, అత్యధిక మెజారిటీ వోటుతో ప్రత్యామ్నాయ రాజకీయ విధాన పత్రాన్ని, కేంద్ర కమిటీకి పార్టీ సభ్యులందరికి చర్చల నిమిత్తం అందచేయాలని కోరినా, దానిని సి. సి. మన్నించలేదు. కేంద్ర కమిటిలో చాలినంత బలం ప్రత్యామ్నాయ వాదులకు లేదని ప్రతిపాదనను త్రోసివేసింది. "విస్తృత ప్రాతిపదికపై నిష్పక్షపాతంగా జరిగే చర్చలు పార్టీ కాంగ్రెసు తుది నిర్ణయాలు మాత్రమే, సైద్ధాంతిక, రాజకీయ, నిర్మాణరీత్యా పార్టీని పూర్తిగా ఐక్యపరచగలవు.

ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారులు జనవరి 1968లో జరిగిన రాష్ట్ర ప్లీనంలో తమ సైద్ధాంతిక రాజకీయ విధానాలను నిర్ణయించుకొని, తదనుగుణంగా నిర్మాణ చర్యలు చేపట్టారు. మార్చి 1968 నాటికి రహస్య నిర్మాణంలో సమీకృతులయ్యారు. కిందిస్థాయి వరకు అటువంటి నిర్మాణ చర్యలు తీసుకొన్నారు. ఈ కమిటీలు నయా సంస్కరణ వాదానికి వ్యతిరేకంగా పోరాటం నిర్వహించే కర్తవ్యాన్ని విప్లవ రాజకీయాలలో సమీకృతమైన శక్తులను నిర్మాణంచేసే కర్తవ్యాన్ని చేబట్టారు. విప్లవ పంథా దృక్పథంలో ప్రజా వుద్యమాలకు మార్గదర్శకత్వం వహించసాగారు.

భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీలో అంతర్గత సైద్ధాంతిక రాజకీయ పోరాటం సాగినప్పుడు చైనా కమ్యూనిష్టుపార్టీ అధికార మెజారిటి పార్టీకి వ్యతిరేకంగా, మైనారిటి వర్గాలను బలపరుస్తూ రచనలు ప్రకటించుతున్నది. గతంలో సి.పి.ఐ.లో మితవాద సంస్కరణవాద వ్యతిరేకంగా,అంతర్గత సైద్ధాంతిక పోరాటం జరిగినపుడు, "సంస్కరణ వాదానికి ప్రతిబింబం", "నెహ్రూ తాత్విక చింతన", "నెహ్రూ తాత్విక చింతనపై మరికొంత వివరణ" అను రచనలు వెలువరించారు.

"నూతన పరిస్థితి పార్టీ కర్తవ్యాలు" అన్న సి.పి.ఐ.(యం) అధికార విధాన పత్రం వెలువడిన నాటినుండి చైనా కమ్యూనిస్టుపార్టీ సి.పి.ఐ.(యం)ను నయా రివిజనిస్టు అని విమర్శించసాగింది. దేశంలో జరుగుతున్న నక్సల్బరీ, శ్రీకాకుళం సాయుధ రైతాంగ భూ పోరాటాలను బలపరచింది. ఇది విప్లవకారులకు ఎంతో ప్రోత్సాహాన్నిచ్చింది. సి.పి.ఐ.(యం)పై వారు జరిపే సైద్ధాంతిక, రాజకీయ పోరాటానికి బలాన్ని చేకూర్చింది, సి.పి.సి. హ్రస్వ దృష్టికి తార్కాణంగా నిలచింది.

ఈ స్ఫూర్తితోనే సి.పి.ఐ.(యం)ను "వర్గసామరస్య, పార్లమెంటరీ పంథాను ప్రబోధించిన సంస్కరణ వాదులకన్నా, నయాసంస్కరణవాద నాయకత్వం హెచ్చు మోసపూరితమైనదని,తానేరుజువుచేసుకొన్నదని"విప్లవకారులుతీవ్రంగావిమర్శించారు. ఇంకా "సి.పి.ఐ.(యం) తన నాయకత్వాన్ని శాశ్వతం చేసుకొనుటకు కుయుక్తులు, మోసపూరిత తప్పుడు పద్ధతులకు తలపడిందని, అది పూర్తిగా సరిదిద్దవీలు లేనిదిగా రుజువయిందని, అందువలన దానిని పూర్తిగా తిరస్కరించవలసి వచ్చిందని" తీవ్రంగా విమర్శించింది.

"అందువలన సి.పి.ఐ (యం)నుండి కమ్యూనిస్టు విప్లవకారులు విడిపోవటం, మార్క్సిస్టు-లెనినిస్టు విప్లవ సూత్రాలను సమర్థవంతంగా నిలుపుటకు భారత కమ్యూనిస్టు ఉద్యమంయొక్క విప్లవ సాంప్రదాయాలను కొనసాగించటానికి నేటి విప్లవ ఆశయాన్ని ముందుకు తీసుకొనిపోవుటకు పూర్తిగా అనివార్యం, సరయినదీ" అని విప్లవకారులు తీవ్రంగా విమర్శించి చీలిపోవుటను సమర్థించుకొన్నారు.

## సి.పి.ఐ.(యం) అఖిల భారత ప్లీనరీ బర్ద్వాన్ సమావేశం :

ఎన్నికల పోరాటం అనంతరం సి.పి.ఐ.(యం) రాజకీయ పరిస్థితిని మదింపు వేయుటలో తీవ్రంగా నిమగ్నమైంది. దానిపై ఆధారపడి, తదనంతర కర్తవ్యాలను రూపొందించింది. ఈ కర్తవ్యాన్నే నిర్వహించుటకు ఏప్రిల్ 1967లో జరిగిన కేంద్ర సమితి ప్రధానంగా యీ పనినే నిర్వహించింది. పార్టీ పురోగమన పంథాని నిర్దేశించింది. పార్టీ సభ్యులందరిముందు విప్లవోద్యమ ముందు వుంచింది. సరిగా యిదే కాలంలో సి.పి.ఐ.(యం) లోని కమ్యూనిస్టు విప్లవకారులు అతివాద సాహసిక వాదాన్ని చేబట్టి, పార్టీపై దాడిని ప్రారంభించారు. పశ్చిమబెంగాల్‌లో నక్సలైట్లుపార్టీ కార్యక్రమాన్ని, రాజకీయపంథాని తీవ్రవిమర్శనా దాడికి గురిచేశారు. చైనా కమ్యూనిస్టు పత్రికలు, రేడియో వారికి పూర్తిమద్దతు నిచ్చాయి. సి.పి.ఐ.(యం)ను ప్రధాన రాజకీయ కర్తవ్యంనుండి పక్కదారులు పట్టించుటకు కమ్యూనిస్టు విప్లవ కారులు తీవ్ర ప్రయత్నాలు చేసారు.

ఏప్రిల్ 1969లో బర్ద్వాన్‌లో జరిగిన సి.పి.ఐ.(యం) కేంద్ర కమిటి సమావేశం కమ్యూనిస్టు విప్లవకారుల, నక్సలైట్ల తాత్వికసిద్ధాంత, రాజకీయ వైఖరిని, అతివాద పెడమార్గాన్ని వివరంగా పరిశీలించింది. పార్టీ పొలిట్‌బ్యూరో సైద్ధాంతిక

చర్చను సమీక్షించి, నిర్ధారణలను ఆంధ్ర కమ్యూనిస్టులకు లేఖ పూర్వకంగా వివరించింది. మరో పత్రంలో కేంద్ర కమిటి "ఆంధ్రలో ప్రత్యేకంగా అతివాద చీలిక వాదులు" అనే పత్రాన్ని విడుదల చేసింది. అందులో అతివాదం పుట్టుక, నైజము, లక్షణాలు వివరించింది. అతివాద అవకాశవాదంవలన ప్రమాదం తొలగిపోలేదని, పార్టీ విప్లవోద్యమం, దానిపై పోరాటం కొనసాగాలని స్పష్టంచేసింది. ముఖ్యాంశాలు యిలా వున్నవి.

1. సి.పి.ఐ.(యం)లో అతివాద అవకాశవాదం మే-జూన్ 1967 లలో బహిర్గతమైంది. ప్రథమంలో పార్టీ కార్యక్రమం, రాజకీయపంథాతో మౌలికంగా ఆమోదించుతున్నామని, కార్యక్రమంలోని కొన్ని అంశాలను, పార్టీ ఎత్తుగడల పంథాలోని కొన్ని ప్రత్యేకాంశాలలో అభిప్రాయ భేదాలున్నవని చెబుతూ వచ్చింది. మొదట పశ్చిమబెంగాలులో బహిర్గతమై తరువాత దేశంలోని వివిధ ప్రాంతాలకు వ్యాపించింది. ఏప్రిల్ 1967లో జరిగిన కేంద్ర కమిటి సమావేశంలో 7వ పార్టీ కాంగ్రెసు తదనంతరం 30 మాసాల పార్టీ కార్యాచరణను సమీక్షించి, దాని ప్రాతిపదికగా నూతన రాజకీయ పరిస్థితిని అంచనావేసి, కర్తవ్యాలను నిర్ధారించినపుడు కేంద్ర కమిటీలోగాని, రాష్ట్ర కమిటీలోగాని ఎట్టి భిన్నాభిప్రాయాలు ఏ రాష్ట్ర ప్రతినిధులు వెలిబుచ్చలేదు. పైగా ఏప్రిల్ 1967 నివేదిక, తదితర తీర్మానాలకు ప్రారంభంలో స్వాగతం పలికారు. అన్నిశాఖలు బలపరచాయి. అక్టోబరు 1967 "నక్సలైట్ల బాల్యారిష్ట తిరుగుబాటు" తరువాత మే–జూన్‌లలో పశ్చిమబెంగాల్‌లో వెలుగులోనికివచ్చి, వ్యాపించి, జనవరి–ఫిబ్రవరి 1968లో బ్రద్దలయింది. పార్టీ పంథాపై చైనా కమ్యూనిస్టు పత్రికలు, రేడియో బహిరంగదాడి ప్రారంభించుటతోపాటు పార్టీపై బహిరంగ తిరుగుబాటు చేయండని వచ్చిన పిలుపుతో, ధైర్యమొచ్చి బయటపడ్డారు[1]"అని సి.పి.ఐ.(యం) నిర్ధారణకొచ్చి తగిన గుణపాఠాలు తీసుకొన్నామని, పశ్చిమ బెంగాలులో నక్సల్బరీ ఉద్యమం పార్టీలో "అతివాదుల" తిరుగుబాటును వివరించింది.

2. పార్టీలో నేటి "అతివాద అవకాశవాద వక్రీకరణ" వొక్క మన జాతీయ లక్షణమే కాదు, అంతర్జాతీయ లక్షణంగా మారింది. ఈ అంశాన్ని మరచుట, తక్కువగా అంచనా వేయుట పార్టీ భవిష్యత్తు, రాజకీయ పంథాను ప్రమాదంలో పడవేయుటయేగాక, "అతివాద", "మితవాద"అవకాశవాదాలపై వక్రీకరణలు, తప్పులపై జరిగే పోరాటం సమర్థవంతంగా జరుగదనే అభిప్రాయానికి సి.పి.ఐ.(యం) వచ్చింది. తరువాత కార్మికవర్గ నియంతృత్వాన్ని, పార్టీ నాయకత్వ పాత్రను, ప్రజాస్వామ్య కేంద్రీకరణ సూత్రానికి, కార్మికవర్గ అంతర్జాతీయతకు, వర్గపోరాట సూత్రా

1. పొలిటికల్ ఆర్గనైజేషనల్, రిపోర్టు. సి.పి.ఐ.(యం) 8వ, పార్టీ కాంగ్రెసు. సి.పి.ఐ.(యం) పబ్లికేషన్ (ఆంగ్లంలో) ఏప్రిల్ 1969. పే. 152-3.

లను నూతన సంస్కరణవాద దృక్పథంలో నిర్వచనాల నిచ్చి వర్గరాజీ, వర్గశాంతి అని నూతన సంస్కరణవాదాన్ని ప్రభోదించి, అన్యాపదేశంగా సోవియట్ యూనియన్‌ను విమర్శించింది. అదేవిధంగా "అతివాద అవకాశవాదం, యితర రాజకీయ పార్టీలతో అన్నిరకాల సహకార మిత్రత్వాన్ని, ఒప్పందాలను, రాజీలను, బూర్జువా పార్లమెంటులలో పాల్గొనవలసిన అవసరాన్ని త్రోసిపుచ్చుట, సంస్కరణవాదం అంటూ ట్రేడ్ యూనియన్‌లలో పనిచేయుట తిరస్కరించుట, పార్టీ నిర్మాణ అవసరాన్ని త్రోసిపుచ్చి ప్రతిగా విప్లవ వర్గాలను విప్లవ అగ్రగామి దళాలలో సమీకరించుట, అపరిపక్వ తిరుగుబాటులను ప్రోత్సహించుట, చేస్తున్నదని అన్యాపదేశంగా చైనాను విమర్శించింది. అంతేగాక, "అతివాద అవకాశవాదం" అనగా నక్సలిజం, "రైతాంగ ప్రజాయుద్ధం", "ప్రపంచ నగరాలను ప్రపంచ గ్రామాలు చుట్టిముట్టి విముక్తి చేయుట"; "ప్రపంచ సామ్రాజ్యవాదాన్ని ఓడించుటలో జాతీయ విముక్తి విప్లవాలు నిర్ణయాత్మక పాత్ర వహించి, ప్రపంచ సోషలిస్టు విప్లవాన్ని సాధించుట" అనే అతివాద విప్లవ నినాదాల ముసుగులో ప్రపంచ కార్మికవర్గ విప్లవంలో కార్మికవర్గ పాత్రను త్రోసిపుచ్చుటలో తన ప్రత్యేకతను వెలిబుచ్చిందని, చైనాను అన్యాపదేశంగా తీవ్రంగా విమర్శించింది.[1]" అతివాద అవకాశవాదం తన స్వంత అంచనా, విశ్లేషణలతో ప్రపంచవర్గ శక్తుల బలాబలాలను తూకం వేసి, ప్రపంచ సోషలిస్టు పక్షంలోని అత్యధిక భాగం సోవియట్ యూనియన్‌తో సహా సంస్కరణవాద విధానాలను అవలంబించుటతో సోషలిజానికి తిలోదకాలు యిచ్చాయని, అవి ప్రపంచాధిపత్యంలో పాలుపంచుకొనుటకు అమెరికా సామ్రాజ్యవాదుల మిత్రులుగా అయ్యారని, ఒకటి రెండు కమ్యూనిస్టుపార్టీలు మినహా, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమమేలేదని, కారణం అత్యధిక పార్టీలు సంస్కరణ వాదాన్ని చేబట్టుటతో యిది జరిగిందని వివరించింది.

"అతివాద అవకాశవాదం నాడు స్వీయ మానసిక దృక్పథంతో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ రూపుమాసి పోయిందని చేసిన విశ్లేషణ; దశాబ్దాల తరువాత వాస్తవమైనా స్వీయ మానసిక దృక్పథం కాకపోదు. కారణం, ఆ విశ్లేషణ చేసిన నిర్ధారణలు నాటి వాస్తవ భౌతిక, రాజకీయ పరిస్థితులు, అంతర్జాతీయ కార్మికవర్గ శ్రేణుల పార్టీల బలాబలాలపై ఆధారపడి చేసినవి కావు. ఊహించని చారిత్రిక యాదృచ్ఛిక భౌతిక రాజకీయ పరిణామాలు ప్రధాన కారణాలుగా చెప్పవలసి వుంటుంది. మరింత, శాస్త్రీయ పరిశీలన అవసరము.

3. "అతి వామపక్షీకవాదులు" బర్ద్వాన్ ప్లీనం ముందూ తరువాత పార్టీపంథాకు వ్యతిరేకంగా పోరాటం సాగించినపుడు, వారి వాస్తవ రాజకీయ అభిప్రాయాలను

---

1. పొలిటికల్-ఆర్గనైజేషనల్ రిపోర్టు, సి.పి.ఐ.(యం) 8వ, కాంగ్రెసు-సి.పి.ఐ.(యం) పబ్లికేషన్ (ఆంగ్లంలో) ఏప్రిల్ 1969. పే. 152-3.

"ముసుగు"లో వుంచారు. పార్టీలో వచ్చిన ప్రతి మార్పు వారికి వ్యతిరేక మగుటతో, సోవియట్ యూనియన్‌ను సామ్రాజ్యవాద శక్తిగా, ప్రపంచంలో వర్గ శక్తుల కల యికలు, వారి అంచనా, సోషలిస్టు వ్యవస్థ అంతమగుట, ఆచరణ నినాదంగా సాయుధ పోరాటాన్ని చేబట్టుట, పార్టీపై విశ్వాసం శూన్యమగుట, పార్టీ వారిపై ఆపాదించిన ఆరోపణలు స్పష్టమయ్యాయి.

"ఈ సాహసిక అతివాదం", పోరాట మిలిటెంటు ధోరణులు ప్రధానంగా పెటీ బూర్జువా, యువజన, విద్యార్థులను, విశ్వాస పాత్రులుగా యిప్పటికే వున్న వ్యక్తులు, గ్రూపులను పోరాటాల లోనికి ఆకర్షిస్తున్నది. దేశంలో కమ్యూనిస్టులు విప్లవోద్యమాన్ని నిర్మించి బలోపేతం చేయు ప్రయత్నాలకు యిది కలుగజేయు ఆటంకాలు తక్కువగా అంచనా వేయుట తప్పు అగుతుంది. ఒకవైపునుండి కమ్యూనిస్టు వుద్యమాన్ని విచ్ఛిన్నం చేయనెంచే బూర్జువావర్గం మితవాద అవకాశ వాదాన్ని సంస్కరణ వాదాన్ని వినియోగించుతూ, అందుకే మరోవైపు నుండి "సాహసిక అతివాద అవకాశ వాదాన్ని వినియోగించుటకు వెనుకాడుట లేదు. ప్రపంచ పెట్టుబడిదారి వర్గం, ప్రపంచ విప్లవోద్యమాలను శాస్త్రీయంగా అధ్యయనం చేసి, అనుభవాలను క్రోడీకరించుకొని విప్లవ కార్మికవర్గం, దాని విప్లవ కమ్యూనిస్టు పార్టీల యెడల, విప్లవ ప్రతీఘాతక ఎత్తుగడలతో ద్వంద్వ నాటక మాడుతున్నవి. మితవాద అవకాశవాదంలో కమ్యూనిస్టుపార్టీలు చేసే పొరపాట్లను విస్తృతంగా వినియోగించుకొంటూ మరోవైపున సాహసిక అతివాద అవకాశవాద ప్రభా వంలో కమ్యూనిస్టుపార్టీలు చేసే పొరపాట్లను వినియోగించుకొంటూ, కమ్యూనిస్టు ఉద్యమాలను, నాశనం చేయు ఎత్తుగడలను ఆచరణలో సాగించుచున్నవి.[1] ఇదే చరిత్ర పునశ్చరణ చేసే గుణపాఠం, నేటి మన అనుభవ సత్యంగా రుజువగు తున్నది.

"అతివాద ప్రమాదం, ఇప్పటి విద్రోహంతో చీలిపోయినవారిని బట్టి మాత్రమే అంచనా వేయరాదు. అది పార్టీకి మొత్తంగా కలుగజేసే ప్రమాద అవకాశాల కోణా న్నుండి కూడా పరిగణించాలి. మన విప్లవోద్యమంలో ఇది తలెత్తుచున్నదని, వికృత రూపం ధరించుటతో ప్రమాదం తీవ్రతరమగుతున్నదని గుర్తించాలి. నిజా నికి సి.పి.ఐ. (యం) ఏ ప్రమాదాలతో రాజకీయంగా, సైద్ధాంతికంగా బాగా వేరూని బలపడలేదు. అత్యధిక జనాభా గలిగిన మనదేశంలో ఈ ప్రమాదాన్ని తక్కువగా అంచనా వేయుట పొరపాటు అగుటయే గాక, ప్రమాదకర ఫలితాలకు కారణమగు తుంది.

---

1. పొలిటికల్–ఆర్గనైజేషనల్ రిపోర్టు, సి.పి.ఐ. (యం) 8వ కాంగ్రెసు, సి.పి.ఐ.(యం) పబ్లికేషన్. (ఆంగ్లంలో) ఏప్రిల్ 1969, పే. 154.

అంతర్జాతీయ సమస్యలు, వైఖరులు సామ్రాజ్యవాదాన్ని, సోషలిజాన్ని ఒకే విధంగా, సమానంగా చూచుట "సాహసిక అతివాద అవకాశవాదం రాజకీయంగా, సైద్ధాంతికంగా వొకే విధమైన వైఖరుల నుండి ఏర్పడుతుంది. అనేకమంది "గౌరవ నీయులను" ఆ మిషతో ప్రక్కదారులు పట్టించింది. తప్పుడు పంథా నుండి బయట పడే వరకు, మనం వారు ఆచరణపెట్టే తప్పుడు పంథాను బయటపెట్టి సత్యాన్ని వారు చూచునట్లు చేయు కార్యక్రమము తేలిక అగుతుంది.

"మన పార్టీ ఒక్కక్షణం కూడా ఈ విషయాన్ని మరువక, నవీన ససంస్కరణవాదం. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రధాన ప్రమాదకారిగా వుంటుందని "మితవాద" కమ్యూనిస్టు నిర్మాణ రూపంలో నేరుగా ఎదుర్కొంటుందని" రిపోర్టు తెలిపింది. ఇంకా, "సంస్కరణవాద రూపంలో మనలను వెంటాడుతూ," మితవాద సంస్కరణవాదానికి వొకవైపున, "సాహసిక అతివాదం"నకు మరోవైపున రెండు రంగాలలో సూత్రబద్ధమైవ ఎడతెగని పోరాటాన్ని" శాస్త్రీయ సోషలిస్టులు సైద్ధాంతిక పోరాటాన్ని సాగించవలసి వుంటుచని సి.పి.ఐ. (యం) 8వ కాంగ్రెసు నివేదిక తెలిపింది.

# 4

# అఖిల భారత కమ్యూనిస్టు విప్లవ సమన్వయ కమిటి (ఎ. ఐ. సి. సి. ఆర్.) నిర్మాణం

మార్చి 1967లో 4వ సార్వత్రిక ఎన్నికలు జరిగి, కాంగ్రెసు ఘోర పరాజయంతో 17 రాష్ట్రాలలోని 8 రాష్ట్రాలలో కాంగ్రెసేతర రాష్ట్రప్రభుత్వాలు ఏర్పడినవి. సి.పి.ఐ. (యం), సి.పి.ఐ లు పశ్చిమబెంగాల్, కేరళలలోని ఐక్య సంఘటనా ప్రభుత్వాలలో భాగస్వాములుగా చేరినవి. మే 1967లో నక్సల్బరీ సాయుధ రైతాంగ తిరుగుబాటు, సి.పి.ఐ. (యం) నాయకత్వంలోని ఐక్యసంఘటనా రాష్ట్ర ప్రభుత్వంగల పశ్చిమబెంగాలులో ప్రారంభమైంది.

చైనా కమ్యూనిస్టుపార్టీ పత్రిక, పీపుల్సు డైలీ 7 జూలై 1967న "భారత్‌పై వసంత రుతుగర్జన" అనే సంపాదకీయాన్ని నక్సల్బరీ సాయుధ రైతాంగ తిరుగుబాటుకు మద్దతుగా ప్రకటించింది. "విప్లవ సాయుధ పోరాటమనే బ్రహ్మాండమైన,

పెనుతుఫాన్ భారతదేశపు నలుదిశలకు వ్యాపించుతున్నదని, ముంచివేయుట నిక్కమని. బృహత్తర మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానము మార్గదర్శికత్వంలో విజయం తథ్యం,"[1] అని చరిత్ర నేడు హాస్యాస్పద, అత్యోక్తియని రుజువు చేసిన వ్యాఖ్యలను పేర్కొన్నది.

సి.పి.ఐ. (యం)లో విప్లవ మార్గాన్ని చేబట్టినవారు, బెంగాలులో నక్సల్బరీ సాయుధ రైతాంగ పోరాటాన్ని తిరుగుబాటును లేవనెత్తినవారు, నవంబరు 1967లో "కమ్యూనిస్టు విప్లవ కారుల అఖిలభారత సమన్వయ కమిటీని" ఏర్పరచారు.[2] వారు 13 నవంబరు 1967లో విడుదల చేసిన ప్రకటన సారాంశము యిలా వున్నది.

కామ్రేడ్ లెనిన్ చెప్పినట్లు, "అన్ని సాంప్రదాయ లక్షణాలతో "మన దేశంలో చక్కని విప్లవ పరిస్థితి వున్నది" "సి.పి.ఐ. (యం) నియో సంస్కరణ వాద నాయకత్వం పార్టీకి, ప్రజలకు ద్రోహం చేసింది భారత విప్లవ ధ్యేయానికి వారు ద్రోహం చేసారు." "విప్లవ పదజాలాన్ని యెంత వాడినా వర్గ సామరస్య పార్లమెంటరీ పంథాను చేబట్టారు. ఈ విద్రోహం పార్టీ చీలక ముందే ప్రారంభమైంది. పార్టీ కార్యక్రమంలోనికి మార్క్సిస్టు, లెనినిస్టు, మావో ఆలోచనా వ్యతిరేక విధానాలను చొప్పించారు. స్వతంత్రవిశ్లేషణ పేరుతో మన దేశ నైజాన్ని సెమీ ఫ్యూడలు, సెమీ వలస లక్షణాలను, తత్సంబంధ ప్రజాస్వామ్య విప్లవ ఎత్తుగడలను త్రోసిబుచ్చారు. దేశం స్వతంత్ర పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధిచెందుతున్నదని, దాని సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్ర అంతం కాలేదని, మావో ప్రపంచ విప్లవ పంథాను, ప్రధానంగా ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలో విప్లవ కార్యాచరణను త్రోసిబుచ్చారని[2]" విప్లవకారులు సి.పి.ఐ. (యం)ను తీవ్రంగా విమర్శించారు.

భారత కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో నక్సల్బరీ వొక కొత్త మలుపుగా చెప్పాలి. కామ్రేడ్ మావో ఆలోచనా విధానపు "కార్మిక, కమ్యూనిస్టుల నాయకత్వంలో, మావో ఆలోచనా విధానపు, నమూనా రైతాంగ యుద్ధానికి సరైన ఉదాహరణగా వుందని" సమన్వయ కమిటీ సమావేశ ప్రకటన పేర్కొన్నది. నక్సల్బరీ సాయుధ తిరుగుబాటుకు నాయకత్వం వహించినవారు, మధ్యతరగతి మేధావి వర్గానికి చెందిన కమ్యూనిస్టులు, కార్యకర్తలు, కౌలుదారులు, వ్యవసాయ

---

1. నక్సల్బరీ అండ్ ఆఫ్టర్. వా. II. (1972) ఎడిటెడ్ బై సునీల్ సేన్ ఎట్ ఆల్. (ఆంగ్లంలో) పే. 190.

2. నక్సల్బరీ ఆండ్ అఫ్టర్. వార్. II. (1978) ఎడిటెడ్ బై సునీల్ సేన్, ఎట్ ఆల్ (ఆంగ్లంలో) పే. 193.

కూలివర్గాలకు చెందినవారు. నాయకత్వం వహించినది కార్మికవర్గం కాదు, కార్మిక వర్గ సిద్ధాంత పార్టీ, కమ్యూనిస్టుపార్టీ. కాన ఏ వర్గం నాయకత్వం వహించిందనే ప్రశ్నకు మధ్యతరగతియని చెప్పుట, సరియైనది కాదని చెప్పుట సాహసమే అవుతుంది.

సమన్వయ కమిటీ ప్రకటన నాలుగు కర్తవ్యాలను నిర్దేశించింది. అవి : 1) కార్మికవర్గ నాయకత్వంలో మిలిటెంటు నక్సల్బరీ విప్లవ పోరాటాలను అభివృద్ధి పరచుట, 2) ఆర్థికవాదాన్ని త్రోసిబుచ్చి, వ్యవసాయ విప్లవ పోరాటాలకు మద్ధతుగా కార్మిక, పీడిత వర్గాల పోరాటాలను సమన్వయపరచి నడుపుట, 3) సంస్కరణ వాదానికి, నయా సంస్కరణ వాదానికి వ్యతిరేక పోరాటం, మావోయిజ ప్రచారం, దాని ప్రాతిపదికపై విప్లవ శక్తులన్నిటిలో ఐక్యత నెలకొల్పుట, 4) మావో ఆలోచనా విధాన వెలుగులో దేశ పరిస్థితిని పై నిర్దిష్ట విశ్లేషణ ప్రాతిపదికగా విప్లవ పంథాను, ఎత్తుగడలను రూపొందించుట.[1]" గా సూచించింది.

అఖిల భారత విప్లవకారుల సమన్వయ కమిటి రెండవ ప్రకటన 4, మే 1968న చేసింది. పరిస్థితి, నిర్వహించిన కార్యకలాపాలను సమీక్షించి, మాతృసంస్థ నుంచి విడిపోయి బయటకురాని విప్లవకారులను, వారి భ్రమలు విడనాడాలని, ఆంతరంగిక సైద్ధాంతిక పోరాటాలకు మాతృసంస్థలో యింకా అవకాశా లున్న వారిని, సంస్కరణవాద వ్యతిరేక విప్లవకారులలో కొత్తభ్రమలు కలుగజేస్తున్నారని తీవ్రంగా విమర్శించింది. విప్లవకారుల ఐక్యతకు వారు విఘ్నం కలుగజేస్తున్నారని, వేరు వేరు గ్రూపుల ఉనికి, భారత విప్లవానికి నష్టదాయకమని, గ్రూపులన్నీ సమన్వయ కమిటీలో చేరాలని విజ్ఞప్తి చేసింది. జూన్ 1967 లిబరేషన్ పత్రికలో రెండవ ప్రకటనలో "వివిధ రాజకీయ సమస్యలపై తీవ్ర అభిప్రాయ భేదాలున్నవని", "అవి గ్రూపులకు మాత్రమే పరిమితమైలేవని" అంగీకరించింది. దేనితోనూ సంబంధం లేకుండా విప్లవ పోరాటాలలో పాల్గొనే కొన్ని గ్రూపులున్నవని, వాటిని గౌరవించాలని, సమన్వయ కమిటి వొక పార్టీ కాదని, యే గ్రూపైనా తన అభిప్రాయాలను, నిర్ణయాలను యితరులపై రుద్దుట సరియైనది కాదని కూడ ప్రకటన స్పష్టం చేసింది. ఇది వాస్తవ పరిస్థితికి ప్రతిబింబము.

రెండవ ప్రకటన బర్ద్వాన్ ప్లీనం నిర్ణయాలపై వ్యాఖ్యానించుతూ "మార్క్సిస్టు వ్యతిరేక సంస్కరణవాద సైద్ధాంతిక పంథాపై, నియో సంస్కరణ వాద పంథాను నాయకత్వం చేబట్టిందని" భరత వాఖ్యంగా చెప్పారు. ఇంకా "ప్రజల, విప్లవకారుల వ్యతిరేకత తీవ్రమగుటతో మరింత మోసకారులు, కుట్రదారులుగ అయ్యారు. మార్క్సిజం, లెనినిజం, మావోయిజంలకు తిలోదకాలు యిచ్చి, విప్లవహింసా, దౌర్జన్యాలను వదలి పార్లమెంటరీ పంథాను చేబట్టిన పార్టీలో అవకాశ

---

1. —అదే— పే. 195-6.

వాదులు మాత్రమే వుంటారని"[1] చీలికకు పిలుపునిచ్చింది.

జూన్ 1966లో సి.పి.ఐ. (యం) పొలిట్‌బ్యూరో అంతర్జాతీయ సైద్ధాంతిక సమస్యలపై సోవియట్ చైనాల మధ్య చెలరేగుతున్న వాగ్వివాదాలపై వొకనోటును తయారుచేసి కేంద్ర కమిటికి సమర్పించింది. కేంద్ర కమిటి పరిస్థితి అనుకూలంగా లేదని తెలుసుకొని, వారే ద్వైపాక్షిక చర్యలు జరపాలని ప్రతిపాదించారు. అదే కాలంలో సోదరపార్టీల అధికార ప్రకటనలను మాత్రమే ప్రచురించాలని, అదికూడా "వాటిలోని వైఖరులతో పార్టీకేమీ సంబంధం లేదు" అన్న వివరణను జతపరచి ప్రచురించాలని రాష్ట్ర కమిటీలను ఆదేశిస్తూ, 1966 జూన్‌లో కేంద్ర కమిటి వొక తీర్మానాన్ని ఆమోదించినట్లు సూచించారు. ఏప్రిల్ 1967లో సి.పి.ఐ. (యం) వొక పత్రాన్ని ఆమోదించి "నియో సంస్కరణ వాదాన్ని" చేబట్టింది. ప్రత్యేకంగా ఆంధ్రకు సంబంధించినంత వరకు అతివాదంవైపు తరలి వెళ్ళిపోవుటకుగల మౌలిక రాజకీయ కారణాల పరిశీలన" అన్న అక్టోబరు 1968 తీర్మానంలో "మన నాయకత్వంలోని వొక భాగంనుండి చెప్పుకొన దగినంత ప్రతిఘటన యెదురైన పరిస్థితులలో యిదంతా చేయవలసి వచ్చిందని" కేంద్ర కమిటియే ఆమోదించింది. అందువలన విప్లవకారులు సి.పి.ఐ. (యం) నయా సంస్కరణ వాదాన్ని చేబట్టి పరిస్థితిని మెట్టుమెట్టుగా తనకుఅనుకూలంగా మార్చుకొనేందుకుకల వొక మోసపూరితమార్గాన్ని అనుసరించిందన్నారు. సిద్ధాంత సమస్యలపై దేవులపల్లి వెంకటేశ్వరరావు ప్రతిపాదించిన ప్రత్యామ్నాయ ముసాయిదాను సర్క్యులేటు చేయుట తిరస్కరించింది. తమకు ఆనుకూలంగా యితర రాష్ట్రాల ప్లీనములను ప్రభావితం చేయాలనే వుద్దేశ్యంతో కొన్ని రాష్ట్ర కమిటీల నిర్ణయాలను బహిర్గతం చేసింది. కొన్ని రాష్ట్రాలలో యేదో వొక మిషతో ప్లీనంలు జరగకుండా, కేంద్ర ప్లీనంనకు ప్రతినిధులను నామినేటు చేసింది. ఈ పద్ధతులన్ని సి.పి.ఐ. (యం) నాయకత్వం యొక్క సిద్ధాంతం బలహీనతలను మాత్రమే బట్టబయలు చేసాయి[2]" అని విప్లవకారుల అభిప్రాయము.

"సిద్ధాంత సమస్యపై ఆంతరంగిక చర్చలు ప్రారంభమయ్యే నాటికి సి. పి. ఐ. (యం) నాయకత్వాన్ని మొత్తంగా తిరస్కరించ వలసి వస్తుందని, ఆంధ్ర ప్రదేశ్‌లోని విప్లవకారులు స్పష్టమైన అభిప్రాయంతో వున్నారు. చర్చలు నిష్పక్ష

---

1. నక్సల్బరీ అండ్ ఆఫ్టర్. వా II. (1958) ఎడిటెడ్ బై సునిల్ సేన్ ఎట్ ఆల్ (ఆంగ్లంలో) పే. 195-6.

2. భారత విప్లవోద్యమము-కొన్ని గుణపాఠాలు, అనుభవాలు. రాజకీయ నిర్మాణ వుద్యమ సమీక్ష (1967-88) యు.సి.సి.ఆర్.ఐ. (యం.యల్.) మొదటి రెగ్యులర్ కేంద్ర కాన్ఫరెన్సు, ఏప్రిల్ 1989లో ఆమోదించినది. పే. 79.

పాతంగా, ప్రజాస్వామిక పద్ధతులలో నిర్వహించబడగలవనే భ్రమలు లేవు. అంతర్గత చర్చలను పూర్తిగా వినియోగించుకొనాలని వారు నిర్ణయించుకొన్నారు. సిద్ధాంత పోరాటాన్ని అఖిల భారత స్థాయికి ఎంతవరకు సాధ్యమైతే అంతవరకు తీసుకొని వెళ్ళదలచారు ఈ వైఖరి ఆశించిన ఫలితాల నిచ్చింది. సైద్ధాంతిక, కార్యక్రమ పంథా, నిర్మాణ సమస్యలపై సి. పి. ఐ. (యం) నాయకత్వపు అవగాహనలను, కార్యాచరణలను సమగ్రంగా బహిర్గతం చేయుటకు దోహదపడిందని" వుద్యమ సమీక్ష తెలిపింది.

## ఆంధ్రప్రదేశ్‌లో "ఎ. పి. సి. సి. సి. ఆర్." యేర్పాటు: శ్రీకాకుళం "డి.సి.సి.సి ఆర్."కు రాష్ట్ర "ఎ.పి.సి.సి.ఆర్."ల మధ్య అభిప్రాయ భేదాలు:

ఆంధ్రప్రదేశ్‌లోని కమ్యూనిస్టు విప్లవకారులు జూన్ 1968లో సి.పి.ఐ. (యం) నుండి అధికారికంగా చీలిపోయారు వెంటనే వారు రాష్ట్ర స్థాయిలో ప్రతినిధుల సమావేశాన్ని యేర్పాటుచేసి, డా. టి. నాగిరెడ్డి కన్వీనరుగా, ఎ.పి.సి.సి. సి ఆర్.గా యేర్పడ్డారు. "ఎ పి.సి.సి.సి.ఆర్. తన రెండవ ప్రకటనలో సి.పి.ఐ. (యం) నుండి యింకా విడిపోని వారిని" అవకాశవాదులుగా పేర్కొన్నారు. "అంతరంగిక పోరాటానికి యింకా అవకాశముందని" తలచిన వారిని అవకాశవాదులు"గ పేర్కొన్నారు, ఆ విధంగా ప్రకటన విమర్శించింది. అదే కాలంలో దేవులపల్లి వెంకటేశ్వరరావు ప్రత్యామ్నాయ డాక్యుమెంటును, "ఎ.ఐ.సి.సి.సిఆర్." లిబరేషన్ పత్రికలో "కొత్త భ్రమలను కలిగించుచున్న దానిగా ఉపోద్ఘాతంలో విమర్శించారు. ఆంధ్రప్రదేశ్ విప్లవకారులు "నయా రివిజనిస్టు సి.పి.ఐ.(యం)" నుండి విడి పోవుటకు సిద్ధంగా లేరని విమర్శించింది. వాస్తవానికి ఆంధ్రప్రదేశ్ విప్లవకారులు సి.పి.ఐ.(యం) నుండి సాధ్యమైనంత హెచ్చుమందిని చీల్చి, బయటకు వచ్చే ఎత్తుగడలను అవలంబించారు. దానిని అఖిల భారత సమన్వయ కమిటి "అవకాశవాదం"గా నిర్ధారించింది. దేవులపల్లి వెంకటేశ్వరరావు డాక్యుమెంట్సుకు జత పరచిన నోటులో 1) సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదంనుగూర్చి స్పష్టం చేయలేదని, 2) శాంతియుత పరివర్తనపై భ్రమలు కలిగి వున్నదని, 3) మధురై డాక్యుమెంటును విమర్శించలేదని, 4) నయా రివిజనిజం పంథాను వదలు కొనుటకు వూగిస లాడుతున్నారని విమర్శించింది. అంతేగాక వాస్తవానికి సి.పి.ఐ.(యం) జాతీయ, అంతర్జాతీయ అవగాహనలను విమర్శించుతున్న టి. నాగిరెడ్డి, సి. వుల్లారెడ్డిలు డాక్యుమెంట్లను "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." తొక్కిపెట్టి, ప్రచురించలేదు. అఖిల భారత సమన్వయ కమిటి నాయకత్వం నిందాపూర్వక, ఆధారరహిత ఆరోపణలు చేయుట, ఏకపక్ష, నిర్హేతుక తీర్పులను యివ్వటం, పరోక్షంగా చీలిక తత్వాన్ని పెంపొందించిందే కాని, వాస్తవానికి విప్లవకారుల ఐక్యతకు తోడ్పడలేదు.

ఈ నేపథ్యంలో శ్రీకాకుళం సి.పి.ఐ. (యం) జిల్లా కమిటి, 1959 నుండి జరిగే గిరిజన పోరాటాలపై "ఎ.పి.సి.సి.సి.ఆర్." అంటే రాష్ట్ర విప్లవకారుల, "ఎ.ఐ.సి.సి.సి.ఆర్,"ల సైద్ధాంతిక, రాజకీయ అవగాహనల భేదాభిప్రాయాలే ఆచరణలో భిన్నాభిప్రాయాలు పుట్టుకకు, అవి పెంపొందుటకు కారణాలు అయ్యాయి.

జులై-అగస్టు 196‌లో "ఎ.పి. సి.సి.సి.ఆర్." నాయకత్వం చర్చలకు "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." నాయకత్వాన్ని కలిసారు. అప్పటికే ఆంధ్రలో కొంతమంది "నక్సల్బరీ పోరాట సంఘీభావ కమిటి"గా యేర్పడి రాష్ట్ర నాయకత్వంపై నిందా ప్రచారం ప్రారంభించారు. ఈ కమిటీకి "ఎ.ఐ.సి,సి.సి.ఆర్." నాయకత్వపు ఆశీస్సులు, అండదండలు లభించాయి. స్వయంగా "ఎ.ఐ.సి.సి.సి.ఆర్" ప్రతినిదే యీ కమిటి సమావేశానికి హాజరై దాని ప్రచారం, కార్యక్రమాలకు మార్గదర్శి కత్వం వహించి ప్రారంభించారు. ఆంధ్ర విప్లవకారుల నాయకత్వం సంస్కరణ వాదులని, మావో ఆలోచనా విధానానికి, సాయుధ పోరాటానికి వ్యతిరేగులని, "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." నాయకత్వంతో విభేదిస్తున్నారని ప్రచారం సాగించారు. రెండు వర్గాలు అనేక విషయాలు చర్చించుచున్నపుడు, యీ విధమైన ప్రచారం దూరదృష్టి లేకపోవుటను తెలుపుకుంది. ఇంత జరిగినా రెండు వర్గాలు చర్చలు కొనసాగిస్తూనే వున్నారు. ఈ క్రమానికి విరుద్ధంగా కేంద్ర నాయకత్వం నేరుగా శ్రీకాకుళం జిల్లా నాయకత్వంతో సంబంధాలు పెట్టుకొన్నారు. రాష్ట్ర విప్లవకారుల నాయకత్వ శ్రేణులలో అనుమాన బీజాలు నాటారు, తిరుగుబాటు భావాలను పెంచారు. శ్రీకాకుళం జిల్లా కమిటి 1968 అక్టోబరులో అఖిల భారత సమన్వయ కమిటితో నేరుగా అనుబంధ శాఖగా వాంఛిం చుతూ తీర్మానించింది. ఈ పరిణామాలకు అంత్య నిర్ణయమైంది. అట్టి పరిస్థితులలో కూడ ఆంధ్ర విప్లవకారులు "ఎఐసిసిసిఆర్" నాయకత్వపు వైఖరులు, ఆచరణలకు అనంగీకారాన్ని తీవ్రంగా తెలియజేస్తూనే, వొత్తిడికి లోనై కేంద్ర సమన్వయ కమిటీలో చేరుటకు నిర్ణయించారు. అయినా అంతర్గత అభి ప్రాయ భేదాలు, నిందాప్రచారాలు, ముఠాతత్వం అదుపు లేకుండా సాగుటతో, కొద్ది కాలంలోనే తిరిగి విడిపోవుట జరిగింది. ప్రథమ నిర్ణయం యెంత తొందరపాటు నిర్ణయమో స్పష్టమైంది.

అఖిల భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ కమిటి రెండు విజ్ఞప్తి ప్రక టనలు చేస్తూ, సి.పి.ఐ.(యం) లోని విప్లవకారులను కోరిన విధంగా శ్రీకాకుళం "జిల్లాకమిటి డిసెంబరు, మే విజ్ఞప్తులను ఆమోదించి, "ఎఐసిసిసిఆర్"లో చేరుటకు ఆమోదం తెల్పుచున్నది. రాష్ట్ర కమిటి కూడ ఆమోదం తెలిపి, చేరుతుందని మేము

ఆశించుతున్నాము" అనే తీర్మానాన్ని ఆమోదించింది. అంతేగాక "దీని అర్థం రాష్ట్ర సమన్వయ కమిటీలో కొనసాగకుండా, నేరుగా "ఎఐసిసిసిఆర్"లో చేరుట సరియైన పద్ధతి కానందున, అవసరమైన సవరణను ప్రతిపాదించగా ముగ్గురు అనుకూలంగాను, 4 గురు ప్రతికూలము అగుటతో సవరణ వీగిపోయింది. ఈ విధంగా వివాదాంశంగా వుండుటతో "ఎఐసిసిసిఆర్" అఖిలభారత సమన్వయ కమిటీలో చేరుటకు కాలాతీతమగుటను అర్థంచేసుకొనవలసి వస్తుంది. రాష్ట్రకమిటి పార్టీ శ్రేణుల ఐక్యత కొనసాగుతుందని తలచింది. రాష్ట్రకమిటి "ఎఐసిసిసిఆర్"తో చర్చలు కొనసాగిస్తూనే వుంది. శ్రీకాకుళం కమిటీకి సంభాషణల కొనసాగింపు తెలియపరచుట జరిగింది. శ్రీకాకుళం జిల్లాకమిటి తీర్మానం చేయునప్పటికి, అన్ని రాష్ట్రాలలో విప్లవకారుల కమిటీల సంప్రదింపులు పూర్తిఅయ్యాయి అనుట సత్యదూరము. నిర్మాణ సూత్ర వ్యతిరేక, అనుచిత చర్యను అవాస్తవికంగా సమర్థించుకొనే ప్రయత్నం.

పశ్చిమబెంగాలులోనే ఐదు గ్రూపులు యింకా "ఎఐసిసిసిఆర్" బయటనే అప్పటికి వున్నవి. కేరళలో కోసలరాం, కె.పి.ఆర్. గోపాలన్ గ్రూపులు బయటనే ఉన్నవి. తమిళనాడులో వొక గ్రూపు బయటనే వుంది. కాశ్మీర్ గ్రూపు అప్పటికి యీ ఆలోచన, చర్చలు ప్రారంభించనేలేదు. ఈ గ్రూపులన్నీ మావో ఆలోచనా విధానాన్ని అనుసరించుతున్నా బయటనే ఉండిపోయాయి. వీటన్నిటినిబట్టి ఆంధ్ర సమన్వయకమిటీయేగాక, యితర రాష్ట్రాలలో అనేక గ్రూపులు వివిధ సమస్యలపై నిర్దిష్ట అవగాహనకు వచ్చిన తరువాతనే అఖిలభారత విప్లవకారుల సమన్వయ కమిటీలో చేరనెంచి వున్నాయి.

ఆంధ్ర విప్లవకారుల సమన్వయ కమిటి సాయుధ పోరాటాన్ని వ్యతిరేకించిందని, అందేత తాము "ఎఐసిసిసిఆర్"లో చేరదలచామని, శ్రీకాకుళం కమిటి తీర్మానంలో ఎక్కడా ఉదహరించలేదు. సాయుధ పోరాటానికి అనుకూలంగా శ్రీకాకుళం జిల్లాకమిటీ జూన్ నెలలో తీర్మానించినా, సాయుధ పోరాటాన్ని ప్రారంభించుటకు రాష్ట్రకమిటీని అనుమతి కోరింది. అఖిల భారత సమన్వయ కమిటీలో చేరుట, సాయుధ పోరాటం ప్రారంభించుటకు అనుమతి కోరుట రెండు పరస్పర విరుద్ధ అంశాలు, వైఖరులుగ నెంచాలి. శ్రీకాకుళం డి. సి. నిర్ణయం, తరువాత "ఎఐసిసిసిఆర్" దానిని ధృవపరచుట సెప్టెంబరు 1968లో డి. సి. రాష్ట్రకమిటి నాయకత్వాన్ని సాయుధ పోరాటం ప్రారంభించకముందే త్రోసిబుచ్చిందని అర్థం చేసుకొనాలి. దీనిని "ఎఐసిసిసిఆర్" ఆమోదించి, రాష్ట్రకమిటి నాయకత్వానికి బదులు, వెంకటరత్నం గ్రూపు నాయకత్వాన్ని గుర్తించి, దానితో నేరుగా సంబంధాలు పెట్టుకొంది. జిల్లా కమిటి తీర్మానం రాష్ట్ర కమిటీని "ఎఐసిసిసిఆర్"లో చేరమని కోరింది. అయినా, రాష్ట్రకమిటి ఆ పనిచేసిన తరువాతకూడ జిల్లాకమిటి స్వతంత్రంగా పనిచేయనారంభించింది. రాష్ట్ర విప్లవకారుల సమన్వయ కమిటీని ఎప్పుడూ గుర్తించి, నాయకత్వాన్ని వొప్పుకొనలేదు. నేరుగా "ఎఐసిసిసిఆర్"తో సంబంధాలు

పెట్టుకొని, దళాలు నేర్పరచి, గెరిల్లా శిక్షణను యిచ్చింది. సాయుధ పోరాటంపై జిల్లా కమిటి చేసిన తీర్మానంలో అనేక లోపాలున్నా, రాష్ట్రకమిటి గెరిల్లా పోరాట ప్రారంభాన్ని ఆమోదించింది.

ఈ పరిస్థితులలో అక్టోబరు 8న జిల్లాకమిటి ప్రధాన బాధ్యులు ఏలూరులో సమావేశమయ్యారు. సమావేశంలో రాష్ట్రి కమిటి ప్రతినిధి పై తీర్మానాలను వివరించారు. జిల్లాకమిటి గెరిల్లా ట్రెయినింగు యిచ్చే ప్రతిపాదనను తిరస్కరించింది. అంచేత యీ ఒప్పందానికి సంబంధించిన అన్ని సన్నాహాలు రద్దుఅయినవి. ఈ సమావేశానంతరం జిల్లాకమిటి నాయకత్వం, కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాల ప్రధాన కార్యకర్తలను నేరుగా కలుసుకొని, రాష్ట్రి సమన్వయ కమిటీనుండి వారిని వేరుచేయ ప్రయత్నించారు. వెంకటరత్నం గ్రూపుతో కలసి పనిచేస్తున్న వివిధ గ్రూపులతో సంబంధాలు పెంచుకొన్నారు. శ్రీకాకుళంలో స్థానికంగా పని చేస్తున్న బొడ్డపాడు గ్రూపుతోకూడ సంబంధాలు పెంచుకొన్నారు.

అక్టోబరు 1968లో "ఎ ఐ సిసిసి ఆర్" ప్రతినిధులతో ఆంధ్రప్రదేశ్ విప్లవ కమ్యూనిస్టు కమిటి ప్రతినిధులు చర్చలు జరిపిన అనంతరం ఈ క్రింది ప్రధానాంశాలలో మౌలిక భేదాభిప్రాయాలు లేవని స్పష్టమయింది. సోవియట్ యూనియన్ సంస్కరణవాద నాయకత్వం సామ్రాజ్యవాదపు విధానాలను ముందుకు తీసుకొని పోతుందనే మావో ఆలోచనా విధానాలలో విశ్వాసం, పార్లమెంటరీ విధానాన్ని తోసి పుచ్చుటలో సాయుధపోరాటం సత్వర సమస్యగా గుర్తించుటలో భేదాభిప్రాయాలు లేవు. అంతేగాక, బర్ద్వాన్ ప్లీనం అనంతరం సి.పి.ఐ.(యం)లో విప్లవకమ్యూనిస్టులు బయటకు రాకపోవుటకు లోపలవుండే పార్టీలో అంతర్గత పోరాటం సాగించుదామనే లక్ష్యంతో కాదని, సామాన్య కమ్యూనిస్టు శ్రేణులలో మన "ప్రత్యామ్నాయ పంథా" ప్రచారంచేసి, ప్రభావితులయి వారు నిర్ణయాలు తీసుకొనుటకు సహాయపడి విప్లవ కమ్యూనిస్టు సమన్వయ కమిటి శ్రేణుల సంఖ్యా, సైద్ధాంతికబలాన్ని మరింత పెంపొందించుకొనుటకు అనే విషయం అందరికీ స్పష్టమైంది. అంచేత దానిని అవకాశవాదంగా పేర్కొనుట తప్పు అవుతుంది.[1]

సమావేశానంతరం కృష్ణా, గుంటూరు జిల్లాలలోని వెంకటరత్నం గ్రూపు కార్యకర్తలను శ్రీకాకుళం పంపించారు. నాయకులు ప్రత్యేకంగా రాష్ట్రి నాయకత్వాన్ని నిందాప్రచారానికి గురిచేశారు. పార్టీ శ్రేణులలో కొంత అసంతృప్తికి కారకులయ్యారు. వారిలో నిజాయితీపరులయిన విప్లవకారులు ప్రజలలోనికి వెళ్ళి పనిచేయ దలచిన వారున్నారు, కొందరు అవాంచనీయులున్నారు.

---

1. రివల్యూషనరీ కమ్యూనిస్టు కమిటి ఆఫ్ ఆంధ్రప్రదేశ్ (ఆంగ్లంలో) టి. నాగిరెడ్డి తొలిపలుకులతో, "కమ్యూనిస్టు విప్లవకారుల నాయకత్వంలో గిరిజన ఉద్యమము (1959-1967) సమీక్ష పే. 17–18.

డిశంబరు 1968లో శ్రీకాకుళంజిల్లా సెక్రటరీతో ఇద్దరు రాష్ట్ర కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ కమిటీ సభ్యులు చర్చించారు, ప్రధానంగా యెత్తుగడలు, సాయుధపోరాటం ప్రారంభించిన తరువాత చేబట్టవలసిన చర్యలకు కొన్ని సలహాలు యివ్వగా ఆమోదించబడినవి. వీటితోపాటు యితరజిల్లాలతో సమన్వయానికి సంబంధాలు పెంపొందించుటకు ప్రయత్నాలు చేయాలని జిల్లా కార్యదర్శికి సలహాలు ఇవ్వబడినవి. అదేకాలంలో రాష్ట్ర కమిటీ వ్యతిరేకులను నూతనంగా రిక్రూట్ చేయుట సమన్వయానికి సహాయకారి కాదని స్పష్టం చేయుట జరిగింది. ఇంత జరిగినా, యీ జిల్లా కామ్రేడ్స్ క్రమేణా వొక పోటీ కేంద్రాన్ని యేర్పాటుచేయ నిర్ణయించారు. రాష్ట్ర కమిటీకి వ్యతిరేకంగా సాయుధ పోరాటానికి వ్యతిరేకులమని నిందాప్రచారం సాగుతూనే వుంది. అంతేగాక, జిల్లా కమిటి కరపత్రాలను, చిరుపుస్తకాలను ప్రచారం చేయుటను రాష్ట్రకమిటీ నిషేధించిందనే నిందాప్రచారం సాగింది. శ్రీకాకుళం జిల్లా కమిటి, రాష్ట్రకమిటి ద్వారా లేక యితర జిల్లాల కమిటీల ద్వారాగాని కరపత్రాలు వగయిరా పంపకం చేయకుండా నేరుగా తన యంత్రాంగం ద్వారానే అన్నిచోట్ల పంపకం చేసింది. సహజంగానే యిది కమ్యూనిస్టు వర్గాల ఐక్యతకు ఏమాత్రం తోడ్పడలేదు.[1]

ఈ విధంగా రాష్ట్రకమిటీ అనేక యిబ్బందులకులోనయి శ్రీకాకుళం జిల్లా కమిటీతో సంబంధాలను మెరుగుపరచుటకు చేసిన ప్రయత్నాలన్నీ పూర్తిగా వైఫల్యం చెందాయి. అయినప్పటికీ రాష్ట్రకమిటీ తన శక్తికొలది సాయుధ పోరాటానికి అన్నివిధాల సహాయాన్ని అందించుటలో వెనుకాడలేదు. పైగా తన పోరాటంగానే తలచిందనేది స్పష్టం.

**కొన్ని సమస్యలు, విధానాలపై వివరణలు :**

ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారుల రాష్ట్రకమిటీ సాధ్యమయినంత తొందరగా ప్రాథమిక చర్యల అనంతరం సాయుధ పోరాటాన్ని ప్రారంభించ తలచినదే కాని వ్యతిరేకం కాదు. ఆ ప్రయత్నాలలో కొన్ని పొరపాట్లు జరిగాయని ఆమోదించింది. పోలీసు దాడులకుముందే సాయుధ ప్రతిఘటనకు సన్నాహాలు చేయుటలో విఫలమయింది. గెరిల్లాలకు శిక్షణ మార్చి 1968కి పూర్వం యిచ్చుటలో, తదితర సన్నాహాలు పూర్తిచేయుటలో వైఫల్యం స్పష్టం. చివరి వైఫల్యాలు రెండు. నిర్మాణ సంబంధమైననవి. రాష్ట్ర కేంద్రానికి సంబంధించినవి. పోలీసు దాడులు ప్రారంభమగునప్పటికి రాష్ట్రకమిటీ పునర్నించబడలేదు. రాష్ట్ర నాయకులు గతంలో వారు

1. రివల్యూషనరీ కమ్యూనిస్టు కమిటీ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ (ఆంగ్లంలో) కమ్యూనిస్టు విప్లవకారుల నాయకత్వంలో గిరిజనోద్యమము (1959-1967) సమీక్ష. టి. నాగిరెడ్డి తొలి పలుకులతో, ఆంగ్లంలో, పే. 19.

పనిచేయు ప్రాంతాలలో రోజువారి కార్యకలాపాలలోనే మునిగిపోయారు. ప్రత్యేక కార్యక్రమాలను చేబట్టలేదు.

శ్రీకాకుళంజిల్లా కమిటీకి, ఎప్పుడు పోరాటం ప్రారంభించాలో అన్న విషయంలో యేకగ్రీవ అభిప్రాయమున్నది. చర్చలలో కొన్ని మౌలిక అంశాలలో అభిప్రాయ భేదాలు వుండుట స్పష్టం. అందులో ముఖ్యమైనవి యిలా వున్నవి.

**భూ సమస్య, సాయుధ పోరాటం :**

శ్రీకాకుళం జిల్లా కమిటీ, యితర కమ్యూనిస్టు శ్రేణులలో "మనం సాగించే యీ పోరాటం నేటి విముక్తి పోరాటం. భూసమస్యపై, భూస్వామ్యవర్గ దోపిడి విధానంపై జరిగే పోరాటానికి, విముక్తి పోరాటానికి తక్షణ సంబంధమేమీలేదు. భూ పోరాట విజయం అనంతరం పరిష్కరించవలసిన సమస్యగా వుంటుంది. ప్రజా సైన్యం నిర్మించి, గ్రామీణ ప్రాంతాలను, తదుపరి నగరాలను విముక్తి చేయాలి. అందుకు స్థావర ప్రాంతాలు స్థాపించాలి."[1] ఇదీ వారి ఆలోచనా క్రమం.

"నేడు దేశంలోని వివిధ ప్రాంతాలలో పెల్లుబుకుతున్న సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాలు విముక్తి పోరాటాలు, అధికారం కైవసం చేసుకొనే పోరాటాలు, సాయుధ పోరాట దశకు చేరని పోరాటాలు కూడ, యీ అవగాహనతో అభివృద్ధి చేసి, ఉన్నత పోరాట రూపాలకు తీసుకొని వెళ్ళిన సాయుధ విముక్తి పోరాటాలుగ అభివృద్ధి చెందుతవి. విప్లవ పరిస్థితులున్న మన దేశంలో నేడు రైతాంగ పోరాటాలన్నీ వర్గపోరాట లక్షణాలను కలిగి వుంటవి. రైతాంగ విముక్తి అంటే భూస్వామ్య విధానం, సామ్రాజ్యవాద విధానాల నుండి విముక్తి. విముక్తి పోరాటం భూస్వామ్య వ్యతిరేక వ్యవసాయ విప్లవ పోరాటంతో వర్గ పోరాటంగా ప్రారంభమై, స్థావర ప్రాంతాల అభివృద్ధి, కొన్ని ప్రాంతాలలో అధికార స్వాధీనం దేశమంతా విస్తరించి అధికార స్వాధీనం, నూతన ప్రజాస్వామ్యం స్థాపనతో విముక్తి పోరాటము విజయమంత మగుతుంది.

"శ్రీకాకుళంజిల్లా అనుభవాలు కూడ దీనినే రుజావు చేయుచున్నవి. ఫ్యూడలు భూస్వాములు, ప్రభుత్వంలో లంచగొండి ఉద్యోగులకు వ్యతిరేకంగా 1959 నుండి విస్తృత గిరిజన ప్రజోద్యమాలలో ప్రజా సమీకరణ చేసాము. భూస్వాముల భూములను, పంటలను స్వాధీనం చేసుకొని, అప్పులను రద్దుచేయుటతో ఉద్యమం ఉన్నత స్థాయికి చేరి సాయుధ పోరాట దశకు పరిపక్వమైంది.

అనుభవాల "సమీక్ష" నిర్ధారణలు యిలా చేసింది. "రైతులు సామ్రాజ్యవాద వ్యతిరేకంగానే కాదు, ఫ్యూడలిజం వ్యతిరేకంగా కూడ పోరాడుతారు. కాబట్టి, సాయుధ పోరాటం ప్రారంభించుటకు ముందు, తరువాత వ్యవసాయ విప్లవం,

---

1 ఎ.పి.సి.సి.సి.ఆర్. కమ్యూనిస్టు విప్లవకారుల నాయకత్వంతో గిరిజనోద్యమం. (1959-1967) సమీక్ష. నాగిరెడ్డి తొలి పలుకులు. పే. 19.

కార్యక్రమం ప్రాతిపదికగా పురోగమించాలి. పోరాట ఫలితాల రక్షణ, విస్తరణ కొరకు జరిగే పోరాటాలతో సాయుధ పోరాటాన్ని సంలీనం చేద్దాము."

"ఈ సాయుధ పోరాటాన్ని భూసమస్య, ఫ్యూడలు దోపిడి వ్యతిరేక పోరాటం గానే పరిమితం చేయుట తప్పు అగుతుంది. సాయుధ పోరాటం అధికార స్వాధీనం అంత్యలక్ష్యంగాసాగాలి. ప్రజలలో మనం తప్పనిసరిగా యీ చైతన్యాన్ని కలిగించాలి. ఫ్యూడలు దోపిడి కొనసాగుతున్న ప్రాంతాలలో, వాటి వ్యతిరేక పోరాటాల క్రమం లోనే రైతాంగానికి యీ చైతన్య వస్తుంది.

"మనముందున్న ప్రశ్న, ఈ ఫ్యూడలు వ్యతిరేక పోరాటం తప్పనిసరిగా అన్ని కాలాలు, ప్రాంతాలలో సంవత్సరాల కొలది సాగించిన తరువాతనే మనం సాయుధ పోరాట దశను చేరతామా? దీనికి సమాధానంగా అవసరంలేదని అంటాము. నేడున్న విప్లవ పరిస్థితి సాయుధ పోరాటంపై తన ప్రభావాన్ని చూపుతుంది. వివిధ ప్రాంతాలలో ప్రారంభమైన సాయుధ పోరాటానికి, మావోయిజానికి అంకితమైన నాయకత్వం అధికారాన్ని స్వాధీనం చేసుకొనే చైతన్యాన్ని, అనేక సంవత్సరాల సుదీర్ఘ పోరాటాల అవసరం లేకుండానే కలుగజేస్తుంది. కొద్దికాలంలోనే సాయుధ పోరాట దశకు చేరుకొనే అవకాశాలున్నవి. విప్లవకారులు యీ అవకాశాలను పూర్తిగ వినియోగించుకొని సాయుధ పోరాటాన్ని పెంపొందించాలి.

"నగ్న ఫ్యూడలిజం దోపిడి లేనిచోట్ల, వున్నా అంత తీవ్రంగా లేనిచోట్ల, ఏ మాత్రం లేనిచోట్ల సాయుధ పోరాటాన్ని యెలా సంలీనం చేయాలి? అట్టి ప్రాంతాలలో ప్రభుత్వంపై ఆధారపడిన సామ్రాజ్యవాదపు, ప్రభుత్వోద్యోగుల దోపిడి సాగుతుంటుంది. దానికి వ్యతిరేకంగా పోరాడాలి. ఈ పోరాటాలు విస్తృతి చెందిన వినియోగించుకొని, వేగంగా అధికార స్వాధీన దశ పోరాటానికి చేరుకోవాలి. సాధ్యమైనంత వరకు మనం దానిని వినియోగించుకొనాలి.[1].

గ్రామీణ ప్రజా సామాన్యానికి ఫ్యూడలిజంనుండి విముక్తి అంటే దున్నేవానికి భూమి లభించుట, సామాజిక న్యాయం చేకూరుట. ఇది కాని ఏ విముక్తిపోరాటమైనా వ్యామోజనితజమే అవుతుంది.

## సాయుధ పోరాటం, ప్రజల పాత్ర :

ప్రజా సాయుధ పోరాటమే గెరిల్లా పోరాటము. ప్రజలు పాల్గొనని గెరిల్లా పోరాటం విజయాన్ని సాధించజాలదు. అదేవిధంగా వ్యవసాయ విప్లవ సాయుధ రైతాంగ పోరాటాలలో, ప్రారంభంనుండీ ప్రజలు పాల్గొనుట తప్పనిసరి.

---

1. కమ్యూనిస్టు విప్లవకారుల నాయకత్వంలో గిరిజనోద్యమము (1959 - 67) సమీక్ష- ఆంధ్రప్రదేశ్ విప్లవ కమ్యూనిస్టుల కమిటీ (ఆంగ్లంలో) టి. నాగిరెడ్డి తొలి పలుకులు. పే. 20.

వ్యవసాయ విప్లవం ప్రారంభమైన వెంటనే ప్రభుత్వం ప్రజలను అణచివేయుటకు సైన్యాన్ని లేక సాయుధ పోలీసులను పంపుతుంది. ప్రజావెల్లువ ఆ పరిస్థితుల్లో ప్రజా కార్యాచరణ తగ్గిపోతుంది, తాత్కాలికంగా స్థబ్దత ఏర్పడుతుంది. విప్లవకారులు అట్టి పరిస్థితిని యెదుర్కొనవలసి వస్తుంది. ప్రజా కార్యాచరణ స్తబ్దతలో వున్నపుడు మనం గెరిల్లా పోరాటాన్ని ప్రారంభించాలా? లేదా? కొంతమంది అట్టి పరిస్థితులలోగూడ ప్రారంభించాలని వాదించుచున్నారు.

"ప్రజా ఉద్యమంలో మా అనుభవం, నేటి పరిస్థితులలో అట్టి స్తబ్దత తాత్కాలికమని తెలుపుచున్నది. ప్రజాకార్యాచరణ స్తబ్దతలో పడిన కాలాన్ని విప్లవకారులు ప్రజలతో తమ సంబంధాలను విస్తృతపరచుకొని బలపరచుకొంటారు. రాజకీయ ప్రచారాన్ని ముమ్మరం చేస్తారు. ప్రజా సమస్యలపై ప్రజలను సాధ్యమయినంత వరలు కదలించుతారు. రాబోవు పోరాటాలకు సన్నాహాలను చేస్తారు. అప్పుడు పోరాటాలలో ప్రజలను సమీకరించుటకు ఎక్కువకాలము పట్టదు" "ఇది గెరిల్లా పోరాటాలకు విస్తృత ప్రజాపునాదిని ఏర్పరుస్తుంది. ప్రజలు పాల్గొనని గెరిల్లా పోరాటాలకు" యీ సౌలభ్యముండదు.

"దీనర్థం ఉద్యమ స్తబ్దతకాలంలో శత్రువు దాడులను ఏ రూపంలోనూ ప్రతిఘటించరాదని కాదు. శత్రువు దాడులను ప్రతిఘటించుటవలననే ప్రజలను చురుకైన కార్యకర్తలను, భవిష్యత్తులోవచ్చే గెరిల్లా పోరాటాలకు తయారుచేసుకోగలము. దొరికిన ఆయుధాలతో ప్రజలతో కలసి ప్రతిఘటించగలము. నిర్మాణయుతమయిన ఈ ప్రతిఘటననుండే గెరిల్లా పోరాటాల ప్రాథమిక పాఠాలను చురుకైన కార్యకర్తలు ప్రజలు నేర్చుకొంటారు.

"శ్రీకాకుళం అనుభవాలుకూడ దీనినే స్పష్టం చేస్తున్నవి. నిరవధిక పోరాటాలద్వారా కార్యకర్తలు, ప్రజలు అత్యున్నత పోరాట రూపాలను చేబట్టుటకు పోరాటాల క్రమంలోనే కావలసిన శిక్షణ పొందుతారు. పోరాట స్తబ్దత కాలంలో ప్రజలకు, కార్యకర్తలకు, మిలిటెంట్లకు స్థానికంగా దొరికిన ఆయుధాలతో ప్రతిఘటనను కొనసాగించుట సాధ్యం కాదనేది తప్పుడు అభిప్రాయమని గుర్తించాలి.[1]

## సాయుధ పోరాట నాయకత్వం :

శ్రీకాకుళం జిల్లాలో సాయుధపోరాటం జరుపుచున్నది. దానిని రాష్ట్రంలో యితర ప్రాంతాలకు విస్తరించే సన్నాహాలు జరుగుచున్నవి. వీటన్నిటినిసమన్వయం చేసి నడిపే "కమాండర్ల అవసరం ఏర్పడుచున్నది. సాయుధ పోరాటానికి యిది అత్యంత ఆవశ్యకమయిన తక్షణ, దీర్ఘకాల సమస్యగా వుంటుంది.

గెరిల్లా పోరాటాల విధానంలో నాయకత్వం పూర్తిగా కేంద్రీకరించబడజాలదు. అదేకాలంలో పూర్తి వికేంద్రీకరణ అభిలషణీయంకాదు. వ్యూహానికి సంబం

---

1. —అదే— పే. 21.

ధించినంతవరకు కేంద్రీకృత నాయకత్వమే సారథ్యం వహించుతుంది. గెరిల్లా పోరాటాలకు సంబంధించినంతవరకు నాయకత్వ వికేంద్రీకరణ వుంటుంది. ఈ అవగాహనలమేరకు స్థానిక నాయకత్వం, రీజినల్, కేంద్ర నాయకత్వాలు ఏర్పడుతవి. సైనిక యుద్ధాలలోవలె పూర్తి కేంద్రీకరణ వుండదు. అదే విధంగా గెరిల్లా యుద్ధాలలో పూర్తి వికేంద్రీకరణ వుండదు. మౌలికాంశం శతృవుకు తీవ్రనష్టాలను కలుగజేయుట గెరిల్లా నష్టాలు నామమాత్రంగా లేక నష్టం లేకుండా వుండుటగా వుండాలి. సమన్వయం పేరుతో అవాంఛనీయ కేంద్రీకరణ, స్థానిక ప్రాధాన్యత పేరుతో వికేంద్రీకరణ, అవాంఛనీయ స్థాయికి దిగరాదు.

ఈ విధంగా అవాంఛనీయ కేంద్రీకరణ, వికేంద్రీకరణ రెండూ నష్టదాయకమైనవిగా గుర్తించాలి. ఒకే ప్రాంతంలో వొకే కమాండు, వొక పోరాటంలో, వొకే కమాండు వుండాలి. ద్వం దానికి తావులేదు.

## ఐక్య సంఘటన :

సాయుధ పోరాట విజయానికి ఐక్యసంఘటన ముఖ్యమైన ఆయుధాలలో వొకటి. ప్రచారంలో కార్యాచరణలో యీ అవగాహనను యెప్పుడూ అశ్రద్ధ చేయరాదు. ఏ వర్గం ఐక్యసంఘటనకు నాయకత్వం వహించాలి? మౌలిక వర్గాలేవి? ఏ వర్గాలను ఐక్యసంఘటనలోనికి తీసుకొని రావాలి? ఈ సమస్యలపై స్పష్టతవుండాలి, అదేవిధంగా పోరాడవలసిన శతృవు లేక శతృవులపై పూర్తి అవగాహనల స్పష్టత వుండాలి. లేకుంటే శతృవు మననుండి తప్పించుకుంటాడు. లేదా పొరపాటున మిత్రులపైనా దాడి జరిగి అపారనష్టం జరుగుతుంది. అంచేత ఐక్యసంఘటనయెడల శాస్త్రీయవర్గ అవగాహన వుండాలి. ఆచరణలో మెలికలు తెలుసుకొనాలి.

"శ్రీకాకుళంజిల్లా కమిటి ప్రచురించిన చిరుపుస్తకంలో యీ అవగాహన యేమాత్రం లేదు. రైతాంగంలోని అన్నివర్గాలు భూస్వాములు, వడ్డీ వ్యాపారులు బ్యూరాక్రటిక్ అధికార వర్గాలచే దోపిడీ చేయబడుచున్నది. భవిష్యత్తులో విద్యార్థులు, ఉపాధ్యాయులు, నాన్‌గెజిటెడ్ వుద్యోగుల సంఘాలు, ప్రజల జీవన పరిస్థితులు అధ్వాన్నమగుటతో వారి పోరాటపటిమ పెరుగుతుంది. ఈ సంఘాలు అభివృద్ధి నిరోధకులు, సంస్కరణవాదుల నాయకత్వంలో వుండుటతో పోరాటానికి వచ్చుటలో కొన్ని పరిస్థితులు గలవు. భవిష్యత్తులో మధ్యతరగతులు మరింతగా పోరాటాలలోనికి వచ్చుటకు అవకాశాలు ఎక్కువగా వున్నవి[1]" అని ఆంధ్రప్రదేశ్ విప్లవ కమ్యూనిస్టుల కమిటి విమర్శనను పేర్కొని, ఇలా తీవ్రంగా విమర్శించింది.

---

1. ఆంధ్రప్రదేశ్ విప్లవకారుల నాయకత్వంలో గిరిజనోద్యమము (1959-'67) సమీక్ష ఆ-ప్ర. వి.క.క.టి. నాగిరెడ్డి తొలిపలుకులు పే. 22

"ఈ అంశాలు సరిగానే వుదహరించారు కాని ఐక్యసంఘటనలో నాయకత్వ పాత్ర వహించవలసిన కార్మికవర్గాన్ని పేరుకైనా పేర్కొనలేదు. సంఘటనలో చేరే జాతీయ బూర్జువావర్గ ప్రస్తావనాలేదు, అది చేరే అవకాశాలు పేర్కొనలేదు. అదే విధంగా, వ్యవసాయ విప్లవ కార్యక్రమాన్ని రేఖామాత్రంగానైనా అమలుచేయవల సినదానిని పేర్కొనలేదు" అని ముఖ్య వైఫల్యాలను వెలుగులోకి తెచ్చింది.

సామ్రాజ్యవాదాన్ని, కంప్రెడరీ బూర్జువావర్గాన్ని ఫ్యూడలిజాన్ని కూల ద్రోయుటకు సాధనంగా ఐక్యసంఘటనను నిర్మించాలి. ఇది కార్మిక కర్షక ఐక్యత పునాదిగా కార్మికవర్గ నాయకత్వములో మధ్యతరగతి బూర్జువా వర్గాలతో ఏర్పడిన ఐక్యసంఘటన, విప్లవపోరాటాన్ని అనగా ప్రజాయుద్ధాన్ని కొనసాగించి, జనతా ప్రజాస్వామ్య విప్లవాన్ని పూర్తిచేస్తుంది. కమ్యూనిస్టుపార్టీ సాయుధ పోరాటం ఐక్య సంఘటన మధ్య విడదీయరాని సంబంధమున్నదని మావో దృఢపరచారు. అది అనుసరణీయమని సమీక్ష వివరించింది.

రాష్ట్ర విప్లవ కమ్యూనిస్టు కమిటి, శ్రీకాకుళంజిల్లా కమిటీల మధ్య వివిధ అంశాలపై గల అభిప్రాయ బేదాలను క్లుప్తంగా యిలా చెప్పవచ్చును.[1]

1) సాయుధ ప్రతిఘటన అవసరాన్ని, రెగ్యులర్ గెరిల్లా పోరాటానికి ముందే వీటి అనుభవాల ప్రాముఖ్యతను, శ్రీకాకుళంజిల్లా కమిటి గుర్తించుటలేదు. ప్రభుత్వ నిర్బంధ హింసాకాండకాలంలో, సాయుధ ప్రతిఘటన అవసరముంటుంది.

2) జిల్లాకమిటి సాయుధ గెరిల్లా పోరాటాలకు కనీస సైనిక శిక్షణ అవస రాన్ని గుర్తించుటలేదు. రాష్ట్రకమిటి అవసరముంటుంది.

3) జిల్లాకమిటి ప్రజాసామాన్యం పాల్గొనుట అవసరమంటూనే, వొకసారి మనం సాయుధపోరాటం ప్రారంభించితే ప్రజలు వారంతట వారే కదలివస్తారని అంటున్నది. రాష్ట్రకమిటి అట్లుగాక గెరిల్లా పోరాటాలు తప్పనిసరిగా ప్రజా సామాన్యం పాల్గొనుటతోనే ప్రారంభమవుతుందని విశ్వాసం కలిగి వుంది.

4) వ్యవసాయ విప్లవంలో భూసమస్య మౌలికమైనందున సాయుధ పోరాట అవసరం గుర్తించబడింది. మరే యితర సమస్య సాయుధ పోరాట అవసరాన్ని గుర్తించబడదని డి.సి. అవగాహనగా వుంది.

5) రాష్ట్రకమిటి సాయుధ పోరాటం సాగించునపుడు ఐక్యసంఘటనా దృక్పథం వుండాలంటున్నది. అట్టి దృక్పథం డి.సి.కి లేదు.

---

1. రివల్యూషనరీ కమ్యూనిస్టు కమిటి ఆఫ్ ఆంధ్రప్రదేశ్ (ఆంగ్లంలో) కమ్యూనిస్టు విప్లవకారుల నాయకత్వంలో గిరిజనోద్యమము (1959-1967) సమీక్ష. టి. నాగిరెడ్డి ఉపోద్ఘాతం పే. 23.

6) సాయుధ పోరాటంలో రాష్ట్ర, జిల్లా కమిటీల మధ్య ప్రజాస్వామ్య కేంద్రీకరణ ప్రాతిపదికగా ఐక్యత వుండాలి. కేంద్రనాయకత్వంలో సాయుధ పోరాటం జరగాలి. కాని డి.సి. అనుసరించిన విధానం పోటీకేంద్రాన్ని, నాయకత్వాన్ని, విప్లవకారులలో రూపొందించే విధంగా, అనైక్యతను పెంచేదిగా సాగింది.

ఈ భేధాభిప్రాయాలన్నీ సాయుధ పోరాట ప్రారంభానికి ముందే బయట పడినవి. పోరాట పురోగమనానికి వీటి పరిష్కారం అవసరము.

## సి.పి.ఐ.(యం.యల్)లో 1968-'71 మధ్య అంతర్గత పోరాటం, మరోవైపు "ఏ.పి.సి.సి.ఆర్"తో సైద్ధాంతిక పోరాటం :

కమ్యూనిస్టు వర్గాలలో సి.పి.ఐ.(యం)తో విభేదించిన విప్లవకారులందరూ మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం మార్గదర్శక సిద్ధాంతంగా నెంచుతున్నవారందరూ, భారత విప్లవ ప్రస్తుత దశను జనతా ప్రజాస్వామ్య విప్లవంగాను, పంథాను ప్రజాయుద్ధపంథాగాను అంగీకరించుతున్నా, ఎత్తుగడలు, ఆచరణ, వర్తమాన రాజకీయ విధానాలలో భిన్నాభిప్రాయాలను కలిగివున్నారు. "గత విప్లవోద్యమాల అనుభవాలు, ముఖ్యంగా తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటపు సంపన్నమైన అనుభవాలు, సుదీర్ఘ పార్టీ జీవితంగల దేవులపల్లి నాగిరెడ్డి వగైరాలు యిటీవలి కాలంలోని నక్సల్బరీ, శ్రీకాకుళంలాంటి పోరాటాల అనుభవం కలవారు. కార్మిక, కర్షక,విద్యార్థి; యువజనోద్యమాల అనుభవజ్ఞులు విప్లవకారులలో వున్నారు. వీరి అనుభవాల సంపద విప్లవాచరణకు, గుణపాఠాలకు ప్రాతిపదికగా నిర్దిష్టరూపములో పంథాను రూపొందించుటకు ఎంతగానో తోడ్పడి వుండేది. అవగాహన, అన్వయం, ఆచరణల సమస్యలపై విప్లవకారులలో ఆనాడు విభేదాలు వుండుట పూర్తిగా సహజమైనదేగాని అసాధారణమయినది కాదు." కాని "ఎఐసిసిసిఆర్" నాయకత్వం యీ కర్తవ్యాలను నిర్వహించుటలో విఫలమయింది. పైగా, దాని వైఖరులు, ఆచరణలూ, విప్లవకారులలో చీలికలను, వైరుధ్యాలను తొలగించుటకుబదులు వాటిని పెంచి, శాశ్వతం చేయుటకు మాత్రమే తోడ్పడినవి.

"మొదటినుండీ "ఎఐసిసిసిఆర్" నాయకత్వం అతివాద అవకాశవాద ధోరణిని, నిర్మాణరీత్యా వొంటెత్తుపోకడలనూ, చీలికలతత్వాన్ని ప్రదర్శించింది. "తమతో విభేదించే వారందరికీ ఏదో వొకరకపు రివిజనిస్టులుగా ముద్రవేయటానికి మొదటినుండీ వారు నిశ్చయించుకొన్నారు." "ఎఐసిసిసిఆర్" నాయకత్వంనుండి ఆంధ్రప్రదేశ్ విప్లవకారులు అతిచేదయిన, బాధాకరమయిన అనుభవాన్నే పొందారు. నిర్మాణ రంగంలో ఆ నాయకత్వం అనుసరించిన వొంటెత్తువాద చీలికతత్వం, నిజా

యితీ లేని పద్ధతులకు ఆదినుంచి ఉదాహరణగ నిలిచింది.[1]"

"ఎపిసిసిసిఆర్" కమ్యూనిస్టువర్గాలు నవంబరు 1968లో, అంటే సి. పి. ఐ. (యం) నుండి లాంఛనంగా చీలిపోయిన 4 మాసాల లోపల "ఎఐసిసిసిఆర్"లో విలీనమయ్యారు. కానీ, దానిలో చేరాలనే నిర్ణయాన్ని వారు తీసుకొనే నాటికి "ఎఐసిసిసిఆర్"తో వారికి సంబంధాలలో అత్యంత చెడ్డప్రభావాలు చోటుచేసు కున్నాయి. "ఎపిసిసిసిఆర్ ప్రారంభంనుండీ "ఎఐసిసిసిఆర్" నాయకత్వం యెడల వారి అతివాద రాజకీయాలు, మొండిపెత్తువాదం, చీలికవాదం, విచ్ఛిన్నకర నిర్మాణ విధానాలయెడల విమర్శనాత్మకంగా వ్యతిరేకిస్తున్నారు. అయినా, కమ్యూనిస్టు విప్లవ కారులను "ఎఐసిసిసిఆర్" నుండి విడిగా ఆర్గనైజ్‌చేయ తలపెట్టలేదు. ఐక్యతకుసరి యైన ప్రాతిపదిక రూపొందించుటకు ప్రయత్నించుట తప్ప మరోమార్గం లేదని గట్టిగా నమ్మారు. చొరవతో వివాద సమస్యలను చర్చించ ప్రయత్నించినా, "ఎఐసి సిసిఆర్" నాయకత్వం మాటలలో ఐక్యతకు సుముఖత, ఆచరణలో నిందా పూర్వక ప్రచారం, తిరుగుబాట్లను ప్రోత్సహించుట చేయసాగారు. ఐక్యత అంటూ మరోవేపు విచ్ఛిన్నకర చర్యలు రెండూ పొసగవని, విప్లవకారుల మధ్య ఐక్యతకు హాని జరుగు తుందని "ఎపిసిసిసిఆర్" స్పష్టం చేసింది. అంతేగాక, చర్చలు, సంప్రదింపుల యెడల వ్యతిరేకతను, పెద్దన్న వైఖరిని "ఎఐసిసిసిఆర్" అవలంభించింది. తిరస్క రించ వీలులేని వాస్తవాలను ముందునుంచి సూటిగా అడిగినప్పుడు వాటిని తిరస్క రించలేదు, ఆత్మవిమర్శనాత్మకంగా పరిశీలించుకొనడానికి ముందుకు రాలేదు. వాస్త వానికి ఆనాడు విప్లవకారులను, విప్లవోద్యమాలను ఐక్యపరచే చొరవ పొక్క "ఎఐ సిసిసిఆర్" చేతులలోనే వుంది. అయినా ఆ కర్తవ్య నిర్వహణలో విఫలమయింది. "ఎఐసిసిసిఆర్"లోని అతివాద అవకాశవాద శక్తులు రాజకీయంగా సైద్ధాంతికంగా విభేదించే శక్తులను ప్రజాస్వామ్య విధానాలను నిరాకరించి వివిధ వొత్తిడులకు, వేధిం పులకు గురిచేశారు. "నాయకత్వంలో తమకున్న స్థానాన్ని, నక్సల్బరీ ఉద్యమానికి వున్న ప్రతిష్టను, తమ వెనుక విప్లవకారులను సమీకరించుకొనుటకు వినియోగించు కున్నారు. ప్రజావిప్లవపంధాను అనుసరించిన లేక దానిపై మొగ్గుచూపిన కమ్యూనిస్టు విప్లవకారులను దూరంగా ఉంచుటకు, అపఖ్యాతిపాలు చేయుటకు, విప్లవకారుల నుండి వేరుచేయుటకు, యీ అతివాద, అవకాశవాదులు వాటిని వినియోగించు కొన్నారు. అంచేతనే "ఎఐసిసిసిఆర్"లో చేరిన మూడుమాసాలలోనే "ఎపిసిసిసిఆర్" అనుబంధాన్ని రద్దుచేస్తూ, ఏకపక్షంగా అకస్మాత్తుగా నిర్హేతుకంగా" అఖిల భారత

---

1. భారత విప్లవోద్యమం. (1990) రాజకీయ, నిర్మాణ, ఉద్యమ సమీక్ష (1967-88) యు.సి.సి.ఆర్.ఐ. (యం॰యల్) మొదటి రెగ్యులర్, కేంద్ర కాన్ఫరెన్సు, ఏప్రిల్ 1989లో ఆమోదించింది. పే 8-7.

సంస్థనుండి బహిష్కరించారు.[1]

"ఈ విభేదాలు ప్రప్రథమంగా సి.పి.సి. పట్ల విధేయతా సమస్య, శ్రీకాకుళం పోరాటంపై "ఎఐసిసిసిఆర్", "ఎపిసిసిసిఆర్"లు భిన్నవైఖరుల సమస్య, మూడవది ఎన్నికల బహిష్కరణను "ఎఐసిసిసిఆర్" మొత్తం విప్లవ దశకు వర్తించే విప్లవ వ్యూహ మౌలిక సమస్యగాను "ఎపిసిసిసిఆర్" ఎత్తుగడల సమస్యగా ఎంచుటలోనే వివాదాంశాలు కేంద్రీకృతమై వున్నాయి.

సమీక్ష "ఎఐసిసిసిఆర్" అవకాశవాద, అతివాద నాయకత్వం విప్లవ ప్రజా పంథాను అనుసరించేవారంటే భయపడింది. విప్లవకారులతో వివిధ సమస్యలను ప్రజాస్వామిక పద్ధతులతో చర్చించుటకు బదులు విప్లవకారుల పట్ల దురభిప్రాయా లను, నిందలను వ్యాపింపజేయుట, ఇతరుల అభిప్రాయాలను వక్రీకరించుట,తిరుగు బాట్లను, పోటీ కమిటీలను ఏర్పరచే పద్ధతులు అవలంభించి, వారి దుస్సాహసాన్ని, పచ్చి పెత్తందారీతనాన్ని బహిర్గతం చేసుకొనుటతోపాటు, వారి సిద్ధాంత, రాజకీయ దివాళాకోరుతనాన్ని "ఎఐసిసిసిఆర్" బహిర్గతం చేసుకొన్నదని" వివరించింది.

విప్లవకారులుగా సి.పి.ఐ. (యం) నుండి చీలిపోయినవారుగాక మిగిలిన వారిలో రెండురకాల వారున్నారు. కొందరు ప్రజాయుద్ధ పంథాను అంగీకరించక, 1951 ఎత్తుగడల పంథానే గుడ్డిగా పరిగణించేవారు, మరికొందరు ప్రజాయుద్ధపంథా వైపు మొగ్గు చూపుతూ, విప్లవకారుల నాయకత్వంపై విశ్వాసం లేనివారు. వృద్ధ నాయకత్వంలో హెచ్చుమంది సి.పి.ఐ. (యం)లో ఎందుకు వున్నారు? విప్లవకారు లలో అఖిల భారత అనుభవం కలవారు కొద్దిమంది మాత్రమే వున్నారు. అంచేతనే ఎటూ తేల్చుకోలేని స్థితిలో వారు సి.పి.ఐ. (యం) నుండి విడిపోకుండా నిరోధిం చాయి. ఈ పరిస్థితిని వినియోగించుకొనుటకు సి.పి.ఐ. (యం) ఈ క్రింది పద్ధతు లను అనుసరించిందని సమీక్ష వివరించింది. విప్లవ పంథాకే కట్టుబడి వున్నానంటూ 1951 నాటి ఎత్తుగడలను పునరుద్ఘాటించింది. అదే అభిప్రాయాన్ని పార్టీ శ్రేణులలో భ్రమలు కల్పించింది. ద్వితీయంగా, విప్లవపంథా యెడల భయోత్పాధాన్ని పార్టీ వర్గాలు, ప్రజలలో కలిగించుటకు ప్రజాతంత్ర శక్తుల, విప్లవ ఉద్యమ బలాన్ని తక్కువగాను, రాజ్యాంగ యంత్ర, పోలీసు బలగాలను అతిగా చూపెట్టి; చివరకు విప్లవకారులలోని వొక వర్గంలో వ్యక్తమైన అతివాద, అవకాశవాద ధోరణులను, అనుభవంలేని దుస్సాహసిక, పెటీ బూర్జువా అతివాద, అవకాశవాదాన్ని అతి పెద్దగా చిత్రించి, అదివొక చిన్న గ్రూపు మాత్రమేనని చిత్రించ ప్రయత్నాలు చేసారని సి.పి.ఐ (యం) రాజకీయ విధానాన్ని తీవ్రంగా సమీక్ష విమర్శించింది.

---

1. భారత విప్లవోద్యమం (1990) కొన్ని గుణపాఠాలు, అనుభవాలు, రాజకీయ నిర్మాణ ఉద్యమ సమీక్ష (1967-88) యు.సి.సి.ఆర్.ఐ. (యం.యల్) మొదటి రెగ్యులర్, కేంద్ర కాన్ఫరెన్స్, ఏప్రిల్ 1989లో ఆమోదించినది. పే. 86-7.

అదే సమయంలో, విప్లవ పంథాను చేపట్టినవారుగాని, దానివైపు మొగ్గు చూపినవారుగాని, తక్కువ శక్తిగాదు. విప్లవ ప్రజాపంథాపట్ల విశ్వాసం, అవగాహన దృఢంగా లేనివారు మూడు రకాల వారున్నారు. ఒక వర్గం విప్లవ ప్రజాపంథా పట్ల స్పష్టమైన, గట్టి విశ్వాసం కలిగి, అతివాద అవకాశవాదానికి వ్యతిరేకంగా సూత్ర బద్ధమైన, రాజీలేని పోరాటం చేయాలనే అభిప్రాయంతో వున్నారు. మరో వర్గం విప్లవ ప్రజాపంథా పట్ల, దృఢం, స్పష్టమైన వైఖరి లేనందున అతివాద, అవకాశ వాదంపై పోరాటంలో నిలకడలేక వూగిసలాట అనుసరించేవారు. మూడో వర్గం అతివాద, అవకాశవాదంవైపు మొగ్గు, ఆకర్షణ గలవారు. వారు ఆ ప్రమాదాన్ని తక్కువగా చేసి, చూపి అతివాద అవకాశ వ్యతిరేక పోరాటాన్ని నీరుగార్చే వైఖరి అవలంభించుతున్నారు.

అతివాద వ్యతిరేక పోరాటంలో అగ్రగామిగా వున్న "ఎపిసిసిసిఆర్"లో కూడా యీ ధోరణులు గల శక్తులున్నవి. వారు "మనకై మనం సమస్యలను కొని తెచ్చుకోవద్దు." అనే ధోరణిలో వున్నారు, ఈ సమయంలో, కా॥ టి. నాగిరెడ్డి అభి ప్రాయాలను "ఎపిసిసిసిఆర్" తన స్వంతం చేసుకొని సమర్థించలేకపోయిందంటే, అది విచారించవలసిన పరిస్థితి. అతివాద, అవకాశవాదులు చేసిన విషప్రచారం విప్లవ కారులలో ఏదో ఒక స్థాయిలో వ్యాపించిందని చెప్పవచ్చును. ఊగిసలాడేవారూ, అతివాద అవకాశవాదంవైపు మొగ్గు చూపేవారు, దానికి వ్యతిరేకంగా జరిగే సూత్ర బద్ధ పోరాటాన్ని నీరుగార్చుటకు, బలహీనపరచుటకు అన్నీ చేసారు. [1]

# 5

# నక్సలిజం అవతరణకు అంతర్జాతీయ నేపథ్యం

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో చెలరేగిన సైద్ధాంతిక పోరాటం, ప్రధానంగా సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ, చైనా ప్రజారిపబ్లిక్ కమ్యూ నిస్టు పార్టీల మధ్య, ప్రపంచయుద్ధం, శాంతి, అణుయుద్ధ ప్రమాదం, సహజీవనం, వలస దేశాలలో విముక్తి విప్లవోద్యమాల పంథాలపై తీవ్రతర సైద్ధాంతిక పోరాటం

1. భారత విప్లవోద్యమం (1990) కొన్ని గుణపాఠాలు, అనుభవాలు. రాజకీయ నిర్మాణ ఉద్యమ సమీక్ష (1967-88) యు.సి.సి.ఆర్.ఐ. (యం.యల్) మొదటి రెగ్యులర్ కేంద్ర కాన్ఫరెన్స్- ఏప్రిల్ 1989 ఆమోదించినది. పే. 98-100.

జరుగుట, వివిధ కమ్యూనిస్టు పార్టీలలో చీలికలు యేర్పడి, అంతర్జాతీయ ఐక్యత, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో ఐక్యకార్యాచరణ క్రమేణా లోపించుట, వివిధ సందర్భాలలో అధ్యయనం చేసివున్నాము. చరిత్రలో 1960 దశకం, యీ శతాబ్దపు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల యుగంగా, సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థల, అభివృద్ధి నిరోధకుల వ్యతిరేక పోరాటాలతో లిఖింపబడింది.

ఫ్రాంసు, ఇటలీ, జర్మనీ, అమెరికా, జపాన్ తదితర అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి దేశాలలో బ్రహ్మాండమైన నిరసన, ప్రతిఘటన ప్రజోద్యమాలు, బూర్జువా నాగరికత బూటకాన్ని బట్టబయలు చేసి, అత్యధిక ప్రజాసామాన్యం పాల్గొని, అంతకు ముందు కార్మిక పోరాటాలకు దూరంగా ఉంటున్న కార్మికవర్గేతర ప్రజాసామాన్యం యీ పోరాటాలలో చొరవతో పాల్గొని నాయకత్వం వహించు నూతనాంశం కన్పడ సాగింది. ఈ పరిణామం ముఖ్యంగా, ఫ్రాంసులోని "1968 మే సంఘటనలు", పాలక గుత్త పెట్టుబడిదారీ వర్గాలకు వ్యతిరేకంగా, కార్మికవర్గేతర, శ్రామిక బడుగు వర్గాలు ముఖ్యంగా మధ్యతరగతి ఉద్యోగులు, విద్యార్థులు, పారిశ్రామిక కేంద్రాలను, ఫ్యాక్టరీలను, విశ్వవిద్యాలయాలను, ఆక్రమించుట, పాలకవర్గాలు సైనిక చర్యలు చేబట్టుతామని బెదరించుట, అంతకుముందువరకు వుద్యమంలో చేరని కార్మికవర్గం రంగప్రవేశం చేయుటకు సన్నద్ధమగుటతో, ఫ్రాంస్, తదుపరి యూరపు ప్రపంచయుద్ధ సంక్షోభంలోనికి జారిపోయే ప్రమాదమేర్పడింది. పాలకవర్గాలు, ప్రభుత్వ ప్రతిపక్ష రాజకీయ శక్తులన్నీ వొకవిధమైన రాజీమార్గాన్ని అవలంబించి, ప్రమాదాన్ని నివారించాయి. అయితే, రాజకీయ శాస్త్ర సిద్ధాంతవేత్తలు, మేధావి వర్గాలలో నూతన ఆలోచనా ధోరణులకు ప్రేరకంగా పనిచేసిందనుటలో సందేహం లేదు. ఈ పెట్టుబడిదారి వ్యతిరేక నిరసన ప్రదర్శనలలో వివిధ "నూతన అతివాద వర్గాలు" సైద్ధాంతిక భేదాభిప్రాయాలను వెల్లడించసాగారు.

ఈ "నూతన అతివాద" వర్గాలు, సర్వశక్తివంతమైన సైనిక పారిశ్రామిక సంక్లిష్ట సంస్థల మాతృకయైన బూర్జువా సమాజ, దురాక్రమణాచరితమైన విదేశాంగ విధానాన్ని అనుసరించే సామ్రాజ్యవాదం శ్రామిక, బడుగువర్గాలపై సాగించే ఆర్థిక, రాజకీయ, సామాజిక వొత్తిడులను బహిరంగంగా ప్రతిఘటించసాగాయి. అదే కాలంలో మార్క్సిస్టు-కమ్యూనిస్టు పార్టీలు పెట్టుబడిదారి విధానాన్ని వ్యతిరేకించే పోరాటంలో సైద్ధాంతిక, రాజకీయ నాయకత్వాన్ని వహించుటను, యీ నూతన అతివాద వర్గాలు వ్యతిరేకించాయి. అందుకు అవి చెప్పే కారణం "విప్లవతత్వం తగినంతగా లేదని," తాము సామాజిక, రాజకీయ ప్రత్యామ్నాయం కలిగి వున్నామని చెప్పసాగారు. నూతన అతివాద, తిరుగుబాటు వైఖరిని ప్రదర్శించసాగారు. సాంప్రదాయకంగా "మధ్యతరగతి బూర్జువా విప్లవతత్వాన్ని" చేపట్టే యీ వర్గాలు నూతన అతివాదం ప్రభావంలో తేలికగా పడిపోయారు. ఈ నూతన ఆలోచనా విధానాలకు, బూర్జువావర్గ నూతన సైద్ధాంతిక తత్వాలు పరోక్షంగా పెంచి, పోషించాయి.

ఈ నూతన అతివాద వర్గాల నిరసన, ప్రతిఘటనోద్యమాల ఆచరణల అనుభవాలు, వివిధ దశలలో ఉద్యమాలను అభివృద్ధి చేయుటకు వారు అనుసరించిన రాజకీయ విధానాలు, ఎత్తుగడలు కొన్ని పరిమితులలో సాగించిన నిర్దిష్ట విధానాలుగ, సర్వసాధారణ అంశాలుగా రూపొందాయి. నేటి నవమానవ సమాజంపై వారి విమర్శనాత్మక వైఖరి, నేటి ప్రపంచ విప్లవ క్రమాన్ని పురోగమన మార్గంలో నడిపించ గలిగినది, అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి దేశాలలోని కార్మికవర్గమనే అంశాన్ని నూతన అతివాద వర్గాలు తిరస్కరించుచున్నవి. ఈ విధంగా నేడు రాజకీయ రంగంలోవున్న అన్ని కమ్యూనిస్టు పార్టీల విధానాలను వ్యతిరేకించుచున్నారు. పైగా ఆ కమ్యూనిస్టు పార్టీలన్నీ "ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారి విధానం"లో భాగస్వాము లయ్యాయని తీవ్ర విమర్శకు గురి చేస్తున్నారు. తృతీయ ప్రపంచంపై దృష్టిని సారిస్తున్నారు. మార్క్సిస్టు, లెనినిస్టు విప్లవ సిద్ధాంతాలను తీవ్రంగా విమర్శించుతూ, నేటి పరిస్థితులకు సవరించబడిన, విప్లవ సిద్ధాంతాన్ని రూపొందించే ప్రయత్నం చేస్తున్నామంటూ, "యాదృచ్ఛిక సంఘటనలతో, చైతన్యరహిత శక్తులతో" "నూతన సంస్కృతి"ని, "నూతన మానవుని" సృష్టిస్తామంటూ, బూర్జువా సమాజంలో నేడున్న ప్రజాస్వామ్య సంస్థలను వినియోగించుటను త్రోసివేస్తున్నారు. అవి అన్నీ బూర్జువా వ్యవస్థ అణచివేతలకు వుపయోగించే యంత్రాలుగా త్రోసి బుచ్చారు.

ప్రపంచ విప్లవోద్యమానికి కార్మికేతర ప్రజాసామాన్యాన్ని అనుసంధించే ప్రయత్నాన్ని నూతన అతివాద ఉద్యమం చేస్తున్నట్లు ప్రథమంలో కన్పించినా, కొంత సైద్ధాంతిక ప్రయత్నం జరిగినా, ఆచరణలో ఆ వర్గాలకే మరింత దూరమైనట్లు, కాలం గడిచిన కొలది, స్పష్టం కాజొచ్చింది. రాజకీయంగా, సైద్ధాంతికంగా, "తృతీయ పంథా"ను రాజకీయాలలోనికి తీసుకొని వచ్చే ప్రయత్నంలో లెనినిజానికి దూరంగా వెళ్ళిపోయింది.

పెట్టుబడిదారీ విధాన వ్యతిరేక నూతన అతివాద నిరసనోద్యమము సాంప్రదాయక పరిమితులను దాటి విజృంభించుటకుగల కారణాలు, ఆ ఉద్యమాన్ని విశ్లేషణ, పరిశీలన గావించిన వెల్లడి అగుతుంది. ఇటలీ, ఫ్రాన్సు, స్పెయిన్ దేశాలలో కమ్యూనిస్టు ఉద్యమం బలోపేతం అగుట దీనినే తెలియజేస్తుంది. అతివాద ఉద్యమంలో యీ మలుపుకు అనేక కారణాలు కన్పించినా, ముఖ్యమైనవి యిలా వున్నవి.

ప్రప్రథమంగా చెప్పుకొనవలసిన ముఖ్యమైన అంశం, నూతన అతివాద ఉద్యమ నాయకత్వంలో అత్యధికులు, దాని అనుచరులు, బలపరచేవారు, నగర పేటీ బూర్జువా వర్గాలుగ గుర్తించాలి. ఈ వర్గం పరివర్తన దశలో కార్మికవర్గంగా రూపొంచుచున్న క్రమంలో వుంది. ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ నాయకులలో వొకడైన పియరె హెన్ట్‌గెస్, అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో విద్యార్థులు

గతంలో బూర్జువావర్గ పూర్వపు దశలో వుండేవారు, కాని నేడు కార్మికవర్గపు ప్రాథమిక దశలోని పరివర్తన దశకు చెందినవారుగా వున్నారు. అంచేత వారి నిరసనోద్యమము ద్వంద్వ నైజాన్ని కలిగివుంది. వారిని నాశనం చేస్తున్న పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా వొకవైపున, వారి కోరికకు వ్యతిరేకంగా వారు కార్మికవర్గంగా రూపొందే పరిణామ క్రమానికి వ్యతిరేకంగా మరోవైపున వారి నిరసన వ్యక్తమగుతున్నది. శతాబ్దం పైగా గతంలోనే మార్క్స్, ఎంజెల్స్‌లు పెటీబూర్జువా వర్గం పతన మార్గంలోనే అరాచకవాదపు వర్గ మౌలిక పునాదులను కనుగొన్నారు. అదే నూతన అతివాద వర్గాన్ని అవగాహన చేసుకొనుటకు తోడ్పడుతుంది.

నూతన అతివాదుల సామాజికవర్గ పొందిక, అది పూర్తి అతివాద వర్గంగా ప్రవర్తించజాలక పోవుటను విశదం చేస్తుంది. బ్రహ్మాండంగా చేసే ప్రచారానికి భిన్నంగా, నూతన అతివాదులు పాలకవర్గాలను విడిచి రాజాలకపోతున్నారు. అందులో ముఖ్యంగా బలంగా పాతుకుపోయిన గుత్త పెట్టుబడిదారీ పాలకవర్గాల ప్రభావం బలంగా వుంది. వారు విప్లవకారులుగా కాక తిరుగుబాటుదారులుగ వున్నారు. వారికి తెలియకుండానే వారు పాలకవర్గాలకు ద్వితీయ రక్షణ శ్రేణులుగా ఉపయోగపడుతున్నారు. కార్మికవర్గం సోషలిస్టు దృక్పథాన్ని చేబట్టినపుడు వాస్తవంగా "వామపక్ష అతివాదులై" పాలకవర్గం నుండి బయటపడతారు.

ద్వితీయ ముఖ్య అంశం, పరస్పర విరుద్ధ అంశాలుగల "స్టాలినిజం" వక్రీకరణ ప్రభావం నుండి, అస్పష్టంగా బయటపడిన ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలోని తీవ్ర సైద్ధాంతిక సంఘర్షణల ఫలితంగా శక్తిహీనమై, సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమాలు ప్రపంచ వ్యాప్తంగా విజృంభించుతున్నా, సరియైన మార్గదర్శిక నాయకత్వాన్ని ఇవ్వజాలకపోయింది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో 1960 మాస్కో ప్రకటన అత్యంత ప్రధానమైనది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ పార్టీ కాంగ్రెస్ "సృజనాత్మక" నూతన విధానాలను రూపొందించింది. కాంగ్రెసు విధానాలు, వివరణలు, మార్పులు, చేర్పులు చాలాకాలం వరకు కొనసాగాయి. ఫలితంగా, నూతన అతివాద ధోరణుల సమాలోచన, విశ్లేషణ, పరిశీలన, సాధ్యాసాధ్యాల అధ్యయనం నిరవధికంగా వాయిదాపై వాయిదా వేయుట జరిగి, అసంపూర్తిగానే వుండిపోయింది.

మూడవ ముఖ్య అంశం ఆశ్చర్య, జుగుప్సాకరమైంది. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం బలంగా విస్తరించుటతో ఆ ప్రభావంలో కార్మిక వర్గేతర శక్తులు, కార్మికవర్గంగా రూపొందుతున్న పేద, మధ్యతరగతి, నగర, గ్రామీణ బడుగువర్గాలెన్నో ప్రవేశించాయి. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం, ప్రపంచ పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద శక్తుల నెదుర్కొని దాని దురాక్రమణలను, విస్తరణను ప్రతిఘటించు కార్యాచరణలో, అనేక నిర్మాణ సరళీకృత చర్యలు, అన్యవర్గాలతో

దగ్గరి సంబంధాలను నెలకొల్పుట జరిగింది. అంచేతనే, కార్మికవర్గ నాయకత్వం కష్టసాధ్యమైంది, సంక్లిష్టంకూడ అయింది. వామపక్ష శక్తులలో ఐక్యత, ఐక్య పోరాటం చాలా సంక్లిష్టమైంది. పశ్చిమదేశాల పరిణామాలపైనే కేంద్రీకరించుతూ, మౌలికంగా పరిశీలించే, భారతీయ కమ్యూనిస్టువర్గాలు, అమెరికా, లాటిన్ అమెరికా, క్యూబా, బొలివియాలో చేగువెరా నాయకత్వంలోని సాయుధ పోరాటాలను అధ్యయనం చేయుట నామమాత్రం చేసారు. ఆసియా, ఆఫ్రికా విస్తృత భూభాగాలలో, అత్యంత జనసాంద్రత కలిగిన ప్రాంతాలలో విప్లవోద్యమాలు వీటిని అధ్యయనం చేయవలసిన అవసరాన్ని గుర్తించజాలక పోయాయి.

భారతదేశంలో కూడ స్వాతంత్ర్య అవతరణ నాటినుండి "నూతన అతివాద వైఖరి" పురోగమించసాగింది. భారత కమ్యూనిస్టుపార్టీలోని ఒకభాగం 1964లో వేరే సి.పి.ఐ. (యం) పార్టీగా యేర్పడే నాటికే, "నూతన అతివాద వర్గం వొకటి బలంగానే వున్నది. సి.పి.ఐ. (యం)లోని వొక ప్రధాన భాగమే, అతి త్వరగానే భారతదేశంలో పరిస్థితులు నూతన అతివాద విధానాలు అనుసరణీయం కాదని స్పష్టం చేస్తున్నవని, "రివిజనిస్టులు"గా పేర్కొంటున్న సి. పి. ఐ. మాతృసంస్థకు చేరువయ్యారు. అంటే, నూతన అతివాదం వొక ప్రత్యేక రాజకీయ విధానంగా కొనసాగి, తరువాత నక్సల్బరీ పార్టీలో బాధ్యులయ్యారు, వారే అరాచకవాదులుగ, హింసావాదులుగ పరిగణించబడ్డారు. బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో "హింసావాదాన్ని" లేక "టెర్రరిజాన్ని" చేబట్టినవారు కమ్యూనిస్టుపార్టీలో చేరిన వారెందరో వున్నారు. కాని, యిప్పుడు కమ్యూనిస్టు పార్టీనుండి "టెర్రరిజం-హింసా" వాదం వైపు తిరిగి వెళ్ళుటయే ప్రత్యేకంగా చెప్పుకొనవలసింది. ఆఫ్రో-ఆసియన్, లాటిన్ అమెరికన్, తదితర పశ్చిమదేశాలలోని "నూతన అతివాద" వర్గాలతో, వారి వైఖరులతో మమేకమైనవారే నక్సల్బరీ కమ్యూనిస్టులు. నూతన అతివాదంవైపు ఆకర్షించబడినవారు సి.పి.ఐ. (యం), సి.పి.ఐ.ల లోని సోదర కమ్యూనిస్టుల వంటివారే. వారి చర్యలు, వైఖరులు కొంతవరకు దేశంలోని వామపక్ష వుద్యమాన్ని, ప్రక్కదారులు పట్టించుతూ నష్టదాయక మౌతున్నది. కమ్యూనిస్టు వుద్యమం గతంలో వారితో సంప్రదింపులు జరుపుతు వారు కమ్యూనిజంవైపు ఆకర్షితులగునట్లు చేసింది. ఇప్పుడూ అదే ఒకేఒక మార్గం."తుపాకీశక్తి"ఊహాజనిత,ఉగ్రవాదులను ఆకర్షించుతూ వుంది. కాని, తుఫాన్‌లా చుట్టుముట్టె ప్రజోద్యమం, మరింత శక్తివంతమైన దగుతుంది. "నూతన అతివాదం" వారసత్వంగానే "వొంటెత్తు పోకడ", శక్తివంతమైన ఉప్పెనలాంటి ప్రజోద్యమం అలాగే అగుతుంది. నేడు వామపక్ష అతివాదం వారసత్వంగానే "వొంటెత్తు పోకడను" కలిగి వుంది.

భారతదేశంలో కమ్యూనిస్టు వుద్యమం చాలావరకు అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమం చీలినందున, మనదేశంలో కూడ చీలిపోయింది. కమ్యూనిస్టుపార్టీ వున్న చాలాదేశాలలో, దగ్గరి దగ్గరిగా అన్నిదేశాలలో యిదే జరిగింది. భారత దేశంలో ప్రత్యేకత యేమంటే, యించుమించు సమాన బలమైన పార్టీలుగా రెండుగా అయినది. ఇతర దేశాలలో మెజారిటీ నాయకులతోపాటు పార్టీకూడ నూతన రాజకీయ విధానాన్ని రూపొందించిన 20వ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు విధానాలను బలపరుస్తూ అటు వెళ్ళుటయో లేక మావొసేటుంగ్ ఆలోచనా విధానాన్ని బలపరుస్తూ యిటువైపు వెళ్ళుటయో జరిగింది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో వచ్చిన చీలిక, భారతదేశంలోకూడ చీలికను తెచ్చిపెట్టినా, మౌలిక బీజాలు స్వాతంత్ర్యానంతర దేశ పరిస్థితులను కమ్యూనిస్టు శ్రేణులు అవగాహన చేసుకొనుటలోనే వున్నాయి. భారత దేశాభివృద్ధిని పెట్టుబడిదారి విధానాభివృద్ధిని, సుదీర్ఘ కాలం అలా జరుగుటలోనే వుంది. ఈ విషయాలన్నీ మరో సందర్భంలో అధ్యయనం చేయుట జరిగింది. అంచేత, ప్రస్తుతం యీ విషయం ప్రస్తావించుట, వివరించుట పునరుక్తి దోషానికి గురౌతుంది.

ఒక్కమాటలో చెప్పాలంటే, నూతన అతివాదం నిర్వచించబడుట, కమ్యూనిస్టుపార్టీ స్వరూపం నిర్ణయించబడుట, మన సమస్యలు లాటిన్ అమెరికా దేశాలైన బ్రెజిల్, మెక్సికో, చిలీ సమస్యలాంటివే. భారతదేశంలో "నూతన అతివాదం" లేక "నక్సల్బరీ దృక్పథం," పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధి కాలిపోవుట స్పష్టమగుటతో, ప్రత్యామ్నాయ విధానంగా బయలుదేరింది. భారతదేశంలో మరో నూతన అతివాదం, కాంగ్రెసు సోషలిస్టుపార్టీ రూపంలో ప్రత్యేకత కలిగి వుంది. అది తాను గాంధీయిజానికి, కమ్యూనిజానికి, అరాచకానికి ప్రత్యామ్నాయమంటుంది. నెహ్రూను అనుసరించే కాంగ్రెసువాదులు, సంయుక్త సోషలిస్టుపార్టీ, ప్రజా సోషలిస్టుపార్టీల శ్రేణులు, కొన్ని వామపక్ష పార్టీలు, డి.యం.కె.లోని కొన్ని వర్గాలు యీ వైఖరికి చేరువగా వున్నారు. ఈ దృక్పథాన్ని అనుసరించేవారిలో పునర్విచారము ప్రారంభమైంది. వీరితోపాటు మధ్యతరగతి ఉద్యోగులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు తదితర మేధావివర్గాలవారు "నూతన అతివాద" వర్గాల శ్రేణులుగా రూపొందుతున్నారు.

## నక్సల్బరీ పూర్వ పరిస్థితి :

భారత కమ్యూనిస్టుపార్టీ చీలి, సి. పి. ఐ. (యం) యేర్పడిన తరువాత 1965–67 లలో చారుమజుందార్ పార్టీలో అంతర్గత సైద్ధాంతిక పోరాటంలో భాగంగా, వివిధ అంశాలపై ఎనిమిది సిద్ధాంత పత్రాలను అనధికారంగా కమ్యూనిస్టు శ్రేణులకు విడుదల చేశారు. వీటిలో వెలిబుచ్చిన అభిప్రాయాలన్నీ నక్సల్బరీ రైతాంగ విప్లవ పోరాటాలకు పూర్వమే ఏర్పడిన అవగాహనలను తెలియజేస్తవి. బహుశా వీటిలో ఏొకేవొక పత్రం, చివరిది మాత్రమే నక్సల్బరీ ఘటనలు తరువాత వ్రాయ

బడినది. ప్రధాన సమస్యలపై చారుమజుందార్ సైద్ధాంతిక అవగాహనలను నిర్దిష్టంగా రచనలు స్పష్టం చేస్తున్నవి.

1. వర్గ శత్రువులను వ్యక్తిగతంగా నిర్మూలనం అనే అంశంపై మొదట శ్రీకాకుళంలో యాదృచ్ఛికంగా, కొన్ని నాయకత్వ వర్గాలు యీ వైఖరిని చేబట్టాయనే అభిప్రాయాన్ని కొన్ని రచనలు కలుగజేస్తున్నవి. దాస్‌గుప్తా రచన "ది నక్సలైటు మూమెంటు" వాస్తవానికి నక్సల్బరీ ఘటనలకు పూర్వమే, వర్గశత్రు నిర్మూలనాభిప్రాయాలను చారుమజుందార్ కలిగియున్నాడనుటకు 1965లో రచించిన 5వ డాక్యుమెంటు స్పష్టం చేస్తుంది. సాయుధ పోరాటానికి, వుద్రేకపూరిత పిలుపునిస్తూ, నిర్బంధకాండకు వ్యతిరేకంగా సాయుధ ప్రతిఘటనను యిలా వివరించారు. "నిరంకుశ పోలీసు ఆఫీసర్లు, సైనిక ఆఫీసర్లు, నిరంకుశ అధికారులపై దాడిచేయుటకు చైతన్యవంతమైన విప్లవ నాయకత్వం చేబట్టాలి. ప్రభుత్వ వాహనాలు, బస్సులు, రైళ్ళపై దాడిచేయుట చాలదు. నిర్బంధ విధానం సాగించేది పోలీసుస్టేషనులు కాదు. కాని ఆ స్టేషను పోలీసు ఇన్‌స్పెక్టరు, ప్రభుత్వ భవనాలు కాదు, కార్లు కాదు, ప్రభుత్వ దమనకాండ యంత్రాంగాన్ని నడిపే వ్యక్తులు. మన దాడి వీరిపైనా జరగాలి." [1] ఆ విధంగా, నిర్బంధ విధానాన్ని అమలుచేసే వ్యక్తులు, ప్రభుత్వోద్యోగులపై కేంద్రీకరించబడింది. అంతేగాక "కార్మికులు, విప్లవకారులు దాడి చేసేది, దెబ్బలు కొట్టుటకుకాదు, శత్రునిర్మూలనం చేయుటకని గుర్తించాలి. శత్రువుకు గాయాలు మాత్రమే తగిలితే, ప్రతీకారం తీర్చుకోవాలనే ప్రతిస్పందన కలుగుతుంది. శత్రువు నిర్మూలనం కావించబడితే, నిర్బంధకాండకు కారకులైన వారందరిలో భయోత్పాతం ఏర్పడుతుంది." అని ఆగస్టు 30, 1966లో చారుమజుందార్ వ్రాసిన 6వ డాక్యుమెంటులో నిర్మూలనం చేయవలసిన "వర్గశత్రువుల"లలో వివరించబడింది.

2. నక్సల్బరీ, దోబ్రా, గోభివల్లభపూర్, ముష్హరి, శ్రీకాకుళం తదితర ప్రాంతాలలో నక్సలైట్ల చర్యలలో సరియైన సమన్వయంకాని, దేశంలో మొత్తంగా అధికారాన్ని స్వాధీనం చేసుకొనుటకై చేసే, వొక వ్యూహంలో భాగంగా చేబట్టే చర్యలుగాకాని సమన్వయం చేయబడలేదు. వాస్తవానికి, యీ పోరాట ప్రాంతాలలో ఎడతెగని పోరాటం సాగించగలిగిన బలం, నిర్మాణం కలిగిలేవు. నక్సల్బరీ ప్రాంతం జాతీయ రహదారితో బాగా కలిసే రోడ్లను కలిగియున్నది. బెంగాలులో వున్న మంచి సైనిక కేంద్రాలలో వొకదానితో బాగా రహదారి, సమాచార సంబంధాలసు బాగా కలిగివుంది. రాజకీయ మద్దతుకు సంబంధించినంతవరకు కనిష్ట సహాయంకూడ లభించజాలదు. కారణం, నక్సలైట్లు విశ్వసించుచున్నట్లుగా భారతదేశ ప్రజలు విప్లవం కొనసాగించుటకు సర్వసన్నద్ధంగా లేరు. వొక్క నిప్పుకణం విప్లవాన్ని ప్రజ్వాలింపజేసే పరిస్థితి

---

1. విప్లవదాస్‌గుప్తా (1978) ది నక్సలైటు మూమెంటు, యాన్ ఎపిలాగ్, సోషల్ సైంటిటిస్టు. వా. 6. నం. 12. జూలై, 1978. పే. 8.

లేదు. చారుమజుందార్ అనుకొన్నట్లు, నక్సల్బరీ ప్రాంతంలో వచ్చిన వ్యవసాయ విప్లవజ్వాల, భారతదేశమంతటా కారుచిచ్చులా వ్యాపించే పరిస్థితులు లేవు. ఏప్రిల్ 1967లో ప్రకటించిన చారుమజుందారు చివరి డాక్యుమెంటు, ప్రభుత్వ రాజ్యాంగ యంత్రాంగాన్ని ధ్వంసం చేయవలసిన అవసరాన్ని పేర్కొని, వ్యవసాయ విప్లవాన్ని దేశమంతటా విస్తరింపచేయాలని, అందుకు స్థానికంగా వ్యవసాయ సాయుధ విప్లవ పోరాటాలు సాగించాలి. అవే దేశమంతటా చివరకు వ్యవసాయ సాయుధ విప్లవ పోరాటాలను వ్యాపింపచేయగలవు. రెండవ డాక్యుమెంటులో 1940 దశకంలో పశ్చిమబెంగాల్‌లో "తెభాగా" ఉద్యమ వైఫల్యం, కేంద్రంలో అధికారాన్ని స్వాధీనం చేసుకొనుటలో వైఫల్యాం ఎదుర్కొనుట జరిగింది. స్థానికంగా తెభాగా ఉద్యమం వైఫల్యంలో కేంద్రంలో అధికార స్వాధీన ప్రయత్నం అన్నీ విఫలమయ్యాయి.

3. నక్సల్బరీ సాయుధ రైతాంగ విప్లవ పోరాటాలకు ముందే సి.పి.ఐ.(యం) నాయకత్వంపై చారుమజుందార్ విశ్వాసాన్ని కోల్పోయారు. నాయకత్వాన్ని కూల ద్రోయుటకు విజ్ఞప్తులు క్రింది కమ్యూనిస్టు శ్రేణులకు చేయసాగారు. ఇదంతా క్రమ శిక్షణా చర్యలను సి.పి.ఐ. (యం) నాయకత్వం చేపట్టకముందే యీ వైఖరులు కొన సాగాయి. ప్రథమ డాక్యుమెంట్లలో పరోక్షంగా దాడిచేశారు. తదనంతర కాలంలో యీ విషయంలో నాయకత్వ వైఫల్యాలను పేర్కొంటూ దాడి తీవ్రంగా చేశారు. మూడవ డాక్యుమెంటులో పార్టీ, 1949 చైనా విప్లవాన్ని సరిగా అవగాహన చేసు కొనలేదని "చైనా పంథా"ను త్రోసిబుచ్చుట, "భారత పంథాను" రూపొందించుట అనే పేరుతో చేసారని, సాయుధ పోరాటం తప్ప మరో ప్రత్యామ్నాయం లేదని, వ్యవసాయ విప్లవం ద్వారా రైతాంగ విముక్తి పోరాటమొక్కటే మార్గమని పేర్కొన్నారు. మజుందార్ ఐదవ డాక్యుమెంటులో, ప్రభుత్వ హింసా, నిర్బంధకాండలకు పార్టీ ప్రతిచర్యలకు సంబంధించినంతవరకు, పార్టీ చురుకైన ప్రతిఘటన "కుక్క కాటుకు చెప్పుదెబ్బ"గా పార్టీ శ్రేణులలో నిరుత్సాహం రాకుండా కొనసాగించా లన్నారు. ఆగస్టు 1966లో ఆరవ డాక్యుమెంటు రూపొందించినప్పటికి, సి పి.ఐ. (యం) "చైనా పంథా"ను త్రోసిపుచ్చుటతో "చైనా పంథాను తిరస్కరించుటతో పార్టీ నాయకత్వం మార్క్సిస్టు-లెనినిస్టు పంథాను త్రోసిబుచ్చి, సంస్కరణవాదాన్ని పోరాటంలోనికి తీసుకొచ్చిందని[1]" నిర్ధారణకొచ్చారు.

4, ప్రజా సంఘాల యెడల చారు మజుందార్ వైఖరి నక్సల్బరీకి ముందూ, తరువాత వొకే విధంగా కొనసాగింది. పార్టీ ట్రేడు యూనియనులు, కిసాన్ సభ లలో నిర్వహించే "ఆర్థిక తత్వపూరిత" కార్యక్రమాన్ని ప్రధానంగా చేసిందని, రాజకీయ కార్యక్రమాలు, చర్యలుకు తగినంత ప్రాముఖ్యత నివ్వక, పార్టీలో ప్రజా సంఘాల నాయకత్వాలకే ప్రాధాన్యత, అధిక్యతనిచ్చుటతో పార్టీ నాయకత్వం బల

1. అదే. పే. 9.

హీనపడి, సంస్కరణ వాదంవైపు మొగ్గుటకు దారి తీసిందని మజుందార్ తీవ్రంగా విమర్శించారు. ప్రత్యామ్నాయంగా చారుమజుందార్ వ్యవసాయ విప్లవ కార్యక్రమాన్ని ప్రధానమైనంగా చేయాలన్నారు. ఈ దృక్పథాన్ని చేబట్టి, ఆచరణ కొనసాగించే పార్టీని నిర్మించాలన్నారు. చారుమజుందార్ ఎనిమిదవ డాక్యుమెంటులో పాక్షిక పోరాటాలను పూర్తిగా త్రోసిబుచ్చకపోయినా తగిన స్థానాన్ని వాటికి యివ్వకపోవుట, అసమాన పార్టీ ప్రజా సంఘాల వుద్యమాలను పరిగణలోనికి తీసుకొనకపోవుట, ఆయా ప్రాంతాల నిర్దిష్ట పరిస్థితులను పరిగణలోనికి తగినంతగా తీసుకొనజాలక పోవుటలోని వైఫల్యం స్పష్టము. విప్లవపార్టీ నిర్మాణానికి ఎంత ప్రాముఖ్యత వుందో, ప్రజా సంఘాల నిర్మాణానికి అంతే ప్రాముఖ్యత కలది కాని, అంతకంటే యెక్కువ కాదనే వైఖరి ముజుందార్ తీసుకొన్నారు.

## నక్సల్బరీ, చైనా మద్దతు పూర్వాపరాలు :

నక్సల్బరీ సాయుధ రైతాంగ గెరిల్లా పోరాట వుద్యమానికి చైనా కమ్యూనిస్టు పార్టీ యిచ్చిన రాజకీయ, నిర్మాణ, సైద్ధాంతిక మద్దతు ప్రారంభంలో ఆ వుద్యమం కొంతవరకు బలపడుటకు వుపయోగపడినా, చివరకు ఆ వుద్యమం బలహీనపడి, చీలికలు అగుటకు కూడా, అదే మద్దతు కారణమైందనుటలో ఆశ్చర్యంలేదు.

చైనా కమ్యూనిస్టుపార్టీ చారుమజుందార్ నాయకత్వాన్ని గుర్తించి, పెకింగ్ రివ్యూ పత్రికలో రెండు వ్యాసాలను ప్రచురించి, ప్రపంచ వ్యాప్తంగా ప్రచారాన్ని, మద్దతును ప్రకటించుట, అతని పత్రికా ప్రకటనలకు విశేష ప్రాధాన్యత నిచ్చి, చైనా విదేశాంగశాఖ వివిధ దేశాలలో వాటికి ప్రచారం పంపకం చేసింది. ఇది అంతా వొక్కసారిగా, చారుమజుందార్‌ను భారత విప్లవ కమ్యూనిస్టుల మహా నాయకుడుగా చేసాయి. మొదటినుండి విప్లవ కమ్యూనిస్టులలో అత్యధిక బలాన్ని కలిగియున్న టి. నాగిరెడ్డి నాటి పరిస్థితులలో తన సైద్ధాంతిక అవగాహనలకు అనుకూలంగా, అంత బలమైన పార్టీని నిర్మించజాలక పోయాడు. అదే కాలంలో చైనా కమ్యూనిస్టుపార్టీ సానుభూతి, సహకార, మద్దతులలో చారుమజుందార్ భారత విప్లవ కమ్యూనిస్టుల యేకైక నాయకుడయ్యాడు.

వాస్తవానికి నక్సలైట్ల వుద్యమ నాయకులలో నాగిరెడ్డి, దేవులపల్లి వెంకటేశ్వరరావు, అసిత్‌సేన్, పరిమళదాస్‌గుప్తా, శుశితల్‌రాయ్ చౌదరి వంటి సమర్థులైన యింకెందరో వున్నారు. వీరు ప్రారంభం నుండి చారుమజుందార్ విధానాలను తీవ్రంగా విమర్శిస్తూనే వున్నారు. తరువాతే చైనా తమ మద్దతును వుపసంహరించుకొన్నది. అయినా చారు మజుందార్ విధానాలను నక్సలైట్లలో అత్యధికులు వ్యతిరేకించుతున్నారు, లేనిచో 1970-71లో చైనా మద్దతు వుపసంహరణ అంత పనిచేసి వుండగలిగేది కాదు. నేడు కూడ చారుమజుందార్ వర్గీయులను త్రోసిబుచ్చి, అంతర్జాతీయ సైద్ధాంతిక పోరాటంలో అల్బేనియాని బలపరుస్తూ, చైనా

పార్టీని వ్యతిరేకించేవారు, లిన్ పియావో విధానాలను విమర్శనాత్మకంగా 'నలుగుర గ్యాంగ్'ను వ్యతిరేకించేవారు, నేటి చైనా నాయకత్వ వర్గాలకు దూరంగా వుంటు న్నారు. మిగతా, అత్యధిక నక్సల్బరీ గ్రూపులు ఎట్టి అరమరకులు లేకుండా, అంత ర్జాతీయత అనే పేరుతో చైనా పార్టీ విధానాలను బలపరుస్తున్నారు.

## కొన్ని లాటిన్ అమెరికన్, యూరోపియన్ నూతన అతివాద వైఖరులు :

నక్సల్బరీ విప్లవకారులు చైనా కమ్యూనిస్టు అనుభవాలను యాంత్రికంగా 1948-50 లలో నాటి సి.పి.ఐ. నాయకత్వాల శ్రేణులు, అవలంభించిన విధంగానే, 1970 దశకంలో అదే పొరపాటులను తిరిగి చేసారు. సి.పి.ఐ. ఐక్య పార్టీగా వున్నపుడే 1946-50 నాటి తెలంగాణా పోరాటాలను అధ్యయసంచేసి, కమ్యూనిస్టు శ్రేణులకు నాటి అనుభవాలను తెలుపుటలో పూర్తిగా వైఫల్యం పొందిన కారణం గానే పొరపాట్లు పునరావృతమైనవి. వర్తమాన చరిత్రనుండి శాస్త్రీయంగా గుణ పాఠాలు తీయనందుననేయని చెప్పవలసి వుంటుంది. కమ్యూనిస్టుపార్టీ స్వీయానుభ వాలను నాయకత్వం బీరువాలలో భద్రం చేయుట, అంతర్జాతీయ సైద్ధాంతిక పోరాటంలో సోవియట్ యూనియన్, చైనా రిపబ్లిక్‌లు బహిరంగ విమర్శలు ప్రతి విమర్శలు వివిధ కమ్యూనిస్టు శ్రేణులలోని విశ్వాసాన్ని దెబ్బతీసి, అదే కాలంలో లాటిన్ అమెరికా, యూరోపియన్ దేశాలలో వచ్చిన నూతన అతివాద దృక్పథాలు, వైఖరుల ప్రభావాలకు లోనగుటకు అనువైన వాతావరణాన్ని సృష్టించాయి.

నక్సల్బరీ కమ్యూనిస్టు విప్లవకారులు కార్మికవర్గ పాత్రను అలక్ష్యం చేయుట, వారు మావోయిజాన్ని అనుకరించుటను స్పష్టం చేయుటయేగాక, వారిని "మార్క్యూస్ సిద్ధాంతాల"కు చేరువగా చేస్తుంది. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో "కార్మికవర్గం సంకీర్ణవర్గంగా" అయిందనేదే మార్క్యూస్ సిద్ధాంతం, అంచేత దానిని విప్లవశక్తిగా నెంచరాదన్నాడు. మార్క్యూస్ "నూతన హింసావాదు ల"పై సమాజం తోసిపుచ్చిన దొంగలు, వ్యభిచారులు, అసంఘటిత నగర దరిద్ర బడుగువర్గాలపై, విద్యార్థులపై నిరుద్యోగులు సమాజంలో సంలీనంకాని వర్గాలపై ఆధారపడ్డారు. అయితే వొకవేపున మార్క్యూస్ యీ సిద్ధాంతాన్ని ప్రవచించేకాలం లోనే మే 1968లో ఫ్రాన్స్ రాజధాని పారిస్‌లో కోటిమంది ఫ్రెంచి కార్మికులు బ్రహ్మాండమైన చారిత్రాత్మక సార్వజనీన సమ్మె, పారిశ్రామిక కేంద్రాలను ఆక్రమిం చారు. ఈ పోరాటాన్ని బలమైన కార్మిక ట్రేడ్ యూనియన్‌లు ఏవీ రూపొందించ లేదు, పైగా పాల్గొనలేదు. దుర్భరమవుతున్న జీవన పరిస్థితులకు వ్యతిరేకంగా సమ్మెజేసి, విద్యార్థులు విశ్వవిద్యాలయాలను ఆక్రమించి తిరుగుబాటు చేయుటకు మద్దతును ప్రకటించుతూ, యాదృచ్ఛికంగా విప్లవోద్యమంలో చేరారు, నాయకత్వం

వహించారు. కార్మికవర్గ ఏ పార్టీ చేబట్టని ఈ ఉద్యమాన్ని చేబట్టి కార్మికులు, విద్యార్థులు నాయకత్వం వహించారు. ఈ సంఘటనలపై మార్క్యూస్ వ్యాఖ్యానించుతూ, మొత్తంమీద మార్క్స్ అభిప్రాయాలు సరియైనవే. కొన్ని అభిప్రాయాలను పునరాలోచించవలసి వున్నది అనే అభిప్రాయాలను ప్రచారంలో పెట్టారు.

విద్యార్థులలో కోహన్ బెండిట్, తదితర "వామపక్ష" అతివాదులున్నారు వీరు కార్మికులను ఎగతాళిచేసి, కమ్యూనిస్టులను ఛీత్కారం చేశారు. కార్మికులు రోజువారి జీవితంలో మిళితమై, కమ్యూనిస్టుల నాయకత్వంలోని ట్రేడ్ యూనియనులలో సంఘటితమై, తమ పోరాటశక్తిని, నాయకత్వ పాత్రను లేక ప్రముఖ పాత్రను కోల్పోయారని, యాదృచ్ఛికంగా వచ్చే సాహసకార్యమయిన విప్లవంలో, కార్మిక వర్గం ప్రముఖపాత్ర వహించుతుందన్న సిద్ధాంతాన్ని గేలి చేశారు. "తుప్పుపట్టిన కమ్యూనిజానికి" తాము వ్యతిరేకులమని ప్రకటించి, "వామపక్ష ప్రత్యామ్నాయాన్ని" ప్రతిపాదించారు. "ఈ వామపక్ష ప్రత్యామ్నాయం" పురాతన బకునిన్ వాదుల "కలగూరగంప" తప్ప మరొకటికాదు, శతాబ్దపు పూర్వమే మార్క్స్ వారి పురాతన "శాంతి సమూహం"ను అత్యున్నత "యువవీరులు" కార్యాచరణను పురిగొల్పుతారనే అవగాహనను ఖండించారు. యువవీరులు పురిగొల్పిన "విప్లవం తన మార్గాన్ని నిర్ధారించుకొంటుంది."కాన ఏ పార్టీ తమపంథాను రుద్దరాదన్నారు. అయితే, ఫ్రెంచి గుత్తపెట్టుబడిదారీ వర్గాల పత్రికలు, రేడియో, టెలివిజన్ తదితర వార్తా ప్రచార సాధనాలు ఈ "వామపక్ష అతివాదుల"కు బాగా ప్రచారం చేయుట కొందరికి ఆశ్చర్యాన్ని కలిగించింది. దీనికి ప్రతిగా తదనంతరం కార్మికవర్గం జరిపిన బ్రహ్మాండమయిన ప్రదర్శన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం క్రింద జరుపుటను ప్రకటించక బాయ్‌కాట్ చేసినది. ఇది వారి ప్రయోజనాలు యెక్కడ వున్నవో స్పష్టం చేస్తుంది. గుత్తపెట్టుబడిదారీ వర్గాలు వారిమిత్రులు, కార్మికవర్గాన్ని, కమ్యూనిస్టులను రెచ్చగొట్టి సాహసచర్యలు చేబట్టినట్లు చేసి, డీగోల్ నాయకత్వంలో ఇండోనేషియాను పునరావృతం చేసి, కమ్యూనిష్టుపార్టీని నాశనంచేయ తలపెట్టారు. మూడు సంవత్సరాల తరువాత కోహన్ బెన్‌డిట్‌గాని, వాని సిద్ధాంతాలుగాని, వామపక్ష అతివాదులు కాని యెవ్వరూ కనిపించలేదు. కమ్యూనిస్టుపార్టీ మాత్రం తన బలాన్ని పెంచుకోగలిగింది.

అదేకాలంలో ఇంచుమించుగా రేజిస్‌డిబ్రే అనే మరో ఫ్రెంచి దేశస్థుడు, క్యూబన్ విప్లవ సిద్ధాంత వ్యాఖ్యాతగా "విప్లవంలో విప్లవం" అనే రచనలో నూతన వామపక్ష అతివాద సిద్ధాంతాన్ని ప్రబోధించాడు. విప్లవ కార్యాచరణ సాయుధ పోరాటంతో ప్రారంభమవుతుందని నొక్కిచెప్పటమే అతని "ప్రత్యేకత" అనుకొనాలి. సాయుధపోరాటం అనే "చిన్న మోటారు" బ్రహ్మాండమయిన ప్రజోద్యమాలకు

"పెద్దమోటారు" శక్తిగా పనిచేస్తుందని ప్రకటించాడు. అది అతను లాటిన్ అమెరికా పరిస్థితులను పరిశీలించి చెప్పుతున్నానన్నాడు. అధికారమేగాక, బలమయిన కమ్యూనిస్టుపార్టీగూడ "తుపాకిగొట్టం ద్వారా పుట్టుకొస్తవని" అన్నాడు. నగరాలలో విప్లవ కార్యాచరణ చేబట్టుట ఆత్మహత్యా సదృశ్యమని, లేకుంటే సంస్కరణ వాదాన్ని చేబట్టుట అన్నాడు.

కార్మికవర్గం దాని వునికి నగరానికి ముడివేయబడి వుందని, ఉత్పత్తి విధానం విప్లవంలో ప్రధానపాత్రగాక, సహాయకపాత్ర వహించుతుందని, అడపా దడపా సాయుధచర్యలు చేబట్టుటకు నిర్మాణ కార్యకర్తలను గ్రామాలకు పంపుతుంది. లాటిన్అమెరికాలోని మెజారిటి కమ్యూనిస్టుపార్టీలు విప్లవానికి ద్రోహంచేసి సంస్కరణవాదాన్ని చేబట్టాయని డిబ్రె ప్రకటించాడు. అంతేగాక అవి తమ స్వాతంత్ర్యాన్ని సోవియట్ యూనియన్ విదేశాంగ అవసరాలకు తలవొగ్గి కోల్పోయాయని అన్నారు. అంచేత "విప్లవంలో విప్లవం" చేబట్టవలసిన సైద్ధాంతిక ప్రప్రథమ చర్య, నేడువున్న కమ్యూనిస్టు పార్టీలలో చీలికలుతెచ్చి, తగాదాలుతెచ్చి, నాశనం చేయాలి అన్నాడు.

కొంతకాలంవరకు డెబ్రె ముఖ్య సైద్ధాంతిక యీ ప్రణాళిక చాలామంది విశ్వాసాన్ని పొందగలిగింది. అంతర్జాతీయగొప్ప విప్లవ క్యూబా కమ్యూనిస్టు నాయకుడు చేగువెరా పేరుతో జతచేయబడియుండుటతో నిజాయితిపరులైన ఎందరో నాయకులకు విశ్వాసపాత్రమైంది.

కాని, కాలం గడచినకొలది అనుభవం, అది తప్పుడు పంథాగా స్పష్టమైంది. లాటిన్అమెరికాలో ఆ విధానాలను అమలుచేయ ప్రయత్నించినవారు విపరీత నష్టాలకు గురిఅయ్యారు. కమ్యూనిస్టేతర విప్లవకారులలో కూడ పెక్కుమంది డెబ్రెని విమర్శించప్రారంభించారు. అనేక నూతనానుభవాలు లభించాయి. ఐక్యత వొనగూడితే సాధారణంగా సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులు, శక్తివంతమైన ప్రజోద్యమాలు, సామాజిక విప్లవాత్మక మార్పులు, తిరుగుబాటుల అవసరం లేకుండానే చేకూరగల అవకాశాలున్నవని చిలీ పరిణామాలు స్పష్టం చేసాయి. అయినా చిలీలో అధికారానికి చేబట్టవలసిన పంథా, డెబ్రె ప్రాతిపదికలపై ఆధారపడిన వామపక్ష అతివాదులపంథాకు భిన్నమైనది. అంతమాత్రంచేత పూర్తిగ అంతర్యుద్ధ పరిస్థితులకు తావులేదని చెప్పుట సాహసమే అగుతుంది. పెరూ, బొలివియాలలో అమెరికా వ్యతిరేక విధానాలు వ్యవసాయ సంస్కరణలు చేబట్టుటతోనే సైనికశక్తులు అధికారంలోనికి వచ్చాయి. డెబ్రె జైలునుండి విడుదలఅయిన వెంటనే బొలివియా నుండి చిలీ వెళ్ళిపోయాడు. తన పూర్వసిద్ధాంతాలు అమలుచేయ వొత్తిడి చేయుట లేదు. ఇప్పుడు, సామ్రాజ్యవాదశక్తులు డెబ్రెని పెంపుడు సంతానంగా నెంచుటలేదు.

వామపక్ష అతివాదం, కార్మికవర్గం సాంప్రదాయ అవగాహనతో చారిత్రాత్మక

పాత్ర నిర్వహించాలా, మావోయిస్టు లేక మార్క్సిస్ట్ వైఖరులను చేబట్టి చారిత్రాత్మక పాత్రను విడనాడాలా అనేది ప్రధాన ప్రశ్న అయింది.

మనకాలంలో కార్మికవర్గం విప్లవంలో నాయకత్వపాత్ర వహించుతుందని మార్క్స్, ఎంగెల్స్ ఎప్పుడు ఆలోచించలేదు. కారణం, వారు అతి దరిద్రులుగ అణచివేయబడుతున్నారు. వారికి చరిత్రయే యీ పాత్రను కేటాయించింది. కారణం దానినైజం, ఉత్పత్తిలో మొత్తం పెట్టుబడిదారి విధానంలో దానిపాత్రను నిర్దేశించాయి. కార్మికవర్గం ఉత్పత్తి సాధనాలను కోల్పోయి వ్యక్తిగత ఆస్తిలేని వర్గమైంది అంచేత సహజంగానే అణచివేయబడుతున్న వర్గమైంది. దానిని అదనపు విలువ ద్వారా పెట్టుబడిదారి విధానంచే దోపిడి చేయబడే వర్గమైంది. పెట్టుబడిదారివిధానం ఆ విధంగానే మనగలుగుతుంది. కార్మికవర్గం దానిపనిద్వారా, అత్యంత అధునాతన ఉత్పత్తి విధానాలను చేబట్టుట, ఉత్పత్తి కొనసాగించుట ద్వారా అది వొక వర్గంగా అభివృద్ధి చెందింది. కార్మికవర్గానికి అది పనిచేయు విధానమే, దానికి క్రమశిక్షణను, నిర్మాణదక్షతను నేర్పుతుంది. ఈ వాస్తవికాంశాలే, కార్మికవర్గానికి మనకాలంలో స్వతంత్రపాత్రను చేకూర్చాయి. విప్లవవర్గమైంది. ప్రపంచవ్యాప్తంగా పెట్టుబడిదారి విధానంనుండి సోషలిజంలోనికి పరివర్తనకు నాయకత్వపాత్ర వహించగల శక్తిగలిగిన వర్గమైంది. అయితే, రోజూ వారి ఆర్థిక సమస్యలపై పోరాడే క్రమంలోనే కార్మికవర్గం సోషలిస్టు చైతన్యాన్ని సంపాదించుకొనజాలనిచో యీ చారిత్రాత్మక పాత్రను నిర్వహించజాలదని లెనిన్ స్పష్టం చేసాడు. అంచేత కార్మికవర్గం దాని శక్తిసామర్థ్యాలు పూర్తిగ వినియోగించబడాలంటే, కార్మికవర్గ అగ్రగామిదళ పార్టీ నాయకత్వంలో పోరాటాలు కొనసాగించవలసి వుంటుంది. ఆదే మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ, యాదృచ్ఛిక ప్రజోద్యమాలకు, సామాజిక చైతన్యానికి వారధి కావాలి. ఆ కారణంగానే దాని నాయకత్వ పాత్ర, మార్క్సిస్టు-లెనినిస్టుపార్టీ అగ్రగామిదళ పాత్రల తాత్విక సమగ్రతల పరిపూర్ణతగా గుర్తించాలి.

రెండు పెదధోరణులను స్పష్టం చేయవలసి వుంది. ఒకటి ఆర్థిక పోరాటాల పాత్ర. కార్మికవర్గ పోరాట కార్యాచరణను ఆర్థిక పోరాటాలకే పరిమితం చేయుట ఆర్థికతత్వమగుతుంది. కాని ఆర్థిక పోరాటాలు కొనసాగించుట ఆర్థికతత్వం కాదు. నక్సల్బరీవాదులు యీ రెండు చర్యలను గందరగోళం చేస్తున్నారు. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌లు వాస్తవానికి, మూడు పోరాట రూపాలను సూచించారు. అవే ఆర్థిక, సైద్ధాంతిక, రాజకీయ పోరాటాలు. కార్మికవర్గం న్యాయవేతనానికి, అధిక జీవన ప్రమాణాలకై పోరాడజాలనిచో, రాజ్యాధికారానికై యేమాత్రం పోరాడజాలదని వారు అనేకసార్లు చెప్పారు. వారు ఆర్థిక పోరాటాల అవసరాన్ని నొక్కి చెప్పారు. అదేకాలంలో ఆర్థికతత్వంపై పోరాటాన్ని నొక్కిచెప్పుట జరిగింది. ఇదే మరువరాని అంశం.

రెండవ పెడ సైద్ధాంతిక అవగాహన, కార్మికవర్గ దైనందిన పోరాటాలనుండి గాక, వాటి వెలుపల నుండి సామాజిక చైతన్యాన్ని గలిగించుటకు చేయు ప్రయత్నాలు, లెనిన్ మేధావుల వర్గం ప్రత్యేక సామాజిక పాత్ర నిర్వహించాలన్నారు. దీని అర్థం కార్మికవర్గానికి నాయకత్వం వహించాలని కాదు. శాస్త్రీయ సోషలిస్టు రాజకీయ పరిజ్ఞానాన్ని పొందిన మేధావి వర్గాలు సామాజిక పాత్రను నిర్వహించాలని నొక్కి చెప్పారు. ప్రప్రథంగా కార్మికవర్గంలో సామాజిక చైతన్యం కలిగించాలి. గ్రామిక వర్గాలనుండి వచ్చిన మేధావివర్గాలు ఈ కర్తవ్యాన్ని సమర్థవంతంగా చేయగలవన్నారు. ఇదే, గ్రాంసీ కూడ నొక్కి చెప్పాడు.

జీన్‌పాల్‌సార్టే ప్రవచించిన,"ఆస్తికత లేక ఉనికి తత్వం మూసలో "నూతన వామపక్ష అతివాదం" తన దృక్పథాన్ని రూపొందించింది. సార్టేతోపాటు కామస్‌లు "ఆస్తిక లేక ఉనికితత్వ వాదాని"కి రెండవసారి ప్రాణంపోసి అభివృద్ధి చేసారు. అదే "వామపక్ష అతివాదం"లో, దాని ప్రవక్తలు విమర్శించిన "వికృత రూపం"లో ప్రత్యక్షమైంది. నాటి "నూతన వామపక్ష అతివాద" సిద్ధాంతవేత్తలు ఆస్తికత లేక ఉనికి తత్వంలో బాగా శిక్షణ పొందారు. అట్టివారిలో హేడెగ్గెర్ శిష్యుడు, అనుచరుడు అయిన మార్క్యూస్ ముఖ్యుడు. అదే విధంగా సార్ట్రె, ఫ్రాంజ్ ఫానాన్‌ల శిష్యుడైన రేజిస్‌డెబ్రె మరో ముఖ్యుడు, ఆస్తికతలేక ఉనికి తత్వంతో బాగా ప్రభావితుడయ్యాడు.

నూతన వామపక్ష అతివాదులు ప్రేమించి, గౌరవించి, అనుసరించే తాత్వికవేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలలో ముఖ్యులు ఫ్రెంచి తత్వవేత్త జీన్‌పాల్ సార్ట్రె ప్రథములు. వీరిని అనుసరించే "వామపక్ష అతివాదులు" తమ ప్రపంచ దృక్పథాన్ని రూపొందించుకొన్నారు. మే 1968 ఫ్రాన్స్ ఘటనలలో, నాటి చర్యలలో స్వయంగా అత్యంత చురుకైన పాత్రను విద్యార్థులే చేబట్టి, వామపక్ష అతివాద శక్తులను ప్రోత్సహించి, మద్దతు చేకూర్చారు.

సామాజిక వాస్తవికతపై ముఖ్యంగా అభివృద్ధి చెందిన పారిశ్రామిక పెట్టుబడి దారీ సమాజంపై "వామపక్ష అతివాదం" చేయు విమర్శనా దాడికి మౌలిక ప్రాతిపదిక అర్థరహితం, అసంగతం, మానవుని ఉనికికే ప్రమాదం తెచ్చే అర్థంలేని ప్రకృతిగా స్పష్టం చేసారు. వామపక్ష అతివాదుల "ఆస్తికత లేక ఉనికితత్వ దృక్పథంలో ఆల్బెర్ట్ కామస్ వివరించిన అర్థంలేని "ఆస్తికత-విప్లవం"లో ప్రతిబింబించింది. "దేవుడు మరణించాడు" అనే నైజెకీన్ ప్రాతిపదికను బలపరచింది. అంటే అధికారాన్ని త్రోసివేయుట, సామాజిక అణచివేతకు చిహ్నంగా త్రోసిబుచ్చుట. వామపక్ష అతివాదం అధికారతత్వాన్ని వ్యతిరేకించి త్రోసిబుచ్చుట, సార్ట్రె, కామస్‌లు ఆస్తికత లేక ఉనికి తత్వంతో సామాజిక అణచివేతనను త్రోసిబుచ్చిన స్థాయితో జరిగింది. సామాజిక వాస్తవికతను వస్తోత్పత్తిలో మౌలిక విముక్తిని వామపక్ష అతివాదం చూడ

లేకపోయిన ఫలితంగా తన వాదనలకు మూలాన్ని ఊహాజనిత ఆదర్శాల సారాంశంలో చూసి చూసింది. ఆదర్శాలు తిరుగుబాటు ద్వారా అమలులోనికి తేవాలనే నిర్ణయం, మానవ అవతరణ శాస్త్ర సామాజిక వాస్తవికత, స్వేచ్ఛా నిర్ణయం లేని మానవుని ఆస్తికతా సారాంశముల నుండి రూపొందింది.

నూతన వామపక్ష అతివాదం 1960 దశకం చివరకు 1970 దశకం ప్రారంభానికి, మరో దశకు చేరుకొన్నది. ఈ దశ వైఖరులు, విలువలు, మనోప్రవృత్తులు బహిర్గతం కాజొచ్చి, వారిని అనుసరించేవారి అభిప్రాయాలు, సానుభూతులు, సార్టెగ్రి కాని లేక మార్క్స్యిస్ల ప్రణాళికలకు చేరువలో లేవు కొత్త మేధావి వర్గాల ప్రోత్సాహం, నూతన ఆదర్శాలు, మారే ప్రపంచానికి దర్పణం పట్టే అవసరమయ్యాయి. నూతన వామపక్ష అతివాదం, నూతనావసరాలకు తగిన పద్ధతులు, ప్రణాళికలు జనం ముందుంచింది.

## కమ్యూనిస్టు పార్టీల స్వతంత్రత, కార్మికవర్గ అంతర్జాతీయ ఐక్యత, సౌభ్రాతృత, రెండింటి సమన్వయమే శాస్త్రీయ మార్క్సిస్టుల ఆచరణ:

పశ్చిమ యూరపు కమ్యూనిస్టు పార్టీలు 1970 దశకంలో తమ తమ పార్టీల స్వతంత్ర పాత్ర నైజాన్ని స్వయం నిర్ణయ శక్తిని నొక్కి చెప్పడం ప్రారంభించాయి. గతంలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల "నాయకుడు"గా, ముఖ్యకమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గం అనుసరించిన పద్ధతులు, విధానాలు, దాని వారసత్వం, కమ్యూనిస్టుపార్టీలు కొన్ని "యూరోకమ్యూనిజం"వైఖరుల ప్రభావాలకు లోనగుటకు కారణభూతమయ్యాయి. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గం, మార్క్స్, ఎంజెల్స్ల కాలంలో ప్రధానంగా వివిధ కమ్యూనిస్టు పార్టీల సంప్రదింపులు, మార్గదర్శికత్వం వహించే సలహా, సమన్వయ సమితిగా పనిచేసింది గాని, క్రమశిక్షణను నెలకొల్పే నిర్మాణంగా పనిచేయలేదు. లెనిన్ కాలంలో సైద్ధాంతిక ఐక్యత, సమన్వయాలను పెంపొందించే దశకు అభివృద్ధి చెందింది. లెనిన్ తదనంతర కాలంలో అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీగా, నిర్మాణ నిబంధనలు, అభిశంసనలు, వెలివేతలతో ప్రపంచ కార్మికవర్గ నియంతృత్వం అనే పేరుతో దాని నైజాన్ని మార్చివేసి, కార్యవర్గ నియంతృత్వ సంస్థగా సలహాసంఘ నైజాన్ని కోల్పోయి, పెడమార్గంలో పడినందున, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో సంక్షోభాలకు కారణమైంది. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో కొమింటరన్ రద్దయినా, కొద్దికాలంలోనే "కొమిన్ ఫారం" రూపంలో తిరిగి తలెత్తినా, పూర్వ సంప్రదాయాలను, పెడధోరణులను విడనాడజాలకపోయింది.

కొమింటర్న్ 1920, 30 దశకాలలో, సోవియట్ యూనియన్ ఒకే ఒక సోషలిస్టు దేశంగా, అమెరికా, ప్రపచ పెట్టుబడిదారీవర్గ దేశాలతో దిగ్బంధనం చేయబడి, సైనికంగా దండ యాత్రలకు, ఆర్థిక, ద్రవ్య, పారిశ్రామిక కుట్రలకు

లోనగుతున్నపుడు, అది అనుసరించిన పద్ధతులు, విధానాలు చారిత్రికంగా కొంత వరకు సమర్థనీయమే అయినా, అట్టి అవసరాల అనంతరం కూడా, ఆ విధానాలు కొనసాగుట, శాస్త్రీయ సోషలిజం కాజాలదు. ఈ చేదునిజాల అనుభవాలే ముఖ్యంగా జకోస్లోవేకియా, పోలెండు, హంగరీ ఘటనల చారిత్రిక అనుభవాలు, యూరోపియన్ కమ్యూనిస్టుపార్టీలలో కొన్ని అవాంఛనీయ పెడధోరణులకు "యూరోకమ్యూనిజం", "ఆఫ్రికన్ కమ్యూనిజం", "అరబ్బు సోషలిజం", "చైనీస్ పంథాలో సోషలిజం"ల వంటి ధోరణులకు మూలమగుటకు ఆశ్చర్యపడనవసరం లేదు. ఈ చారిత్రికాంశాలను, యీ సందర్భంలో ఇంతకంటే లోతుగా వెళ్ళనవసరం లేదు.

అయినా, యీ సందర్భంలో, వివిధ కమ్యూనిస్టు పార్టీలలో ముఖ్యంగా గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీ కమ్యూనిస్టు పార్టీల కార్యక్రమాలలో "సోజలిజానికి బ్రిటన్ మార్గమని", "సోషలిజానికి ఇటాలియన్ పంథా"యని, "సోషలిజానికి ఫ్రాంసు మార్గమని" స్పష్టంగా పేర్కొనుటను మనం మరచిపోరాదు. అంతేగాక భారతదేశంలో సి.పి.ఐ; సి.పి.ఐ(యం)లు "సోషలిజానికి మన స్వంత పంథా"ని రూపొందించామని, ముఖ్యంగా 1965 నుండి చెప్పుటకూడ మనకు గుర్తు వుంటుంది. అంతేగాక ఐక్యకార్యాచరణ, కమ్యూనిస్టు వుద్యమ ఐక్యతద్వారా"సోషలిజానికి మన స్వతంత్ర పంథా"కు పరిపూర్తి స్వరూపం యేర్పడుతుందని, వుద్యమ శ్రేణులు నొక్కి చెప్పుతున్నవి. చారిత్రక పరిణామం కూడా అదేమార్గంలో గోచరమగుచున్నది. విప్లవోద్యమాలు వివిధ దేశాలలోని ప్రత్యేక పరిస్థితులను పరిగణలోనికి తీసుకొనుటలేదు, మార్క్సిజం-లెనినిజంల సర్వసాధారణ వైఖరులను, నైజాన్ని విడనాడి, చైనాలో మార్క్సిజాన్ని చైనీయం, అరబ్బు దేశాలలో అరబ్బీయిజం, ఆఫ్రికాలో ఆఫ్రికనీజం, ఆసియాలో ఆసియానీజం చేయు ప్రయత్నాలు శాస్త్రీయ సోషలిజం కాదు.

అట్లాంటిక్ మిత్రకూటమి 1977 జనవరిలో "యూరోపియన్ కమ్యూనిజం, అట్లాంటిక్ మిత్రకూటమి" అనే నివేదికను కేంబ్రిడ్జ్, మాసెసెట్యూట్స్ ఆధ్వర్యంలో ప్రచురించింది. "యూరప్‌లో అనిశ్చిత పరిస్థితులు వున్నపుడు, అట్లాంటిక్ కూటమిలో మార్పులు వస్తున్నప్పుడు, యూరోపియన్ కమ్యూనిస్టుపార్టీలో కన్పడుతున్న యూరో కమ్యూనిజం ధోరణుల అవకాశాలను అమెరికా తీసుకొని, ఆ పార్టీలమధ్య భేదాభిప్రాయాలను పెంపొందించి, ప్రప చ కమ్యూనిజంలో చిచ్చుపెట్టాలని, అట్లాంటిక్ కూటమికి కమ్యూనిజం వుపద్రవకరమైనదిగా నెంచాలని" పేర్కొన్నది.

ఇటాలియన్ కమ్యూనిస్టుపార్టి జనరల్ శెక్రటరీ ఎన్‌రికొబెర్లింగెర్ 1975 మార్చి 19న "లాయూనిటా"లో జనరల్ ఎన్నికల సందర్భంలో "నాటో నుండి ఇటలీ నిష్క్రమించాలనే ప్రశ్నను, ఇటాలియన్ కమ్యూనిస్టుపార్టీ యింకా యే మాత్రం లేవనెత్తదని" ప్రకటించుట అన్నివర్గాలలో యెంతో చర్చనీయాంశమైంది.

అణు సంబంధాల మిత్రకూటమికి సర్వసైన్యాధ్యక్షుడైన జనరల్ నైనొపాస్తిని స్వతంత్ర అభ్యర్థిగా నిలబెట్టగా ఇటలీ కమ్యూనిస్టుపార్టీ బలపరచింది. ఈ సందర్భంలో గియోర్గిఅమెన్‌డోలా "కమ్యూనిస్టులు, అట్లాంటిక్ కూటమిలో, నాటోలో వుండుట వైరుధ్యపాత్రనే కలిగి వుంటుందని, అందుకే, మిత్రకూటమి నుండి వైదొలగాలని కోరుట, క్రమేణా సమతూకపు నిరాయుధీకరణ, శాంతి దృక్పథం సైనిక రాజకీయ కూటముల వునికికే ప్రమాదకరమగుటతో వాటి ఉనికే నిరర్ధకరమగుతుందని వారి అవగాహన లక్ష్యంగా వుంది" అని నివేదించాడు.

ఇటాలియన్ కమ్యూనిస్టు నాయకుడు బెర్లింగర్, కొరియర్‌డెల్లా సెరా పత్రికకు 21 జూన్ 1975న యిచ్చిన ఇంటర్వ్యూలో "మేము ఎట్టిషరతులు లేకుండా "సోషలిజానికి ఇటాలియన్ పంథా"లో పయనియగలము అని తెలియజేసారు. ఇంకా "అట్లాంటిక్ వొడంబడిక పరిమితులలోనే, దానిని ప్రశ్నించకుండానే, ఇటలీ భవిష్యత్తును స్వచ్ఛందంగానే నిర్ధారించుకొనగల హక్కును వినియోగించుకొనగలదని" నివేదిక స్పష్టం చేసింది. ఇదే విషయాన్ని యూరోపియన్ కమ్యూనిస్టుపార్టీల కాంగ్రెసు సమావేశం బెర్లిన్‌లో స్పష్టం చేసారు.

అమెరికా విదేశాంగ విధానం, అంచేతనే "సందిగ్ధావస్థ"లో పడింది. ఫ్రాంసు, ఇటలీ కమ్యూనిస్టుపార్టీలు పాక్షికంగానైనా అధికారంలోనికి రాగలవని భయపడుతున్నారు, తగిన చర్యలు, జాగ్రత్తలు తీసుకొంటున్నారు. అమెరికన్ వర్గాలు యీ పరిస్థితిని అధిగమించుటకు యీ క్రింది తాత్కాలిక చర్యలు చేబట్టారు. i) నాటో సభ్యదేశాలలో అమెరికా సైనిక అవసరాలను, ప్రయోజనాలను వ్యాప్తి చేసుకొనుట, అందుకు ప్రాథమిక చర్యగా, అమెరికా నిష్క్రమించాలనే నినాదాన్ని నీరుగార్చే పని చేస్తున్నారు. ii) కమ్యూనిస్టు బలం, కంట్రోలు ప్రభావంతో వారి నిష్క్రమణకు ప్రభుత్వం ప్రోత్సహించాలి. iii) నాటో పరిధిలో, నమ్మకంగా దాని నిర్ణయాలను, కూటమి ప్రయోజనాలకు ఉపక్రమించాలి. నష్టం కలుగజేసే అనుమానాస్పద చర్యలు చేబట్టరాదు. iv) నాటో కూటమిలోనే కమ్యూనిస్టు ప్రభుత్వాలను తొలగించాలిగాని, సభ్యదేశాన్ని మాత్రం కాదు. ఒక ఖాళీ యేర్పడుతుందనే మనస్తత్వానికి లోనుకారాదు. ఈ విధానాన్ని అమెరికా చిరకాలంగా అనుసరించింది. v) రక్షణ బాధ్యతను స్వీకరించినందుకు అమెరికాకు సంతృప్తికర షరతులను సభ్యదేశాలు ద్వైపాక్షిక వొప్పందాలకు అంగీకరించవలసి వుంటుంది. ఈ అంశాలతో పశ్చిమ యూరపులో అనుసరించే విదేశాంగ విధానం, ప్రధానంగా కమ్యూనిస్టు ప్రభుత్వాలు యేర్పడే అవకాశంగల ఫ్రాన్స్, ఇటలీలలో అనుసరించే విధానం స్పష్టం చేయబడింది.

లెనిన్ అక్టోబరు విప్లవానికి పూర్వమే, ఆగస్టు, అక్టోబరు 1916లో "బూర్జువా ప్రభుత్వాన్ని కూలద్రోయుటకు, ప్రతీఘాతక విప్లవాలను తిరుగగొట్టుటకు విప్లవ వర్గాలకు విడువకుండా కార్మికవర్గ నియంతృత్వ అవసరాన్ని" నొక్కి చెప్పారు.

అంతేగాక, అన్ని జాతులు సోషలిజానికి తప్పనిసరిగా చేరుకొంటవని, కాని అవి అన్నీ ఒకే వొక విధంగా చేరుకొనవని, ప్రతిదీ ప్రజాస్వామ్యానికి, తన వంతు స్వతంత్ర పాత్రను చేకూర్చి, కార్మికవర్గ నియంతృత్వానికి యేదో వొక రకపు ప్రజాస్వామ్య అంశాలతో సామాజిక జీవనం వివిధ మోతాదులలో సోషలిజంగా పరివర్తన చెందుటకు తోడ్పడగలవని" చెప్పారు. అంచేత, చారిత్రిక భౌతికవాదం అనే పేరుతో భవిష్యత్తులో "వొకే నమూనా" అనుసరించబడాలని చెప్పుటకంటే హాస్యాస్పద విషయం మరొకటి లేదని కూడ చెప్పారు. (కలెక్టడు వర్క్స్. వా. 23 పే. 69-70 లు) "మార్క్సిజం వొక వ్యంగ్య చిత్రణ"అనే వ్యాసంలో వివరించారు.

కారిల్లో "యూరో కమ్యూనిజం"లో వెలిబుచ్చిన అభిప్రాయాలు, వాటిపై వచ్చిన వివిధ విమర్శలు క్లుప్తంగా తెలుసుకొందాము.

కారిల్లో కార్మికవర్గ నియతృత్వం విషయమై ప్రస్తావించుతు, మార్క్స 5 మార్చి 1852 లో వెడ్‌మేయర్‌కు వ్రాసిన లేఖలో కార్మికవర్గపు "నియంతృత్వానికి" ప్రతిగా యేకైక 'వర్గ నాయకత్వాన్ని' విడగొట్టి చూపారని తెలిపారు. ఈ విషయమై మార్క్స్, ఎంజెల్స్‌లు 1917 లో లెనిన్‌ల అవగాహనలను కారిల్లో యిలా సిద్ధాంతీకరించారు. "ప్రపంచంలో కార్మికవర్గం, బాగా కేంద్రీకరించబడిన అత్యంత చైతన్యవంతమైన విప్లవ వర్గమని, దేశంలో చాలా చిన్న మైనారిటి, రైతాంగం అత్యధికంగా వున్న పెటీ బూర్జువా సముద్రంలో వొక నీటి బిందువుగా వుంది. అట్టి పరిస్థితులలో కార్మికవర్గం నియంతృత్వ అంశాన్ని సమాజంలో కార్మికవర్గం ఆధిపత్యం వహించే, "కార్మికవర్గ ఏకైక నాయకత్వాని"కి మారుగ, (లేక రెండూ వొకటిగా) చెప్పజాలము. కార్మికవర్గ ఏకైక నాయకత్వాన్ని సమాజంలో సుస్థిరం చేయుటకు దాని ఆధిక్యతను కొనసాగించుటకు "నియంతృత్వం" అనే ధోరణి తప్పనిసరి మార్గం. మార్క్స్, ఏంజెల్స్, లెనిన్‌లు యీ వాస్తవాన్ని గుర్తించారు అని, ఆ వెంటనే ఆ ప్రతిపాదనను బలపరచుటకు యిలా వ్రాసారు. "అభివృద్ధి చెందిన యూరపియన్ దేశాలలో, పెట్టుబడిదారీ ప్రపంచంలో నేడు శ్రామిక ప్రజాసామాన్యం సమాజంతో అత్యధిక మెజారిటీగా, సాంస్కృతిక శక్తిగా, సైద్ధాంతిక ప్రాముఖ్యతాంశంగా, అత్యధికులుగా, కార్మికవర్గ స్థానాలకు చేరువగా వున్నారు. మార్క్స్, ఎంజెల్స్, లెనిన్‌లు కార్మికవర్గ నియంతృత్వం తప్పనిసరియని తలచిననాటి పరిస్థితులకు నేటి పరిస్థితులు భిన్నమైనవన్న విషయం స్పష్టం.[1]"

కారిల్లో "యూరో కమ్యూనిజం అండ్ ది స్టేటు" అనే గ్రంధానికి ఉపోద్ఘాతంలోనే యీ సమస్యపై 1917-18 ల లోని లెనిన్ సిద్ధాంత రచనయైన "స్టేట్

1. యూరో కమ్యూనిజం-ఆర్-సైంటిఫిక్ సోషలిజం (1979) మొహిత్ సేన్; దిలిప్ బోస్. కారిల్లోస్ యూరో కమ్యూనిజం అండ్ ది స్టేట్....దిలిప్ బోస్, పే. 30-31.

అండ్ రివల్యూషన్"తో విభేదించుతున్నానని స్పష్టం చేసారు. లెనిన్ సిద్ధాంత అభిప్రాయాలు రష్యాలో అనుసరణీయాలని, సిద్ధాంత రీత్యా ఆ కాలంలో మిగతా ప్రపంచంలో అనుసరణీయాలన్నారు. అవి నేడు అనుసరణీయాలు కావన్నాడు. కారణం, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందిన పశ్చిమ యూరప్‌లో పరిస్థితులలో ఎంతో పురోగమనం జరుగుటతో మార్పు వచ్చిందన్నారు. ఆర్థిక వ్యవస్థా నిర్మాణాలలో, సామాజిక అభ్యుదయ శక్తులలో వచ్చిన వాస్తవిక విస్తృతి, ఉత్పత్తి శక్తుల అభివృద్ధిలో, అణుశక్తితో సహా, ఫాసిస్టు శక్తులపై విజయం, వలసల అంతం సమీపించుట, సోషలిజం పురోగమించుటతో వచ్చిన విస్తృతమైన మార్పులు అని చెప్పవచ్చును.

లెనిన్, కాట్స్కీతో చేసిన సైద్ధాంతిక చర్చలలో "నియంతృత్వ పాలనయే చట్టమూ పరిమితులు విధించజాలని, బలప్రయోగంతో జరుగుతుందని, కార్మికవర్గ విప్లవ నియంతృత్వం, బూర్జువా వర్గంపై కార్మికవర్గం హింసా ప్రయోగం ద్వారా సంపాదించబడి, ఆ విధంగానే కొనసాగుతుందని" స్పష్టం చేసారు. లెనిన్ యీ ప్రవచనాన్ని ఆ సందర్భం, రాజ్యాంగ యంత్రంపై మార్క్సిజం యిచ్చే మౌలిక అవగాహనకు దూరంగా అర్థం చేసుకొనరాదు. అంటే, "ప్రభుత్వం లేక రాజ్యం ప్రత్యేక హింసా నిర్మాణ రూపం," "ఒక వర్గాన్ని అణచివేసే నిర్మాణ హింసా స్వరూపం", కార్మికవర్గం అణిచివేయవలసినది సహజంగానే బూర్జువా వర్గం, దోపిడీదారుల ప్రతిఘటనను అణచివేయుటకు కార్మికవర్గానికి యిది (రాజ్యం) అవసరం. ఒక్క కార్మికవర్గం మాత్రమే అణచివేతకు సారధ్యం వహించి, నిర్వహించగలదు. కారణం, కార్మికవర్గ మొక్కటే నిరవధికంగా అణగారిన అన్ని వర్గాలను ఐక్యంచేసి, పూర్తిగా బూర్జువా వర్గాన్ని రూపుమాపువరకు పోరాడగలిగిన విప్లవ వర్గం.

కార్మికవర్గం విజయవంతంగా అధికారాన్ని చేజిక్కించుకొనిన అనంతరం సోషలిస్టు నిర్మాణం విజయవంతంగా సాగుటకు, కార్మికవర్గం యితర అన్ని వర్గాలను ఐక్యంచేసి, దోపిడి వర్గాలను అణచివేయు పాత్ర వహించవలసి వుంటుంది. అది కార్మికవర్గ నాయకత్వం వహించి, యితర శ్రామిక వర్గాల ప్రజాసామాన్యాన్ని నడుపుటకాక మరేమి అవుతుంది. అంచేత "కార్మికవర్గ నియంతృత్వానికి రెండు పార్శ్వాలున్నవి: వొకటి విచ్ఛిన్నత, మరొకటి నిర్మాణాత్మకం "హింసపై నేరుగా ఆధారపడిన పాలన, చట్టాల పరిమితులకు మించినది, వినాశనాత్మకమైనది. రైతులు, పెటీబూర్జువాలు, సెమీకార్మికులను సోషలిస్టు ఆర్థిక పునర్నిర్మాణానికి, విస్తృత ప్రజాస్వామ్యాన్ని ఐక్యపరచి ఐక్యనిర్మాణానికి సమీకరించవలసిన నిర్మాణాత్మక కార్యక్రమాంశము. లెనిన్ సోషలిస్టు నిర్మాణం విజయవంతంగా పురోగమించి కమ్యూనిజానికి చేరువవుతున్నకొలది, రాజ్యాంగయంత్రం-రాజ్యం శుష్కించిపోతుం దని కూడ స్పష్టంచేశారు. అప్పుడు రాజ్యాంగ యంత్రంయొక్క రాజకీయ స్వరూపం, అత్యంత పరిపూర్ణ ప్రజాస్వామ్యంగా వుంటుందని అందరకు తెలిసే వుంది.

కారిల్లో, "కార్మికవర్గ నియంతృత్వం" యొక్క యీ ద్వంద్వనైజాన్ని ఆమోదించక "అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి విధాన ప్రజాస్వామ్య దేశాలలోని శ్రామిక ప్రజాస్వామ్యాన్ని, శక్తులను కార్మికవర్గ ఏకైక నాయకత్వంలో సమీకరించుట, కార్మికవర్గ నియంతృత్వంగా చెప్పుటలో తనకు విశ్వాసం లేదన్నాడు. ఈ దేశాలలో సోషలిజం అంటే, విస్తృత ప్రజాస్వామ్యాన్ని నిర్ణయాత్మకంగా అభివృద్ధిచేయు మార్గంలోనే సోషలిజానికి పురోగమించగల విశ్వాసం కలదన్నాడు. సమాజంలో నియంతృత్వ ధోరణిని త్రోసిపుచ్చుటయేగాక, దానిని చేరుటకు ప్రజాస్వామ్య పంథాని, దానిలోని కష్టనిష్ఠూరాలన్నిటితో పయనించుటలో విశ్వాసం ప్రకటించాడు. అనగా, కార్మికవర్గ నియంతృత్వం అనే పేరేగాక, ఆ అవగాహన మొత్తంగా "సమాజంలో నియంతృత్వ వైఖరిని తెలుపుతున్నందున, తన విముఖతను తెలిపాడు.

లెనిన్ తప్పనిసరి పరిమితని యిలా వివరించాడు. "దోపిడిదారులను వర్గంగా అణచివేయుట, నిరంకుశత్వంయొక్క తప్పనిసరి పరిస్థితి, అది బలవంతంగా, హింస నవలంబించి చేయవలసియుండుట"తో "పరిశుద్ధ ప్రజాస్వామ్యాన్ని, సమానత్వాన్ని, ఆ వర్గపు స్వేచ్ఛను కుంటుపరుస్తుంది. ప్రజాస్వామ్యాన్ని కుంటుపరచకుండా ముఖ్యంగా దోపిడివర్గాలకు సంబంధించినంతవరకు కార్మికవర్గ నియంతృత్వాన్ని అమలుచేయుట సాధ్యమా అనేది సైద్ధాంతిక సమస్యగా వుంది." ఆచరణ, పరిస్థితులబట్టి స్పష్టమవుతుంది.

## భారత కమ్యూనిస్టు శ్రేణులలో "నూతన అతివాదం", "యూరో కమ్యూనిజంల" ప్రభావాలు :

లాటిన్ అమెరికా, ఆసియా, ఆఫ్రికాలలో "నూతన అతివాదంపై"యూరపులో "యూరో కమ్యూనిజంపై" చెలరేగిన వాదోపవాదాలు, సైద్ధాంతిక బహిరంగ చర్చలు, భారత కమ్యూనిస్టు వివిధ శ్రేణులలో చెలరేగుతున్న సైద్ధాంతిక చర్చలపై తీవ్రమైన ప్రకంపనాలను కలిగించలేకపోలేదు. కొన్ని శ్రేణులలో విప్లవలక్ష్యం, వ్యూహం లాంటి మౌలిక సమస్యలపై తీవ్రప్రభావాన్ని కలుగజేశాయి. ఈ చర్చలలో లేవనెత్తబడిన సమస్యల విస్తృతి బహుళంగా వుంది. అవి అంతర్జాతీయ నైజాన్నేగాక, సైద్ధాంతిక విస్తృతిని కలిగి ఉన్నవి. అనేక కమ్యూనిస్టు పార్టీలు "యూరో కమ్యూనిజం" అవగాహనలను, దృక్పథాలను తీవ్రంగా విమర్శించి, యూరో కమ్యూనిజం సైద్ధాంతికాంశాలు, సమిష్టి శాస్త్రీయ అనుభవాల సారాంశం కాదని స్పష్టం చేసాయి. అయినా భారత కమ్యూనిస్టు శ్రేణులలో అవి కలుగజేసిన అంతరంగిక సైద్ధాంతిక చర్చాతరంగాలు అంత స్వల్పమైనవి కావు.

భారత కమ్యూనిస్టుపార్టీ, భటిండా కాంగ్రెసు నివేదిక "మార్క్సిజం-లెనినిజాన్ని వక్రీకరించి, మౌలికాంశాలను త్రోసిపుచ్చి, తప్పుడు ప్రమాదకర అభిప్రాయాలను ప్రచారం చేయుటను మేము అంగీకరించజాలము. ఆ అభిప్రాయాలు, కార్మిక

వర్గ అంతర్జాతీయతా మౌలికాంశాలను బలహీనపరుస్తున్నవి. సోషలిజపు విజయాలపై నిందాప్రచారం చేస్తున్నవి. మా పార్టీ 1957, 1960, 1969 అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీల సమిష్టి అవగాహనలను, సిద్ధాంతాలను బలపరుస్తుంది. జాతీయ, అంతర్జాతీయ సాధారణ, ప్రత్యేక అంశాలను, మార్క్సిజం-లెనినిజంల దృక్పథంలో పరిష్కరింపజడగలవని తలచుచున్నదని" తెలిపింది. సి.పి.ఐ. నిర్దిష్టంగా "జాతీయ కమ్యూనిజం; ప్రపంచ కమ్యూనిజం నుండి "స్వాతంత్ర్యం" అనే యూరో కమ్యూనిజం నినాదాలను, నిర్వివాదంగా వ్యతిరేకించింది.

నూతన అతివాదం, యూరో కమ్యూనిజంలు లేవనెత్తిన వివిధ సమస్యలపై భారత కమ్యూనిస్టు శ్రేణుల స్పందనలను చూద్దాము.

మొట్ట మొదటి ప్రధాన మౌలిక సమస్య, "జాతీయ కమ్యూనిజం" లేక "ప్రాంతీయ కమ్యూనిజం"లు శాస్త్రీయ మార్క్సిజం లెనినిజంల సమ్మతి పొందగలవా అనేదే ప్రశ్న. కమ్యూనిజం, మార్క్సిజం-లెనినిజంలు విశ్వజననీయం అంతర్జాతీయమైనవి. వాటి సారాంశం విశ్వవ్యాప్తం, అనుసరణీయం. కమ్యూనిజం, మార్క్సిజం-లెనినిజంలను ప్రాంతీయ, జాతీయమైనవిగా చెప్పట, వాటి శాస్త్రీయ నైజాన్ని, స్వీయ మానసిక ధోరణిలో యాదృచ్ఛికమైనవిగా మరోచోట జరగని నిర్ధారణలుగా చెప్పట, వాటి శాస్త్రీయతను త్రోసిపుచ్చుటయే అగుతుంది. శాస్త్రాలను యూరోపియన్ రసాయన శాస్త్రంగా, అమెరికన్ భౌతిక శాస్త్రంగా, ఆసియా జీవశాస్త్రంగా చెప్పజాలం. కమ్యూనిజం అంతే! కారణం, జాతీయమైనది, తాత్కాలికమైనది, ప్రత్యేకమైన దానిని అంతర్జాతీయం, శాశ్వతం, విశ్వజనీనమైన దాని నుండి వేరు చేయజాలము. ఆ రెండిటిమధ్య వొక తాత్విక ఐక్యత వుంది. అంతేగాని ఆ రెండు వొకే విధంగా వుండవు. ఐక్యత ప్రత్యేకత ఒక్కటిగాదు. ప్రత్యేకతలను నాశనంచేసి, చేసే ఐక్యత శాస్త్రీయ ఐక్యతయేకాదు. ఇది వొక తాత్విక సాధారణ సూత్రం మాత్రమేకాదు, చారిత్రిక అనుభవ సారాంశము.

చైనా కమ్యూనిస్టుపార్టీ 7వ, కాంగ్రెసులో పార్టీ నివేదికను ప్రతిపాదించిన లీషావీ 1945లో మొట్టమొదటగా "మావో ఆలోచనా విధానం" అనే సమాసాన్ని అందించాడు. దురదృష్టకరంగా 1966-68 లలో ఆ సమాసానికే ఆహుతి అయ్యారు. నాడు లీషావీ, మావో "మార్క్సిజాన్ని చైనీయం" చేసాడని ప్రస్తుతించుటయేగాక, 1949-50లలో, "మావోయిజం అంటే; ఆసియన్ మార్క్సిజం-లెనినిజంగా, విశ్వజనీనమైనదిగా" వ్యాఖ్యానించాడు. చైనీయ ప్రత్యేకతలో విశ్వజనీనతను పరికించక, చైనీయ ప్రత్యేకతనే విశ్వజనీనతగా వక్రీకరించి, వినాశనానికి దారి చూపారు. దీనికి మౌలిక పునాదులను "పెటీ బూర్జువా జాతీయత, జాతీయ దురహంకారాలతో" చూడగలం, అదే "జాతీయ", "ప్రాంతీయ కమ్యూనిజం"లలో ప్రతిబింబించింది.

భారత కమ్యూనిస్టు శ్రేణులలోని ప్రధాన సిద్ధాంతకర్తలు నంబూద్రిపాద్, రణదివె, మొహిత్ సేన్, దిలిప్‌బోస్‌లు. 1980 దశకంలో "నూతన అతివాదం"; "యూరో కమ్యూనిజం" సమస్యలపై తమ తమ రచనలతో "జాతీయ", "ప్రాంతీయ కమ్యూనిజం"ల ధోరణులను యిదే దృక్పధాలలో తీవ్రంగా విమర్శించారు.

రెండవ మౌలికాంశం; మార్క్సిజం-లెనినిజాలకు పునాదులైన తత్వశాస్త్రం, రాజకీయ అర్థశాస్త్రం, శాస్త్రీయ సోషలిజంలను వేరు వేరుగ చూచుట, చేయుట. రెండవ శాస్త్రీయ సోషలిజంలో మౌలిక మార్పులు అనగా మార్క్సిస్టు-లెనినిస్టు విధానాలు, పద్ధతులలో నూతన ఆచరణానుభవాలు, నూతన శాస్త్రజ్ఞానం అభివృద్ధి చెందినరీత్యా తప్పనిసరిగా చేయవలసిన మార్పులు చేయాలి, అదే శాశ్వత సత్యం. ఏది మార్పు చేయవలసింది తగినంత బలమైన సాక్ష్యాధారాలతో, విషయ వివరణతో శాస్త్రీయంగా చేయాలి.

నూతన అతివాదులు, యూరో కమ్యూనిజం సిద్ధాంతవాదులు లెనినిజాన్ని మాత్రం తొలగించి, మార్క్సిజాన్ని ఆకాశానికి ఎత్తుతున్నామంటున్నారు. మరి కొందరు తాము శాస్త్రీయ సోషలిజంపై విశ్వాసంతో మార్క్సిజం-లెనినిజంలను త్రోసివేస్తున్నామంటున్నారు. ఇది సత్యానికి ముసుగు వేయుట అగుతుంది.

బాగా వెనుకబడిన రష్యాకు, లెనినిజం ప్రత్యేక ప్రాముఖ్యత కలది. మరి కొంత విస్తరించితే "వెనుకబడిన దేశాలకు మాత్రమే" ఆలోచించ తగినదనే వర్గాలు లేకపోలేదు. ఇక్కడ యూరో కమ్యూనిస్టులు తెగనాడేది లెనిన్ సిద్ధాంతాలను మాత్రమేకాదు, మార్క్స్-ఎంజెల్స్ ప్రవచించిన మౌలిక సూత్రాలను, లెనిన్ సమర్థించి, మరింత సంపన్నం చేసిన సిద్ధాంతాలనని అర్థం చేసుకోనాలి.

వర్గ పోరాట సిద్ధాంతానికి, మార్క్స్-ఎంజెల్స్‌లు సోషలిజంలోనికి పరివర్తన కాలంలో, తదుపరి పునర్నిర్మాణకాలంలో కార్మికవర్గ నియంతృత్వం తప్పనిసరియని, ఆ సిద్ధాంతాన్ని సంపద్వంతం చేసారు. పెట్టుబడిదారి విధాన ప్రభుత్వ రాజ్యాంగ యంత్రాన్ని సమూలంగా ధ్వంసం చేయవలసిన అవసరాన్ని, నూతన సోషలిస్టు సమాజ నిర్మాణానికి ఆ రాజ్యాంగ యంత్ర వినియోగాన్ని మార్క్స్-ఎంజెల్స్ పూర్తిగా నిషేదించారు. అదే కాలంలో వర్గ పోరాటపు అంతర్జాతీయ నైజాన్ని కమ్యూనిస్టు మానిఫెస్టోలో స్పష్టం చేసారు.

కార్మికవర్గ విప్లవ పోరాటాలలో ఏకరూపంగా, సోషలిజంలోనికి పరివర్తన శాంతియుతంగా జరుగుట, అందుకు పార్లమెంటు, తదితర బూర్జువా ప్రజాస్వామ్య వ్యవస్థా నిర్మాణ రూపాలు కొన్నింటిని వినియోగించుకొని పురోగమించవచ్చునే అభిప్రాయం సి.పి.ఐ. లోని కొన్నివర్గాలలో బలంగా వుంది. పైగా 1960, 1969 లలో జరిగిన అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీల సమావేశాలనుండి వారసత్వంగా యీ సైద్ధాంతిక అవగాహనలు రూపొందాయి. వివిధ సందర్భాలలో మార్క్స్, ఎంజెల్స్, లెనిన్‌లు ఈ ధోరణులకు కొంత అవకాశాన్ని యిచ్చి బలాన్ని చేకూర్చారు.

లెనిన్ నాయకత్వంలో మూడవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామ్య విప్లవపంథా, ఐక్యసంఘటనా, బూర్జువా పార్లమెంటు, ట్రేడ్ యూనియన్‌లలో పనిచేయు ఎత్తుగడలు రూపొందించబడినవి, బూర్జువా పార్లమెంటులను శాంతియుతమార్గంలో విప్లవ పురోగమనానికి, వీలయితే సోషలిజంలోనికి శాంతియుత పరివర్తనకు వినియోగించు ప్రాథమిక ఆలోచనలను కలిగిన వర్గాలున్నవి.

మూడవ మౌలికాంశం, పార్లమెంటరీ ప్రజాస్వామ్యంగల అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ విధానంగల దేశాలలోను, నాటి సోషలిస్టు దేశాలలోగల రాజ్యం, రాజ్యాంగ యంత్ర సమస్యలు లేవనెత్త బడినవి.

"కార్మికవర్గ నియంతృత్వం" అనే సమాసాన్ని తొలగించితే మంచిదనే అభిప్రాయాన్ని కొన్ని కమ్యూనిస్టుపార్టీలు వెలిబుచ్చాయి. ఐక్య సి.పి.ఐ. 1958 లోనే ఏకగ్రీవంగా "కార్మికవర్గ నియంతృత్వం" అనే పదాల కూర్పుకుబదులు "కార్మిక రాజ్యం" (ప్రొవిటేరియన్ స్టేట్ హుడ్) వాడాలని నిర్ణయించింది.

సోషలిస్టురాజ్య ప్రభుత్వం గురించి లెనిన్‌గాని మరెవ్వరుగాని "ఒకే నమూనా"ను ఎవ్వరూ సూచించలేదు. అంతేగాక, సోషలిస్టురాజ్య ప్రభుత్వపు నిర్దిష్ట కర్తవ్యాలు వాటి నిర్వహణలో వేగోద్భృతి దాని స్వరూపాన్ని లేక వివిధ రూపాలను బహిర్గతం చేస్తుందని అనేకసార్లు నొక్కి చెప్పారు.

కార్మికవర్గ నాయకత్వంలో "వర్గ ఐక్యకూటమి" సోషలిస్టుప్రభుత్వపాలనలో యే విధంగా వుండాలనే అంశంపైగూడ నిర్దిష్టంగా వొక నమూనాలో వుండాలనిగాని రష్యాలో 1917లో జరిగిన దాని పక్కిలో ఉండాలనిగాని ఎవరూ నిర్ధారించలేదు. అన్నికాలాలలో అన్నిప్రాంతాలు లేక దేశాలలో మధ్యతరగతి వర్గాలు అనగా పెటీ బూర్జువాలు, "వర్గ ఐక్యకూటమి"లో విప్లవ విజయం, అనంతరం స్థిరపడేవరకూ బయటనే ఉండాలని ఎవరూ చెప్పలేదు.

ఇదే సమస్య కీలకాంశం. ఈ విషయమై "యూరో కమ్యూనిజం" వాదులు, దానినే పునశ్చరణ చేయసాగారు. అంటే దానర్థం బూర్జువా ప్రజాస్వామ్య కొలమానాలు, రూపాలు సోషలిజంకంటే కూడ మిన్నవయినవిగా యెంచసాగారు. సోషలిజాన్నికూడ బూర్జువా ప్రజాస్వామ్య కొలమానాలకు త్యాగం చేయతలపెట్టారు. అధికారం సమస్యపై మౌలికవర్గ దృక్పథాన్ని వదలివేయుటమంటే సోషలిజాన్ని కమ్యూనిజాన్ని వదలివేసి సోషల్ ప్రజాస్వామ్య అవకాశవాదాన్ని చేబట్టుటయే అవుతుంది.

సోషలిస్టు విప్లవంలోకూడ యిదే సమస్య ఎదురౌతుంది. అనేక దేశాలలో, కొన్ని అభివృద్ధిచెందిన దేశాలలో సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన, బహుశా వొకమార్గం కావచ్చు. పార్లమెంటరీ ప్రజాస్వామ్య అభివృద్ధికై పోరాటం, దాని

రూపాన్ని మార్చే పోరాటం కొన్ని దేశాలతో ప్రధానమయినదిగా రూపొందవచ్చు. గ్రాంసీ సిద్ధాంతం చెప్పినట్లు "కందకంనుండి పోరాటం కంటె ప్రజోద్యమాల మెరుపుదాడి యుద్ధం" కొన్ని దేశాలలో మరింతగా తగినది కావచ్చును.

టోగ్లియాటి, సిద్ధాంతం "చట్టసంస్కరణల పంథా ద్వారా విప్లవానికి పురోగమించుట" అనేదికూడ యిక్కడ వివరణ యిస్తుంది. "చారిత్రిక రాజీ" కూడ "ఐక్య సంఘటన" ద్వారా ప్రజాస్వామ్యమార్గంలో అధికారానికి, తదనంతరం అట్టిదేశాలలో సోషలిస్టు పరిణామం, బహుశా సరియైన పంథా కావచ్చు. వాస్తవమైన వొక్క ఉదాహరణకూడ లేదు. అన్వేషణ, తృష్ణ, అభిప్రాయభేదాలు, చర్చలు వివిధ రూపాలలో పరస్పరం అభిప్రాయాల పరిశీలన, ఉపయోగకరమయినదే కాక, తప్పనిసరియైనది.

నాల్గవ మౌలిక సమస్య, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమపు మొత్తంగా వివిధ దేశాలలో వ్యూహం, ఎత్తుగడలకు సంబంధించిన విషయాలలో గతాన్ని పూర్తిగా వదలివేయక మార్పులను స్వీకరించు విషయాల సమస్యలు ముఖ్యమయినవి. యూరోపియన్ కమ్యూనిజం వాదులలో కొందరు "మాస్కోను రోం-లేక-మక్కాగా నెంచే శైశవదశ విడనాడి, అంతర్జాతీయ దేశ పరిస్థితులలో వచ్చిన మార్పుల ననుసరించి, వాటి పరిపక్వతనుబట్టి, మౌలిక సూత్రాలను, వైఖరి, దృక్పథాలను మార్చుకొనుటగాక, దేశ పరిస్థితులలో వచ్చిన పరిణామాలకు ప్రాధాన్యతనిచ్చి ఆయాదేశాలలో వ్యూహం, ఎత్తుగడలు రూపొందించుకొనాలనే అభిప్రాయానికి వచ్చారు. ఈ విధంగా చేయనిచో, కాలంచెల్లిన దృక్పథాలనే పట్టుకొని, వూబిలో దిగిపోవుట జరుగుతుందని యూరో కమ్యూనిజం అభిప్రాయంగా వుంది.

సోషలిజానికి ప్రత్యేక పంథాలకై అన్వేషణ, సోషలిస్టు విప్లవాలకు శాంతియుత పరివర్తన వొక విప్లవరూపంగా పరిగణించే అవకాశాలు పెరుగుటతో ప్రజాస్వామ్య పరిరక్షణకై తీవ్ర ప్రజాపోరాటాలు, వాటిని సోషలిజం కొరకు జరిగే పోరాటాలతో సంలీనంచేయు సమస్యలన్నిటిపై ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం, ఆచరణయోగ్యమైన అనేక అంశాలను విశదీకరించింది. గత కొద్ది సంవత్సరాలలో యీ అన్వేషణకు కొన్ని కమ్యూనిస్టు పార్టీల నాయకులు యూరో కమ్యూనిజం అని పేర్కొంటూ, లెనినిజానికి తిలోదకాలు యివ్వసాగారు. కొన్ని వర్గాలలో సోషలిస్టు పంథా అన్వేషణ, సోవియట్ యూనియన్‌నుండి దూరంగా పోయే మార్గంలో పడింది. స్పెయిన్ మొదలైన కొన్ని దేశాలలోని సోషలిస్టు పంథా, సోవియట్ రష్యాపంథాకు భిన్నమైనదనే దశనుండి, పెట్టుబడిదారి విధానపు నేటి అభివృద్ధి, ఆచరణలో ప్రభుత్వ యంత్రాంగపు నైజాన్నే మార్చివేసిందనే వరకు వెళ్ళారు. యూరో కమ్యూనిజాన్ని బలపరిచేవారిలో కొందరు కార్మికవర్గ నియంతృత్వాన్ని వ్యతిరేకించుటయేగాక, నేటి పెట్టుబడిదారి దేశాలలోని ప్రభుత్వాలను గుత్త పెట్టు

బడిదారీ వర్గాల నియంతృత్వాలు అనే నిర్వచనాన్ని వ్యతిరేకించుట జరుగుతున్నది.

ఐదవ మౌలిక సమస్య, యే వొక దేశంలోనైనా సోషలిజం కొరకు జరిగే పోరాటానికి, సోవియట్ యూనియన్, యితర సోషలిస్టు దేశాలకు మధ్య వుండవలసిన సంబంధాల సమస్య ప్రధానమైనదిగా ముందుకొచ్చింది.

యూరోకమ్యూనిజాన్ని బలపరచే వర్గాలకు, "సోవియట్ నియంతలు", "సోవియట్ ఆజ్ఞల" ప్రకారం, కమ్యూనిస్టులు తమ విధానాలను మలచుకొనుట, "సోవియట్ ఏజంట్లుగ" ఎప్పుడో వొకప్పుడు నిందాప్రచారాలకు గురియగుట, వివిధ కమ్యూనిస్టు పార్టీల అనుభవంలో వున్న విషయం. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ కేంద్రంగాని, నాయకత్వం వహించే పార్టీగాని లేదని, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ అగ్రగామి పార్టీ మాత్రమేనని అందరికి తెలుసు.

సోవియట్ యూనియన్ ప్రభుత్వం ఒక విదేశ ప్రభుత్వం యెడల అవలంబించే వైఖరికి, ఆ దేశపు కమ్యూనిస్టుపార్టీ పెట్టుబడిదారి దేశపు ప్రభుత్వం యెడల చేబట్టే వైఖరి విధానాలూ వొకేవిధంగా వుండాలనే అవగాహన లేని విషయం వాస్తవం. ఈ సమస్యపై లెనిన్ వైఖరిని 1935లో జరిగిన 7వ అంతర్జాతీయ కొమింటర్న్ కాంగ్రెసులో టోగ్లియాటి గుర్తుచేసారు.

పెట్టుబడిదారి దేశాలలో కమ్యూనిస్టుపార్టీ చేబట్టే ఏఐక్యసంఘటన కార్యక్రమమైనా దేశ, విదేశాంగ విధానాలపై కొంత "రాజీ" పడవలసి వుంటుంది. కాని దాని అర్థం ఆ కమ్యూనిస్టుపార్టీ తన స్వతంత్ర విధానాన్ని విడనాడుతుందని కాదు. తన స్వతంత్ర కార్యక్రమాన్ని, విధానాన్ని విడనాడితే అది రాజీపడిందని కాదు. పూర్తిగా లొంగుబాటుతనాన్ని చేబట్టిందని అర్థం. అది దాని స్వతంత్రతను పోగొట్టుకొనుట ప్రారంభించిందని, ఐక్యసంఘటనకు, దానికి నష్టదాయకమని తెలియవలసి వుంది.

పాలక కమ్యూనిస్టుపార్టీలు లేక యితర కమ్యూనిస్టు పార్టీల మధ్య సోవియట్ కమ్యూనిస్టుపార్టీ మధ్య వున్న భేదాభిప్రాయాలను సంప్రదింపులు, చర్చలు, అవసరమైన అంతర్జాతీయస్థాయిలో చర్చలద్వారా సమిష్టి అవగాహనకు వచ్చే ప్రయత్నం చేయాలి. గతంలో అట్టి చర్చలు జరిగిన సాంప్రదాయమున్నది. అంతర్జాతీయ సరియైన అవగాహన, ఐక్యత, సౌభాతృత్వాలను పెంపొందించాలి.

పార్టీ స్వతంత్రపాత్రను నొక్కిచెప్పుతూ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీలను యేకపక్షంగా తీవ్రంగా విమర్శించుట, విమర్శించబడే, విమర్శించే పార్టీల రెండింటికి నష్టదాయకమైనది. అంతేగాక సోవియట్ వ్యతిరేకంగా ప్రచారం కావించుట, సోషలిజం వ్యాప్తిని అరికట్టే పెట్టుబడిదారి శత్రువర్గాలకే అత్యంత వుపయోగకారి

అగుతుంది. బూర్జువావర్గ ప్రభావంలో వున్న ప్రజాసామాన్యంలో నూతన భ్రమలను కలుగజేయుట అగుతుంది.

ప్రజాసామాన్యంలో తప్పుడుది, అపాయకరమైనది, విప్లవ చైతన్యాన్ని కలిగించనిదానికి వ్యతిరేకంగా రాజీలేని పోరాటం జరుపుటద్వారానే ప్రజాసమీకరణ సాధ్యం. సోవియట్ వ్యతిరేకత ప్రజాసమీకరణకు తోడ్పడదు. అందుకే సామ్రాజ్యవాదం అట్టి ప్రచారాన్ని ముమ్మరంగా సాగిస్తున్నది. కమ్యూనిస్టుపార్టీ అట్టి పోరాటాన్ని సాగించుటలో నైపుణ్యాన్ని ప్రదర్శించాలి.

# 6

# నక్సలిజం, సిద్ధాంతం, ఆచరణ

బెంగాలులో సాంప్రదాయ వామపక్ష శక్తులకు పోటీగా, ప్రత్యర్థిగా పుట్టిన శక్తి నక్సలిజం. నేటి పాలకవర్గాలను కూలద్రోయుటకు సాయుధ విప్లవ హింసా మార్గమొక్కటే మార్గమని, యువతరాన్ని ఆకర్షించుచున్నది. కుళ్ళిపోతున్న నేటి సమాజాన్ని పునరుద్ధరించుటకు అది వొక్కటే మార్గమంటూ అత్యధిక యువకులలో సానుభూతిని పొందింది. ఈ యువ తిరుగుబాటుదారుల ధైర్యసాహసాలు, త్యాగనిరతి, అడవిలోకాసిన వెన్నెలయింది. యువశక్తికి ముప్పయి సంవత్సరాలు భ్రమలు కల్పించింది. అంతర్గత సైద్ధాంతిక, గ్రూపుల, వ్యక్తుల పోరాటాలతో చీలికలైనాయి, వాసిని కోల్పోయినవి.

**బెంగాల్ నక్సల్బరీల నగరాలలో గెరిల్లా పోరాట కార్యక్రమము :**

పశ్చిమబెంగాల్, మార్క్సిస్టు–లెనినిస్టు కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యక్రమంగా "నగరాలలో గెరిల్లా పోరాటాల కార్యక్రమం" చేబట్టింది. ఆ పార్టీ పత్రిక "దేశబ్రతి". 30 ఏప్రిల్ 1970 సంచికలోని ఈ క్రింది వాఖ్యాలు చూడండి.

"విప్లవకారులు, భారత విప్లవకారుల బద్ధశత్రువయిన గాంధీజీ సాహిత్యాన్ని భోగిమంటకు ఆహుతిచేశారు. విప్లవజ్వాలలు కలకత్తాలో ప్రజ్వలించుతున్నవి. ప్రెసిడెన్సీ కాలేజీపై ఎర్రజెండా ఎగురుతున్నది. అదే సామ్రాజ్యవాద తొత్తుల నినాదం, జాదల్‌పూర్, సిబపూర్, ఖర్గపూర్‌లలో విప్లవజ్వాలలు రేగాయి. వ్యవసాయ విప్లవానికి మద్దతుగా గెరిల్లా పోరాటాలు ప్రారంభమయ్యాయి. "సి.పి.ఐ. (ఎం. యల్) నగరాలలో స్కూళ్ళు, కాలేజీలు, ప్రభుత్వ రవాణా సౌకర్యాలు, కుటుంబనియంత్రణ

కేంద్రాలు, ఆఫీసు ఫర్నీచరు, అసభ్య సినిమా చిత్రాలపై దాడులను కేంద్రీకరించింది.

సమాజంలో అత్యున్నతవర్గాల "లగ్జరీ బస్సులు, స్టార్ హోటల్స్, విహార యాత్రాస్థలాలు"వారి దాడులకు గురయ్యాయి.విద్యార్థి గెరిల్లాలు ఖర్గ్‌పూర్‌లో పరీక్షా పత్రాలు చింపి, తగలబెట్టి, లాబొరేటరీలను తగులబెట్టి నాశనం చేసారు. సిబపూర్ ఇంజనీరింగు కాలేజీలో లైబ్రరీలలో సైన్స్ గ్రంథాలనన్నిటిని తగులబెట్టారు. అభివృద్ధి నిరోధక కేంద్రాలని,"అమెరికా సాంస్కృతిక కేంద్రాలను"నాశనం చేశారు.ఇట్టి కార్యక్రమాలన్నిటికి కలకత్తా విశ్వవిద్యాలయం విద్యార్థి గెరిల్లాలనుకేంద్రస్థావరంగా వినియోగించారు. పార్టీ నాయకత్వ వికేంద్రీకరణ జరిగింది. బహుశా యాదృచ్ఛికంగా జరిగే అనేక సంఘటనలకు, సైద్ధాంతిక నిర్మాణ నాయకత్వం వహించుటకై కావచ్చును. జాతీయనాయకులు గాంధీ, తదితర విగ్రహాలను, తలలు పగులగొట్టి నాశనం చేశారు. అధికారంకొరకు పోరాడుకొంటున్న డాంగే, సుందరయ్య పార్టీలు రెండూ జాతిపితగా నెంచే గాంధీజీ విగ్రహాలను నాశనంచేస్తూ విప్లవకారులు అగౌరవపరచుట ఆశ్చర్యకరం అనుటను మే,జూన్ 1970 దేశవ్రతి పేర్కొనుట జరిగింది. "శశాంక" తదనంతర వ్యాసంలో 150వ జయంతిని సంఘ సంస్కర్తగా పేరుగాంచిన విద్యాసాగర్‌కు జరుపబోవు సందర్భంలో, సంస్కరణవాదులు, ద్రోహుల విగ్రహాలను నాశనంచేసి, రైతాంగ విప్లవవీరుల విగ్రహాలను ప్రతిష్ఠించాలని ఆందోళన చేయాలని వ్రాయుట గమనించవలసిన విషయము. దీనిని అమలుచేసిన చైతన్యరహిత విప్లవకారులు, వాస్తవానికి ఆ సంఘ సంస్కర్తలను అధ్యయనం చేసినవారు కారు. వారు బెంగాల్ సాంస్కృతిక విప్లవానికి వాస్తవంగా వైతాళికులు.

ఈ సందర్భంలో "సాంస్కృతిక విప్లవానికి విగ్రహాల విచ్ఛిన్న పండుగ ప్రారంభం మాత్రమే" అని చారుమజుందార్ సిద్ధాంతీకరించిన విషయాన్ని జ్ఞాపకం చేసుకొనవలసి వుంది. ఇంకా, "ఒక నూతన విప్లవ సాంస్కృతిక విద్యావిధానం నిజంగా భారత దేశభక్తియుత విప్లవకర విధానం, సాంస్కృతిక విప్లవం లేకుండా రూపొందించబడినదని, యిది సాయుధ వ్యవసాయ విప్లవంలో భాగమని" ప్రచారం చేయబడింది (దేశవ్రతి, 15 ఆగస్టు 1970). అంతేగాక దేశవ్రతి 19 మార్చి,1970 వ్యాసంలో "కుళ్ళిపోతున్న గాంధీయిజపు కలుపుమొక్కలను ఏరివేయుట ప్రస్తుత సాయుధ విప్లవానికి సహాయచర్యగా" ప్రస్తుతించి, ధన్యవాదాలు తెలిపింది.

దీని అంతటినుండి మనకు స్పష్టమయ్యేది ఏమిటి? వాస్తవ విప్లవ కార్యాచరణకు బదులుగా విగ్రహాల వినాశన చర్యలతో విప్లవం పురోగమిస్తుందని నిర్ధారించారు. ఇటువంటి కొన్ని సాహస చర్యలు, వాటికి మద్దతుగా వ్యవసాయవిప్లవం, సాంస్కృతిక విప్లవానికి నాందిపలికి నక్సలైట్ల రాజకీయ విధానాన్ని సుస్థిరంచేసి, రక్తపాతం లేకుండా, కార్మికవర్గానికి అధికారాన్ని తెచ్చిపెట్టుతుందనే అవగాహన యిస్తుంది.

కరుడుగట్టిన ఎంతటి సంస్కరణవాదికూడ శాంతియుతంగా ఇలా నూతన సమాజం ఉద్భవిస్తుందని ఆశించడు.

సి.పి.ఐ. (యం.యల్) గ్రామీణ ప్రాంతాలలో విముక్తి ప్రాంతాలను అభివృద్ధి చేయాలనే ధ్యేయంతో వర్గశత్రు నిర్మూలన కావించే కార్యక్రమంలో భాగంగా, దోపిడిదారులపై "వ్యక్తిగత హింసా దౌర్జన్యాన్ని" వినియోగించుతూ, మరో వేపున నగర ప్రాంతాలలో "ప్రాణంలేని విగ్రహాల"పై దాడిచేసి నాశనం చేయుట-ఆలోచనాపరులకు వింత గొల్పుటలో ఆశ్చర్యంలేదు.

సి.పి.ఐ. (యం.యల్) ఇటీవల కాలంలో మొండిగా, సామాన్య ప్రజానీకములో భయోత్పాతాన్ని కలిగించుతున్నది. సి.పి.ఐ.(యం)తో దాని సంఘర్షణలో ఏమాత్రం, ఇసుమంతయినా దయాదాక్షిణ్యం చూపించలేదు. అనేకమందివ్యాపారులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు, పోలీసులు, ఇతర అధికారులు నిర్దాక్షిణ్యంగా కాల్పులలో మృతిచెందారు, చంపబడ్డారు. చరిత్రలో టెర్రరిస్టులు ప్లాను ప్రకారం చేసిన విశేషయుత హత్యలకు, ఈ విచక్షణారహిత మారణహత్యాకాండలు ఏమాత్రం ప్రజా సానుభూతిని పొందలేకపోయాయి. ఈ ప్రజా సానుభూతి లేకపోవుటను వారు "గుడ్డి పిడివాదులు" మాత్రమే గుర్తించజాలకపోయారు. చారుమజుందార్ నూతన మార్గదర్శక సూత్రాలను విద్యార్థులకు అందజేశారు. విద్యార్థులు చదువులు, పరీక్షలకు కాలేజీలలో తమ కాలాన్ని వృథాచేయక, వాటిని వదిలివచ్చి చిన్న చిన్న దళాలుగా గ్రామాలకు వెళ్ళి, అక్కడనే నివసిస్తూ పనిచేయాలనే పిలుపు మే 1970లో లిబరేషన్ పత్రికలో యిచ్చారు. ఆ విధంగా విప్లవ పోరాట స్థావరాలను యేర్పాటు చేయాలని కోరారు.

ఈ విధంగా కాలేజీలలో సి.పి.ఐ. (యం యల్) నిర్మాణం లేకుండా చేశారు. పైగా, అంతమాత్రంచేతనే సి.పి.ఐ (యం.యల్) శ్రేణులన్నీ చదువును మానివేసి, పరీక్షలు బహిష్కరించి వెళ్ళలేదు ఉద్రేకపరులైన కొద్దిమంది మాత్రమే ఆ పనిచేసి, నగరాలకు విద్యార్థిలోకానికి దూరమయ్యారు. "బాయికాట్ ఆఫ్ బూర్జువా విద్యా విధానం" పూర్తి వైఫల్యం చెందిందని చెప్పవచ్చును. దాని ఫలితంగానే విద్యార్థుల నుండి దూరమై, విద్యాలయాలు, లైబ్రరీలు, ప్రయోగశాలలపై విధ్వంసక దాడులను చేబట్టి "వాంపెత్తు పిడివాదులు, సెక్టేరియనులు"గా విద్యార్థిలోకం, ప్రజల నుండి దూరమయ్యారు. అన్నివిధాలా బలహీనపడ్డారు.

కార్మికవర్గంలో చైతన్యవంతమైన కార్మిక సంఘాలను నిర్మించి పోరాట పటిమను దైనందిన కార్మిక సమస్యలపై వుద్యమాన్ని బలోపేతం చేయుటకు బదులు, బిల్డింగులపై ఎర్రజండాలు ప్రతిష్టించే ప్రధాన కార్యక్రమాన్ని చేబట్టారు. విప్లవ పరిస్థితులున్న నేడు ప్రతి కార్మిక పోరాటం సంఘర్షణలకు దారితీస్తున్న నేటి పరిస్థితులలో వర్గ సంఘాలపాత్ర యేమీ లేదంటూ, కార్మికులలో పార్టీ యూనిట్లు నిర్మించే ప్రధాన కర్తవ్యం చేబట్టారు. చారుమజుందార్ విప్లవకారులు ట్రేడ్‌యూని

యనులకు దూరంగా వుండాలని, రహస్య పార్టీ యూనిట్లను స్థాపించాలని బోధించారు. "ట్రేడ్ యూనియనులకు బయటనుండే, వ్యవసాయ విప్లవ రాజకీయాలు వచ్చాయని" అన్నారు.

"కార్మికులలో మన కర్తవ్యాలు" అన్న యిటీవల రచనలో చారుమజుందార్ ముగింపుగా, "సంస్కరణవాదం" "విప్లవపంథా" ట్రేడు యూనియనులలో చాలా కాలం సహజీవనం చేస్తాయని, వాటిని వదలివచ్చి వేయరాదని, చెప్పుట మొదలిడినారు. విద్యార్థులు వారికి అండగా నిలబడాలన్నారు. ఆదేకాలంలో విప్లవ కార్మికులు యూనియను కార్యకలాపాలలో, పోరాటాలలో, యూనియన్ ఎన్నికలలో పాల్గొనరాదని, ఆ విధంగా చేసిన కార్మికులలో విశ్వాసం కోల్పోతామని తలచే వ్యక్తికి "కార్మికుల నైజంలో వారికి అనుభవంలేదని యెంచాలని[1]" అన్నారు. శాంతియుత కార్మిక పోరాటాలైన సమ్మెలుచేయు పరిస్థితులు అంతమైనవని, "గెరావోలు, పోలీసులతో సంఘర్షణలు, పెట్టుబడిదారులతో సంఘర్షణలు, బారికేడ్ల పోరాటాలు, శతృవులను, వారియేజంట్ల నిర్మూలనా చర్యలే మార్గాలని[2]" స్పష్టం చేసారు. కొద్దిమంది సాగించే "గెరావో", కార్మికుల సార్వజనిక సమ్మెకంటె "తీవ్ర చురుకైన చర్య"గాను, బజారు పోరాటాలే విప్లవ పోరాటాలుగ నెంచారు. ఈ విధంగా, వ్యవసాయ విప్లవ సారథులైన కమ్యూనిస్టు శ్రేణులను నిర్మించే వ్యూహాగానం చేస్తున్నారు. సాధారణ శాంతి పరిస్థితులలో యిది సాధ్యంకాదని నాయకత్వం ఆమోదించుతున్నది. "వీరినుండి చాలా కొద్దిమంది మాత్రమే గ్రామీణ ప్రాంతాలలో సాయుధ పోరాటం సాగించుటకు వస్తున్నారని[3]" కూడ స్పష్టం చేయక తప్పలేదు.

కార్మికవర్గాన్ని "దాని బయటనుండి" మార్గదర్శక నాయకత్వం వహించి నడుపగల మనుకొనుట, లెనిన్, ఏమిచేయాలి? అన్న ప్రసిద్ధ రచనలో మేధావి వర్గాలు కార్మికవర్గానికి రాజకీయాలు, సోషలిజంలో పరిజ్ఞానాన్ని పెంపొందించి, వర్గ చైతన్యవంతులను చేయుట యాదృచ్ఛికంగా జరుగదని, వారి వుద్యమక్రమంలోనే కార్మిక ప్రజాస్వామ్యం, వారి అంతటవారే విప్లవ చైతన్యవంతులగుతారని, వెలిబుచ్చుట మననం చేసుకొనవలసి వుంది. లెనిన్ కమ్యూనిస్టులు మత గురువుల వలె కార్మిక సంఘాలకు వెలుపలవుండి, బోధించుతూ వుండాలని తలచలేదు. పైగా లెనిన్ కమ్యూనిస్టులు యాజమాన్యపు యూనియనులలోనైనా చేరాలని, అవసరమని

1. లిబరేషన్, మార్చి 1970. కార్మికులలో మన కర్తవ్యాలు, అన్న వ్యాసం. పే. 6.

2. ....అదే. ....పే. 7.

3. ....అదే. ....పే. 9.

స్పష్టం చేసారు. "అతివాద కమ్యూనిజం" అనే మరో ప్రసిద్ధ రచనలో, ట్రేడు యూనియనులు కొన్ని అభివృద్ధి నిరోధక లక్షణాలను కలిగివున్నా, రాజకీయాలకు దూరంగా వుండేవైనా, విప్లవపార్టీని నిర్మించే దశలోనైనా, లేక విప్లవ పోరాటాలు అత్యున్నత దశకుచేరి, అధికారాన్ని చేజిక్కించుకొనుటకు చేరువైనా, ట్రేడుయూనియనులకు దూరంగా వుండరాదన్నారు. అనగా చురుకుగా పాల్గొనాలని వేరుగ చెప్పనవసరం లేదు. వాటిలో వుంటూనే, వాటిలో కార్మికవర్గంలో కనుపించే మితవాద, అతివాద సంస్కరణ, అవకాశవాదాలపై సైద్ధాంతిక పోరాటం సాగించి, వోడించి, విప్లవ పురోగమనంతో విజయం సాధించాలని స్పష్టం చేయుటగా నెంచాలి. కమ్యూనిస్టు శ్రేణులను కార్మికవర్గానికి దూరంచేసే ఎట్టి ఎత్తుగడలు విప్లవ ఉద్యమ పురోగమనానికి తోడ్పడవు.

## నక్సల్బరీ పోరాటం - మరోసారి చైనా పంథా :

కాంటన్‌లో తిరుగుబాటు విప్లవ పోరాటాల వైఫల్యం, కార్మికుల దారుణ వూచకోత తదనంతరం, చైనా కమ్యూనిస్టుపార్టీ "చిన్నాభిన్నమైన సైన్యాన్ని కమ్యూనిస్టు శ్రేణులను తిరిగి సమీకరించుటకు, తూర్పున (తీరనగరాలలో)చప్పుడు చేయుట (ఆందోళన) పశ్చిమాన (కొండ ప్రాంతాలలో) దాడి చేయుట" అనే మావో విధానాన్ని అమలుచేసి, గ్రామీణ, కొండ ప్రాంతాలలో, తీరనగరాలకు దూరంగా, "గ్రామీణ స్థావరాల" ఏర్పాటు చేయు విధానాన్ని ఆచరణలో పెట్టిన విధంగానే, నక్సల్బరీ సాయుధ రైతాంగ తిరుగుబాటు అనంతరం, మావో "చైనా పంథా"ను నక్సలైట్లు చేబట్టారు. వీరికి 1946-51, తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటాల ప్రత్యక్ష అనుభవంలేదని వేరుగ చెప్పనవసరం లేదు. ఈ అనుభవం కారణంగానే, ఆంధ్రప్రదేశ్ విప్లవకారులు సాయుధ రైతాంగ ప్రజా విప్లవ పోరాటాలను, పూర్తి సన్నాహాలు చేయకుండా ప్రారంభించకపోగా, నక్సల్బరీ విప్లవకారులవలె సాయుధ రైతాంగ తిరుగుబాటు విప్లవ పోరాటాలను, కేంద్ర ప్రభుత్వ అధికారాన్ని స్వాధీనం చేసుకొనే పోరాటంగా నిర్వచించజాలకపోయారు. అంతేగాక, ప్రజల పాత్రకు ప్రాధాన్యత నిచ్చారు.

. నక్సల్బరీ విప్లవకారులు ఎట్టి పరిస్థితులలో ప్రారంభించింది, వారి స్టేట్‌మెంట్‌లను ముఖ్యంగా ప్రథమ వొకటి రెండు సంవత్సరాలలో చేసిన ప్రకటనలను పరిశీలించిన స్పష్టమగుతుంది. అదే విధంగా వారి పత్రికల సంపాదకీయాలు దానిని తెలియజేస్తాయి. నవంబరు 1967 దేశ్‌బ్రతి, ట్రేడ్‌యూనియన్‌ల నిరుపయోగాన్ని స్పష్టం చేసింది. అంతేగాక 21 డిసెంబరు 1967 వారపత్రిక, నగరాలలోని వర్గ పోరాటాలు, గ్రామీణ ప్రాంతాలలో స్థావరాలు స్థాపించే ప్రయత్నంచేసే రైతాంగ పోరాటాల లక్ష్యాలకు మద్దతు కూర్చే వైఖరి చేబట్టాలి అని చెప్పుటతోపాటు, సి.పి.ఐ. (యం)పై తీవ్ర విమర్శనా దాడిని సాగించింది. పైగా, చైనా పంథా మన

పంథా కాదని నగరాలలో సంఘర్షణలే అధికార స్వాధీనానికి మార్గమని చెప్పేదెవ రని ప్రశ్నించింది. ఫ్యూడలు వ్యతిరేక నక్సల్బరీ రైతాంగ సాయుధ విప్లవ పోరా టాన్ని తెగనాడేదెవరు? ఆ విధంగా నగరాలలో తిరుగుబాటుకు యువశక్తిని ఆక ర్షించ ప్రయత్నిస్తున్నారని తీవ్ర విమర్శన చేసింది.

నక్సల్బరీ సాయుధ రైతాంగ పోరాటంపై, రైతులను భూమి నుండి వెళ్ళ గొట్టుటకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంపై అనేక రకాల ప్రచారం సాగించారు. అప్పుడు నక్సల్బరీవాదులు, సి.పి.ఐ.(యం)లో వున్నారు. అప్పుడున్న వామపక్ష సంఘటన ప్రభుత్వంలో సి.పి.ఐ. (యం) పార్టీ నాయకుడే, రెవెన్యూ మంత్రిగా వున్నారు. అనేక సంవత్సరాల నుండి ఇదే సమస్యపై, ప్రభుత్వం అధిక మిగులు భూమిని స్వాధీనం చేసుకొని రైతాంగానికి పంచుతుందని అనేక ఉపన్యాసాలు ఇచ్చివున్నారు. బహుశా ఈ నక్సల్బరీ ఉద్యమం, సి.పి.ఐ. (యం) చేసిన వాగ్దానా లను ఎంతవరకు అమలుచేయగలదోనని, ఈ ఉద్యమాన్ని అతివాదులు ప్రారం భించి వుండవచ్చును. సంస్కరణవాదులు, అభివృద్ధి నిరోధకులతో కలిసి, ఉద్య మాన్ని రక్తపుటేరులలో ముంచెత్తే ప్రయత్నం చేయుట ఆశ్చర్యాన్ని గొల్పుతుంది. వాస్తవానికి ఈ వొత్తిడితో వామపక్ష ప్రభుత్వానికి నాయకత్వం వహించే సి.పి.ఐ. (యం) మరిన్ని వామపక్ష చర్యలు చేబట్టుటకు వినియోగించుకొని వుండవలసింది.

ఆర్థిక, పాక్షిక పోరాటాల ప్రాముఖ్యతను త్రోసిపుచ్చలేదు. దేశబ్రతి సంపా దకుడు, పేద రైతులను, కౌలుదారులను, భూములు లేని వ్యవసాయ కూలీలను నిర్మాణంలో సమీకరించవలసిన ప్రాముఖ్యత, అవసరాలను స్పష్టంచేసి, వ్యవసాయ విప్లవానికి వాటి ఆవశ్యకతను వివరించింది. పార్టీ వారపత్రిక ఐక్యసంఘటన ప్రభుత్వం ఆహార, వ్యవసాయ భూముల వంటి ముఖ్య సమస్యలను అశ్రద్ధ చేయు టను తీవ్రంగా విమర్శించింది. నవంబరు 1969లో లిబరేషన్ పత్రిక, విస్తృత రైతాంగాన్ని సమీకరించుట ద్వారానే గెరిల్లా రైతాంగ సాయుధ పోరాటాలు సాధ్య మని, ప్రజాసామాన్యానికి దూరమైన ఉద్రేకపూరితం, చైతన్యయులయిన పెటీ బూర్జువా యువకులు చెగువెరా నమూనా యుద్ధాన్ని కొనసాగించగలరని పేర్కొన్నది.

సి.పి.ఐ.(యం) నుండి వేరుపడిపోయిన కమ్యూనిస్టు విప్లవకారులు చాలా కాలం వరకు, నక్సల్బరీ కమ్యూనిస్టు ఉద్యమం, మౌలికంగా వ్యవసాయ ఉద్య మంగా ఎంచారు. దేశబ్రతి మొదటి సంచిక "తెరై రైతాంగపు న్యాయబద్ధమైన పోరాటంగా, భూస్వాములకు వ్యతిరేకంగా భూమికై జరిపే రైతాంగ పోరాటంగా ఎంచింది.[1]

---

1. దేశబ్రతి, 6 జులై 1967 సంచిక నుండి "కమ్యూనిస్టుపార్టీ అండ్ నక్సలైట్లు" అనే పుస్తకంలో మిత్ర అండ్ సేన్‌లు చేసిన ఉదహరింపు. పే. 15.

నూతనంగా ఏర్పడిన సి.పి.ఐ. (యం.యల్) చైర్మెన్, "నక్సల్బరీ పోరాటాన్ని వొక జాతీయ పోరాటంగానేగాక, అంతర్జాతీయ పోరాటంగా[1]" చూస్తున్నారు. అంతేగాక, "పంట భూమి పోరాటంగానే కాక, రాజ్యాధికారానికై జరిగే పోరాటంగా"[2] నెంచుతున్నాడు. డె(పాఫ్ధానా కమిటీ ఈ పోరాటాన్ని "రాజ్యాధికారాన్ని పట్టుకొనే సాహసిక వీరుల చర్యగా"[2] పేర్కొన్నది.

నక్సల్బరీ జండా క్రింద సమీకరించబడిన గ్రూపు క్రమేణా పరిణామంచెంది మార్పుకు గురైంది. అక్టోబరు 1968లో కానూ సన్యాల్ తెరై ఉద్యమంపై సమీక్షా నివేదికలో ఇది ప్రతిబింబించింది.

తెరై నివేదికలో కానూసన్యాల్ "పది గొప్ప కార్యాలను" చైనా హూనాన్ నివేదికలోని "పదునాలుగు గొప్ప కార్యాలను" ప్రధానంగా వ్యవసాయ సంబంధిత చర్యలను ప్రతిబింబించుటను పేర్కొని, తదుపరి వివరించాడు. తెరాయ్ రైతాంగపు సాయుధ విప్లవ పోరాటం, "భూమి కొరకు కాదు, అధికారం కొరకు జరిగే పోరాటం, ప్రతి వర్గ సంఘర్షణా రాజకీయ పోరాటమేనని మాకు తెలుసు, ప్రతి రాజకీయ పోరాట లక్ష్యం అధికారాన్ని పట్టుకొనుటకేనని తెలుసు" అని స్పష్టం చేసారు సన్యాల్. ఇదే విషయాన్ని "సాయుధ పోరాటం భూమికొరకు కాదు, రాజ్యాధికారానికని"[3] ప్రత్యేక శీర్షిక క్రింద మూడు పేజీలలో వివరించారు.

నక్సల్బరీ వుద్యమ కాలంలో యేవిధమైన సెక్టేరియన్ తప్పిదములు జరిగినప్పటికి, ఆ వుద్యమం విఫలమైన తరువాత జరిగిన అసాధారణ విచారణ, అంచనాలతో ప్రాణం పోయజాలక పోయారు. పోరాటంలో భూమిని పొందుటతో పేద రైతాంగాన్ని ధనిక రైతాంగంగా మార్పు చెందుతుంది. రాజ్యాంగ యంత్రాన్ని నాశనం చేయు వరకు అనగా ప్రభుత్వాన్ని కూలద్రోయు వరకు వ్యవసాయ విప్లవాన్ని వాయిదా వేయాలనే, చారుమజుందార్ నక్సల్బరీ పూర్వ సిద్ధాంతాన్ని తిరిగి ప్రాణ ప్రతిష్ట కావించజాలము. మౌలికంగా యీ అవగాహన క్రమేణా రూపు దాల్చింది. సి.పి.ఐ. (యం.యల్) ప్రధాన వైరుధ్యంపై ఆధారపడిన విధానాన్ని కొనసాగించింది. అంటే ఫ్యూడలిజం-రైతాంగం మొత్తంగా మధ్యగల వైరుధ్యాలే ఆధారంగా వ్యవసాయ విప్లవ పోరాట దృక్పధాన్ని రూపొందించి, ప్రజా చర్యలతో కల్పించుకొన్న, అనగా అధికారకంగా చెప్పబడే "గెరిల్లా యుద్ధం" పోరాటరూపం ప్రధానంగా చేపట్టింది.

---

1. లిబరేషన్, డిసెంబరు 1969 పే. 9.
2. అదే. పే. 66.
3. నక్సల్బరీ అంటే ఆఫ్టర్ వా II. పే. 213-216.

## గ్రామీణ ప్రాంతాలలో గెరిల్లా పోరాటాలు :

గ్రామీణ ప్రాంతాలలో గెరిల్లా పోరాట స్వరూప, స్వభావాలను వివరించుటలో సి.పి.ఐ. (యం.యల్) నాయకులైన చారుమజుందారు యీ క్రింది విధంగా వివరించారు.[1]

అ) రైతాంగం వున్న ప్రాంతాలలో, గెరిల్లా యుద్ధం ప్రారంభించవచ్చును. (లిబరేషన్. నవంబరు, 1969 పే 10). ఆ ప్రాంత నైసర్గిక స్వరూపం అంత ముఖ్యం కాదు. గెరిల్లా పోరాటాలు ప్రారంభమైన వెంటనే వర్గ శత్రువులు గ్రామాలు వదలి పారిపోయారు. గ్రామాలు వాటి కంతట అవే విముక్తి చెందాయి.

ఆ) ప్రజా వుద్యమంగాని, ప్రజా సంఘాల నిర్మాణంగాని గెరిల్లా పోరాటం సాగించుటకు అత్యవసరం కాదు. పైగా అవి వూగిసలాటను తెస్తవి.

ఇ) మధ్యతరగతి మేధా వివరాల నాయకత్వం విఫలమైనందున, నిరుపేదలు భూములు లేని రైతాంగం తప్పనిసరిగా, వాస్తవంగా యీ కార్యక్రమాన్ని చేపట్టాలి.

ఈ, వర్గశత్రు నిర్మూలన అత్యున్నత వర్గపోరాట రూపం.

ఈ అవగాహనలో, యాదృచ్ఛికత ప్రధానంగా కనపడుతుంది. దానితోపాటు యాంత్రిక తత్వం కూడా స్పష్టం. సాంప్రదాయవర్గ పోరాటాన్ని త్రోసివేసి, "వర్గశత్రు నిర్మూలన" అనే పేరుతో "వ్యక్తులపై హింసా"కాండ చోటు చేసుకొన్నది. చారుమజుందార్ రచన "గెరిల్లా చర్యలపై కొన్ని మాటలు" అన్న వ్యాసం, యీ వైఖరినే ప్రతిబింబించింది. అంతేకాక "ఒక సంవత్సరకాలంలో నక్సల్బరీ పోరాటం" అన్న వ్యాసంలో చారుమజుందారు "కొన్ని పాక్షికమైన ప్రయోజనాల కొరకుగాక, రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకోవాలనే ఉద్దేశ్యంతో పోరాటం చేయటానికి నక్సల్బరీయే నాంది." ఇంకా వీటి నుండి నేర్చుకొనవలసింది, "మిలిటెంటు పోరాటాలు చేయవలసింది భూమికొరకు, పంటల కొరకు కాదు, రాజ్యాధికారం స్వాధీనం చేసుకోవాలనే ఉద్దేశ్యంతో చేయాలి."[2] అని స్పష్టం చేయబడింది.

చారుమజుందార్, లిబరేషన్ ఫిబ్రవరి 1970వ సంచికలో "గెరిల్లా చర్యల గురించి కొన్ని సూచనలు" అన్న వ్యాసంలో గెరిల్లా యూనిట్ యే విధంగా ఏర్పర చాలి? అన్న అంశంపై యిచ్చిన కొన్ని సూచనలు యిలా వున్నవి. "గెరిల్లా యూనిట్ నేర్పరచే విధానం మొత్తంగా కుట్రకు సంబంధించినదిగా ఉండాలి. ఎలాంటి జాడలు బయటకు పొక్కనీయకూడదు. ఇది వ్యక్తుల మధ్యను, వ్యక్తి

1. ప్రతాప్‌మిత్ర, మొహిత్‌సేన్ (1971) కమ్యూనిస్టుపార్టీ అండ్ నక్సలైట్స్ సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 17.

2. చారుమజుందార్ రచనలు (1973) శ్రామికవర్గ ప్రచురణలు, వరంగల్. పే. 21

నుండి వ్యక్తి అనే పునాదిమీద నుండాలి. ఈ విషయంలో పెటీబూర్జువా మేధావి కామ్రేడ్స్ సాధ్యమైనంత యెక్కువ చొరవ తీసుకోవాలి. తన అభిప్రాయంలో అత్యంత విప్లవ పటిమ గలిగినట్టి పేద రైతు వద్దకు వెళ్ళి అతని చెవిలో గుడగుడ పెట్టాలి. "పలానా పలానా జోతేదారును (భూస్వామిని) సఫాచేయటం మంచిపని అని నీవు అనుకోవటం లేదా? "ఈ విధంగానే రహస్యంగా, ఒంటరిగా గెరిల్లాలను యేర్పరచుకొని, చేర్చుకొనవలసి వుంది. ఒక యూనిట్ నిర్మాణం చేసుకోవాలి"[1] "వర్గ శత్రువుల దుష్ట బంధనాల నుండి ఒక ప్రాంతం విముక్తి పొందినపుడు నిర్బంధ రాజ్యాంగం యొక్క కండ్లు, చెవులు లేకుండా చేసిన వారమగుతాము. తత్ఫలితంగా గెరిల్లా లెవరో, ఎవరు కాటో తమ స్వంత భూమిని ఎవరు దున్నుకొంటున్నారో ఆ జోతేదార్ల భూమిని ఎవరు దున్నుకుంటున్నారో తెలుసుకొనుటకు పోలీసులకు అసాధ్యమవుతుంది." విప్లవ రైతాంగ కమిటీల క్రింద భూసంస్కరణల కార్యక్రమాన్ని, ప్రజలు, గ్రామ ప్రభుత్వ అధికారంలో భాగంగా అమలు చేయు చర్యలు చేబట్టుటను యిది సాధ్యం చేస్తుంది."[2] ఈ విధానం రాజకీయ చైతన్యాన్ని యివ్వకుండా, ప్రజల పాత్ర లేకుండా రచించిన యీ ప్రణాళిక "క్రైం సినిమా స్క్రిప్టు"గా వుందనుట ఆశ్చర్యాన్ని కలుగజేయదు.

ఈ విధంగా ఉద్యమం వాస్తవికత అనే భూమిక లేక పునాదిని వదలి, ఊహా చిత్రంగా గాలిమేడలలో విహరించసాగింది. కష్టాదటి విషయాలు, సంఘటనలు, ప్రజలు, వారి విషాద గాథలు వదలి, గెరిల్లా పోరాటాలనే పేరుతో, అత్యున్నత వర్గపోరాటాన్ని సాగించుతున్నామంటూ, వర్గశత్రు నిర్మూలనంటూ వ్యక్తిగత హింసా వాదాన్ని విప్లవ కమ్యూనిస్టులు చేబట్టారు.

**పునరాలోచన :**

నక్సలైట్ల రాజకీయ, నిర్మాణ, ఎత్తుగడల విధానాలు ఆచరణ ఆశించిన ఫలితాల నివ్వజాలకపోవుట, విప్లవకారుల శ్రేణులలో అంతర్గత భేదాభిప్రాయాలు తీవ్రమగుట, చీలికలకు చేరువగుటతో, తదనంతర కాలంలోని వివిధ పత్రాలలో వారి ఆలోచనవిధానంలో వచ్చిన గణనీయమైన మార్పు ప్రతిబింబించింది. కానూసన్యాలు, అక్టోబరు 1968లో "తెరై నివేదిక"లో ప్రదర్శించిన వివేచన దీనినే స్పష్టంచేస్తుంది. నక్సల్బరీ ప్రాంతంలో పార్టీ కార్యాచరణ చాలా మందగించిందని, పోరాట వెల్లువ కాలంలో చేబట్టిన కొద్ది చురుకైనపాత్రలు యాదృచ్ఛికమైనందున ప్రభుత్వ దమన కాండ పెరుగుటతో ఆచరణలో పార్టీ పని స్తంభించిపోయిందని, కానూసన్యాల్ నివేదికలో అంగీకరించారు.[1] సహచరులు యెంతోమంది అంగీకరించకపోయినా,

---

1. అదే పే. 98
2. అదే పే. 99
3. నక్సలిజం ఆండ్ ఆఫ్టర్.ఎ.ఫ్రాంటియర్ ఆంతోలజీ. వా II. పే. 219.

ఆత్మవిమర్శనా వివేచనతో ఆమోదించారు. తాత్కాలికంగానైనా మనం యెందుకు వైఫల్యాన్ని ఎదుర్కొన్నామని ప్రశ్నించి, క్రింది కారణాలు పేర్కొన్నారు. "బలమైన పార్టీ నిర్మాణం లేకపోవుట, శక్తివంతమైన ప్రజాపునాది యేర్పరచుటకు హృదయపూర్వకంగా ప్రజలపై ఆధారపడకపోవుట, సైనిక విషయాల పరిజ్ఞాన శూన్యత, పాత పద్ధతులలోనే ఆలోచించుట, రాజ్యాధికారాన్ని నెలకొల్పుట, విప్లవాత్మక భూసంస్కరణలపై మొక్కుబడి "అవగాహన, సోషలిజంవైపు పురోగమించుట తేలికైనదిగా, వ్యూహాత్మకంగా కష్టాలు, తిరోగమనాలు వూహించజాలకపోవుట, బ్రహ్మాండమైన ప్రజాప్రయత్నంగా నెంచుటలో"[1] వైఫల్యాలను కారణాలుగ పేర్కొన్నాడు.

సన్యాల్ తెరై నివేదికలో "విప్లవ పరిస్థితులు అత్యంత అనుకూలంగా వున్నవని, "తెరై రైతాంగ పోరాటం సాయుధ పోరాటం" అని, "భూమికై జరిగే పోరాటం కాదు, రాజ్యాధికారానికై జరిగే పోరాటమని" రైతాంగంలో గత కొన్ని దశాబ్దాలుగా సంస్కరణవాద భావాలు వ్యాపించి వున్నవని, యిది మౌలిక సమస్య అని, దీనిని పరిగణించి పరిష్కరించవలసి వుంటుందని[2]" పెడధోరణులను అతివాద మార్గంలోనే పరిష్కారం చూసాడు. అంతేగాక వుద్యమం వెనుకడుగు వేయుటను, "వ్యూహాత్మక తిరోగమనంగా" తదనంతరం "తిరోగమనాన్ని నిస్తబ్దతగా" చెప్పి గెరిల్లా పోరాట పరిభాషలో "ప్రజాసమీకరణచేసి, వారిని సాయుధులుగ చేయుటతో జోతేదారులు, స్వప్రయోజనపరులు, యితర సమాజ శత్రువులు గ్రామాలు వదలి వెళ్ళుటతో, విముక్తిప్రాంతం ఏర్పడించనే" అభిప్రాయానికొచ్చారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగాలు శక్తియుక్తులను, వారి తిరుగుబాటులను అణచివేయగల శక్తిని చాల తక్కువగా అంచనావేశారు. అధికారవర్గ ప్రభుత్వ హింసా యంత్రాంగాన్ని శాస్త్రీయంగా అవగాహన చేసుకొనుటలో వైఫల్యం స్పష్టం. ఈ అవగాహననే యిలా వెలిబుచ్చారు. "సాయుధులైన సాధారణ ప్రజాసామాన్యాన్ని నిజమైన సైన్యంగా చూసాము. యాదృచ్ఛిక ప్రజా తిరుగుబాటులనుండి గెరిల్లా దళాలు ఏర్పడునని తలంచాము. నిర్వ్యాపార తిరుగుబోతులను దళాలలో చేర్చుకొని, వారు పోరాటాలను బలపరచుటతో వారు పోరాట దళాలకు నాయకత్వం వహించగలరని తలచాము." అనికూడ వ్రాసారు.

అఖిలభారత కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయకమిటి నాయకత్వం, తాము భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు–లెనినిస్టు)గా రూపొందినట్లు 1969 మే దినోత్సవంనాడు ప్రకటించింది. ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారుల కమిటి 1968లో అఖిలభారత కమిటీలో విలీనం కావటము, ఆ కమిటి నాయకత్వం 1969లో ఆంధ్ర

---

1. అదే పే. 219.
2. అదే పే. 213.

ప్రదేశ్ కమిటీని, అఖిల భారత నిర్మాణంనుండి తొలగించుట రెండూ స్వల్పకాలం లోనే జరిగాయి ఈ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారులు విప్లవ సిద్ధాంతం కొరకు జరిపిన అంతర్గత సైద్ధాంతిక పోరాటం, తదుపరి బయటకువెళ్ళి అదే పోరాటాన్ని కొనసాగించుట, అఖిలభారత కమ్యూనిస్టు విప్లవకారులలో పునరా లోచనకు తోడ్పడిన దనుటతో సందేహం లేదు. అయితే అదేకాలంలో ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారులలో వివిధ సమస్యలపై భేదాభిప్రాయాలు వెల్లడయ్యాయి, అవే తదనంతర కాలంలో చీలికలకు ప్రాతిపదికలయ్యాయి అనుట నిస్సందేహము. వొకవర్గం, అఖిలభారత కమ్యూనిస్టు విప్లవకారుల యెడల ఉదారవాద దృక్పథాన్ని వహించాలని, భేదాభిప్రాయాలను కనీసస్థాయికితెచ్చి, సిద్ధాంత పోరాటాన్ని దిగ జార్చారు.

డెబ్రా పోలీస్ స్టేషన్ ప్రాంత ఆర్గనైజింగు కమిటి 1969 శీతాకాలంలో, ఏ జెండాలోని "గెరిల్లా చర్యలు" ఎలా వచ్చింది, ముఖ్యంగా వుద్యమం విఫలమై, పోలీసు చర్యలతో "ఆర్గనైజింగు కమిటి నిర్వీర్యమై, నిరాశతో" మునిగి పోయిందో వివరించింది, అంతేగాక, అధికారం స్వాధీనం చేసుకొనే రాజకీయాలను ప్రజా సామాన్యానికి బోధించుట అవసరమని నివేదిక రచయిత స్పష్టం చేసారు. ఆ వెను వెంటనే, "అధికారాన్ని స్వాధీనం చేసుకొనే సమస్య ప్రధానంగా ఎప్పుడూ రాలేదని" తెలుపుట ఆశ్చర్యాన్ని కలిగించదు. అంతేగాక, "ఉద్యమం యిసుకలో కూరుకు పోయి" పురోగమనం స్తంభించింది. ఉద్యమం పెడదారి పట్టుటతో, ప్రజాసమీకరణ విఫలమగుటతో, వ్యక్తిగత హింసావాదానికి దారితీసింది[1].

బెంగాల్-బీహార్-ఒరిస్సా సరిహద్దు ప్రాంత కమిటి, ఏప్రిల్ 1970 నివేదిక మరో ప్రధాన పత్రంగా నెంచవచ్చును. ఉద్యమం ప్రథమంలోనే వైఫల్యాన్ని చవి జూచుటకు, గతంలోని ఆర్థిక వాదానికి అంట గట్టింది. బీహారులో ముషాహరి నివేదిక కూడ యిదే పనిచేసింది. వీటినుండి సి.పి.ఐ.(యం.యల్.) వుద్యమానికి ప్రజా మద్దతు ఏ మాత్రంలేదని, అంచేతనే పోలీసు యంత్రాంగం కదిలిన వెంటనే నీరుగారి పోయిందని స్పష్టమగుతుంది. అంతేగాక వైఫల్యం చేదు వాస్తవికతను ప్రత్యక్షం చేసింది, పరస్పర ద్వేషాన్ని కలుగజేసి, పార్టీ అనేక ప్రాక్షనులుగా చీలికలకు కారణమైంది. శ్రీకాకుళం మరో మార్గాన్ని నాయకత్వానికి వెలుగును చూపేవరకు బెంగాల్‌లో వివిధ గ్రూపులు చీకటిలో పయనించాయి.

ఈ చీకటిలో పయనించే వుద్యమానికి, "మహాపథాన్ని" వర్గ శత్రు నిర్మూలనా సిద్ధాంతాన్ని చారుమజుందారు గెరిల్లాలకు మార్గదర్శికం చేసారు. ఇదే సెప్టెంబరు 1969 లో అఖిలభారత కమ్యూనిస్టు విప్లవకారుల వుద్యమాన్ని "వ్యక్తిగత హింసా

1. ప్రతాప్‌మిత్రా, మొహిత్ సేన్ (1971) కమ్యూనిస్టుపార్టీ అండ్ నక్సలైట్స్. సి.పి.ఐ. పబ్లికేషన్, పే. 19-20.

వాద" పెడమార్గాన్ని పట్టించింది. డెబ్రా, బహరాగోరాలలో విప్లవ కమ్యూనిస్టుల దళాలు, గతంలో ప్రజా కార్యాచరణ అనుభవాలున్నప్పటికి, గోపి వల్లభపూర్ ప్రాంత కమ్యూనిస్టు విప్లవకారుల కంటె ముందుగానే పురోగమించి, శత్రు నిర్మూలనా సిద్ధాంతాన్ని అమలు పెట్టారు. సరిహద్దు ప్రాంత నివేదిక, డెబ్రా యూనిట్ చట్టబద్ధ బహిరంగ ప్రజా కార్యాచరణ చేబట్టిందని, శతృనిర్మూలనా ఎత్తుగడలను ఆచరించుటలో తూగిసలాట ఆడుతున్నదని తీవ్రంగా విమర్శించింది. సిద్ధాంతం ఆచరణతో ప్రాభావిత మౌతుందని, ఆచరణ పరిస్థితులతో మార్పు చెందుతు పరిణామక్రమంలో రాటుతేలి సిద్ధాంతమగుతుంది, యిది పరివర్తనా క్రమం, శాస్త్రీయ విధానము- సహజంగానే నూతన పంథాతో ప్రభుత్వ హింసా, దౌర్జన్యకాండ పెరిగిపోయింది. అయితే విప్లవకారుల నిర్మాణం దానిని తట్టుకొనగలదిగా లేదు. సాయుధ పోలీసు దళాలు విప్లవకారుల గెరిల్లా దళాలను చుట్టుముట్టి కాల్పులలో మట్టుపెట్టుతో, పౌరవను గెరిల్లా దళాలు కోల్పోయాయి. గెరిల్లాలు దాడిచేయుట నుండి, చుట్టుముట్టి దాడికి లోనగుటతో రక్షణకై తప్పించుకొనిపోయే స్థితికి వచ్చారు.[1].

నక్సల్బరీ సాయుధ రైతాంగ తిరుగుబాటు తరువాత వారి పోరాటాల విధానం, లక్ష్యం, అందరికి అర్థమైంది. వ్యవసాయ రైతాంగ సాయుధ విప్లవాన్ని అభివృద్ధిచేసి గ్రామీణ స్థావరాలను ఏర్పాటుచేసి, తద్వారా గ్రామసీమలను విముక్తి చేయాలనే ధ్యేయం ప్రజామన్ననను, మద్దతును పొందజాలక పోయింది. బహుశా, యిది కొంత వరకు అనుభవ శూన్యులైన కమ్యూనిస్టు శ్రేణులకు విప్లవ సమగ్ర స్వరూపం, అవగాహన వారికి లేదు, వారికి గల దురభిప్రాయాలను తొలగించుకొనజాలక పోయారు. పైగా నక్సలైటులు పెద్ద కమ్యూనిస్టు పార్టీలు, యితర వామపక్షాలతో పోటీ చేయజాలక పోయారు. ఐక్యసంఘటనలోని వామపక్షాలవలె రైతాంగాన్ని చైతన్యవంతులనుచేసి సమీకరించజాలకపోయారు ఫలితంగా నక్సలైట్ల విధానాలు వారిపై వ్యతిరేకతను పెంచాయి. గెరిల్లా పోరాటాలలో భయభ్రాంతులను చేసే హింసా ఎత్తుగడలు వొక్కటే మార్గంగా కన్పించాయి. అయితే, వాటి వెనుకనే ఇనుమడించి ప్రభుత్వ పోలీసు యంత్రాంగం ప్రజలపై హింసా చర్యలు యెక్కువగుట అందరకూ స్పష్టంగా తెలియవచ్చింది. గ్రామాలలో వుండుట నక్సలైట్లకు చాల కష్టమైంది. సి.పి.ఐ.(యం.యల్.) ప్రజాపంథా, ప్రజల నుండి తిరోగమన పంథా అయింది. వాగాడంబర పదజాలానికి, హింసా దౌర్జన్య సాహసకృత్యాల తరచు ప్రదర్శనగా, హత్యలకు నైతిక బలాన్నిచ్చేదిగా ఆచరణలో యువకులను ఆశ్చర్యంలో ముంచేదిగా అయింది. ప్రజలలో యువకులలో చైతన్యాన్ని, పోరాట

1. అదే పే. 21.

శక్తిని పెంచేదిగా కాక, వారిని ప్రేక్షకులుగా చేసి, వారి పాత్రకు భరత వాక్యం పాడింది.

సి.పి.ఐ.(యం.యల్) విప్లవ కమ్యూనిస్టులు నగరాలను కేంద్రాలుగా చేసుకొన్న నేటిదశ, క్రొత్తపుంతలు త్రొక్కి గ్రామసీమలవైపు మళ్ళుట జరిగినట్లు కన్పడుతున్నది. వారు వూహించే బెంగాలులోని ఒక జిల్లానుండి మరో జిల్లాకు "సుదీర్ఘప్రయాణం" కనుచూపుమేర లేదు. సి.పి.ఐ. (యం యల్) శ్రేణులు గ్రామీణ ప్రాంతాలలో స్థావర ప్రాంతాలను నిర్మించే ప్రయత్నమూ ఎక్కడా కనుపించదు. ఆ స్థావరాలలో ప్రజావిముక్తి సైన్యం నిర్మించబడుట వూహాచిత్రంగానే వుండిపోయింది. ఆ విధంగా 1970 దశకాన్ని "విముక్తిదశకం"గా చేయనెంచుట కూడ గాలిలో మేడగానే అయింది. భారతదేశంలో చైనా నమూనా విప్లవం పునరావృతమగుట కల్ల. ఆ విధంగా పునరావృతమగుటకు అవకాశాలున్నవనుటకు యేమైనా కారణాలు వున్నవా? ఈ ప్రశ్నకు సమాధానమిచ్చుటకు చైనా కమ్యూనిస్టు అనుభవాలను, సిద్ధాంతాన్ని, మావో ఆలోచనా విధానం యేవిధంగా చారుమజుందార్ ఆచరణలో పెట్టుటలో విఫలమయ్యారో ఫలితాలే స్పష్టం చేసాయి.

# 7

# మహాడు కమ్యూనిస్టు స్రవంతుల పార్టీల కాంగ్రెసులు

సి.పి.ఐ. 8వ పార్టీ కాంగ్రెసు ఫిబ్రవరి 1968లో, సి.పి.ఐ.(యం) 8వ పార్టీ కాంగ్రెసు డిశెంబరు 1969లో క్రమంగా పాట్నా, కొచ్చిన్‌లలో జరిగాయి. సి.పి.ఐ.(యం యల్) కన్వెన్షన్ ఏప్రిల్ 1969, కాంగ్రెసు మే 1970లో జరిగినవి. సి.పి.ఐ.,సి.పి.ఐ.(యం) కాంగ్రెసులు తమ తమ రాజకీయ నివేదికలు, తీర్మానాలు, నిర్మాణ నివేదికలు, అంతర్జాతీయ పరిస్థితిపై తీర్మానాలు, కార్యక్రమము, పొలిటికల్-ఆర్గనైజేషనల్ రిపోర్టు సుదీర్ఘచర్చల తరువాత ఆమోదించాయి. సి.పి.ఐ. (యం.యల్) విప్లవకారులు సమన్వయకమిటి ప్రతిపాదించిన రాజకీయ తీర్మానం, పార్టీనిర్మాణ తీర్మానం, పార్టీ కార్యక్రమము, రాజకీయ నిర్మాణ నివేదికలను పార్టీ కాంగ్రెసు ఆమోదించింది. వాటి అధ్యయనం, విశ్లేషణ క్లుప్తంగా చేద్దాము. సి.పి.ఐ. (యం) 7వ కాంగ్రెసులోనే కార్యక్రమాన్ని ఆమోదించింది. తిరిగి 1972 లో జరిగిన 9వ కాంగ్రెసు సవరణలతో ఆమోదించింది.

కమ్యూనిస్టు పార్టీల విధానాల పత్రాలలో, కార్యక్రమము వొక దశకంతటికి సంబంధించి వుండుటయేగాక, రాజకీయ పరిస్థితుల పరిశీలన, రాజకీయ తీర్మానాలు, తక్షణ కార్యక్రమాల రూపకల్పన ప్రధానంగా దీనిననుసరించే వుంటుంది. కాన కార్యక్రమాల పరిశీలనతోనే ప్రారంభించుదాము.

## స్వాతంత్ర్య సమస్య :

సి.పి.ఐ. 8వ పార్టీ కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమంలో "మన దేశ చరిత్రలో భారతదేశ స్వాతంత్ర్యాన్ని 15 ఆగస్టు 1947న సాధించుట నూతన యుగానికి ప్రారంభం[1]" అని స్పష్టంగా పేర్కొన్నది. అంతేగాక ఇది మన వొక్క దేశానికి ప్రజలకు మాత్రమేగాక, మానవాళికి చారిత్రిక ఘటనగా విశదపరచింది. మన స్వాతంత్ర్య అవతరణ తరుణంలో "ఉవ్వెత్తుగా పెల్లుబికిన జాతీయ విప్లవం, యూరపులో వచ్చిన ప్రజాస్వామ్య పోరాటాల వెల్లువలో, రెండవ ప్రపంచయుద్ధానంతరం నైఋతి ఆసియాలో విజృంభించిన జాతీయ విముక్తి పోరాటాల వెల్లువలో, ఫాసిస్టు శక్తులపై సోవియట్ యూనియన్ సోషలిస్టుశక్తుల విజయంలో భాగంగా[2]" వివరించింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదం "రాజీకి నిర్ణయించి, తిరిగి దాడిచేయు లక్ష్యంతో వేసిన వ్యూహాత్మక వెనుకడుగు"గా తన గత అవగాహననే పునరుద్ఘాటించింది.

స్వరాజ్య వుద్యమంలో యుద్ధానంతర ప్రజాపోరాట వెల్లువకు కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యానికి నిర్దిష్ట, స్పష్టమైన, సైద్ధాంతిక పునాది, సామాజికాభివృద్ధి, సెక్యులర్ వేదికను రూపొందించుటలో విఫలమైంది. హిందూ-ముస్లిం అనైక్యత, మతకల్లోలాలు, రక్తపాతం అవకాశంగా తీసుకొని, జాతీయోద్యమాన్ని విచ్ఛిన్నంచేసి భారతదేశాన్ని బ్రిటిష్ సామ్రాజ్యవాదం ఇండియా, పాకిస్తాన్ అను రెండు దేశాలుగ చీల్చి, స్వాతంత్ర్యాన్ని యిచ్చింది. "సామ్రాజ్యవాదం భారత స్వాతం స్వాతంత్ర్యాన్ని నామమాత్రంచేసి, సామ్రాజ్యవాద పెట్టుబడిదారి విధాన పరిధిలో ఉపగ్రహదేశంగా, ఆర్థికాభివృద్ధికి అడ్డు తగలాలని పథకాలు వేసింది[3]".

"జాతీయోద్యమానికి నాయకత్వం వహించి జాతీయ కాంగ్రెసు స్వతంత్ర భారతదేశంలో ప్రథమ ప్రభుత్వాన్ని యేర్పరచింది. జాతీయ కాంగ్రెసు వేదిక, స్వతంత్ర భారతదేశ రాజ్యాంగాన్ని రూపొందించుట, దేశభవిష్యత్తుకు, స్వతంత్ర జాతీయ ఆర్థిక విధానాన్ని నిర్మించుటకు, రైతాంగానికి భూసంస్కరణలు, ప్రాథమిక హక్కులు, శ్రమజీవుల సంక్షేమం, పారమెంటరీ ప్రజాస్వామ్యాలను

---

1. ప్రోగ్రాం ఆఫ్ ది కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా (1968) 8వ కాంగ్రెసు సవరణలతో ఫిబ్రవరి 1968లో ఆమోదించినది. (ఆంగ్లంలో) పే. 1.

2. అదే పే. 2.

3. ప్రోగ్రాం ఆఫ్ ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా (1968). ఆంగ్లంలో పే. 2.

వేదికగా చేపట్టింది.[1]

జాతీయోద్యమం చరిత్ర అంతటా, ద్వంద్వపాత్ర వహించిన జాతీయ బూర్జువా వర్గానికి జాతీయ కాంగ్రెసుతో నాయకత్వం సుస్థిరమైనందున, దాని ప్రభావం రాజకీయ పరిణామాలపై ప్రగాఢంగా వుంది. ఒకవైపు స్వాతంత్ర్య పోరాటంలో సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక పాత్ర, అదేకాలంలో మరో వైపు వర్గ ప్రయోజనాలరీత్యా సామ్రాజ్యవాద పాలకులతో రాజీపడుతూ, మిలిటెంటు ప్రజా పోరాటాలను నీరుగార్చుతూ, కార్మిక, కర్షకుల వర్గపోరాటాలను వ్యతిరేకించింది. "ఈ ద్వంద్వపాత్ర కాంగ్రెసు నాయకత్వపు, బ్రిటిష్ ప్రభుత్వం మధ్య జరిగిన సంప్రదింపులలో, చేసుకొన్న ఒప్పంద స్వభావంలో ప్రతిబింబించింది. జాతీయ విముక్తి వుద్యమం జాతీయ బూర్జువా నాయకత్వం నుండి చేజారిపోయే పరిస్థితి ఒకవైపున, రాజ్యాధికారాన్ని చేబట్టి, ఆ బలంతో వర్గశక్తులకు స్థిరమైన బలాన్ని చేకూర్చు లక్ష్యం మరోవైపున ఆ వొప్పందం షరతులను బూర్జువా వర్గం ఆమోదించునట్లు చేసింది. కొన్ని షరతులు మన స్వాతంత్ర్యాన్ని బలహీనపరచి సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు సేవ చేయునట్లున్నవి.[2]

సామ్రాజ్యవాదశక్తులు భారత జాతీయ బూర్జువా శక్తులను మతకల్లోలాలు, కాందిశీకుల సమస్యలు, కాశ్మీర్‌పై కొండజాతుల వారిలో దురాక్రమణ దాడులు, కాశ్మీర్‌పై పాకిస్తాన్, ఇండియా-పాకిస్తాన్ యుద్ధము వగైరాల వొత్తిడితో సామ్రాజ్యవాదం, ఇండియాను తన చెప్పు చేతలలో వుంచుకొనే ప్రయత్నం చేస్తున్నది. వీటితోపాటు స్టెర్లింగు నిలువల చెల్లింపులు, దిగుమతులు, ఆహార పదార్థాల దిగుమతులు అన్ని యిబ్బందులకు లోనగునట్లు చేస్తున్నది. సంస్థానాధిపతులకు, కేంద్ర కాంగ్రెసు ప్రభుత్వానికి వ్యతిరేకంగా రెచ్చగొట్టుతున్నది.

ఒక్కమాటలో పాలకవర్గ పార్టీలోని అత్యధిక ఆధిక్యతగల వర్గాలు, స్వతంత్ర పెట్టుబడిదారి విధానాభివృద్ధికి, రాజీ విధానాన్ని అవలంబించుటతోపాటు, అభ్యుదయకర కాంగ్రెసు వాదులను బయటకు నెట్టివేయుట, చీలికలు తెచ్చుట చేస్తున్నవి. ముఖ్యంగా అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో చీలికలు తెస్తూన్నారు.

సి.పి.ఐ.(యం) 7వ కాంగ్రెస్‌లోనే తమ కార్యక్రమానికి తుది మెరుగులు దిద్దింది. తదనంతరం 9వ, పార్టీ కాంగ్రెసులో సవరణలతో పునరుద్ఘాటించింది.

ఫాసిస్టు శక్తులకు నాయకత్వం వహించిన జర్మనీ రెండవ ప్రపంచయుద్ధంలో సైనిక అపజయం పొందుటలో సోవియట్ సోషలిజం విజయంఫలితంగా ఆసియాలో

1. అదే పే. 3.
2. అదే పే. 3.

ఫాసిస్టు జపాన్ కుప్పకూలిపోయింది. వలసలలో జాతీయ విముక్తి వుద్యమాలు సామ్రాజ్యవాదంపై విజయం సాధించి, అనేక స్వతంత్ర దేశాలు యేర్పడినవి. భారతదేశంలో కూడా బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా విప్లవ ప్రజోద్యమాలు పెల్లుబికి, రైతుల తిరుగుబాటులు, కార్మికుల సార్వజనిక సమ్మెలు, విద్యార్థుల సమ్మెలు, సంస్థాన ప్రజోద్యమాలు అన్నీ కలసి మునుపెన్నడులేని మహోద్యమంగా సాగింది. అనేక ప్రాంతాలలో సైనిక దళాలు, నావికా సైన్యం తిరుగుబాటులు జరిగాయి. విజృంభిస్తున్న యీ పోరాటాలన్నీ సార్వజనీన జాతీయ తిరుగుబాటుగా అభివృద్ధి చెందగలవని బ్రిటిష్ సామ్రాజ్యవాదం గుర్తించి, తన పాలన మరెంలో కాలం కొన సాగదని గ్రహించింది. కాంగ్రెసు నాయకత్వం, సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయోధ్యమ నాయకత్వం తన చేతులలో వుండజాలదని భయపడింది. అట్టి పరిస్థితులలో జాతీయ కాంగ్రెసు, ముస్లింలీగుల నాయకత్వాల మధ్య బ్రిటిష్ ప్రభుత్వంతో వొక వొప్పందం కుదిరిందని పునరుద్ఘాటించింది.

ఫలితంగా, దేశం రెండుగా చీల్చబడి, ఇండియా, పాకిస్తాన్‌లకు రాజకీయ అధికారం ఇండియాలో కాంగ్రెసు నాయకత్వానికి ఆగస్టు 15, 1947న బదిలీ చేయబడింది. ఈ విధంగా భారతదేశంలో బ్రిటిష్ రాజకీయ పాలన అంతమొంది, బడా బూర్జువా పాలనలో రాజ్యాంగం యేర్పడింది. దీనితో భారతదేశ విప్లవంలో జాతీయ సామాన్య ఐక్య సంఘటనా ప్రథమదశ, ప్రధానంగా విదేశ సామ్రాజ్యవాద పాలన వ్యతిరేక పోరాటం అంతమైంది" అని సి.పి.ఐ.(ఎం) స్వాతంత్ర్య సంపాదనపై విశ్లేషణ చేసి, భారతదేశం స్వతంత్ర్యం పొందినదని, చివరకు ఆమోదించింది. "సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటన కార్మికవర్గ నాయకత్వంలో మాత్రమే, ప్రజాస్వామ్య విప్లవం అన్ని దశలను పూర్తి చేసుకొనుటయేగాక, ప్రజాస్వామ్య విప్లవ దశలో ఆగిపోకుండా వేగంగా సోషలిస్టు విప్లవ దశకు పురోగమిస్తుంది. భారతదేశపు అసంపూర్తి విప్లవం కూడ, యీ చారిత్రిక సత్యాన్ని రుజువు చేస్తున్నది[1]" అని కార్యక్రమము ఐక్య సంఘటనా నైజాన్ని తెలియజేసింది. ఇంకా "మనయుగం వలస విధాన నిర్మూలనం, సోషలిజంలోని పరివర్తనా" యుగంగా కూడ పేర్కొంది. "ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడే శక్తులే సోషలిస్టు పరివర్తన ప్రధాన వైఖరిని, నైజాన్ని ప్రధాన లక్షణాలను సమాజ చారిత్రికాభివృద్ధిని నిర్ణయిస్తాయి. "ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ సమాజాభివృద్ధిని నిర్ణయించేదిగా తయారైంది" అని అంతర్జాతీయ పరిణామాలలో సోషలిస్టు వ్యవస్థ పాత్రను, అనగా సోవియట్ యూనియన్, యితర సోషలిస్టు దేశాల

1. ప్రోగ్రాం, సి.పి.ఐ.(ఎం) 7వ, కాంగ్రెసు నవంబరు 1964లో ఆమోదించినది. మధురై 9వ, కాంగ్రెసు అధికరణలు 88 నుండి 90 వరకు సవరణతో ఆమోదించింది. పే. 2.

పాత్రను స్పష్టము చేసింది.

"భారతదేశంలో విప్లవం రెండవ దశలో ఫ్యూడలు, సెమీ ఫ్యూడలు భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి, వ్యవసాయ కూలీలకు, పేద రైతులకు భూమిని పంపకం చేయుట తక్షణ కర్తవ్యంగా పూర్తి చేయవలసి వుంటుంది. బ్రిటిష్ పెట్టుబడిని స్వాధీనం చేసుకొని జాతీయంచేసి, మన జాతీయ ఆర్థిక వ్యవస్థపై విదేశీ గుత్త పెట్టుబడి దోపిడి కబంధ హస్తాల పట్టు"ను రద్దు చేయాలి అనేవి ప్రధాన కర్తవ్యాలుగా సి.పి.ఐ.(ఎం) కాంగ్రెసు కార్యక్రమంలో స్పష్టం చేసింది.

ప్రజాస్వామ్య విప్లవంపై కర్తవ్యాలను చేబట్టి, ఆర్థిక, రాజకీయ మౌలిక మార్పులను తెస్తుందని బడా బూర్జువావర్గం సామ్రాజ్యవాదంతో రాజీపడి, బ్రిటిష్ ద్రవ్య పెట్టుబడచేసే దోపిడికి ఆమోదముద్ర వేసింది. పైగా బ్రిటిష్ కామన్‌వెల్తులో కొనసాగుతానని హామీ యిచ్చింది. ఈ నేపథ్యంలోనే ఫ్యూడలు సంస్థానాలకు, రాజులకు, జమీందారులకు, భూస్వాములకు అనేక రాయితీల నిచ్చింది.

చారిత్రిక అనుభవాలు, బూర్జువావర్గం జాతీయోధ్యమానికి నాయకత్వం వహించి, స్వాతంత్ర్య పోరాటాన్ని సాగించి, అధికారాన్ని హస్తగతం చేసుకొన్నా జాతీయ ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను సంపూర్తి చేయజాలదని స్పష్టం చేస్తున్నాయి. అసంపూర్తి భారత విప్లవం కూడ దీనినే రుజువు చేస్తున్నది.[1]

సి.పి.ఐ. (ఎం.ఎల్) కార్యక్రమం, మే 1970లో జరిగిన పార్టీ కాంగ్రెసు ఆమోదించింది. ముఖ్యాంశాలు యిలా వున్నవి[2] వీటిని సి.పి.ఐ., సి.పి.ఐ. (ఎం)ల కార్యక్రమాలతో పోల్చి అధ్యయనం, విశ్లేషణ చేద్దాము.

"భారత బూర్జువావర్గం, కంప్రెడార్ నైజాన్ని కలిగి వుండి, జాతీయ విముక్తి పోరాటాన్ని ప్రక్కదారి పట్టించి, విప్లవ పోరాట పంథాని లొంగుబాటు, రాజీ విధానంగా చేసింది." అని సి.పి.ఐ. (ఎం.ఎల్) కార్యక్రమము స్పష్టంచేసి, అందుకు బలమైన మద్దతుగా చంపరాన్ రైతాంగ పోరాటాన్ని నీరుగార్చినట్లు, జాతీయ విముక్తి వుద్యమాన్ని స్వప్రయోజనానికి, బ్రిటిష్ సామ్రాజ్యవాద పాలనను, ఫ్యూడలు పరిపాలకులకు రక్షణ కల్పించే విధంగా మార్చి వేసిందని తీవ్రంగా విమర్శించింది. అదే విధంగా సి.పి.ఐ. యీ క్రింది విధంగా విమర్శించింది. "సి.పి.ఐ. నాయకత్వం మొదటినుండి కాంగ్రెసు నాయకత్వపు తోకను పట్టుకొనిపోతూ, విప్లవానికి ద్రోహం చేసిందని" విమర్శించింది. "సి.పి.ఐ. నాయకత్వం సామ్రాజ్యవాదపు, ఫ్యూడలు శక్తుల యేజంట్లు"గా చిత్రించింది.

---

1. అదే. పే. 4.
2. ప్రోగ్రాం ఆఫ్ ది సి.పి.ఐ. (యం. యల్) మే 1970లో పార్టీ కాంగ్రెసు ఆమోదించినది. నక్సలిజం అండ్ ఆఫ్టర్ వా. 2 (ఆంగ్లంలో) పే. 275-284.

"అజాద్ హింద్ ఫౌజ్" ఖైదీలను విడుదల చేయాలనే బ్రహ్మాండమైన విప్లవ వెల్లువతో, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం విజృంభించుట, తెభాగా, తెలంగాణా, పౌన్నప్రా, వయలార్, పి. అండ్ టి. వర్కర్స్, రాయల్ ఇండియన్ నావికాదళ తిరుగుబాటు, అన్నీ కలసి, బ్రిటిష్ సామ్రాజ్యవాదం, కాంగ్రెసు, ముస్లిం లీగులకు రాజ్యాధికారాన్ని అప్పజెప్పునట్లు చేసాయి. ప్రధానంగా అమెరికా సామ్రాజ్యవాదం, సోవియట్ యూనియన్ సోషలిస్టు సోషల్ సామ్రాజ్యవాదం అంటే సోవియట్ రష్యా సోషల్ సామ్రాజ్యవాదం మిత్ర సలహా సంఘ యేర్పాట్లుగానే చూడ కోరుచున్నారు.

సి.పి.ఐ (యం.యల్) ఆగస్టు 15, 1947లో వచ్చిన స్వాతంత్ర్యాన్ని "బూటకపు స్వాతంత్ర్యంగా, బడా కంప్రెడరీ - నిరంకుశ బూర్జువావర్గం బడా భూస్వామ్య పాలకవర్గాలు, తమ సామ్రాజ్యవాద యజమానులకు నమ్మకంగా సేవ చేస్తున్నారు. ఈ సామ్రాజ్యవాద బంట్లు, బ్రిటిష్ సామ్రాజ్యవాదపు పూర్వదోపిడి కాపాడుతూ, అమెరికా సామ్రాజ్యవాద, సోవియట్ సోషల్ సామ్రాజ్యవాద దోపిడీల కొనివచ్చి, దేశాన్ని పీల్చి వేయునట్లు చేస్తున్నారని [1]" పేర్కొన్నారు.

"బ్రిటిష్ సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం అనే పర్వతాల భారానికి బదులు, నేడు అమెరికా సామ్రాజ్యవాదం, సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం, కంప్రెడరీ నిరంకుశ పెట్టుబడి అనే నాలుగు పర్వతాల భారాన్ని భారత ప్రజలు మోయవలసి వుంటుంది. ఈ విధంగా భారతదేశం అమెరికా సామ్రాజ్యవాదానికి, సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదానికి నియో లేక నూతన వలసగా మారింది." [2]

ఆగష్టు 15, 1947న వచ్చినది స్వాతంత్ర్యమా కాదా అన్న సమస్య భారత కమ్యూనిస్టు ఉద్యమం వివిధ శ్రేణులు వివిధ రకాలుగా వ్యాఖ్యానించిన చారిత్రిక ఆధారాలున్నవి. నేడు మార్క్సిస్టు-లెనినిస్టు కమ్యూనిస్టు శ్రేణులు "బూటకపు స్వాతంత్ర్యంగా" పేర్కొనుట కొత్త విషయం కాదు. సి.పి.ఐ. కేంద్ర కమిటీ జూన్ 1946లో స్వాతంత్ర్యంగా రణదివె నాయకత్వంలో, సుదీర్ఘ చర్చల అనంతర నిర్ధారణ, సమీక్ష, 2వ పార్టీ కాంగ్రెసు సిద్ధాంత పత్రాలన్నిటిలో అదే ధంగా పేర్కొనబడింది. జూన్ 1946 కేంద్రకమిటి సమావేశం 2వ పార్టీ కాంగ్రెసు మధ్యకాలంలో జరిగిన జూన్ 1947లో జరిగిన కేంద్ర కమిటీవచ్చినది స్వాతంత్ర్యం అని గుర్తించి, అది పరిమితులు, వొత్తిడులకు లోనవుతున్నదని

---

1. —అదే —పే. 277.

2. —అదే —పే. 277-8.

చెప్పుట కమ్యూనిస్టు శ్రేణులలో పెక్కుమందికి తెలిసే వుంటుంది. తదనంతరపార్టీ చరిత్రలో "జూన్ 1946 అవగాహన మితవాద వక్రీకరణ"గాను, 2వ పార్టీ అవగాహన "అతివాద వక్రీకరణ"గాను లిఖించబడుట గూడ కమ్యూనిస్టు శ్రేణులకు తెలుసు.

సి.పి.ఐ. లో అతివాదులు 1964 వరకు, తరువాత సి.పి.ఐ. (యం) గా ఏర్పడినవారు 1960 దశకంలో స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారాలపై మార్క్సిస్టు ఆర్థిక కొలమానాన్ని సవరించుట తప్పని, బ్రిటిష్ సామ్రాజ్యవాదంతోగల కామన్ వెల్తు సంబంధం విడదీయలేనిదని, బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి భారత బూర్జువా వర్గానికిగల వైరుధ్యం నిర్ణయాత్మక అంశం కాదని, రెండింటికిగల "పొత్తు"నిర్ణయాత్మక పాత్ర వహించుచున్నందున సామ్రాజ్యవాదం దాని దేశీయ పొత్తుదారులకు వ్యతిరేకంగా సంపూర్ణ స్వాతంత్ర్యానికై పోరాడుట భారత విప్లవ మౌలిక కర్తవ్యమని వాదించారు. దశాబ్దాల తరువాతపై అవగాహన "అతివాద పొరపాటుగా" బర్ద్వాన్ ప్లీనంలో సరిచేసుకొన్నారు.

సి.పి.ఐ. లో 1950-60 లలో "మితవాదులు"గా పేరుబడి చీలిక తదనంతరము నాయకత్వం వహించినవారు భారతదేశం స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారం గల, సర్వసత్తాక రిపబ్లిక్‌గా నిర్వచించి,శాంతి, యుద్ధవ్యతిరేక విదేశాంగ విధానంతో స్వాతంత్ర్యాన్ని పటిష్టం చేసుకొంటున్నది. సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక దేశీయార్థిక విధానాలను, పెట్టుబడిదారీ మార్గానాభివృద్ధిలో సాగిస్తున్నదనే వైఖరి చేబట్టారు. నాడు మధ్యేమార్గాన్ని అనుసరించిన కమ్యూనిస్టు శ్రేణులు భారతదేశం స్వేచ్ఛా, స్వాతంత్ర్య, సార్వభౌమాధికారాలను పొందిందని,కాని అర్ధవలస, ఆధారిత ఆర్థిక విధానంలో వుందని, బ్రిటిష్ కామన్‌వెల్తు బంధనాలనుండి బయటపడి, విదేశీ పరిశ్రమలను, ఆర్థిక ప్రయోజనాలను జాతీయంచేసి, స్వతంత్ర ఆర్థిక పారిశ్రామికాభివృద్ధిని, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పొందవలసి వుందనే అవగాహన చేబట్టి, పార్టీని విచ్ఛిన్నతనుండి కాపాడి కొంత చారిత్రక పురోగమనాన్ని సాధించాయి.

సి.పి.ఐ. (యం) బర్ద్వాన్‌ప్లీనం (1968) లో "భారతస్వాతంత్ర్యం" పైగల అవగాహనలు ఎలా మార్పు చెందాయో యిలా వివరించింది. "మరోసారి పార్టీలోని అతివాద సెక్టేరియన్ ధోరణి భారత స్వాతంత్ర్యం "నామమాత్రమూ, దగా" వగైరా అంటూ ప్రబోధిస్తోంది. 1948—55 నాటికి యిప్పటికీ వున్న తేడా బ్రిటిష్ సామ్రాజ్యవాదులక్రింద మన జాతీయ స్వాతంత్ర్యం "నామమాత్రం, బూటకము" అయింది, అని లోగడ నిర్వచించగా యిప్పుడు "అమెరికన్ సామ్రాజ్య"వాదుల క్రింద మన స్వాతంత్ర్యం "నామమాత్రం, బూటకం" అయిందని వర్ణించబడింది. ఈ సమస్యలో గల సెక్టేరియన్‌వాదం, జాతీయ బూర్జువా వర్గం, సామ్రాజ్యవాదంవేపుకు వెళ్ళిపోయిందని, దానికి లొంగిపోయిందని,దేశంలోవర్గవిప్లవం ఏజండాలోనికి వచ్చిందని

యీ పని జరిగిందన్న వాదనతో తమ సిద్ధాంతీకరణను బలపరచుకో జూచింది. కాగా యిప్పుడిప్పుడే సెక్టేరియన్ వాదన, పాలకవర్గమయిన బడా బూర్జువావర్గం, కాం(ప్రడోర్ (దళారీ) బూర్జువా వర్గంగా మారిందనీ, అంతర్గతవర్గ వైరుధ్యాలు తీవ్రమయి సాయుధ ప్రతీఘాత విప్లవాన్ని సాయుధ విప్లవంతో ఎదు ర్కొనే దశకు చేరుకున్నదనీ, దాని ఫలితంగా బూర్జువావర్గం సామ్రాజ్యవాదం వేపుకు పూర్తిగా వెళ్ళిపోయిందని, జాతీయ స్వాతంత్ర్యాన్ని స్వాధీనపర్చిందని చెప్తోంది. అలాగే లోగడ సెక్టేరియన్ ధోరణి భారత రాజకీయ స్వాతంత్ర్యాన్ని బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పాతవలస విధానం క్రింద ఒక ఉపగ్రహ ప్రతిపత్తిగల స్వాతంత్ర్యంగా దిగజార్చితే,కొత్త సెక్టేరియన్ తత్వం దాన్ని అమెరికన్ సామ్రాజ్య వాదం క్రింద ఒక కీలుబొమ్మ ప్రతిపత్తిగల ప్రభుత్వంగా, నయా వలస రాజ్యంగా" నిర్వచించ ప్రయత్నిస్తున్నది.

"ఆధునిక రివిజనిస్టులు నూతన యుగమనే మంత్రంతో సామ్రాజ్యవాదాన్ని "తుడముట్టించుతూవుంటే" ఆధునిక సెక్టేరియనిజం నూతన యుగ ప్రాధాన్యతనూ, దాని రాజకీయ ప్రభావాన్ని మొత్తంగా తుడముట్టించి దాన్ని బ్రిటిష్ పాతవలసవాదం స్థానే అమెరికా నయా వలస విధానం ప్రవేశించుటగా" [1] దిగజార్చటానికి ప్రయత్నిస్తోంది.

సి.పి.ఐ. 1946 నుండి ఆగస్టు 15, 1947న వచ్చినది స్వాతంత్ర్యమని చెప్తున్నా, ఇతర రాజకీయ విధానాల విషయంగా "మితవాదవైఖరి" చేబట్టుతున్నదనే, అతివాద విమర్శన తట్టుకొనే ప్రయత్నంలో "రాజీ" మార్గంగా కొన్ని "పరిమితుల" క్లాజులను పెట్టనారంభించింది. సి.పి.ఐ.లోని "అతివాదులు" వారి వొంపెత్తు పోకడలు, అతివాద సెక్టేరియనిజంపై వచ్చే విమర్శన తట్టుకొనుటకు కామన్‌వెల్తులో వుండుట, విదేశాంగ విధానంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ననుసరించుట, ఆర్థికంగా వారిపై ఆధారపడి వుండుట "స్వాతంత్ర్యాన్ని నిర్వీర్యంచేసి, అర్ధవలస విధానంగా చేసిందనే వాదన చేబట్టారు. ఈ సందర్భంలో చైనా భారతదేశాన్ని "అర్ధవలస దేశం"గా పేర్కొనుటకూడ కమ్యూనిస్టు శ్రేణులకు గుర్తుండే వుంటుంది.

ఏదైనా ఒక విషయం స్పష్టం, స్వతంత్రంగా భారత, ఆర్థిక, సామాజిక పరిస్థితిని మార్క్సిస్టు-లెనినిస్టు శాస్త్రీయ సోషలిజం దృష్టిలో అధ్యయనం, పరిశీలన, విశ్లేషణ చేయుటలో వైఫల్యమేగాక, అంతర్జాతీయ ధోరణుల ప్రభావం బలంగా పనిచేయుటతోపాటు, స్వీయ మానసిక ధోరణిలో, పాక్షిక ప్రయోజనాలను ఆశిం

1. ఆంధ్ర కామ్రేడ్స్‌కు భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) పొలిట్‌బ్యూరో లేఖ మార్క్సిస్టు ప్రచురణలు. విజయవాడ పే. 13-14.

చుట వలన జరిగిన వివేచనా లోపంగా వివిధ కాలాలలో భారత కమ్యూనిస్టు ఉద్యమంలోని వివిధ శ్రేణులు "స్వాతంత్ర్య సమస్య" యెడల చేబట్టిన వివిధ వైఖరులను యెంచవలసి వుంటుంది,

**ప్రభుత్వ వర్గపొందిక విశ్లేషణ :**

"భారతప్రభుత్వం, జాతీయ బూర్జువావర్గపు మొత్తంగా వర్గపాలనా యంత్రాంగంగా, అందులో బడాబూర్జువా వర్గం శక్తివంతమైన ప్రభావం కలిగివుంది. ఈ వర్గ పాలనా యంత్రాంగం భూస్వాములతో బలమైన సంబంధాలను కలిగి వుంది. ఈ అంశాలు రాజ్యాంగ యంత్రంపై పనిచేయుట వలన అభివృద్ధి నిరోధక అంశాలు వుద్భవించుతూ వుంటవి [1]" అని సి.పి.ఐ. 8వ, పార్టీ కాంగ్రెసు ఫిబ్రవరి 1968లో ఆమోదించిన కార్యక్రమము, ప్రభుత్వవర్గ పొందికను, పాలనను నిర్వచించింది.

అంతేగాక బూర్జువా స్వతంత్ర్య ప్రభుత్వం అయినప్పటికీ దేశంలో సామ్రాజ్యవాద నిరంకుశ ప్రభుత్వం కంటే స్వతంత్ర్య ప్రభుత్వం "చారిత్రిక పురోగమనం"గా నెంచవచ్చును.

"భారత రిపబ్లిక్ రాజ్యాంగ చట్టము, వయోజన వోటుపై ఆధారపడినది, ప్రజలకు ప్రాథమిక హక్కులు, మార్గదర్శిక సూత్రాలు గ్యారంటీ చేయబడినవి.

"రాజ్యాంగంలో ప్రాథమిక హక్కులు నిర్దిష్టంగా వున్నప్పటికి ప్రజలకు పరిమితంగానే వుపయోగపడుతున్నవి. అనేక హక్కులు తప్పుగా వ్యాఖ్యానించబడుట, వక్రీకరించబడుట, అతిక్రమించబడుట, దోపిడీవర్గాలకు అనుకూలంగా ప్రభుత్వ యంత్రాంగమే చేస్తున్నది.

"ఈ విధమైన పరిణామాలున్నప్పటికి, రాజ్యాంగ చట్టంలోవున్న హక్కులను వేదికగా, పోరాట ఆయుధంగా చేయుటయేగాక, ప్రజలకు హక్కులు విస్తరింపచేసి, వారి ప్రయోజనాలను కాపాడవచ్చును." అనే అవగాహనను సి. పి. ఐ. కార్యక్రమం వివరించింది.

సి. పి. ఐ. (యం) భారత ప్రభుత్వవర్గ పొందికపై గల అవగాహనలను తెలుసుకొందాము. "భారత బడాబూర్జువా వర్గాన్ని గుత్తవర్గంగానూ, బడాబూర్జువా వర్గంగానూ, అభివృద్ధి నిరోధక, విప్లవ ప్రతీఘాతక వర్గంగానూ, పైకి ఖండించుటలో మితవాద సంస్కరణవాదులు, రివిజనిస్టులుగా, యితర్ల కంటె ఏమీ తీసిపోరు. మాటల్లో మాత్రమూ యీ వర్గాన్ని మినహాయిస్తూ వుంటారు. ప్రస్తుత రాజ్యాంగ యంత్రాంగంలోనూ, ప్రభుత్వంలోనూ, బడాబూర్జువావర్గం, నాయకత్వ స్థానంలోవున్న సత్యాన్ని దాస్తున్నారు. రెండో విషయం: యీ వర్గం బడా భూస్వామ్య వర్గంతో మిలాఖత్ అయిందన్న విషయాన్ని, తన వర్గ పాలననూ

---

1. ప్రోగ్రాం ఆఫ్ సి.పి.ఐ. (1968) 8వ, కాంగ్రెసు ఆమోదించినది. (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 28.

దోపిడి కొనసాగించుటకు, నిలబెట్టుకొనుటకు, విదేశ గుత్తపెట్టుబడితో రాజీపడటం ద్వారాను, మిలాఖత్ అవటం ద్వారాను మైత్రిని యేర్పరచు కొంటుందన్న విష యాన్ని వీరు మరుగుపరుస్తున్నారు. బడాయేతర జాతీయ బూర్జువావర్గమే ప్రధా నంగా రాజ్యాంగ యంత్రంలోనూ, ప్రభుత్వంలోనూ, సారథ్యం వహిస్తున్నదని, దాని నేరము బడా బూర్జువావర్గం బలీయమైన పలుకుబడిని కలిగి వుండుటకు, భూస్వాములతో బలమైన సంబంధాల నేర్పరచు కొనుటకు అంగీకరించుటయేనని సి.పి.ఐ. ప్రబోధిస్తున్నదని, బర్ద్వాన్ ప్లీనం ఆంధ్ర కామ్రేడ్స్‌కు వ్రాసిన లేఖలో పేర్కొన్నారు. అదే లేఖలో "భారత బూర్జువావర్గం దళారీ (కాంప్రెడారీ) బూర్జువా వర్గంగా మారిందని ఫలితంగా అది అమెరికన్ సామ్రాజ్యవాద గులాముగా మారిందని వాదించే అతివాద సెక్టేరియనుల (నక్సలైట్లు)ను తీవ్రంగా విమ ర్శించారు. అంతేగాక సి.పి.ఐ. సంస్కరణవాద భారత రాజ్యాంగం- బూర్జువా ప్రజా స్వామ్య రాజ్యాంగంగా చెప్పుట (?)పై విమర్శనా దాడిని చేయబోయి, తాము సెక్టేరియనిజంవైపు పయనించి, భారతదేశాన్ని "నయావలస రాజ్యంగా" "భారత ప్రభుత్వాన్ని "కీలుబొమ్మ" ప్రభుత్వంగాను, భారత రాజ్యాంగాన్ని నయావలస రాజ్యంగా చైనా కామ్రేడ్స్ చెప్పుచున్నారు కాబట్టి మనదేశంలోని సెక్టేరియనులు (నక్సలైట్లు) దానినే వల్లించుచున్నారని, బర్ద్వాన్ ప్లీనం ఆంధ్ర కామ్రేడ్స్‌కు వ్రాసిన లేఖలో విమర్శించారు.

సి.పి.ఐ. (యం) కార్యక్రమము రాజ్యాంగ నిర్మాణాన్ని "నేటి భారత ప్రభుత్వం బడా బూర్జువా, బడా భూస్వామ్య వర్గాల పాలన యంత్రాంగం, బడా బూర్జువా వర్గం నాయకత్వం వహించుతున్నది. విదేశ ద్రవ్య పెట్టుబడితో సహకార పొత్తును రోజురోజుకు అధికం చేస్తున్నది. పెట్టుబడిదారీ అభివృద్ధి పంథాను అనుస రిస్తున్నది. ప్రభుత్వ పాత్ర, కార్యాచరణను ప్రధానంగా ప్రభుత్వ వర్గ పొందిక నైజం నిర్ణయిస్తుంది. [1]

స్వాతంత్ర్యానంతరం, కాంగ్రెసు నాయకత్వం రాష్ట్రాల పునర్నిర్మాణం, భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణం ప్రాతిపదికపై, రాష్ట్రాలకు స్వపరిపాలన, ఆటవిక జాతులకు స్థానిక స్వపరిపాలన సూత్రాలపై, రాజ్యాంగ నిర్మాణం చేపట్టు తుందని ఆశించారు. ప్యూడలు సంస్థానాలను రద్దుచేసినా, భారత యూనియన్‌లో సంలీనం చేసింది కాని, గుత్త పెట్టుబడి వర్గాల ప్రభావం, పలుకుబడులతో అన్ని రాష్ట్రాలను భాషా ప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికపై దేశంలో రాష్ట్రాలను పునర్విభ జన చేయ తలపెట్టలేదు.

---

1. సి.పి.ఐ. (యం) కార్యక్రమము. 7వ కాంగ్రెసు ఆమోదించింది. పార్టీ 9వ కాంగ్రెసు 1972లో సవరణలు ఆమోదించింది. (ఆంగ్లంలో) పే. 23.

అంచేత సహజంగానే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య వైరుధ్యం తీవ్రతర మైంది. ఈ పరిస్థితులలో బడా బూర్జువా వర్గం, ప్రజాసామాన్యం ఆయా రాష్ట్రాల లోని బూర్జువా వర్గాల మధ్య లోతైన, బలమైన వైరుధ్యాలు, సంఘర్షణలకు మూలకారణములగుతున్నవి.

బడా బూర్జువా నాయకత్వం, మనది లౌకిక మతాతీత ప్రజాస్వామ్యమని గొప్పగా చెప్పుకొంటుంది. కాని వాస్తవంగా, సమర్థవంతంగా, లౌకిక ప్రజాస్వామ్య వ్యతిరేక చర్యలను అరికట్టుటకు బదులు వారికి రాయితీలనిస్తూ, పరోక్షంగా, మత, కుల శక్తులకు బలాన్ని చేకూర్చుతున్నది.

సి పి.ఐ. (యం.యల్) "బ్రిటిష్ ప్రభుత్వం తప్పనిసరి పరిస్థితులలో దేశాన్ని విభజించి, భారత ప్రభుత్వాన్ని బడా దళారి బూర్జువా వర్గానికి, బడా భూస్వామ్య వర్గాలకు అధికారాన్ని అప్పగించింది." అని విప్లవకారుల కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమంలో పేర్కొన్నారు. బ్రిటిష్ ప్రభుత్వం 1947లో ప్రకటించిన "బూట కపు" స్వాతంత్ర్యం, "వలస సెమీ ఫ్యూడలు" ఏర్పాటును తొలగించి "అర్థ వలస, సెమీఫ్యూడలు" ఏర్పాటుగా కన్పడుతున్న దంటున్నది.

సి.పి.ఐ. (యం), సి.పి.ఐ. (యం.యల్)ల మధ్యగల అభిప్రాయ భేదాలు సైద్ధాంతికంగా అంత తీవ్రమైనవి కాకపోయినప్పటికి, ఆచరణలో, ముఖ్యంగా ఎత్తు గడలలో తీవ్రమగుతవి. బడా బూర్జువావర్గం ప్రభుత్వంలో స్థిరపడి బలమైన నిర్ణ యాత్మక పాత్ర వహించుచున్నదనుటలో సందేహంలేదు. భేదమల్లా అది సామ్రాజ్య వాద వొత్తిడిలకు ఎంత లొంగుబాటుతనాన్ని కలిగివుందనే విషయంలో అధికంగా వుంది. అంటే, దాని కంప్రెడార్ నైజం లోతుపాతులలో భేదం వున్నది. స్వతంత్ర బూర్జువా అనేది లేదు. బూర్జువా ప్రజాస్వామ్య స్వతంత్రత అనేది లేదు. ఎన్నికలు మోసమూ, పార్లమెంటు తమాషా గారడీ, ఎన్నికలకు అవకాశము, వుపయోగం లేదు. పార్లమెంటేతర మార్గమొక్కటే ఆచరణయోగ్యమైనది.రహస్య పార్టీ నిర్మాణ పంథాయే, మిగిలిన ఏకైక మార్గము. సి.పి.ఐ. (యం), సి.పి.ఐ. (యం.యల్)లు రెండూ జనతా ప్రజాతంత్ర నిర్మాణమే వ్యూహ లక్ష్యంగా కలిగి యున్నా, ఆచరణయోగ్యమైన ఎత్తుగడలలోనే ప్రధాన భేదాభిప్రాయాలను కలిగి వున్నవి.

## స్వతంత్ర ఆర్థికాభివృద్ధి :

స్వాతంత్ర్యానికి పూర్వం మన ఆర్థిక విధానము, బాగా వెనుకబడిన, ఆధా రిత, వలస ఆర్థిక విధానంగా వుండి, యితర వలస, అర్థవలస దేశాలతో పోల్చి చూసిన కొంత మెరుగైన పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధి చెందియున్నది. దేశంలో పారిశ్రామిక బూర్జువావర్గం పుట్టి రెండవ ప్రపంచ యుద్ధకాలంలో గణనీయమైన పెట్టుబడి కేంద్రీకరణ, పారిశ్రామిక వుత్పత్తి పెరుగుట, బ్యాంకింగు సౌకర్యాల

అభివృద్ధి అన్నీకలసి పారిశ్రామిక గుత్తపెట్టుబడిదారీవర్గాల గ్రూపులు ఏర్పడి భారత బూర్జువావర్గం పెరిగి గణనీయంగా అభివృద్ధి చెందింది.

యుద్ధకాలంలో బ్రిటన్‌కు యుద్ధ సప్లయిలలో విపరీత లాభాలను పొంది బల పడిన జాతీయ బూర్జువావర్గం, యుద్ధానంతరం అనేక బ్రిటిష్ పరిశ్రమలను కొని, బ్రిటిష్ గుత్తపెట్టుబడివర్గాలతో పోల్చితే బాగా బలపడింది. బ్రిటిష్ పెట్టుబడిదారీ వర్గాలనుండి భారత రైల్వేలను తీసివేసికొన్న ఆంగ్ల ప్రభుత్వం యుద్ధానంతరం భారత ప్రభుత్వానికి స్వాతంత్ర్యానికి పూర్వమే, భారత స్టెర్లింగు నిలువల చెల్లింపుల క్రింద స్వాధీనం చేయవలసి వచ్చింది. ఈ విధంగా బ్రిటిష్ పెట్టుబడిలో భారత రైల్వేలు మొట్టమొదట జాతీయం చేయబడి ప్రభుత్వరంగంగా స్వతంత్ర భారత దేశంలో ఏర్పడింది. భారత బూర్జువావర్గపు స్వాతంత్ర్యానంతర లక్ష్యం బలపడి, విస్తరించి, నిలదొక్కుకొని స్వప్రయోజనాలకై స్వతంత్ర పెట్టుబడిదారీ ఆర్థికాభి వృద్ధిగావించింది. పెట్టుబడి వనరులు సేకరించుట, దేశీయ మార్కెట్టును విస్త రించుట కొంతవరకు భూసంస్కరణ చేబట్టుట, వ్యవసాయంలో వ్యూడలు సంబం ధాలను సరళీకృతం చేయుట, దాని వర్గ ప్రయోజనాలదృష్ట్యా అవసరమైంది. అయినా జాతీయ బూర్జువావర్గపు వూగిసలాట, రాజీవిధానాల ఫలితంగా దేశ సమగ్ర ఆర్థికాభి వృద్ధి స్వాతంత్ర్యానంతరం అనుకొన్నంత వేగంగా జరుగలేదు. ఇది భూస్వాములకు, విదేశీ ముఖ్యంగా బ్రిటిష్ పెట్టుబడులకు విపరీతంగా "రాయితీ"లను యిచ్చిన ఫలి తంగా జరిగింది. అంతేగాక, భారతదేశ పారిశ్రామికీకరణకు బ్రిటన్, అమెరికాలు చేసిన "బూటకపు వాగ్దానాలు" మన ఆర్థిక విధానం, సామ్రాజ్యవాద పెట్టుబడితో, మార్కెట్టుతో "పీటముడి" సంబంధాలు, అభివృద్ధిని కుంటుపరచాయి. అంచేతనే పంచవర్ష ప్రణాళికలు వ్యవసాయం, నీటిపారుదల ప్రాజెక్టులకు ప్రాధాన్యతనిచ్చాయి గాని పారిశ్రామికీకరణకు గాదు.

భారత ప్రభుత్వ 1948 పారిశ్రామిక విధాన తీర్మానం, వ్యూహాత్మక పరి శ్రమలను ప్రభుత్వ రంగానికి రిజర్వు లేక కేటాయించుట, వనరుల సమీకరణకై 1949లో రిజర్వుబ్యాంకును, 1953లో ఇంపీరియల్ బ్యాంకు, విమానయానం, 1956లో బంగారు గనులు, జీవిత బీమా కంపెనీలను జాతీయం చేయుట ప్రణాళికా బద్ధ పారిశ్రామిక విధానాన్ని చేబట్టుట, ప్రభుత్వరంగ పారిశ్రామికీకరణను బహు ళంగా విస్తృతపరచి, బలపరచుటతో ప్రభుత్వం ఆర్థిక, పారిశ్రామిక, ద్రవ్యవ్యవ స్థలపై "అధికారపట్టు"ను సంపాదించుట దేశ, విదేశ గుత్తపెట్టుబడివర్గాలకు రుచిం చక కంటకమైంది. ప్రభుత్వరంగం రక్షణ, రవాణా, ప్రజా వుపయోగకర పరిశ్రమ లకు మాత్రమే పరిమితమై, మిగిలినవాటినన్నిటిని ప్రవేటు రంగానికి వదిలివేయాలని వొత్తిడి ప్రారంభించాయి. అయినా రెండవ, మూడవ పంచవర్ష ప్రణాళికలు భారీ పారిశ్రామిక యంత్రనిర్మాణ పరిశ్రమలను, తదితరములను ప్రభుత్వ రంగంలో

ముఖ్యంగా ఇనుము, ఉక్కు, మెషిన్‌టూల్స్, పవరు, గనులు, నూనె, గ్యాస్, రసాయనాలు, ఎరువులు వుత్పత్తి విస్తరణ చేబట్టాయి.

"సామ్రాజ్యవాదులు ముఖ్యంగా అమెరికా భారీ యంత్రనిర్మాణ యంత్రాంగారాలకు, ప్రభుత్వరంగానికి "సహాయ"మనే వడ్డీతో కూడిన అప్పును యివ్వ నిరాకరించింది. అదేకాలంలో నీటిపారుదల, వ్యవసాయాభివృద్ధి ప్రణాళికలకు అప్పు సహాయం చేయసాగింది. మన ప్రయోజనాలకు భిన్నంగా అనేక ప్రాజెక్టులకు"సహాయం" అనే అప్పును పొందింది. సామ్రాజ్యవాదులు మన పారిశ్రామికీకరణకు "అప్పు" నిరాకరించినా, అనేక అడ్డంకులు కలుగజేసినా, భారీ పారిశ్రామిక నిర్మాణ వ్యవస్థలకు సోవియట్ యూనియన్ యితర సోషలిస్టు దేశాలు సహాయాన్ని అందించాయి. ఆవిధంగా భారతదేశం భారీ పరిశ్రమలను నిర్మించుటలో గణనీయమైన విజయాన్ని సాధించింది. భిలాయ్, బరూని, రాంచి, హరిద్వార్, హైదరాబాద్, నెవెల్లీలు భారత పారిశ్రామికీకరణలో మైలురాళ్ళుగా చరిత్రలో నిలిచాయి.

"భారతదేశ ఆర్థిక విధానాన్ని అర్ధవలస బంధనాలలోనే వుంచాలనుకొన్న సామ్రాజ్యవాదుల విధానం వెనుకకు త్రిప్పికొట్టబడిందనుటలో సందేహంలేదు. భారతదేశం యింకేమాత్రమూ ప్రపంచ పెట్టుబడిదారి మార్కెట్టుపై మాత్రమే ఆధారపడిలేదు. స్వతంత్ర పారిశ్రామికాభివృద్ధి మార్గంలో పురోగమించగలదు. గతంలోవలె ప్రపంచ పెట్టుబడిదారి మార్కెట్టుతోనే సంబంధాలు పెట్టుకుని ఆధారపడివున్నట్లయితే, స్వతంత్ర దేశీయ, విదేశాంగ విధానాలను చేబట్టుటలో పురోగమించగలిగేది కాదు."[1] ఈ విధంగా సి.పి.ఐ. 8వ పార్టీ పార్టీ కాంగ్రెసు కార్యక్రమంలో స్వాతంత్ర్య ఆర్థిక, పారిశ్రామిక విధానం యెడల తన సైద్ధాంతిక అవగాహనను వివరించింది. అంతేగాక, అభివృద్ధి "అగుతూ-సాగుతూ"నెమ్మదిగా జరుగుతుందని, అడ్డంకులు పెట్టుబడిదారీ పంధాను జాతీయ బూర్జువా వర్గం అనుసరించిన తొలగిపోవని, సంపూర్ణ ఆర్థిక స్వాతంత్ర్యం అసాధ్యమగుతుందని చెప్పింది.

సి.పి.ఐ. అవగాహననే "స్వాతంత్ర్యానికి పూర్వమే, భారత బూర్జువావర్గం వొక స్థాయికి చేరుకొని", కొన్ని పరిశ్రమలను నెలకొల్పిందని,"గుడ్డలమిల్లులు, పంచదార, సిమెంటు" పరిశ్రమలను వుదహరించి; "యుద్ధ కాలంలో బూర్జువా వర్గంలో పై వర్గాలు "అంతులేని భాగ్యాన్ని కూడబెట్టారని" మరో మాటలలో వెల్లడించింది. సాంకేతిక పరిజ్ఞానం లేకపోయినా, భారీ పరిశ్రమలు లేకపోయినా, సామ్రాజ్యవాదులవలే "వలసలు" లేకపోయినా "బూర్జువా వర్గం రాజ్యాంగాన్ని వుపయోగించి, శ్రామికుల శక్తి ఫలాలను తన పెట్టుబడి పెంపొందించుకొనుటకు, పెట్టుబడిదారీ పంధాలో దోపిడి చేసింది."

---

1. ప్రోగ్రాం ఆఫ్ ది సి. పి. ఐ. సవరణలతో 8వ కాంగ్రెసు ఆమోదించినది. (ఆంగ్లంలో) పే. 10.

"స్వాతంత్ర్యానంతరం, బ్రిటీష్, అమెరికా సామ్రాజ్యవాద శక్తులు, భారత బూర్జువా వర్గాన్ని సంతృప్తిపరచకపోగా," నూతన భారత ప్రభుత్వంపై అనేక వొత్తిడులు తెచ్చి "రాజకీయ స్వాతంత్ర్యాన్ని" త్రోసిబుచ్చ ప్రయత్నించారు. "ఎన్ని సారులు ప్రాధేయపడినా, భారీ పరిశ్రమల నిర్మాణానికి తోడ్పడ నిరాకరించారు." "ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఆవిర్భవించుటతో, సోషలిస్టు సహాయాన్ని కొన్ని భారీ పరిశ్రమల నిర్మాణానికి వినియోగించుకొన్నా, నిజానికి సామ్రాజ్యవాద గుత్త పెట్టుబడిదారులతో తన కనుకూల వొప్పందాలను చేసుకొనుటకు వినియోగించింది".[1].

"స్వాతంత్ర్య పోరాటంలో వెల్లడైన బూర్జువా ద్వంద్వనైజము" స్వాతంత్ర్యానంతరం మరో రూపంలో ప్రత్యక్షమైంది. సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజము మరో వైపు బూర్జువా వర్గంతోసహా ప్రజల మధ్య పెరుగుతున్న వైరుధ్యాలు, మరోప్రక్క ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఆవిర్భవించుటతో యేర్పడిన నూతన అవకాశాలను బడా బూర్జువావర్గ నాయకత్వంలోని ప్రభుత్వం సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజంలను రూపుమాపుటకు నిర్ణయాత్మకంగా వినియోగించుకొనజాలగ పోయింది. అంతేగాక, ప్రభుత్వంపై తన బలాన్ని, నూతనావకాశాలను, ప్రజలపై దాడిచేసి తాను బలపడ నెంచింది, వైరుధ్యాలను, సంఘర్షణలను బేరసారాలతో, రాజీ సంప్రదింపులతో పరిష్కరించ నెంచింది. ఈ క్రమంలో విదేశీ గుత్త పెట్టుబడిదారులతో బలవత్తర సంబంధాలను నెలకొల్పుట, ఫ్యూడలు భూస్వామ్య వర్గాలతో అధికారాన్ని పంచుకొంటున్నది. ఈ విధంగా సోషలిస్టు సహాయాన్ని వినియోగించుకొంటున్నా, ప్రజా వ్యతిరేక, కమ్యూనిస్టు వ్యతిరేక నైజాన్ని కలిగి, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా స్వామ్య కర్తవ్యాలను చేబట్టుటను దృఢంగా వ్యతిరేకించుచున్నది.[2]

"ఈ విధానాల ఫలితంగా" ప్రభుత్వం బడాబూర్జువావర్గ నాయకత్వంలో వున్నందున, ప్రభుత్వరంగంపై బడా వ్యాపార వర్గాల ప్రభావం యెక్కువగా పెరుగుతున్నందున, బడా పెట్టుబడిదారి వర్గాలను మరింత బలవత్తరం చేయుటకు మార్గమగుతున్నది. ద్రవ్య సంస్థలు యిచ్చే అప్పులలో ఎక్కువ భాగం, వారే మరింత బలపడుటకు వుపయోగపడుతున్నవి. ప్రణాళికలోని అన్ని ప్రధాన కంట్రాక్టులు ప్రభుత్వం నుండి బడా బూర్జువా వర్గాలకే పోతున్నవి. ప్రభుత్వ రంగంలో అనేక ఉత్పత్తులను, పంపకాన్ని బడా వ్యాపార బూర్జువా వర్గాల ఆధ్వర్యంలోనే జరుగుతున్నది. ప్రభుత్వ పెట్టుబడిదారి విధానానికి ప్రవేటు గుత్త పెట్టుబడిదారి వర్గాలకు మధ్య సంబంధాలను పెంపొందించుటయేగాక ప్రభుత్వం పెట్టు

---

1. ప్రోగ్రాం ఆఫ్ ది సి.పి.ఐ.(యం) సవరణలతో (1972) 9వ, కాంగ్రెసు ఆమోదించినది. పే. 5.

2. అదే పే. 6.

బడిదారులను విదేశీయులతో సహా అందరిని షేర్ మార్కెట్లలోనికి, షేర్ల పెట్టుబడి సంస్థలలోనికి ఆహ్వానించుచున్నది. ఇది ప్రభుత్వరంగ అభివృద్ధిని ప్రక్కదారులు పట్టించుతుంది. అంతేగాక ప్రభుత్వరంగ పరిశ్రమలు ప్రవేటు నిరంకుశ అధికారులు, ప్రజాస్వామ్య వ్యతిరేకులు, కార్మిక వ్యతిరేకుల ఆధ్వర్యంలో వుంచబడుతున్నవి. ప్రభుత్వరంగంలో బడా బూర్జువావర్గం, ప్రవేటు నిరంకుశ ఆధికారుల ప్రభావం పెరిగిన కొలది, ప్రభుత్వ పెట్టుబడిదారి విధానపు అభ్యుదయకర పాత్ర అంతమగుతుంది.[1]

ప్రభుత్వ పారిశ్రామిక విధాన తీర్మానానికి వ్యతిరేకంగా ప్రభుత్వరంగానికి కేటాయించబడిన వాటిని యింకా-టాటా-ఇనుము, ఉక్కు పరిశ్రమ కొనసాగించబడుటయే గాక, విస్తరణకు సహాయ పడుతున్నది. తీర్మానంలోని అనేక పరిమితులను నీరుగార్చి రాయితీలను యిస్తున్నది. గుత్త పెట్టుబడిదారి వర్గాలు మరింత బలపడుటకు మరికొంతమంది గుత్త పెట్టుబడిదారులుగా ఎదుగుటకు తోడ్పడుతున్నది.

"పశ్చిమ దేశాల ఆర్థిక సహాయంపై భారీగా ఆధారపడిన మన ఆర్థిక, పారిశ్రామిక విధానాభివృద్ధి, ముఖ్యంగా ప్రభుత్వరంగం వనరులు, స్పేరు పార్టులు, పారిశ్రామిక ముడిపదార్థాలకు, ఆహార పదార్థాలు దిగుమతులు ఎంతో అవసరమైనపుడు, విదేశ పెట్టుబడులకు దిగుమతులకు మనమిచ్చే రాయితీలు మనదేశ భవిష్యత్తుకు ప్రమాదకరంగా పరిణమించుతాయి.[2]" దేశ ఆర్థిక విధానం అనేక రకాలుగా విదేశ ఆర్థిక సహాయం, ముఖ్యంగా అమెరికా సహాయంపై ఆధారపడి వుంది. "పెట్టుబడిదారి విధానం సామాన్య సంక్షోభంలో నూతన తీవ్ర దశకు చేరుకున్నపుడు, పెట్టుబడిదారి పంథాలో వెనుకబడిన దేశాలు ఆర్థికాభివృద్ధి మార్గాన్ని చేబట్టుట నిరర్థకము. అటువంటి అభివృద్ధి సాధ్యమగుట చాల అరుదైన విషయము. మన ఆర్థిక అధారిత మౌలిక సమస్య అయిన వెనుకబాటుతనాన్ని, దారిద్ర్యం, నిరుద్యోగము పరిష్కరించబడవు.

భౌతిక, మానవ వనరులను పెట్టుబడిదారి విధాన పంథా పూర్తిగా వినియోగించుకొనలేదు. అది పెరిగిపోయే వైరుధ్యాలకు, అసమానతలకు, సంక్షోభాలకు కారణభూతమగుతుంది.

సి. పి. ఐ. బూర్జువా వర్గ అవగాహన యిలా వుంది. ఆసియా, ఆఫ్రికాలతో భారత బూర్జువా వర్గం బాగా అభివృద్ధి చెందిన వర్గాలలో వొక్కటి, వొక్క జపాను తరువాతగా అంచనా వేస్తున్నది. అది చిన్న, మధ్యతరగతి, ఉక్కు, ఇనుములాంటి అతి భారీ పరిశ్రమలను కూడ కలిగి, పారిశ్రామిక అభివృద్ధి ప్రయోగ, పరిశోధన

---

1. ప్రోగ్రాం సి.పి.ఐ.(యం) సవరణలతో 1972లో 9వ, కాంగ్రెసు ఆమోదించినది. పే. 8-9.
2. అదే పే. 12-13.

శాలలను శాస్త్ర, సాంకేతిక, యాజమాన్య దక్షత కలిగిన బృందాలను కలిగి వుంది. పెద్దవి 500-1000 కోట్లు కేంద్రీకృత పెట్టుబడి కలిగిన వ్యవస్థలున్నవి. పారిశ్రామిక పెట్టుబడిని, ద్రవ్య పెట్టుబడి వొకే గొడుగు క్రింద వుండి "బడా ద్రవ్య పెట్టుబడి" వ్యవస్థలుగా కూడ రూపొందాయి. ఇది దేశీయ మార్కెట్టులో తమ స్థానాన్ని పదిల పరచుకొని, విదేశ మార్కెట్టులలో కూడ స్థానాన్ని సంపాదించి, విస్తరించ ప్రయత్నిస్తున్నది. "చిన్న సామ్రాజ్యవాది"గా బీజప్రాయంగా సబ్బులు, గుడ్డలు, రేయాను, రసాయనాల పరిశ్రమలలో విదేశాలలో ముఖ్యంగా ఆఫ్రో-ఆసియా దేశాలలో 150-200 కోట్లు రూపాయలు దాదాపుగా పెట్టుబడులు ఎగుమతి చేసింది. ఇది వొక కంప్రెడరీ బూర్జువా వర్గానికి సాధ్యమయ్యే పనియేనా అని సి.పి.ఐ. ప్రశ్నించే విధంగా వుంది.

సి.పి.ఐ. భారత బూర్జువా వర్గం సామ్రాజ్యవాద వర్గాలతో రాజీ పొత్తు నెరపుట వారసత్వంగా కలిగి వున్నప్పటికి, మైనరు పార్టనరుగా పని చేస్తున్నప్పటికి, పూర్తిగా వారి ఆధిపత్యాన్ని, అధికారానికి లొంగుబాటు ప్రదర్శించుట లేదంటూ, వారిలో ప్రతిఘటనా శక్తి యున్నదని నర్మగర్భంగా చెప్పుతున్నది. పశ్చిమదేశ వ్యాపారుల ప్రయోజనాలు, కోరికలు ఎన్నిటికో రాయితీలను యిస్తున్నది, అయితే బేరసారా లాడుతున్నది, వారు తమ కోర్కెలు, షరతులు బలవంతాన రుద్దలేక పోతున్నారు. ఉదాహరణగా, యూరోపియన్ కామన్ మార్కెట్టులో బ్రిటనును వొత్తిడి చేసి, చేరకుండా చేయలేదా అని, తన అవగాహనను బలపరచుకొంటుంది.

విదేశ గుత్త పెట్టుబడిదారి వర్గాలకు భారత బడా బూర్జువా వర్గంపై కొంత ప్రభావాన్ని మాత్రమే కలిగి వున్నాయి. అదే విధంగా భారత బడా బూర్జువా వర్గం కూడా రాజ్యాంగ యంత్రంపై కొంత ప్రభావాన్ని ప్రసరించగలిగి వున్నవి కాని, అదుపులో పెట్టగలిగిన శక్తిని కలిగిలేదు. ఆటు-పోటులకు లోనగుతున్నా, నిర్ణయాత్మక శక్తిని జాతీయ బూర్జువా వర్గమే కలిగియున్నదనుటను పంచవర్ష ప్రణాళికలలో ప్రభుత్వ రంగానికే కేటాయింపులను యెక్కువగా పెంచుటనుబట్టి స్పష్టమవుతుంది. రవాణా, ఇంపీరియల్ బ్యాంకు,జీవితబీమా, బ్యాంకులను జాతీయం చేయుట, క్రమేణా ప్రభుత్వ రంగపు కేటాయింపు ప్రతి ప్రణాళికలో పెంచుట, 1956 పారిశ్రామిక విధానాన్ని కొనసాగించుతున్నారు. ప్రణాళికా సంఘం, సోషలిజాన్ని తీసుకొని వస్తుందని ఆశించము, కాని దానితో బూర్జువా వర్గపు మేధావులు బూర్జువా ప్రజాస్వామ్య విప్లవాన్ని పూర్తిచేయ ప్రయత్నించుట లేదని చెప్పజాలము. అందుచేతనే, ప్రతి సంవత్సరపు సమావేశంలో చేంబర్స్ఆఫ్ కామర్స్ ప్రణాళికా విధానాలను తీవ్రంగా ప్రతిఘటించుట జరుగుచున్నది. కారణం, ఆ సంస్థ బడా బూర్జువా వర్గ

నాయకత్వంతో వుంది. క్లుప్తంగా, ఇది సి. పి. ఐ. ఆర్థిక విధాన అవగాహన సారాంశము.

"అనుభవం, పెట్టుబడిదారి విధానపు సాధారణ సంక్షోభం మూడవ "నూతన తీవ్రదశ"కు చేరిన కాలంలో, అభివృద్ధి చెందని దేశాలు పెట్టుబడిదారి విధాన పంథాలో అభివృద్ధి చెంద నెంచుట దురాశయేనని మూడు ప్రణాళికల ఫలితాలు తెలియజేస్తున్నవి. ఇట్టి అవకాశాలు మిక్కిలి పరిమితులకు లోనైనవి. ఆర్థిక ఆధారితను, వెనుకబడిన తనాన్ని, దారిద్ర్యం, నిరుద్యోగం లాంటి మౌలిక సమస్యలను పరిష్కరించజాలవు. దేశంలో మానవ భౌతిక వనరులను వినియోగించుకొనే సామర్థ్యం, వాటికి లేదు. పైగా, పెరిగిపోయే వైరుధ్యాలను, అసమానతలను, సంక్షోభాన్ని సృష్టిస్తాయి.[1]" అని కార్యక్రమములో సి.పి.ఐ.(యం) వివరించింది.

సి.పి.ఐ.(యం·యల్)కు ప్రభుత్వ, పబ్లిక్ రంగంపై గల అవగాహనలు సి.పి.ఐ; సి.పి.ఐ.(యం)లకు అవగాహనలకు పూర్తి భిన్నంగా వున్నవి.

బ్రిటిష్ వలస అయినందున, భారత దేశంలో స్వాతంత్ర్యోద్యమ కాలంలో, నిజమైన అర్థంలో స్వతంత్ర బూర్జువా వర్గం, యూరపులో వర్గ పోరాటాలు ఫలితంగా బూర్జువా వర్గం ఏర్పడిన విధంగా ఏర్పడలేదు. గ్రేటు బ్రిటన్‌ను అమెరికా 38వ రాష్ట్రంగా పేర్కొంటున్న, పెట్టుబడిదారి విధానపు వృద్ధాప్యంలో సర్వ సాధారణ మార్గంలో పుట్టి, పెరగని భారత బూర్జువా వర్గాన్ని స్వతంత్రంగా సహజంగా పెరిగినది కాజాలదు, అనే సిద్ధాంతాన్ని రూపొందించి నక్సలైట్లు వివరించారు. ఈ అధ్యయనం, ప్రభుత్వ రంగాన్ని సరిగా పరిశీలించి, అంచనావేయుటతో ప్రారంభం కావాలని తలచారు.

ప్రభుత్వరంగం అన్నది ఏ వర్గం లేక వర్గాలు ఆధ్వర్యం వహించుతున్నది, అధికారంలో ఏ వర్గం వున్నది, తెలుసుకొంటేనే, అర్థమౌతుంది. అధికారం కార్మిక వర్గం చేతులలో వుంటే, ప్రభుత్వ రంగం సోషలిజం అవుతుంది, అలాగే అధికారం జాతీయ బూర్జువా వర్గం చేతులలో వుంటే, అది "జాతీయ పెట్టుబడిదారి విధానమగుతుంది. ఒక పరిశ్రమను జాతీయంచేసి, అనగా వ్యక్తి యాజమాన్యం రద్దుచేసి, పెట్టుబడిదారుల సమితిగా వున్న బడా బూర్జువా వర్గం అధికారంలో వున్నప్పుడు, బడా బూర్జువా వర్గ రంగ విధానమగుతుంది. ప్రభుత్వరంగం, ప్రజలలో వున్న నామమాత్రపు వనరులను "బలవంతపువిధిగా" సేకరించుటకు ఒక ఆయుధమగుతుంది. భారీ పరిశ్రమలను ప్రభుత్వ రంగంలో ప్రారంభించి, తలపెట్టిన ఉత్పాదక శక్తి స్థాయికి చేరి, లాభప్రదంకాగా, బహుశా ప్రవేటీకరణ చేయాలని వుద్దేశ్యం అయినట్టు కన్పడుతుంది.ఇది 1990 దశాబ్దంలో ప్రారంభించుట

1. ప్రోగ్రాం సి.పి.ఐ.(యం) సవరణలతో 1972లో 9వ, పార్టీ కాంగ్రెసు ఆమోదించినది. పే. 12-13.

దీనిని తెలియచేస్తుంది. అంతేకాక యీ పరిశ్రమలు తలబరువు, నష్టదాయకం అవుతున్నవనే పేరుతో చవకగా ప్రవేటీకరణ, వారి లక్ష్యంనెరవేరినట్లు కన్పబడుతుంది. ఇదంతా కుంటి నడక ప్రారంభించిన పెట్టుబడిదారి విధానానికి, కొత్త రక్తమిచ్చే ప్రయత్నం చేయుట అగుతుందా?

బహుశా మరో లక్ష్యం ప్రభుత్వ, ప్రజా రంగాల పునాదులను బలహీనపరచి, సోషలిస్టు సిద్ధాంత పునాదులను, ఉత్పత్తిని నిరుత్సాహపరస్తూ, అప్రతిష్టపాలు చేయుటకు కావచ్చు. ప్రభుత్వ రంగం సోషలిస్టు సిద్ధాంత పునాదులపై నిర్మించవలసి వుంది, కాని భారతదేశంలో పెట్టుబడిదారి విధాన సిద్ధాంత సూత్రాలపై నిర్మించే ప్రయత్నం, సహజంగానే నైపుణ్యలేమిని, అనవసరంగా వనరుల వ్యర్థం చేయుట, ఆర్థికంగా నష్టదాయకంగా రూపొందుతున్నది. అపఖ్యాతి పాలైన, వక్రీకరించబడిన ప్రభుత్వ రంగం, సోషలిస్టు ఆర్థిక విధానాలంటే భయభ్రాంతులను చేస్తుంది [1].

మహలనోబిస్ ఆధ్వర్యంలోని "మొనాపలీ కమిషన్" నివేదిక ప్రభుత్వ లేక రాజ్యాంగ బలం, బడా బూర్జువావర్గపు రాజకీయ గ్రూపుల, భూస్వాముల మధ్య సురక్షితంగా వుంది. జాయింటు స్టాక్ కంపెనీల పెట్టుబడి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు 1947లో 480 కోట్లుగా వున్నది. 1964కు 1400 కోట్ల రూపాయలకు పెరిగింది. ఇందులో తాతా, బిర్లా, మఫత్‌లాల్, వాల్‌చంద్, మహేంద్రల ఆధ్వర్యంలో 539 కంపెనీలు వున్నవి. అగ్రభాగానవున్న 10 కుటుంబాలు, 1958లో 1600 కోట్ల రూపాయలు, మొత్తం ప్రవేటు పెట్టుబడి 2300 కోట్లుగా వున్నప్పుడు కలిగి వున్నవి. జాతీయ ఆదాయంలో పైవర్గంలోని 10 శాతం, 28-37 శాతం ఆదాయాన్ని పొందగలిగారు. క్రింది వర్గాలలోని 40 శాతం ప్రజలు, జాతీయ ఆదాయంలోని 20 శాతంగా వున్నదానిని, 1953-61 లలో 13శాతానికి కోల్పోయారని, ఇండియా రిజర్వుబ్యాంక్ అంచనా వేసింది. మన విదేశ స్టెర్లింగు నిల్వలు 1948లో 1400 కోట్లరూపాయలు హరించుకుపోయి, 4వ ప్రణాళిక కాలానికి 4000 వేల కోట్లరూపాయల విదేశీ అప్పులు,అమెరికన్ అప్పు 2600 కోట్లరూపాయలవరకు పెరిగిపోయాయి.[2]

స్వయంచాలక ఆర్థిక విధానమని గొప్పగా డబ్బాలు కొట్టుకొనేది వొక్కొక్క అంశాన్ని నిశితంగా పరిశీలించితే, బూటకం స్పష్టమవుతుంది.

ఈ పారిశ్రామిక, ఆర్థిక, ద్రవ్యవిధానాలలోని వైరుధ్యాలను సంక్షిప్తంగా యిలా చెప్పుకొనవచ్చును. మొదటి అంశంగా, గుత్తపెట్టుబడిదారీ వర్గాలమధ్య వ్యక్తుల మధ్యగల వైరుధ్యాలు, ప్రభుత్వానికి అదృశ్యంగా మార్గదర్శకత్వం వహిస్తున్న గుత్తపెట్టుబడిదారుల గ్రూపులమధ్య వైరుధ్యాలు యివి ప్రధానంగా చేంబర్స్

---

1. అరున్‌కుమార్‌రాయ్ (1969) నక్సలిజం అండ్ ఆఫ్టర్ వా 2. పే. 54–55.
2. అదే పే. 56-57.

ఆఫ్ కామర్స్‌లో వారి గుద్దులాటలనుబట్టి స్పష్టమవుతూనే వున్నవి, వాకరి నొకరు అనుమానాస్పదులయి, పరస్పర విశ్వాసాన్ని కోల్పోవుట స్పష్టంగా కానవస్తున్నది. ప్రధాన గుత్తపెట్టుబడి వర్గాలలో ఏ వొకదానికో భారీపరిశ్రమలకు అనుమతి లభించుటకు అవి అంగీకరించవు. బడాబూర్జువావర్గ కూటమి ప్రభుత్వరంగంలో అయితే ఏ వొక్కరోగాక యిరువర్గాలకు ప్రయోజనముంటుందని పైగా భారీపరిశ్రమలలో ఎక్కువ పెట్టుబడి పెట్టవలసి వుండుట, ఉత్పత్తి ఆర్థికంగా లాభప్రద స్థాయికి వచ్చుట చాల సంవత్సరాలు పడుతుందని, వినిమయవస్తువుల ఉత్పత్తి పరిశ్రమలలో కంటె లాభశాతము తక్కువగా వుండుట వీటన్నిటివలెననే ప్రభుత్వరంగంలో భారీ పరిశ్రమలు స్థాపించుటకు, విస్తరణకు వాస్తవికంగా తమ శక్తినంతా వినియోగించి గుత్తపెట్టుబడిదారీ వర్గాలు ప్రతిఘటించలేదు. వీటిపై వొత్తిడిని వ్యతిరేకతను మరిన్ని యితరవిధాల రాయితీలు పొందుటకు ఎత్తుగడగ వినియోగించుకున్నారు. రెండవ అంశం; వైరుధ్యం ప్రధానంగా దేశీయ బడాబూర్జువావర్గం, వారి విదేశీ యజమానుల మధ్యవుంది. ఇద్దరి మధ్యగల స్నేహ సహకారాలు, విదేశీ గుత్తపెట్టుబడిదారులతో పోటీలో ప్రాణాలు నిలబెట్టుకొనుటకు తరచుగా తప్పనిసరి అవుతుంది. నిజానికి ఖాయితాపడిన ప్రభుత్వరంగంకూడ విదేశీ ద్రవ్యపెట్టుబడిదారులకు కంటకప్రాయ మౌతున్నది.

మూడవ అంశం: ప్రభుత్వరంగపు సైద్ధాంతిక అవగాహనలు, ఆచరణలు మధ్య వైరుధ్యం వాస్తవమయినది. అంతేగాక, దేశీయ గుత్తపెట్టుబడిదారుల వర్గాలల్లో వారసత్వంగా వచ్చిన వైరుధ్యం, కార్మికవర్గాన్ని అంతగా దోపిడి చేసేదికాదు అయినా ప్రభుత్వరంగంలోనే కార్మికుల అసంతృప్తి యెక్కువగా బహిర్గతమవుతుంది. నాలుగవ అంశంగా సోషలిస్టు సహాయంతో ప్రభుత్వరంగంలో నిర్మించబడిన పరిశ్రమలు, పెట్టుబడిదారిదేశాల సహాయంతో నిర్మించబడిన పరిశ్రమల మధ్య వైరుధ్యం తీవ్రంగా వుంది.

క్లుప్తంగా సి.పి.ఐ. భారత బూర్జువావర్గ సామ్రాజ్యవాద వ్యతిరేకత, ఫ్యూడలు వ్యతిరేకతలకు ప్రాధాన్యతనిచ్చి, జాతీయ బూర్జువావర్గ నాయకత్వంలో స్వతంత్ర ఆర్థిక, పారిశ్రామిక విధానం చేబట్టి భారత ప్రభుత్వం బూర్జువా ప్రజాస్వామిక విప్లవకర్తవ్యాలను పూర్తిచేయ ప్రయత్నిస్తున్నదనే అవగాహన కలిగి వున్నది. సి పి.ఐ (యం) ప్రభుత్వ నాయకత్వంలో బడాబూర్జువా, భూస్వామ్య వర్గాల నాయకత్వంలో వుండటవలన ద్వంద్వ విధానంలో సామ్రాజ్యవాదం, ముఖ్యముగా అమెరికా పొత్తుతో నూతన వలస విధానంలో పడిపోతుంది. కాన స్వతంత్ర ఆర్థిక పారిశ్రామిక విధానాన్ని చేబట్టలేదని, ప్రజాస్వామ్య విప్లవకర్తవ్యాలను ఒక్క జనతా ప్రజాస్వామ్య స్థాపనవలననే సాధ్యమంటున్నది. సి. పి. ఐ. (యం. యల్) ప్రభుత్వం అర్ధవలస, అర్ధఫ్యూడలు శక్తుల నాయకత్వంలో వుండుటవలన, ప్రజా

స్వామ్య విప్లవ కర్తవ్యాలను జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం మాత్రమే పూర్తిచేయ గలదని, ఆట్టి ప్రభుత్వం వొక్క సాయుధపోరాటాన్ని వ్యవసాయవిప్లవంగా గెరిల్లా ఎత్తుగడలతో దీర్ఘకాలం సాగించుటవలననే సాధ్యమంటున్నది.

అయితే ఒక్కటి నిజం పారిశ్రామికీకరణ జరుగవలసినంత జరగకపోయినా బాగానే జరిగింది. ఫలితాలు మాత్రం ప్రజలకు కాకుండా బూర్జువావర్గాలే పొందాయి. బలమైన ఐక్య కార్మిక, కర్షక, మధ్యతరగతి వర్గాల ప్రజా వుద్యమాలు రూపొంది, ఐక్య ప్రజా విప్లవ పోరాటాలను సాధించుటలోని వైఫల్యమే యిందుకు కారణంగా చెప్పవచ్చును.

## వ్యవసాయ సమస్య :

మూడు కమ్యూనిస్టు శ్రేణుల పార్టీ కాంగ్రెసులు వ్యవసాయ సమస్యల ఎడల అవలంబించిన వైఖరి, అవగాహనలను చూద్దాము.

జాతీయ ఆదాయంలో 46.8 శాతం, వ్యవసాయరంగం నుండి వస్తున్నది. మొత్తం జనాభాలో 69.5 శాతం వ్యవయం జీవనాధారంగా వుంది. మొత్తం 324 మిలియనుల వ్యవసాయానికి పనికివచ్చే భూములు వుండగా 60మిలియనుల ఎకరాలు పడావు భూములుగ వున్నవి.

జాతీయ బూర్జువావర్గం అధికారాన్ని సంపాదించిన తరువాత దేశ ఆర్థికాభి వృద్ధిని స్వతంత్ర పెట్టుబడిదారి విధాన పంథాలో సాధించనెంచింది. అందుకు ప్రప్రథమంగా వ్యవసాయరంగాన్ని పునర్నిర్మాణం చేయవలసి వచ్చింది. ఆ విధంగా పారిశ్రామికీకరణకు పునాది నేర్పరచ నెంచింది. వ్యవసాయరంగంలో కాంగ్రెసు ప్రభుత్వం సెమి ఫ్యూడలు వ్యవసాయ సంబంధాలను, వ్యవసాయ ఉత్పత్తి విధానా లను పెట్టుబడిదారి విధాన సంబంధాలు, వుత్పత్తి విధానాలుగ వ్యవసాయ సంస్క రణల చట్టాలు ద్వారా మార్చాలనే లక్ష్యాలను నిర్దేశించుకొన్నదని, సి.పి.ఐ. కార్యక్రమం స్పష్టం చేసింది.[1]. ఇదే విషయంలో సి.పి ఐ. (యం) కాంగ్రెసు లక్ష్యం, నిస్సందేహంగా, ఫ్యూడలు, సెమిఫ్యూడలు వ్యవసాయ సంబంధాలను రూపు మాపి రైతాంగానికి విముక్తి కలిగించే విధంగాలేదని, కార్యక్రమం స్పష్టంచేసింది.[2] అంతేగాక, తరతరాలుగా వుంటున్న ఫ్యూడలు, సెమిఫ్యూడలు భూస్వాములను పెట్టు బడిదారి విధానపు ధనిక రైతులుగా మార్చాలనే వుద్దేశ్యము స్పష్టమని వివరించింది. సి.పి.ఐ. (యం) కాంగ్రెసు ప్రభుత్వం ప్రకటించిన లక్ష్యాన్నేగాక ఆచరననుగూడ పరిగణలోనికి తీసుకొని, తన కార్యక్రమంలో కాంగ్రెసు లక్ష్యాన్ని నిర్వ

---

1. సి.పి.ఐ. కార్యక్రమము. (1968) పాట్నా కాంగ్రెసు ఆమోదించినది. (ఆంగ్లములో) పే. 18-19.
2. సి.పి.ఐ. (యం) కార్యక్రమము (1972) 9వ కాంగ్రెసు ఆమోదించినది (ఆంగ్లములో) పే. 13.

చించింది. సి, పి. ఐ. కాంగ్రెసు లక్ష్యాన్ని పేర్కొని ఆచరణలో విఫల మగుటగా పేర్కొన్నది. మొత్తం మీద కాంగ్రెసు ప్రభుత్వాల వ్యవసాయ సంస్కరణల అవగాహనలు, అంత్య నిర్ణయాలలో సి.పి.ఐ. సి.పి ఐ. (యం)ల మధ్య మౌలిక భిన్నాభిప్రాయాలు లేవు. బూర్జువా ప్రజాస్వామిక విప్లవ కర్తవ్యంగా పెట్టుబడిదారి పారిశ్రామిక, వ్యవసాయ ఉత్పత్తి సంబంధాలను పెంపొందించే కార్య క్రమాన్ని జాతీయ బూర్జువావర్గ ప్రభుత్వం చేబట్టినా, బడాభూస్వామ్య, బడాబూర్జువా వర్గాల బలమైన శక్తులుగా తమ ప్రభావాన్ని ప్రసరించగలిగి వున్నందున సంస్కరణలు అమలు జరుగకపోగా, సవరణలతో నీరుగార్చుతున్నారని, బలమైన రైతాంగ వ్యవసాయకూలి, ప్రజోద్యమాల వొత్తిడితో వాటిని అమలు చేయుటయేగాక, అభ్యుదయకర వ్యవసాయ భూముల సంస్కరణ చట్టాలు ద్వారా, ప్రజాస్వామిక విప్లవ కర్తవ్యాలను పూర్తి చేయవచ్చు అనే అవగాహన సి.పి.ఐ.కు ఉన్నట్లు కన్పడుతున్నది. సి.పి.ఐ. (యం) కాంగ్రెసు ప్రభుత్వాలకు ఫ్యూడల్, సెమిఫ్యూడల్ వ్యవసాయ సంబంధాలను రూపుమాపే లక్ష్యమే లేదనే అవగాహన కలిగి వుండుటతో వ్యవసాయ విప్లవం ద్వారానే అది సాధ్యమనే నిర్ణయానికి వచ్చినట్లు స్పష్టము అయినా, ఆచరణలో సి.పి.ఐ., సి.పి.ఐ. (యం)లు కిసాన్ వుద్యమంలో అనుసరించిన ఎత్తుగడలు, దగ్గరి దగ్గరిగా వొకే విధంగా వున్నవి.

మే 1970లో జరిగిన సి.పి.ఐ. (యం.యల్) పార్టీ కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమంలో వ్యవసాయ సమస్య, వ్యవసాయ విప్లవం, వ్యవసాయ భూములు సంస్కరణల చట్టాల ప్రసక్తి, వివరణలు యేమీ నిర్దిష్టంగా ఎట్టి అవగాహన యివ్వబడలేదు. జనతా ప్రజాస్వామ్య విప్లవం వొక్కటే ఫ్యూడలిజం, సెమి ఫ్యూడలిజాలను నిర్మూలిస్తుందని అందుకు లిన్ పియావో చెప్పినట్లు "ప్రజా సమీకరణకు, శత్రువుపై ప్రజలు మొత్తపు బలాన్ని వుపయోగించుటకు గెరిల్లా సాయుధ పోరాటం వొక్కటే మార్గమని" అది వొక్కటే ప్రజల చొరవను, వారు అద్భుతాలను చేయునట్లు చేస్తుందని వివరించింది.[1] జనతా ప్రజాస్వామ్య విప్లవం కొనసాగించుటకు ప్రజాస్వామ్య సంఘటన కార్మిక, కర్షకులతో ప్రధానంగా పేద రైతులు, భూములులేని రైతులపై ఆధారపడి మధ్య తరగతి రైతులతో ఐక్యమై, ధనిక రైతులతో కొన్ని వర్గాలను తమవైపు ఆకర్షించి, కలుపుకొని, మిగతావారిని తటస్థులుగా చేస్తుందని వివరించింది. అదేకాలంలో జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం, దున్నేవానికే భూమి అనే సూత్రంపై భూస్వాముల భూములను స్వాధీనపరచుకొని, భూములు లేనివారికి, పేద రైతాంగానికి పంచుతుం దని మాత్రమే పేర్కొన్నది. పైగా నక్సలైట్ల ప్రధాన వేదికైన "వ్యవసాయ విప్లవ

1. నక్సలిజం అండ్ ఆఫ్టర్ వా 2, ప్రోగ్రాం ఆఫ్ ది సి.పి.ఐ. (యం.యల్) అడాప్టెడ్ ఎట్ పార్టి కాంగ్రెస్. మే 1970. పే. 282 పేరా 37.

ప్రాతిపదికపై, సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటం, దీర్ఘకాలం సాగించుట" అనేది కూడ పేర్కొనబడలేదు. కార్మికవర్గ నాయకత్వంలో రైతాంగంతో ఐక్యమై జనతా ప్రజాస్వామిక విప్లవం చేబట్టాలని పేర్కొన్నది. ఇదే తదనంతరం నక్సలైట్లలోని కొన్ని వర్గాల తీవ్ర విమర్శకుకూడ గురైంది. నక్సల్బరీ, శ్రీకాకుళం సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాలు, తిరుగుబాటుల నేపథ్యంలోకూడ, మార్క్సిస్టు-లెనినిస్టుల 1970 పార్టీ కాంగ్రెసు తీర్మానాలు, కార్యక్రమం అతివాద సెక్టేరియనిజంగా వివిధ కమ్యూనిస్టు శ్రేణుల, ప్రధానంగా ఆంధ్రప్రదేశ్ విప్లవ కమ్యూనిస్టుల సమన్వయ కేంద్రపు తీవ్ర విమర్శకు గురిఅయ్యాయి.

కాంగ్రెసు ప్రభుత్వం ఫ్యూడలు, సెమిఫ్యూడలు వర్గాలతో రాజీమార్గాన్ని అవలంబించుటతో కొన్ని నిర్దిష్ట వైరుధ్యాలు రూపొందుట చూడగలము. చట్టబద్ధ భూస్వామ్య విధానాన్ని రద్దుచేయుట, జమీందారీ, జాగిర్దారీ, మొఖాసాదారి ప్రాంతాలలో ఈనాందారి ప్రాంతాలలో మిలియనులకొలది రైతాంగం, వ్యవసాయ కూలీలలో దేశంలోని వివిధ ప్రాంతాలలో వారి జీవితాలతో మార్పులు తీసుకొచ్చింది. రైతుల సాగులలోవున్న మిలియనుల కొలది వ్యవసాయ భూములలో, పడావు, అటవీ భూములలో ఫ్యూడలు, సెమీఫ్యూడలు భూస్వాములు ఆస్తిహక్కును-అనగా భూమిహక్కు కోల్పోయారు. వ్యవసాయం చేస్తున్నవారికే ఆ హక్కులు లభించాయి. అయినా వ్యవసాయభూముల సంస్కరణ చట్టాలు ప్రధానంగా రాజీ సంప్రదింపుల ప్రాతిపదికలపై రూపొందించబడినందున, స్వంత వ్యవసాయంకింద సాగుచేయుట అన్న పేరుతో మిలియనులకొలది యకరాల వ్యవసాయ భూములనుండి రైతాంగం తొలగించబడింది. చాలాచోట్ల లాండు రికార్డ్సులేవు. వున్నచోట్లకూడ లోపభూయిష్టంగా వుంది. అనేక సాకులతో భూస్వాములకే చెందునట్లు రాయితీలు జమీందారీ, జాగిర్దారీ, ఈనాందారీ, మొఖాసాదారి, మాల్గుజారీ రద్దు చట్టాలలో కల్పించబడినాయి. స్వంత వ్యవసాయాన్ని చేబట్టుట అన్న పేరుతో సీర్, ఖుద్‌ఖాస్త్, ఖకాష్తి వ్యవసాయ భూములలో విస్తారంగా జరిగింది. అత్యధికభాగం వ్యవసాయ భూములను సాగు చేస్తున్న రైతాంగం అన్నిమార్గాలు, హింసా దౌర్జన్యంతో తరివేయబడ్డారు. వారి స్థానాలనుండి తొలగించబడి పారద్రోలబడ్డారు. ఈ విషయంలో వీరు అవలంబించని హింసా, దౌర్జన్యం, మారణ హత్యాకాండకు అంతులేకుండా పోయింది. అంతేగాకుండా భూస్వాములకు యిచ్చిన నష్టపరిహారం 641 కోట్ల రూపాయల భారాన్ని రైతాంగమే భరించవలసి వచ్చింది. ఈ భారం యిప్పటికీ రైతాంగం నుండి వసూలు చేయబడుతూనే వుంది. పరోక్షంగా పన్నుల రూపంలో జరుగుతున్నది. [1]

---

1. సి.పి.ఐ. కార్యక్రమం (1968). పాట్నా పార్టీ కాంగ్రెసు ఆమోదించింది. పే. 20.

చట్టబద్ధంగా భూస్వామ్య విధానాన్ని రద్దుచేసినా సెమీ ఫ్యూడలు దోపిడి, తిరిగి కౌలుకిచ్చుట, హెచ్చురేట్లకు కౌలుకిచ్చుట, లీజుకిచ్చుట, ఉత్పత్తిలో పాలు పంచుకొనుట జమీందారీ ప్రాంతాలలో యింకా కొనసాగుతూనేవుంది. వివిధ రకాల స్వంత వ్యవసాయం బహుళంగా విస్తరించినా, కౌలుదారి విధానం విస్తారంగా సాగుతూనే వుంది. గ్రామీణ ఆర్థిక విధానంలో గణనీయంగానే వుంది. పాలుకవులుదారులు పంటలో 50 శాతం పైగా పంటలో భాగమిచ్చుట, బహిరంగంగా విస్తార ప్రాంతాలలో వుంది. చట్టబద్ధ భూస్వామ్య విధానం రద్దుఅయిన పశ్చిమబెంగాల్‌లో సెమి ఫ్యూడలు భూస్వామ్య దోపిడి కొనసాగుతూనే వుంది.

రైత్వారివిధానం వున్న రాష్ట్రాలలో బ్రిటన్ పాలన కాలంలో భూస్వాములు వొకవర్గంగా చట్టరీత్యా రైతాంగంగా పరిగణించబడుతున్నారు. పూర్తి హక్కులు భూములపై కలిగివుండి, స్వచ్ఛంద కౌలుదారులుగ అత్యధికంగా కౌలును చెల్లించుచున్నారు. కౌలుదారుల వ్యవసాయ భూముల సంస్కరణ చట్టాలు కౌలుదారులకు కొన్ని రక్షణలు కల్పించినా, ఆచరణలో శూన్యం చేయబడినవి.

అదేవిధంగా వ్యవసాయభూముల గరిష్ఠ పరిమితి చట్టాలు చేసినా, బినామీ ట్రాన్సుపరులతో మిగులుభూమి ఏనుగుతిన్న వెలగపండు చందమైంది. అతిస్వల్పం మాత్రమే రైతులు వ్యవసాయ కూలీలకు పంచబడింది. [1]

ప్రభుత్వం చేబట్టిన వ్యవసాయ భూముల, కౌలుదారుల చట్టాల ఫలితాలను సి.పి.ఐ. కార్యక్రమం యిలా సంగ్రహంగా పేర్కొన్నది.

i) ఫ్యూడలు వ్యవసాయ సంబంధాలు రద్దు చేయబడినవి. మాజీ జమీందారీ ప్రాంతాలలో చట్టబద్ధ భూస్వామ్య విధానం రద్దుచేయబడింది.

ii) చట్టాలు జరిగినా, సెమి-ఫ్యూడలు భూస్వామ్య సంబంధాలు బలంగానే యింకా వున్నవి. సెమీ ఫ్యూడలు కౌలుదారి విధానం స్థానికంగా వివిధ రూపాలలో కొనసాగుతూనే వుంది.

iii) పెట్టుబడిదారి వ్యవసాయ వుత్పత్తి విధానం గణనీయంగా వ్యాప్తిలోనికి వచ్చింది. స్వయంగా వ్యవసాయంచేయు రైతాంగం వేతన కూలీలతో సాగుచేయించుట ప్రబలింది. సెమిఫ్యూడలు భూస్వాములు, ధనికరైతులు పెట్టుబడిదారి విధాన వ్యవసాయదారులు అయ్యారు.

iv) గ్రామీణ సామాజిక జీవనంలో బలమైన శేషఫ్యూడలు, వృద్ధిచెందుతున్న వ్యవసాయ పెట్టుబడిదారి విధానం ఆధిక్యతను సంపాదించింది. వ్యవసాయ భూములలో 58 శాతం భూమి 10 శాతం వ్యవసాయ కుటుంబాల క్రింద వుంది. దీనినిబట్టి వ్యవసాయ భూముల కేంద్రీకరణ అధికమగుట స్పష్టము. గ్రామసీమలలో సెమీ

---

1. సి.పి.ఐ. కార్యక్రమము (1968)పాట్నా కాంగ్రెసు ఆమోదించినది (ఆంగ్లంలో) పే. 23–25

ప్యూడలు—పెట్టుబడిదారి విధాన వ్యవసాయం పరస్పరం సంలీనమగుతున్నవి.

v) స్వంత వ్యవసాయదారులలో అత్యధికభాగపు పరిస్థితి యేమాత్రం బాగు పడలేదు. సెమిఫ్యూడలు, మార్కెటింగు దోపిడి కొనసాగుతున్నందున వారిది అప్పులతో కొనసాగించే వ్యవసాయమే అయింది.

vi) వ్యవసాయ భూములనుండి రైతాంగాన్ని కౌలుదారులను విస్తృతంగా తొలగించుటతో ముఖ్యంగా వ్యవసాయ భూముల కౌలుదారుల సంస్కరణల చట్టాల కారణంగా, భూముల పంపకానికి మించి అనేకరెట్లు భూములనుండి తొలగించబడ్డారు. వారికి రక్షణ ఆచరణలో లేకుండా పోయింది. ఫలితంగా వ్యవసాయ కూలీల సంఖ్య పెరిగిపోయింది.

vii) వ్యవసాయంలో వ్యాపారీకరణ పెరిగిపోయినా మరోవైపు సెమీ ప్యూడలు దోపిడీ విధానం కొనసాగింది. నూతన అభివృద్ధి, నిరోధకవర్గం వ్యవసాయంలో ఏర్పడింది. భూస్వాములు, వడ్డీవ్యాపారులు, వ్యవసాయ హోల్ సేల్ వ్యాపారులు, ట్రాక్టర్లు, నీరుతోడు యింజనులు నడిపే యజమానులు చిన్న వ్యవసాయ వుత్పత్తుల ప్రోసెసింగుదారులు, మార్కెటింగుదారులు వగైరాలు కలదే యీ నూతనవర్గము. యిది ప్రధానంగా గ్రామసీమలలో అభివృద్ధి నిరోధక వర్గము.

జాతీయ బూర్జువావర్గపు వ్యవసాయ ఆర్థిక విధానం,భూసంస్కరణలతోపాటు సంక్షోభంలో పడిపోయింది. దీనినుండి బయటపడాలంటే సి.పి.ఐ. అభివృద్ధికర వ్యవసాయ భూముల సంస్కరణలు, వ్యవసాయంలో పునరుత్పత్తిని పెంచుటకై వుద్యమం లేకుండా ఆహార సమస్యను పరిష్కరించి, దేశ ఆర్థిక విధానాభివృద్ధిని సాధించుట అసాధ్యమని పేర్కొన్నది. అందుకు యీ క్రింది కార్యక్రమాలను చేబట్టి, వ్యవసాయరంగాన్ని పూర్తిగా పునర్నిర్మాణం చేయాలని సి.పి.ఐ. కార్యక్రమం సూచించుచున్నది.[1]

1. ప్యూడలు, సెమీప్యూడలు అవశేషాలన్నిటిని, వ్యవసాయ భూముల కేంద్రీకరణను బ్రద్దలుచేసి, నిజమైన గరిష్ట పరిమితికి మించిన మిగులు భూములను భూమిలేనివారికి, పేద రైతులకు పంచాలి.

2. రైతులకు ప్రభుత్వ సహాయం పుష్కలంగా, వుత్పత్తిని పెంచుటకై అధికం చేయాలి. వినియోగదారుల సహకార సంఘాలు, ఉత్పత్తిదారుల సంఘాలు విత్తనాభివృద్ధిని నూతన సాంకేతికపరిజ్ఞానంతో పెంపొందించి అందుబాటు చేయాలి.

3. బ్యాంకులు జాతీయం చేయుట, రుణాలు యిచ్చే వ్యవస్థను, తక్కువ వడ్డీతో రైతులకు అందివ్వాలి.

---

1. సి.పి.ఐ. కార్యక్రమము (1968)పాట్నా కాంగ్రెసు ఆమోదించినది (ఆంగ్లంలో) పే. 26–27.

4. వ్యవసాయ వుత్పత్తుల టోకు వ్యాపారాన్ని జాతీయం చేయాలి. గిట్టుబాటు ధరలు నిర్ణయించి, వుత్పత్తికి ప్రోత్సాహాన్ని యివ్వాలి. వినియోగదారులకు చవకదుకాణాలు యేర్పరచాలి.

5. వ్యవసాయ కూలీలకు జీవన ప్రమాణ కనీస వేతన నిర్ణయం చేయాలి.

"కార్మికవర్గ పార్టీయైన సి.పి.ఐ. యీ అభివృద్ధికర మార్పులను, దేశ వ్యవసాయ జీవితంలో కొనివచ్చుటకు తన సర్వ శక్తులను వినియోగిస్తుంది. వ్యవసాయ కూలీలు, పేద రైతాంగంపై ఆధారపడి రైతాంగంలో అన్ని వర్గాలను, శ్రామిక శక్తులను పోరాటాలలో ఐక్యపరచి, నూతన స్వాతంత్ర్యం, శుభిక్ష జీవితమార్గంలో పురోగమిస్తుంది" అని ముగించింది.

వ్యవసాయ సమస్యకు సంబంధించిన వివిధ అంశాలపై సి.పి.ఐ.(యం) అవగాహన, వైఖరి, ఎలా వున్నవో చూద్దాము.

రైత్వారీ ప్రాంతాలలో కౌలువారి చట్టాల అమలు, ఆచరణ ఎలా వున్నదో చూద్దాము. స్వంత వ్యవసాయం కొరకు కౌలుదారులను తొలగించి, వ్యవసాయం కొనసాగించుటకు చట్టాలు అవకాశమిస్తున్నవి. ఆ అవకాశాన్ని వినియోగించుకొని కౌలుదారుల తొలగింపుట విచక్షణారహితంగా జరిగి వేలకొలది తమ జీవానాధారాన్ని కోల్పోయారు,వారు సాగు చేసుకొనే న్యాయబద్ధ హక్కులను కోల్పోయారు. చట్టంలో వుద్దేశ్య పూర్వకంగా అనేక లొసుగులను, తప్పించుకొనుటకు అవకాశాలను కలుగజేశారు. మరోవైపు అసలు అమలు చేయుటలో ఆలస్యం, తాత్సారం చేసి నీరు కార్చివేసారు. ఈ కారణంగా మిలియనుల కొలది భూములను కోల్పోయి వ్యవసాయ కూలీలు అయ్యారు, దారిద్ర్యంలో కూరుకుపోయారు.

ఇదే కథనం పునారావృతం, గరిష్ట పరిమితి భూ ఖండాల చట్ట విషయంలోను జరిగింది. బడా భూస్వాములు వ్యాపార పంటలు, పరిశ్రమలు, తోటలు, వగైరాల పేరులతో చట్టం క్రిందకు రానివిధంగాను,కుటుంబాలను వేరు వేరుగా విడగొట్టుకొని యెక్కువ భూమిని యథాతథంగా వుంచుకొనుట లేదా బినామీ ట్రాన్సఫరులతో తమ క్రిందనే వుండగా, మిగులు భూములను హరించి వేయుట జరిగింది. అనేక రకాలుగా చట్టం క్రిందకు రాకుండా తప్పించుకొన గలిగారు. చాలా సందర్భాలలో గరిష్ట పరిమితి చాలా యెక్కువగా వుంది. సమర్థవంతంగా యాజమాన్యం వహించుటకనే మిషతో గరిష్ట పరిమితినే పెంచివేసారు. "పాడి పరిశ్రమ, పశువుల మేత" కని విస్తార బీడు భూములను వుంచుతూ గరిష్ట పరిమితిని చాలా యెక్కువగా పెంచేసారు. ఈ విధంగా మిగులు చాలా తక్కువగా చూపబడింది. అందులో ప్రభుత్వం నామమాత్రంగా మరింత తక్కువ భూమిని స్వాధీనం చేసుకొని ప్రచార నిమిత్తం పంచింది.

వ్యవసాయోత్పత్తులను పెంచాలంటే "కన్సాలిడేషన్ ఆఫ్ హోల్డింగ్స్" అనే ప్రభుత్వ విధానాన్ని కొన్ని రాష్ట్రాలలో ప్రవేశ పెట్టి వ్యవసాయదారుల భూ ఖండా

అను వొకేచోటికి చేర్చి విస్తీర్ణం పెంచునట్లు చేసారు. ఇది అమలు చేసిన రాష్ట్రాలలో ధనిక రైతులు తమ క్షేత్రాల ప్రక్క భూములను వివిధ రకాలుగా తమ స్వాధీనం, సాగులోనికి తెచ్చుకొని లాభించారు.

వ్యవసాయ కూలీలు పూర్తిగా తమ శ్రమశక్తి అమ్ముకొని జీవించేవారు, చాలా చిన్న భూఖండాలున్నా ప్రధానంగా శ్రమశక్తిని అమ్ముకొని జీవించేవారు, గ్రామ సీమలలో చిన్న వివిధ వృత్తుల బడుగు వర్గాలు ప్రధానంగా వ్యవసాయ కూలీలుగా జీవించేవారు అత్యధిక సంఖ్యాలు వొకేవర్గంగా వ్యవసాయ కూలీలుగా వున్నారు. వ్యవసాయ భూముల, కౌలుదారుల చట్టాలు, యితర ప్రభుత్వ విధానాల కారణంగా స్వాతంత్ర్యానంతరం వీరి సంఖ్య అత్యధికంగా పెరిగిపోయింది. అఖిల భారత స్థాయిలో గ్రామీణ జనాభాలో 30-35 శాతంగాను, ఆంధ్రప్రదేశ్, మద్రాసు, మైసూరు, కేరళ, ఒరిస్సా, బీహారు మరికొన్ని రాష్ట్రాలలో 50-55 శాతం వ్యవసాయ కూలీలు వున్నారు. వేలకొలది భూస్వాముల పాలేరులుగా సంవత్సరమంతా పనిచేసే వారు వున్నారు. వీరికి కనీస జీవన వేతన చట్టాలు చేయబడలేదు, నివాస స్థలాలు, త్రాగునీటి సౌకర్యాలు లేవు, దారిద్ర్యం తాండవిస్తూ వుంటుంది. కారణం సంవత్సరంలో 120 రోజులకు మించి పని వుండదు, తిండికి అవస్థ పడుతుంటారు.

ద్రవ్య, ఆర్థిక, మార్కెటు విధానాలు అభివృద్ధి చెందుటతో గ్రామీణ ప్రాంతాలలో జట్టీ ఉత్తరోత్తర డెలివరీ, స్పెక్యులేషన్ వ్యాపారం, ఆహార పదార్థాల ధాన్యాలులలో, తదితర పప్పు ధాన్యాలు,వ్యాపార పంటలలో విపరీతంగా పెరిగిపోయింది. దేశ, విదేశ గుత్త వ్యాపారుల, మార్కెట్టుపై ఆధిపత్యం, వ్యవసాయ వుత్పత్తులపై వ్యాపార వర్గాల ప్రయోజనాలు, ఫలితంగా దోపిడీ తీవ్రతరమైంది, యిది ప్రధానంగా అసమాన విదేశ ద్రవ్య మారకం రేట్లు, ధరల హెచ్చుతగ్గుల ద్వారా యీ దోపిడి సాగుతున్నది. ఫలితంగా, వ్యవసాయ వుత్పత్తులను అమ్ముకొనే వానిగా, పారిశ్రామిక వస్తువుల కొనుగోలుదారుగా రెండు విధాల యీ దోపిడి సాగుతున్నది. వీటన్నిటి ఫలితంగా గ్రామీణ అప్పు విపరీతంగా పెరిగిపోయింది. [1]

సి.పి.ఐ. (యం.యల్) కార్యక్రమం "ప్రజాసామాన్యంలో 75 శాతం రైతులున్నారని, దేశంలో అత్యంత తీవ్రదోపిడికి లోనవుతూ దుర్భర దారిద్ర్యంతో, ఆకలితో కష్టాలకు గురియవుతున్నారు. అర్ధ-ఫ్యూడలు భారతదేశంలో 80 శాతం భూమి, 20 శాతం భూకామందుల చేతులలో వుంది. వారే, రాజులు, భూస్వాములు, ధనికరైతులు. గ్రామీణులలోని 80 శాతానికి భూమిలేదు, వున్నా నామమాత్రం. అందుచేత ఆకలికి గురగుతున్నారు" అని పేర్కొన్నది. అంతేగాక "భూమిలేని పేద రైతాంగం తమ పంటలో 50 నుండి 70 శాతంవరకు "కౌలు" రూపంలో భూస్వా

1. సి.పి.ఐ. (యం) కార్యక్రమము (1972) 9వ కాంగ్రెసు ఆమోదించింది. పే. 13 నెం.

ములకు యిస్తున్నారు. విపరీత వడ్డీలతోకూడ వీరు దోపిడికి గురవుతున్నారు. సెమి ఫ్యూడలు భూసంబంధాలు మన ప్రజలను కరువుకాటకాలకు గురిచేస్తున్నవి. "దున్నే వానికే భూమి అనే సూత్ర ప్రాతిపదికపై జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం భూస్వాముల భూములను స్వాధీనపరచుకొని భూములులేని రైతాంగానికి, పేద రైతులకు పంపకం చేయాలి, అన్ని అప్పులు రద్దుచేయాలని"[1] పేర్కొన్నది.

**విదేశాంగ విధానము :**

సి.పి.ఐ. 8వ పాట్నా పార్టీ కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమం "భారత దేశ ప్రభుత్వ విదేశాంగ విధానం ప్రధానంగా శాంతి, అలీన వలస విధాన వ్యతిరేక విధానము"గా క్లుప్తంగా పేర్కొన్నది. ఈ విధానం జాతీయ బూర్జువావర్గ ప్రయోజనాలకు పూర్తిగా అనుకూలంగా వుంది. భారత ఆర్థికాభివృద్ధికి తోడ్పడుతుంది. అప్పుడప్పుడు వూగిసలాటలకు, రాజీలకు, వెనుకాటలకు లోనవుతూ వుంటుంది. అయినా, ప్రధాన రాజకీయ విధానానికి, లక్ష్యాన్ని విడనాడకుండానే వుంటుంది. ప్రథమంలో బ్రిటిష్ ప్రభుత్వ వొత్తిడులకు, వారసత్వానికి లోనయినా త్వరగానే ప్రభుత్వ వైఖరిలో గణనీయమైన మార్పు వచ్చింది. ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదుల భారత వైఖరి, ఆసియా, ఆఫ్రికా దేశాల యెడలవారి వైఖరే అందుకు కారణం.

వలస విధాన వ్యతిరేక, అలీన విధానం 1961లో భారతదేశం గోవాను విముక్తిచేయుటకు సైనికచర్య చేబట్టి, గోవా పరిసర ప్రాంతాలను విముక్తి చేయుటతోపాటు డయ్యూ, డామన్‌లుకూడ విముక్తిచెందాయి. దీంతో అలీనవిధానం దేశములో బలపడింది. పైగా యిది అంతర్జాతీయ శాంతి, వలస వ్యతిరేక ఉద్యమాన్ని బలపరచి, ప్రపంచంలో శాంతిని వాంఛించే దేశాలలో పేరు ప్రతిష్ఠలను, గౌరవాన్ని తెచ్చిపెట్టిందని, సి.పి.ఐ. అంతర్జాతీయ అవగాహనగా వుంది.

సామ్రాజ్యవాదం భారతదేశపు శాంతి, అలీన వలస వ్యతిరేక విధానాన్ని పూర్తిగా వ్యతిరేకించి ఇండియా-పాకిస్తాన్‌ల, కాశ్మీర్ సమస్యా ఉగ్రవాద చర్యలను రెచ్చగొట్టి, ఐక్యరాజ్యసమితిలోని సెక్యూరిటీకౌన్సిలు సభ్యత్వానికి పాకిస్థాన్ ఎన్నుకొనుబడునట్లు తన అంతర్జాతీయ బలాన్ని ప్రత్యేకంగా భారతదేశానికి వ్యతిరేకంగా వినియోగించింది. ఈ కాలంలోనే అక్టోబరు 1962లో చైనా భారతదేశంపై సరిహద్దు యుద్ధాన్ని తెచ్చిపెట్టి భారతదేశ అంతర్జాతీయ శాంతి, అలీన సామ్రాజ్యవాద వలస వ్యతిరేక విధానానికి పెద్ద పరీక్ష తెచ్చిపెట్టి, అమెరికా చేసే వొత్తిడులకు పరోక్షంగా సహాయపడింది. ప్రపంచ సామ్రాజ్యవాదశక్తులు భారతదేశంపై అత్యధిక వొత్తిడి తెచ్చినా నెహ్రూ తన అలీనవిధానాన్ని వదలి, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాద శక్తులతో రక్షణ వొప్పందం చేబట్టక తన విదేశాంగ విధానం శాంతి, అలీన, వలస

1. సి.పి.ఐ, (యం.యల్) కార్యక్రమము. మే 1970 పార్టీ కాంగ్రెసు ఆమోదించినది. నక్సల్బరీ అండ్ ఆఫ్టర్ వా 2 పే. 278-9; 283.

విధాన వ్యతిరేకతా వేదికను కొనసాగించి, ప్రపంచ అభ్యుదయ శక్తుల మన్ననలను పొందాడు. సైనికవోటమి పొందినా నైతిక రాజకీయ విజయాన్ని పొందాడు. ఈ క్రమంలో సి.పి.ఐ. విదేశాంగ విధానాన్ని పూర్తిగా బలపరచింది.

భారతదేశ శాంతి, అలీన, వలస సామ్రాజ్యవాద వ్యతిరేక విధానం, మనదేశ రాజకీయ స్వాతంత్ర్యాన్ని బలపరచుటయేగాక, కాంతియుత, ఆర్థికాభివృద్ధికి అత్యావసరమైన వనరులను మిత్రదేశాలనుండి పొందునట్లు చేసింది. ఈ విధంగా శాంతి, అలీనవిధానం అంతర్జాతీయంగా వైముఖ్యతాభావ విధానంగా కాక, సుముఖ అభ్యుదయకర విధానంగా నాడు రుజువయింది. సి.పి.ఐ. దానిని మౌలికంగా బలపరచుట సరియైనదేయని తదనంతర వర్తమాన చరిత్ర స్పష్టం చేసింది.

సి.పి.ఐ. (యం) విదేశాంగ విధాన అవగాహన "ఏ రాజ్యం, లేక దాని ప్రభుత్వపు విదేశాంగ విధానమైనా, అంత్య విశ్లేషణలో ఆ ప్రభుత్వపు దేశాంగ విధానపు విస్తరణయేగాక, ఆ ప్రభుత్వానికి నాయకత్వం వహించే వర్గపు లేక వర్గాల ప్రయోజనాలను ప్రతిబింబిస్తుంది. అంతేగాక, భారతదేశ ప్రభుత్వ విదేశాంగ విధానం సహజంగానే సామ్రాజ్యవాదంతో రాజీ విధానాన్ని సహకారాన్ని వొక వైపున ద్వంద్వ నైజపు బూర్జువావర్గపు విధానాన్ని ప్రతిబింబిస్తుంది. సామ్రాజ్యవాద దేశాలలోని గుత్త బూర్జువావర్గాల వలె గాక భారత బూర్జువావర్గం, దాని అభివృద్ధికి శాంతి అవసరం. అందుకే అది ప్రపంచ యుద్ధ వ్యతిరేకతగా వుంది.

"నూతనంగా అలీన విధానానికి సామ్రాజ్యవాద వ్యతిరేకతాంశానికి ప్రాధాన్యత నిచ్చుటతో సుముఖ పాత్ర అంతర్జాతీయ రాజకీయాలలో వహించుట జరిగింది."

"గుత్త పెట్టుబడిదారి వర్గాలు, బడా బూర్జువావర్గాలు అభివృద్ధి చెందుటతో పాటు సామ్రాజ్యవాద గుత్త పెట్టుబడిదారి బడా బూర్జువావర్గాలతో సంబంధాలు యేర్పడుటకు, ప్రభుత్వం నుంచి మంచి ప్రోత్సాహం లభించింది. కారణం పంచవర్ష ప్రణాళికలు "సహాయం" లభించుతుందని ఆశించి ఆ పని చేసింది. అందులో ముఖ్యంగా అమెరికా నుండి సహాయం లభించగలదని ఆశించింది. ఈ సందర్భంలో భారత భారీ ఉక్కు, ఇనుము, భారీ యంత్రాల నిర్మాణ పరిశ్రమలను వాస్తవంగా సామ్రాజ్యవాద దేశాలనుండిగాక, సోషలిస్టు దేశాలనుండి సహాయం, సాంకేతిక పరిజ్ఞానం లభించుట మరచిపోవుట" ఆశ్చర్యకరము మాత్రమేగాక, ప్రజలు ఎదుర్కొంటున్న మౌలిక సమస్యలను, చైనా, వియత్నాం దేశాలతో పోల్చితే పరిష్కరించుట విఫలమైంది. సామ్రాజ్యవాదుల "సహాయాన్ని" ఆశించుతూ ప్రణాళికా రచనలు సాగించుటతో, యీ వైఫల్యాలకు మూల కారణాన్ని వెతకవలసి వుంటుంది.

సి.పి.ఐ.(యం) కార్యక్రమము, భారతవిదేశాంగ విధానంపై యీ క్రింది

వ్యాఖ్య (పేరా. 55)ను చేసింది.[1].

"ప్రపంచ యుద్ధ వ్యతిరేక, అలీన విధానపు విస్తృత పరిధిలో ప్రభుత్వ విదేశాంగ విధానం కొనసాగించబడినా, పెట్టుబడిదారి విధానాభివృద్ధి పంచవర్ష ప్రణాళికలను పరిపూర్తి చేయుటకు విదేశీద్రవ్య పెట్టుబడిదారి విధానంపై, కామన్‌వెల్తులో కొనసాగుటపై ఆధారపడినందున, వూగిసలాడుతూ, అనేక వలస వ్యతిరేక సమస్యలపై, ఇటీవల కాలంలో అమెరికా నియో వలస విధాన విస్తరణకు వాస్తవానికి అవకాశాలను, దురాక్రమణలకు పరోక్షంగా వీలు కలుగజేసి శక్తివంతమైన శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజంలకు భారతదేశం దూరమగునట్లు చేసింది. బడాబూర్జువావర్గం నాయకత్వంలోని ప్రభుత్వం ప్రజా వ్యతిరేక విధానాలను కొనసాగిస్తూ, అలీన విధానాన్నిగాని, హృదయపూర్వకంగా తన ప్రకటిత విధానాన్ని అమలు చేస్తుందన్న గ్యారంటీని, విశ్వాసాన్ని కలిగించలేదు, అని వివరిమాటగా చెప్పింది.

సి.పి.ఐ. (యం.యల్) కార్యక్రమంలో "భారత విప్లవపు మౌలిక కర్తవ్యంగా, ఫ్యూడలిజం కంప్రెడరు బురాక్రటిక్ పెట్టుబడిదారి విధానాన్ని, సామ్రాజ్యవాదాన్ని, సోషల్ సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయాలని" పేర్కొన్నది. "మన విప్లవ దశను యిదే నిర్ణయిస్తుంది. ప్రజాస్వామ్య విప్లవదశ, సారాంశము వ్యవసాయ విప్లవం"[2] అని స్పష్టం చేసింది. విదేశాంగ విధానాన్ని కార్యక్రమము పరిగణలోనికి తీసుకొనలేదు. ఆంధ్రప్రదేశ్ రివల్యూషనరీ కమ్యూనిస్టు కమిటి, కన్వెక్షన్‌లో ఏప్రిల్ 1969లో ఆమోదించిన తక్షణ కార్యక్రమములో "విదేశాంగ విధానపు పునాది, ప్రపంచ సామ్రాజ్యవాదానికి ముఖ్యంగా అమెరికన్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, దాని వలస సోదరుడు సోవియట్ యూనియన్ సోషల్ ఇంపిరియలిజంకు, దాని ముఠాకు వ్యతిరేకంగా ఐక్య సంఘటన నిర్మించుట"[3] ప్రధాన కర్తవ్యంగా పేర్కొని, ఆ ఐక్య సంఘటనలో భాగస్వామి కావాలని పేర్కొన్నది.

భారత ప్రభుత్వ విదేశాంగ విధానమైన శాంతి, అలీన, సామ్రాజ్యవాద వలస వ్యతిరేక విధానం, జాతీయ బూర్జువావర్గ ప్రయోజనాలకు అనుకూలంగాను, భారత ఆర్థికాభివృద్ధికి తోడ్పడుతుందనే అవగాహనను సి.పి.ఐ. బలంగా విశ్వసించు

---

1. సి.పి.ఐ. (యం) కార్యక్రమము (1972) 9వ, పార్టీ కాంగ్రెసు ఆమోదించినది. పే. 22-23.

2. సి.పి.ఐ. (యం.యల్.) కార్యక్రమం (1970) పార్టీ కాంగ్రెసు మే 1970లో ఆమోదించింది. పే. 276-277 (పే. 7).

3. తక్షణ కార్యక్రమము (1969) ఎపిఆర్‌సిసి కన్వెన్షన్, ఏప్రిల్ 1969 ఆమోదించినది. నక్సల్బరీ అండ్ ఆఫ్టర్. వా II పే. 233.

తుంది. అంచేతనే, ప్రభుత్వం యీ విధానాన్ని "అరమరికలు" లేకుండా అమలు చేయుటకు పూర్తి సహకారాన్ని యిస్తున్నది. ఈ విధానాన్ని అమలు చేయుటలో ప్రభుత్వ వూగిసలాటను తీవ్ర విమర్శకు గురిచేస్తూ వొత్తిడిచేసింది. సి.పి.ఐ. (యం) భారత ప్రభుత్వ ద్వంద్వ నైజాన్ని, అతిగా నొక్కి చెపుతూ, సామ్రాజ్యవాదంతో అది అనుసరించే రాజీ విధానాన్నే నొక్కి చెప్పుతూ, తన ఎత్తుగడలను, కార్యక్రమాలను తదనుగుణంగానే ప్రధానంగా ఆచరించసాగింది. భారత బూర్జువావర్గ ప్రయోజనాలకు, ఆర్థికాభివృద్ధికి శాంతి, అలీన, సామ్రాజ్యవాద వలస వ్యతిరేక బూర్జువావర్గ రెండవ పార్శ్వాన్ని సి.పి.ఐ.(యం) గుర్తించినా ఆచరణలో ఎత్తుగడల్లో యీ అవగాహన ప్రతిబించలేదు. అంటే క్లుప్తంగా ఆచరణ, అవగాహనల నుండి వేరుపడి పోయింది. సి.పి.ఐ. (యం.యల్) వ్యూహలు, కంప్రెడరీ బూర్జువా, సామ్రాజ్యవాద, సోషల్ సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనను నిర్మించి, తద్వారా సాయుధ రైతాంగ విప్లవ పోరాటాల ద్వారా వ్యవసాయ విప్లవం ధ్యేయంగా వ్యూహరచన, ఎత్తుగడలను అతివాద సాహసికవాద వొంటెత్తు సెక్టేరియన్ దృక్పథాన్ని చేబట్టుటతో, శాంతి,ప్రపంచ యుద్ధవ్యతిరేకతలకు స్థానం లేకుండా పోయింది. సెక్టేరియనిజానికి పరాకాష్టగా రూపొందింది.

## విప్లవ పురోగమనము, మూడు పంథాలు :

భారత కమ్యూనిస్టు వుద్యమ అనుభవాలు, చారిత్రక గుణపాఠాలు, వివిధ కమ్యూనిస్టు స్రవంతులు తమ ముందున్నది సోషలిస్టు విప్లవం కాదని, తమ కర్తవ్యం ప్రజాస్వామ్య విప్లవాన్ని, ప్రజాస్వామ్యాన్ని ఐక్యసంఘటన ద్వారా, పోరాటాల ద్వారా సాధించవలసి వుందని సూత్రప్రాయంగా ఆమోదం కలిగి వున్నారనుట వాస్తవం. అయితే, సి. పి ఐ. జాతీయ ప్రజాస్వామ్య విప్లవం సంపూర్తిగా, మధ్యంతరంగా సామ్రాజ్యవాదం, బడా బూర్జువా వర్గాలు రాజీ మార్గాన్ని అనుసరించుటతో, విప్లవ కర్తవ్యాలు సంపూర్ణంగా నెరవేర్చబడలేదని, అంచేత జాతీయ బూర్జువా వర్గ ప్రయోజనాలు సంపూర్తిగా నెరవేరలేదని, ఆ కారణంగా, మన ముందున్నది జాతీయ ప్రజాస్వామ్య విప్లవం జాతీయ ప్రజాస్వామ్య సంఘటన ద్వారా సాగించాలని, ఆ క్రమంలోనే జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని ఏర్పరచాలనే అవగాహనతో తన వ్యూహాన్ని, ఎత్తుగడలను రచించింది. జాతీయ ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలు అసంపూర్తిగా వున్నంతవరకు, వాటిని పూర్తి చేయుటలో జాతీయ బూర్జువావర్గ ప్రయోజనాలు యిమిడి వుండుటతో, జాతీయ బూర్జువా వర్గ విప్లవ పాత్ర పూర్తిగా అంతమైందనుట సెక్టేరియనిజానికి దారి తీస్తుందని జాతీయప్రజాస్వామ్య విప్లవంలో భాగస్వామ్య పాత్ర వహించే జాతీయ బూర్జువా వర్గానికి, తత్ఫలితంగా ఏర్పడే ప్రభుత్వంలో కూడ భాగస్వామి అగుతుందని, అట్టి ప్రభుత్వంలో ఏ వొక్క వర్గానికే నాయకత్వం వుండదని, ఆ దశలో

సమిష్టి నాయకత్వం వుంటుందని, తదనంతర దశలో పోరాటం వర్గ పోరాట స్వరూపాన్ని పొందుటతోనే నూతన ప్రజాస్వామ్యదశ, అది సంపూర్తిగా తన కర్తవ్యాన్ని నిర్వహించుటతోనే సోషలిస్టు దశకు చేరుతుందని, దీనికి కాలనిర్ణయం కాక సామాజిక వ్యుత్పత్తి విధానమే దీనిని నిర్ణయిస్తుందని సి.పి.ఐ. అవగాహనగా వుంది. అంతేగాక, సి.పి.ఐ. "జాతీయ ప్రజాస్వామ్యాన్ని స్థాపించి, సోషలిస్టు గమ్యానికి పురోగమించుటకు అనువగు భౌతిక పరిస్థితులను రూపొందించుటకు శాంతియుతమార్గాలలో ప్రయత్నిస్తుందని, శక్తివంతమైన విప్లవ ప్రజోద్యమాన్ని నిర్మించి స్థిరమైన పార్లమెంటరీ మెజారిటీని ప్రజా బాహుళ్యాన్ని సమీకరించుట ద్వారాను, శక్తివంతమైన కార్మికోద్యమము అభివృద్ధి నిరోధక శక్తుల ప్రతిఘటనను నిర్వీర్యచేయుట ద్వారా, బూర్జువా వర్గానికి సేవలందించే పార్లమెంటు సాధనాన్ని ప్రజల కోర్కెలను మన్నించే ప్రజల వాస్తవ సాధనంగా చేసి, మౌలిక ఆర్థిక, రాజ్యాంగ, సామాజిక మార్పులు కొనివచ్చుటకు వినియోగిస్తుందని"[1]. సిద్ధాంతీకరణ చేసింది.

సి.పి.ఐ.(యం.) కార్యక్రమం కూడ "ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతున్న చారిత్రిక పరిస్థితులలో, ప్రపంచ పెట్టుబడిదారి విధానం త్వరితంగా కూలిపోతున్నపుడు మనకు నూతన విస్తృతావకాశాలు, అనేకం నూతనంగా స్వాతంత్ర్యం పొంది వెనుకబడి, అభివృద్ధి చెందని దేశాలకు జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వాల నిర్మాణావకాశాలు వుద్భవించాయి. అభివృద్ధిచెందే కార్మిక వర్గం క్రమేణా ఆ ప్రభుత్వంలో కార్మికవర్గ నాయకత్వాన్ని ఏర్పరచి, దేశాన్ని పెట్టుబడిదారేతర మార్గంలో అభివృద్ధిపరచి, పెట్టుబడిదారి విధాన దశ అవసరం లేకుండా, సోషలిజంకు పురోగమించగలదని" (పేరా 84) స్పష్టం చేసింది. ఈ అవగాహనలో ఎక్కువ భాగము సి.పి.ఐ. అవగాహనకు చాల దగ్గరిగా వున్నా, "పెట్టుబడిదారి విధానదశ అవసరం లేకుండా సోషలిజానికి" పురోగమించుట అన్న విషయంలో ప్రధాన భేదమున్నది.

ఈ అవగాహనలో "జాతీయ ప్రజాస్వామ్య విప్లవ దశలో జరగవలసిన జాతి పునర్నిర్మాణ దశ, అది పెట్టుబడిదారి విధానంలో సమాజాభివృద్ధి దశను "స్కిప్పింగ్ చేయుట" అనగా "దాటవేయుట"; 1948-51 లలో "జాతీయ ప్రజాస్వామ్య దశ" దాటవేసి, "సోషలిస్టు విప్లవ దశ"కు చేర ప్రయత్నించుట, "అతివాద సెక్టేరియనిజపు వక్రీకరణ"గా తదుపరి అన్ని వర్గాలు నిర్ధారణ చేయుట గుర్తుంచుకొనవలసి వుంటుంది.

సి.పి.ఐ.(యం) కార్యక్రమము "భారతదేశంలో యీ మార్గం (పెట్టుబడిదారే

1. ప్రోగ్రాం ఆఫ్ సి.పి.ఐ. 8వ, పాట్నా కాంగ్రెసు (1968) సవరణలతో ఆమోదించినది. (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 57.

తర మార్గంలో ఆర్థికాభివృద్ధి చెందిన మూసివేయబడింది. బ్రిటిష్‌వలస పాలనలోవున్నప్పుడే, పెట్టుబడిదారి విధానం అభివృద్ధి చెందిన దేశాలలో భారతదేశం వొకటైవుంది. బడా బూర్జువావర్గం జాతీయోద్యమానికి నాయకత్వం వహించింది, నూతన స్వాతంత్ర్య దేశం 1947 తరువాత ఏర్పడినపుడు ప్రభుత్వాధికారాన్ని చేబట్టింది. రెండు దశాబ్దాల తరువాత, నేడు ఆ ప్రభుత్వాధికారాన్ని, వినియోగించుకొని, తన వర్గ శక్తులను బలోపేతం చేసుకొని తన స్థానాన్ని బలపరచుకొన్నది, మరోవైపున సంప్రదింపులు రాజీ బేరసారాలు సామ్రాజ్యవాదంతో, బడా భూస్వామ్య వర్గాలతో సాగించింది, పెట్టుబడిదారి పంథాలో దాని వర్గ ప్రయోజనాల అభివృద్ధి సాగించింది. గత రెండు దశాబ్దాలుగా విపరీతంగా గుత్త పెట్టుబడిదార్లను పెంచి, పోషించి, బలపరచింది. ఈ పరిస్థితులలో పెట్టుబడిదారేతర పంథాలో ఆర్థికాభివృద్ధి అని, జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వ నిర్మాణం ఆశించుట అవాస్తవం అవుతుంది. సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడి కూకటివేళ్ళతో తొలగించుట, ఫ్యూడలు, సెమి ఫ్యూడలు బంధనాలను ఛేదించే మౌలిక ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలు, యీ బూర్జువా భూస్వామ్య ప్రభుత్వానికి నాయకత్వం వహించే బడా బూర్జువా వర్గాన్ని కూలద్రోయందే నెరవేరవు.[1]

సి.పి.ఐ.(యం) ధ్యేయం సోషలిజం, కమ్యూనిజమే అయినన్పటికి, ఆర్థికాభివృద్ధి స్థాయిని, కార్మికవర్గ నిర్మాణము, దాని రాజకీయ, సైద్ధాంతిక పరిపక్వత స్థాయిని పరిగణలోనికి తీసుకొని జనతా ప్రజాస్వామ్యం, ఫ్యూడలు వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక అన్ని శక్తుల సహకారంతో కార్మికవర్గ నాయకత్వంలో యేర్పరచుట తన తక్షణ లక్ష్యంగా పెట్టుకొన్నది. ఇదే భారత విప్లవాన్ని సరైన మార్గంలో పెట్టి సోషలిజానికి దారి తీస్తుంది. దీనికై జనతా ప్రజాస్వామ్య సంఘటన ద్వారా ప్రజా సమీకరణ పోరాటాలద్వారా జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పాటు, యివి అన్నీ కార్మికవర్గ నాయకత్వంలోనే సాధ్యమని సి.పి.ఐ. (యం) 9వ, పార్టీ కాంగ్రెసు 1972లో సవరణలతో ఆమోదించిన కార్యక్రమం స్పష్టం చేసింది.

సి.పి.ఐ. (యం.యల్) విప్లవ పురోగమనానికి అనుసరించుతున్న పంథాను కార్యక్రమం యిలా పేర్కొన్నది.

"భారతదేశ విప్లవ మౌలిక కర్తవ్యం, ఫ్యూడలిజం, కంప్రెడరీ బురాక్రటిక్ పెట్టుబడిదారి విధానాన్ని, సోషలు సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయుట ఇదే భారత దేశ విప్లవ దశను నిర్ణయిస్తుంది. ప్రజాస్వామ్య విప్లవ దశలో భారతదేశం వుంది, దాని సారాంశమే వ్యవసాయ విప్లవం.

---

1. కార్యక్రమము (1972) సి.పి.ఐ (యం) 9వ, పార్టీ కాంగ్రెసు మధురైలో జూలై 1972లో ఆమోదించింది. (పేరా 84-6)

"ఏమైనా అది పురాతన ప్రజాస్వామ్య విప్లవ నమూనాలో వుండదు. అది నూతన ప్రజాస్వామ్య విప్లవ దశలోని వ్యవసాయ విప్లవ రూపంలో వుంటుంది. "ఈ విప్లవం కార్మిక కర్షక, పెటీ బూర్జువా, చిన్న, మధ్య తరగతి బూర్జువాల నియంతృత్వాన్ని కార్మిక కర్షక నాయకత్వంలో యేర్పాటు చేస్తుంది. వీరందరూ కలసి భారత ప్రజానీకంలో అత్యధిక మెజారిటీగ వుంటారు. నూటికి 90 శాతం ప్రజా సామాన్యానికి ప్రజాస్వామ్యాన్ని గ్యారంటీ చేస్తుంది. అందుచేతనే అది జనతా ప్రజాస్వామ్యం.

"ప్రజాస్వామ్య విప్లవాన్ని తుదివరకు కొనసాగించుటకు ప్రజాస్వామ్య సంఘటన లేక అన్ని వర్గాల కూటమి కార్మికవర్గ నాయకత్వంలో నిర్మించాలి.

"సాయుధ పోరాటాల క్రమంలో కార్మిక, కర్షక ఐక్యత యేర్పడి, దేశంలో కనీసం కొన్ని ప్రాంతాలలో ఎర్ర రాజకీయ ప్రభుత్వం యేర్పడినపుడు యీ సంఘటన యేర్పడుతుంది."

"జనతా ప్రజాస్వామ్య విప్లవంపై కార్మికవర్గ నాయకత్వం, దాని రాజకీయ పార్టీయైన కమ్యూనిస్టు పార్టీద్వారా యేర్పడుతుంది. [1]

భారతదేశంలో విప్లవ పురోగమన పంథా విషయంలో, సి.పి.ఐ., సి.పి.ఐ. (యం), సి.పి.ఐ. (యం.యల్)లు మూడు చేపట్టవలసిన విప్లవం ప్రజాస్వామ్య విప్లవమేనని, సోషలిస్టు విప్లవం కాదనే విషయంలో వొకే విధమైన అవగాహనను కలిగి వున్నవి. సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు 1947లో స్వాతంత్ర్యం వచ్చిందనే విషయంలో కూడ వొకే అభిప్రాయాన్ని కలిగివుండి, అప్పుడు బూర్జువా వర్గం సామ్రాజ్యవాదం రాజీ వొప్పందం కారణంగా, సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక కర్తవ్యాలు పరిపూర్తి చేయబడలేదని, అందుకే ప్రజాస్వామ్య విప్లవాన్ని కొనసాగించి, ఆ విప్లవ కర్తవ్యాలను పరిపూర్తి చేయవలసి వుంటుందని కూడ వొక విధమైన అవగాహనను కలిగి వున్నవి. సి.పి.ఐ. నేటి పరిస్థితులలో విప్లవం, పెట్టుబడి దారేతర ఆర్థికాభివృద్ధి మార్గంలో శాంతియుతంగా, ప్రజోద్యమాల ఫలితంగా పార్లమెంటరీ మెజారిటిని సంపాదించి, పార్లమెంటును సాధనంగా వినియోగించి ప్రజాస్వామిక విప్లవ శేష కర్తవ్యాలను పరిపూర్తి చేయగల అవకాశాలన్నవనే విశ్వాసంతో వుంది. ఆ విధంగానే సోషలిజం వైపుకు విప్లవం పురోగమించగలదనే అవగాహన కలిగి వుంది. సి.పి.ఐ. (యం) నేటి ప్రత్యేక పరిస్థితులను, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఆధిక్యతను గుర్తించి ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను, జనతా ప్రజాస్వామ్య విప్లవం బూర్జువా

1. పార్టీ కార్యక్రమం (1970) సి.పి.ఐ. (యం.యల్)పార్టీ కాంగ్రెసు మే 1970లో ఆమోదించినది. నక్సల్బరీ అండ్ ఆఫ్టర్. వా. II పే. 280-1.

భూస్వామ్య ప్రభుత్వాన్ని కూలద్రోసి, కార్మికవర్గ నాయకత్వంలో జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం వొక్కటే ఆ పని చేయగలదనే అవగాహన కలిగివున్నది. మూడవ కమ్యూనిస్టు శ్రేణి అయిన సి.పి.ఐ. (యం.యల్) అర్థవలస దేశంగా, సెమీ ఫ్యూడల్ సామాజిక వ్యవస్థగ నిర్వచించి, సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక దీర్ఘ కాల సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాల ద్వారా వ్యవసాయ విప్లవం వొక్కటే విప్లవ పురోగమన మార్గంగా నిర్ణయించింది స్వాతంత్ర్యం, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం "బూటకమనీ", "మోసం", "కుట్రగా" త్రోసిబుచ్చింది.

**ఐక్య సంఘటన :**

ఈ ఐక్యసంఘటన సి.పి.ఐ. దృక్పథంలో జాతీయ ప్రజాస్వామ్య సంఘటనగా నిర్వచించి, దానిలో భాగస్వాములుగా, ప్రయోజనాల ప్రాతిపదికగా యీ క్రింది వారిని పేర్కొన్నది. జాతీయ ప్రజాస్వామ్యం చేబట్టవలసిన కార్యక్రమాలపైకూడా అందులో పాల్గొనే వర్గాల పాత్ర స్పష్టమగుతుంది. కాంగ్రెసు ప్రభుత్వాన్ని తొలగించే ప్రత్యామ్నాయ పంథా, యేదోరూపంలో మరో బూర్జువా ప్రభుత్వాన్ని యేర్పరచుట కాదు. సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక, గుత్త పెట్టుబడిదారి వ్యతిరేక వర్గాలు, నేటి పెట్టుబడిదారి విధాన ఆర్థికాభివృద్ధి కొనసాగించుటకాక, పెట్టుబడిదారేతర పంథాలో ఆర్థికాభివృద్ధిని చేబట్టే జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వం అయివుండాలి. ఆ ప్రభుత్వం యీ క్రింది సత్వర మౌలికమార్పులు చేబట్టాలి.

మొదట భారత ఆర్థికవిధానంపై విదేశ గుత్తపెట్టుబడిదారి వర్గాల ఆధిక్యతను అంతం చేయాలి. విదేశ గుత్తపెట్టుబడి వర్గాలపై ఆధారపడని ప్రభుత్వరంగాన్ని ప్రజాస్వామ్య పద్ధతులలో పనిచేయు స్వతంత్ర్య వ్యవస్థగా నిర్మించాలి. అదే స్వశక్తిపై ఆధారపడే స్వయంచాలక జాతీయ ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధికి ప్రోత్సాహకారి అగుతుంది బ్యాంకింగు, వ్యాపారాన్ని, పారిశ్రామిక శక్తిని తమ చేతులలోనే కేంద్రీకరించుకొన్న భారత గుత్తపెట్టుబడివర్గాల గ్రూపులను చెదరగొట్టి గుత్తపెట్టుబడిదారి కేంద్రీకరణను, పెరుగుదలను సమర్థవంతంగా అరికట్టాలి. భూస్వామ్య, శేషఫ్యూడలు వ్యవస్థలను పూర్తిగా రద్దుచేయాలి. రైతులకు ప్రయోజనం చేకూర్చే అభ్యుదయకర వ్యవసాయ భూ సంస్కరణలు చేయాలి. రైతుల రక్తం పీల్చి, అధిక వడ్డీలనుగుంజే వడ్డీవ్యాపారుల, తదితర ద్రవ్యవ్యవస్థల ఆటలు కట్టించాలి. ఈ చర్యలు మొత్తంగా ప్రజల జీవనాన్ని మెరుగుపరుస్తాయి. అయితే యీ కార్యక్రమం అమలుచేయుటలో చురుకుగా పాల్గొనే వర్గాలను సి.పి.ఐ. యిలా సూచించింది. [1]

1. సి.పి.ఐ. కార్యక్రమము (1968) 8వ, పాట్నా పార్టీ కాంగ్రెసు ఆమోదించింది. పే. 39.

కార్మికవర్గం పై కార్యక్రమాన్ని అమలుచేయుటకు ముందుపీఠీన నిలబడు తుంది. ఇప్పటికే దేశవ్యాపిత పోరాటాలలో చురుకుగా పాల్గొంటున్నది. పొలాలు దున్ని, సాగుచేసే విస్తృత రైతాంగ ప్రజాసామాన్యం, ధనిక రైతులతోసహా కలసి వస్తారు. వ్యవసాయ కూలీలు, కార్మికవర్గంవలె చురుకుగా పాల్గొంటారు. అభ్యుదయ కర వ్యవసాయ భూసంస్కరణలను చేబట్టిన, వ్యవసాయ రంగంలో వ్యవసాయ శక్తుల బంధనాలు తొలగిపోవుటతో వుత్పత్తి శక్తులు ఋనుమడించుతాయి. వ్యవ సాయంలోని శ్రమశక్తి పూర్తి వినియోగానికి వచ్చి వుత్పత్తి పెరిగిపోతుంది. గ్రామీణ ప్రజాసామాన్యం జీవన ప్రమాణం పెరుగుతుంది. నగర, గ్రామీణ ప్రాంతాలలోని విద్యావంతులైన నిరుద్యోగ మేధావులు, దారిద్ర్యంతో సతమతమగుతున్నవారు, విద్యావకాశాలు నిరాశాజనకంగా వున్నవారు దేశంలోని గుత్తేతర, జాతీయ బూర్జువా వర్గం, వాస్తవికంగా సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక విప్లవం పరిపూర్తి చేసే కర్తవ్యాలలోనే, స్వతంత్ర జాతీయ ఆర్థికాభివృద్ధిలోనే, తమ వర్గ ప్రయోజనం కూడ యిమిడివుందని గుర్తించి, ఐక్య సంఘటనలో భాగస్వామి అగుతుందని సి.పి.ఐ. అవగాహన. అదే కాలంలో యీ వర్గం దోపిడివర్గాలలో వొకటని కూడ సి.పి.ఐ. గుర్తించింది. ఈ వర్గం దేశ ఆర్థికవిధానంపై సామ్రాజ్యవాదానికి, ఫ్యూడ లిజానికి గల బలమైన స్థానాన్ని రూపుమాప ప్రయత్నిస్తూనే, దాని ద్వంద్వ నైజపు కారణంగా మరోవైపున వూగిసలాట, రాజీ సంప్రదింపులు, వొప్పందాలు చేసు కొంటూ, ప్రజావ్యతిరేక విధానాలను అమలుచేస్తూ వుంటుంది.[1]

"ఈ సందర్భంలో పెట్టుబడిదారి విధాన ఆర్థికాభివృద్ధి క్రమంలో జాతీయ బూర్జువా వర్గంలోనుండే కొన్ని గుత్తపెట్టుబడిదారి వర్గాలు వుద్భవించుట జరిగిం దని యింతకుముందే పేర్కొన్నప్పటికి, పునరుద్ఘాటించవలసియుంది. ఆ వర్గాలు కాంగ్రెసు వెలుపలవున్న అభివృద్ధి నిరోధకవర్గాలతో స్నేహ, సహకారం నెరపుతూ జాతీయ విధానాలను ప్రక్కదారి పట్టించే ప్రయత్నాలు చేయుటయేగాక, జాతీయ బూర్జువా ప్రయోజనాలకు నష్టంచేసే నిందాప్రచారం చేయసాగారు.

"అంచేత కార్యక్రమాన్ని అమలుచేయు సాధనంగా జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను నిర్మించి, అన్ని దేశభక్తవర్గాలను అనగా కార్మికులు, రైతాంగ మొత్తాన్ని ధనిక రైతుతో సహా, వ్యవసాయ కార్మికులను, మధ్యతరగతి మేధావి వర్గాలను, గుత్తేతర బూర్జువా వర్గాలను దానిలో సమీకరించవలసి వుంది. ఈ సంఘ టన కార్మిక, కర్షక ఐక్యత పునాదిగా, ఇరుసుగా వుంటుంది.

జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటన తన దాడిని మితవాద అభ్యుదయ నిరోధక శక్తులపై ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలన్నిటిపై కేంద్రీక

1. సి.పి.ఐ. కార్యక్రమము (1968)పాట్నా కాంగ్రెసు ఆమోదించినది (ఆంగ్లంలో) పే. 40.

రించి, ప్రజాసమీకరణచేసి పోరాడుతుంది.[1]

సి.పి.ఐ.(ఎం) 8వ, పార్టీ కాంగ్రెసులో 1969లో ఆమోదించిన కార్య క్రమంలో జనతా ప్రజాస్వామ్య సంఘటన తత్సంబంధ అంశాలు, కార్యక్రమము అమలుపై పార్టీ అవగాహనల తీరు చూద్దాము.

ప్రపంచ చారిత్రిక పరిస్థితులు "శక్తివంతమైన ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ త్వరితంగా అభివృద్ధి చెందుట "అదేకాలంలో" ప్రపంచ పెట్టుబడిదారి వ్యవస్థ త్వరితంగా శిథిలమవుతూ వుండటను "కార్యక్రమం గుర్తించి పేర్కొన్నది. ఈ నేపథ్యంలో అనేకం ఆర్థికంగా వెనుకబడిన దేశాలు స్వాతంత్రాన్ని పొందుటకు నూతన విస్తృత అవకాశాలు వుద్భవించి జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వాలు యేర్పడుటను గుర్తించింది. అభివృద్ధి చెందే కార్మికవర్గం క్రమేణా ప్రభుత్వంలో కార్మికవర్గ నాయకత్వాన్ని స్థాపించే పంథాలో దేశాన్ని పెట్టుబడిదారేతర అభివృద్ధి మార్గాన, పెట్టుబడిదారి విధాన దశను "దప్పదాటు"గా దాటి, సోషలిజానికి పురోగమించు అవకాశాలున్నవని కూడ గుర్తించింది. (పేరా 84).

కాని "ఈ మార్గం భారతదేశంలోని మనకు మూసివేయబడిందని" కార్యక్రమం నిర్ధారించి, అందుకు కారణాలుగా "బ్రిటిష్ పాలనలోని పెట్టుబడిదారి విధానంలో అభివృద్ధి చెందిన వలసలలో, సెమివలసలలో మన దేశం వొకటి. అని జాతీయ విముక్తి వుద్యమానికి బడా బూర్జువావర్గ నాయకత్వం వహించి 1947 లో స్వాతంత్ర్య సంపాదనానంతరం, ప్రభుత్వ అధికారాలను వినియోగించుకొని, సామ్రాజ్యవాదం బడా భూస్వామ్య వర్గాలతో బేరసారాలు, రాజీ వొప్పందాలతో, తన వర్గ శక్తులను విస్తృతంగా బలపరచుకొన్నది. ఇట్టి పరిస్థితులలో పెట్టుబడిదారేతర పంథాలో ఆర్థికాభివృద్ధి, జాతీయ ప్రజాస్వామ్యం గురించి ప్రస్తావించుట, దానిని లక్ష్యంగా పెట్టుకొనుట అవాస్తవం"[2] అగుతుందని స్పష్టం చేసింది. ఈ మౌలిక అవగాహన నేపథ్య లోనే సి.పి.ఐ.(ఎం) తన వ్యూహమైన జనతా ప్రజాస్వామ్యం, జనతా ప్రజాస్వామ్య సంఘటన, ప్రభుత్వం కార్యక్రమాలను రూపొందించింది.

ఇప్పుడు జనతా ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణ సమస్యలపైన సి.పి.ఐ. (ఎం) సైద్ధాంతిక అవగాహనలను చూద్దాము.

"భారత విప్లవ మౌలిక కర్తవ్యాలను సంపూర్తిగ, సమర్థవంతంగా నిర్వహించుటకు, ప్రస్తుత బడాబూర్జువా నాయకత్వంలోని బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వాన్ని తొలగించి, కార్మికవర్గ నాయకత్వంలో జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని

---

1. అదే పే. 42

2. సి.పి.ఐ.(ఎం) కార్యక్రమం (1972) సవరణలతో 9వ కాంగ్రెసు ఆమోదించినది. (పే. 85).

యేర్పరచవలసి వుంటుంది" [1] అప్పుడే రైతులకు, ప్రయోజనకరమైన, అభ్యుదయ కర వ్యవసాయ భూసంస్కరణలు సాధ్యమగుతవి, ప్రజల ఆహార కొరత పోయి, మార్కెట్టు విస్తరణతో పారిశ్రామిక వుత్పత్తులతో అదనపు పెట్టుబడి ప్రోగు పడుట జరిగి దేశం అభివృద్ధి చెందుతుంది.

"కార్మిక, కర్షక దృఢతర ఐక్యతయే జనతా ప్రజాస్వామ్య సంఘటన పునాది, మౌలికాంశము. ఈ ఐక్యతయే జాతీయ స్వతంత్ర రక్షణకు, సామాజిక సమగ్రాభివృద్ధి పురోగమనానికి, ప్రజాజీవితానికి ప్రజాస్వామిక సంస్కరణలు కొని తెచ్చే అత్యంత ప్రధానశక్తిగా అగుతుంది. ఈ కార్మిక, కర్షక వర్గ శక్తుల ఐక్యత, బలం, ధృఢతర స్థిరత్వంపైన జాతీయ బూర్జువా వర్గంలోని శాఖలు, పూ్యడలు, సామ్రాజ్యవాద వ్యతిరేక కర్తవ్యాల నిర్వహణలో ఎంతవరకు తమపాత్రను పూర్తి చేయగలవో ఆధారపడి వుంటుంది.

"పెట్టుబడిదారి విధానం నిర్ణయాత్మక అభివృద్ధిని సాధించుటతో రైతాంగంలో నిర్దిష్ట విభజన జరిగింది. రైతాంగంలోని వివిధ వర్గాలు విప్లవంలో వివిధ పాత్రలు వహించుతవి. వ్యవసాయ కూలీలు, పేదరైతులు, గ్రామీణులలో 70 శాతంగా వున్నారు. భూస్వాములచే గరిష్ట దోపిడికి గురిఅగుతున్నారు. సహజంగానే వారు కార్మికవర్గానికి మౌలికమిత్రులు. అధికవడ్డీలకు గురిఅగుతూ మధ్యతరగతి రైతాంగం ధనిక, పూ్యడలు భూస్వాములచే అనేక రకాలుగా దోపిడి చేయబడుతున్నారు.

"రైతాంగంలో ధనిక రైతులు ప్రాపకం, పలుకుబడి కలిగిన బలమయిన వర్గం. ఈ వర్గంలోని కొన్ని తరగతులవారు, కాంగ్రెసు వ్యవసాయ భూసంస్కరణ లతో గ్రామసీమలలో బలమయిన శక్తిగా అభివృద్ధి చెంది, పాలక బడా బూర్జువా, బడా భూస్వామ్యవర్గాల ప్రభుత్వాలకు కుడిభుజంగా వున్నారు అయినా పూ్యడలు వ్యవసాయ బంధనాలను పూర్తిగా రూపుమాపుటకు వారిని సంఘటనలో సమీకరణకు అవకాశాలు ఎక్కువగానే వున్నాయి. అంతేగాక సామ్రాజ్యవాదం, వారి మిత్రులైన బడా బూర్జువావర్గాలు మార్కెట్టులను-పారిశ్రామిక వ్యవసాయ ఉత్పత్తుల మార్కెట్ లను తమ గుప్పిటలో పెట్టుకొని, ధరల నిర్ణయంలో వనరులు, ఎరువుల ధరల నిర్ణ యంలో రైతులను రెండువైపులా దోచి వేస్తున్నారు, వారి జీవనం దుర్భరం చేస్తు న్నారు. [2]

నగరాలలోని బడుగువర్గాలు, నిరుద్యోగులు, ఉద్యోగులు, ఇతర మధ్యతర గతి చేతివృత్తులవారు, నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోవుటతో

---

1. అదే పేరా. 93
2. సి.పి.ఐ.(యం) కార్యక్రమం (1972)9వకాంగ్రెసు ఆమోదించింది (ఆంగ్లంలో) పే. 44-45.

జీవితం దుర్భరబాధలు పడుతున్నారు. ఈ వర్గమంతా యిప్పటికీ వేతనాల పెంపుకై అనేక పోరాటాలు సాగించారు. ఐక్య సంఘటనలో చురుకయిన పాత్ర వహించుతారు.

నూతనంగా స్వాతంత్ర్యం సంపాదించిన, వెనుకబడిన, అభివృద్ధి చెందని భారత బూర్జువావర్గం మొత్తంగా సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజాలతో ఘర్షణ, వైరుధ్యం కలిగియున్నది. సెమీ ఫ్యూడలిజంలోకూడ వైరుధ్యం కలిగి వుంది. స్వాతంత్ర్యానంతరం బడాబూర్జువా గుత్తపెట్టుబడిదారివర్గాలు, ప్రభుత్వం, రాజ్యాంగము, వారి అధికాంతో వుండుటతో సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజంలకు ప్రజలకుగల వైరుధ్యాలను, ఘర్షణలను రాజీలు వొప్పందాలతో కొంతవరకు పరిష్కరించుకొన్నారు. ఈ క్రమంలోనే విదేశీపెట్టుబడులతో సంయుక్త సంస్థలు, చట్టవ్యతిరేక బడా భూస్వామ్య విధానాన్ని సంస్కరణలతో, రాజీలుపడి పరోక్షంగా వారినే బలపరచారు.

ఈ సంప్రదింపులు, రాజీ వొప్పందాల క్రమంలో విదేశీ గుత్తపెట్టుబడిదారి వర్గాలతో బలమయిన పొత్తు సంబంధాలను అభివృద్ధి చేసుకొంటున్నవి. అధికారాన్ని భూస్వామ్య వర్గాలతో భాగస్వామ్యాన్ని పెంపొందించుకొంటున్నవి. ఈ వర్గాలు ప్రపంచ సోషలిస్టు వ్యవస్థచేసే సహాయాన్ని "లావాదేవీలలో" బేరసారాల వొత్తిడిలకు వినియోగించుకొంటున్నవి. మరోవైపున ప్రజావ్యతిరేక చర్యలకు వినియోగించుకొంటున్నవి. ఈ వర్గాలు కమ్యూనిస్టు వ్యతిరేకులేగాక ప్రజా వ్యతిరేకులు, జనతా ప్రజాస్వామ్య సంఘటన, దాని విప్లవధ్యేయానికి వ్యతిరేకులు. (పేరా 105).

జాతీయ బూర్జువావర్గం గణనీయమయిన పెద్ద విస్తృతిగల వర్గము. విదేశ గుత్తపెట్టుబడిదారి వర్గాలతో ఎట్టి పొత్తులేకుండా లేక వున్నా దీర్ఘకాల పొత్తులు లేకుండా వుంది. పైగా అది సహజంగా గుత్తపెట్టుబడిదారి వర్గంకాదు. పైగా అది అనేక విధాలుగా గుత్తపెట్టుబడిదారివర్గాల దోపిడికి గురవుతున్నది. అంచేత అది బడా బూర్జువావర్గంతో. వైరుధ్యం కలిగివుండి సంఘర్షణల పడుతున్నది. ముఖ్యంగా సామ్రాజ్యవాద, ఫ్యూడల్ వ్యతిరేకతల విషయంలోనే ప్రధానంగా యీ ఘర్షణలను చూడగలము. ప్రపంచ పెట్టుబడిదారి సంక్షోభం తీవ్రమయినకొలదీ, విదేశ గుత్త పెట్టుబడివర్గాలలో సంఘర్షణలు వైరుధ్యాలు పెరిగినకొలది, బడాబూర్జువా వర్గం తన చేతిలోని రాజ్యాంగ ప్రభుత్వాధికారాన్ని, సంక్షోభ భారాన్ని బలహీనపెట్టుబడి వర్గాలపై, ప్రజలపైనెట్టి, తాను గట్టెక్క ప్రయత్నిస్తుంది. ఈ బూర్జువావర్గ జాతీయ శ్రేణులు ప్రత్యర్థి వర్గాలవేపుకు నెట్టివేయబడతాయి, అవి బయటపడతవి. అధికార ప్రభుత్వ బడా బూర్జువా వర్గాలకు వ్యతిరేకంగా బయటకు వస్తవి. వాటికి ఐక్యసంఘటనలో సముచిత స్థానముంటుంది. ఏమయినా యింతవరకు ప్రభుత్వ అధికారాన్ని

బడాబూర్జువావర్గం జాతీయ బూర్జువావర్గాన్ని భాగస్వాములుగ చేసుకొని లేక దాని పేరుతో తానే పరిపాలించుతున్నది. భారత బడా బూర్జువావర్గంతో గుత్తపెట్టుబడి దారి వర్గంతో విదేశ సామ్రాజ్య వర్గాలతో పోల్చి చూస్తే చాలా బలహీనమయినం దున సామ్రాజ్యవాదం- భారత బడా బూర్జువావర్గ పోటీలో తీవ్ర వూగిసలాటలకు లోనగుతూ వుంటుంది. ఒక వైపున భారత బడా బూర్జువా వర్గం మరోవైపున జనతా ప్రజాస్వామ్య సంఘటన మధ్య అదే విధంగా వూగిసలాటకు లోనగుతూ వుంటుంది. దాని ద్వంద్వ స్వభావ కారణంగా, వర్గ శక్తుల బలాబలాలపై, సామ్రాజ్యవాద, ఫ్యూడలిజం-ప్రజలమధ్య గల వైరుధ్యాల అఘాతాల లోతులపై ముఖ్యంగా బడా బూర్జువా వర్గ నాయకత్వంలోని బూర్జువా భూస్వామ్య వర్గాల - జాతీయ బూర్జువా వర్గాల మధ్యగల వైరుధ్యాల తీవ్రతలాంటి నిర్దిష్ట పరిస్థితులనుబట్టి జాతీయ బూర్జువావర్గం విప్లవంలో పాల్గొనుట ఆధారపడి వుంటుంది.[1] (పేరా 106 స్వేచ్ఛా, భావానువాదం)

ముగింపుగా పాలక వర్గాలు తమ అధికారాన్ని స్వచ్ఛందంగా వదలుకొన జాలవు అనే నగ్నసత్యాన్ని పోరాడే శక్తులు మరచిపోజాలవు.

ఇప్పుడు సి.పి.ఐ. (యం.యల్)కు ప్రజాస్వామ్య విప్లవాన్ని ప్రజాసంఘటన ద్వారా ఎలా సాధించ నెంచిందో చూద్దాము. సి.పి.ఐ. (యం.) వలెనే "నూతన నమూనా ప్రజాస్వామ్య విప్లవం," "(న్యూటైపు ఆఫ్ డెమోక్రటిక్ రివల్యూషన్) "జనతా ప్రజాస్వామ్య విప్లవాన్ని, ప్రపంచ సోషలిస్టు విప్లవంలో భాగంగా" స్పష్టం చేసింది. "ప్రజాస్వామ్య విప్లవాన్ని చివరికంటా తీసుకొని వెళ్ళుటకు ప్రజాస్వామ్య సంఘటన" తప్పనిసరియని అంటున్నది. ఈ సంఘటన అన్ని వర్గాల సంఘటన యని, కార్మికవర్గం నాయకత్వాం వహించుతుందని స్పష్టం చేసింది.

"ప్రజాస్వామ్య విప్లవంలో కార్మికవర్గ నాయకత్వంలోని రైతాంగం ప్రధాన శక్తిగా" పేర్కొని; కార్మికవర్గం భూమిలేని పేదరైతాంగంపై పూర్తిగా ఆధారపడి, మధ్యతరగతి రైతాంగంతో ఐక్యమై, ధనిక రైతాంగంలో కొంత భాగాన్నైనా కలుపుకొని, మిగిలిన వారిని తటస్థులను చేస్తుంది. రైతాంగంలో చాలాకొద్ది భాగం మాత్రమే విప్లవ విరోధులతో కలుస్తారు. నగర పెటీ బూర్జువా వర్గాలు, విప్లవ మేధావి వర్గాలు వగైరాలే విప్లవ శక్తులు, నమ్మకమైన మిత్రులు."[2]

---

1. సి.పి.ఐ.(యం.) కార్యక్రమము (1968) 9వ, పార్టీ కాంగ్రెసు ఆమోదించినది. పే. 40.

2. సి.పి.ఐ.(యం.యల్) కార్యక్రమం (1990) మే 1990లో పార్టీ కాంగ్రెసు ఆమోదించింది. నక్సల్బరీ అండ్ ఆఫ్టర్. వా II. పే 281-2.

"చిన్న, మధ్యతరగతి బూర్జువా వర్గాలు, వ్యాపారులు, బూర్జువా మేధావి వర్గాలు, వూగిసలాడుతుంటవి కాన స్థిరమైన మిత్రులు కారు. ఒకప్పుడు బలపరుస్తారు, మరొకప్పుడు వ్యతిరేకించుతారు. విప్లవ శతృవులతో వైరుధ్యం, ఐక్యత-సహకారం రెండూ కలిగియుండుటయే వారి ద్వంద్వ నైజపు ధోరణికి కారణము.

అవే కాలంలో "సాయుధ పోరాట క్రమంలో రాజ్యాధికారం సంపాదించి ఏర్పాటు చేసిన తరువాత, (కార్మిక, కర్షక ఐక్యత ఏర్పడిన తరువాత) యీ ఐక్య సంఘటన ఏర్పడుతుంది. ఈ అంశాన్నే చౌయెన్‌లై, సౌరిన్‌బోస్‌తో సంభాషణలో వివరించాడు.

"కార్మికవర్గం, దాని రాజకీయ పార్టీయైన కమ్యూనిస్టుపార్టీ ద్వారా జనతా ప్రజాస్వామ్య విప్లవానికి నాయకత్వం వహించుతుంది.

అంతేగాక "భారత విప్లవ పంథా ప్రజా విప్లవ పంథా" మావో చెప్పినట్లు "విప్లవ యుద్ధం, ప్రజా యుద్ధం, ప్రజా సమీకరణ ద్వారానే ప్రజాయుద్ధాన్ని సాగించగలము. వారిపై ఆధారపడే చేయగలము ఇంకా లిన్‌పియవో చెప్పినట్లు "గెరిల్లా యుద్ధ మొక్కటే, ప్రజలను సమీకరించగలదు, శతృవులకు వ్యతిరేకంగా ప్రజాశక్తిసంతటిని వినియోగించగలదు.[1]"అని యం. యల్. వర్గాల అభిప్రాయం.

"గెరిల్లా పోరాటాల ద్వారానే ప్రజాసమీకరణ జరుగుతుందని" ఆ విధంగా "అధికారాన్ని చేజిక్కించుకొన్న తరువాతే జనతా ప్రజాస్వామ్య సంఘటన ఏర్పడు తుందని," "సాయుధ గెరిల్లా యుద్ధ పోరాట మొక్కటే ఏకైక విప్లవ మార్గమని చెప్పుట[2]" నిస్సందేహంగా సెక్టేరియన్ అతివాద అవకాశవాదము తప్ప మరొకటి కాదు.

**కమ్యూనిస్టులు : ఐక్య సంఘటనల కార్యక్రమాలు :**

సి.పి.ఐ., సి.పి.ఐ.(యం), సి.పి.ఐ.(యం.యల్.)లు చేబట్టిన ఐక్యసంఘటనల దృక్పథాలలో వాటి లక్ష్యాలు, నిర్మాణం, అందులో పాల్గొనే వివిధ వర్గాలు, నాయకత్వ పాత్రల విషయమై యింతకుముందే తెలుసుకొన్నాము. ఇప్పుడు మూడు కమ్యూనిస్టు శ్రేణులు వారి వారి దృక్పథాలలో ఐక్యసంఘటనలు చేబట్టవలసిన కార్యక్రమాలు, వాటి సారూప్యతలు, భిన్నత్వాలు పరిశీలించి తెలుసుకొందాము.

సి.పి.ఐ. ఫిబ్రవరి 1968లో పాట్నాలో జరిగిన 8వ, పార్టీ కాంగ్రెసు సవరణలతో ఆమోదించిన కార్యక్రమము, సి.పి.ఐ.(యం.) 1964 లో ఏర్పడిన తరువాత, 1969లో జరిగిన కలకత్తా కాంగ్రెసులో మొట్టమొదట కార్యక్రమాన్ని ఆమోదించింది. కాని తిరిగి 1972 లో జరిగిన 9వ, పార్టీ కాంగ్రెసులో కార్యక్రమానికి కొన్ని సవరణలు ఆమోదించింది. ఇక, సి.పి.ఐ. (యం.యల్.) కలకత్తాలో 1970 మేలో

---

1, 2. అదే పే. 283, 4.

జరిగిన మొదటి కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమాన్ని ఆమోదించింది. ప్రస్తుత ఈ అధ్యయనం, యీ మూడు కార్యక్రమాలలో, ఐక్యసంఘటనలు, ప్రతిపాదించబడిన ఐక్యసంఘటనా కార్యక్రమాలు లేక ఐక్యసంఘటనా ప్రభుత్వాలు ఏర్పడిన అవి చేబట్టవలసిన కార్యక్రమాల పరిధిలను తెలుసుకొందాము. ఈ కార్యక్రమాలు విప్లవదశ కాలమంతటికి వుద్దేశించబడినందున, వాటి దీర్ఘకాల నైజము అందరికీ తెలిసినదే. వీటికి అనుబంధంగా పార్టీ కాంగ్రెసులు, కన్వెన్షనలు, కాన్ఫరెన్సులలో ఆమోదించబడే తక్షణ కార్యక్రమాలను ఆయా సందర్భాలలోనే అధ్యయనం చేద్దాం. అందువలన యీ కార్యక్రమాల ప్రస్తావన, అధ్యయనం వాక దశకంతటికి సంబంధించిన తాజా కార్యక్రమాలను ఉద్దేశించినదని స్పష్టం చేయుట అవసరము. వీటిని కమ్యూనిస్టు మూడు శ్రేణుల ఆమోదం పొందిన కార్యక్రమాలను, సైద్ధాంతికంగా ఆమోదించబడిన "వ్యూహాత్మక ఉమ్మడి కార్యక్రమాలు" "పరస్పర విరుద్ధ కార్యక్రమాలు," "ఎత్తుగడలలో విభేదించే కార్యక్రమాలు"గా అధ్యయనం చేయ ప్రయత్నించుదాము.

అంతర్జాతీయ రాజకీయ విధానాలు, విదేశాంగ విధానాల అంశాలను చూద్దాము. మూడు కమ్యూనిస్టు శ్రేణులకు ఆమోదయోగ్యమైన సైద్ధాంతిక వుమ్మడి అంశాలను ప్రథమంగా చూద్దాము.

భారత ప్రభుత్వం స్వతంత్ర విదేశాంగ విధానాన్ని, వలస వ్యతిరేక విధానాన్ని, శాంతి, అలీన విధానాన్ని చేబట్టాలని సి.పి.ఐ. కార్యక్రమంగా వుంది. సి.పి.ఐ.(యం) కార్యక్రమం ఈ అంశాలనే పునరుద్ఘాటించినా, అలీన విధానాన్ని "తుచ" తప్పక ఆచరించక, ప్రపంచంలోని రెండు శిబిరాల మధ్య "దోబూచిలాడు"తున్నదని, శాంతి, సామ్రాజ్యవాద వ్యతిరేక విధానాలను దృఢతరముగా ఆచరించాలని అంటున్నది. "భారత బూర్జువావర్గం తన అభివృద్ధి కొరకు ప్రపంచ శాంతిని వాంఛించుతున్నది. అందుకు ప్రపంచ శాంతిని కోరుతూ, ప్రపంచ యుద్ధాన్ని వ్యతిరేకించుచున్నద"ని సి.పి.ఐ.(యం) స్పష్టం చేసింది. ప్రపంచంలో అత్యంత బలీయమైన అమెరికన్ సామ్రాజ్యవాదం ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా ప్రజల రక్తమాంసాలను పీల్చివేస్తున్నది, తన ఆధిపత్యంలోనికి తెచ్చుకొన ప్రయత్నిస్తున్నది. ప్రపంచ పెట్టుబడిదారి విధాన దోపిడి రక్షణకు, అదే నాయకత్వం వహిస్తున్న పాత్ర విషయంలో మూడు శ్రేణుల కమ్యూనిస్టులు యేకాభిప్రాయాన్ని కలిగియున్నారు. అమెరికా "సహాయం" అన్న పేరుతో తన ఆధిక్యతను పెత్తందారితనాన్ని, బడుగు దేశాలలో విస్తరింపజేసుకొంటున్నదని కూడా యేకాభిప్రాయాన్ని కలిగియున్నారు.

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ విషయమై సి.పి.ఐ., సి.పి.ఐ.(యం) దగ్గరి దగ్గరిగా వొకే విధమైన అవగాహన కలిగియున్నారు. సోషలిస్టు దేశాలు ప్రపంచ సోషలిస్టు వ్యవస్థకు నాయకత్వం వహించుతున్న సోవియట్ యూనియన్ నూతన స్వతంత్ర, అలీన దేశాలు తమ స్వాతంత్ర్యాలను బలపరచుకొనుటకు, ఆర్థిక స్వాతం

త్త్యానికి మార్గమైన పారిశ్రామికాభివృద్ధిని సాధించుటకు అవసరమైన విదేశ పెట్టు బడి, సాంకేతిక పరిజ్ఞానాన్ని, వాస్తవికంగా అవసరమైన పరిశ్రమల స్థాపనకు, వాటి విస్తరణలకు తోడ్పడుతున్నదనే అనగాహననే కలిగి వున్నవి. ఇక్కడ గల వొక ప్రధాన భేదాన్ని పేర్కొనవలసి వుంది. సోషలిస్టు దేశాలుచేసే సహాయం, పెట్టుబడి దారి విధానంలో అభివృద్ధిని కొనసాగించే నూతన స్వతంత్ర దేశాలకు యిచ్చిన, పెట్టు బడిదారి విధానాన్ని బలపరచినట్లు అగుతుంది కాని, ఆయా దేశాలలోని కమ్యూనిస్టు లను, ప్రజలను బలపరచినట్లు కాదని, అంచేత సోవియట్ యూనియన్, దాని నాయకత్వంలోని దేశాలు, సోషలిస్టు పంథాలో పురోగమిస్తున్న దేశాలకు అధిక సహాయాన్ని చేయాలని సి.పి.ఐ.(యం) విమర్శన కూడ మొదట్లో సాగింది. అంత ర్జాతీయ రాజకీయాలలో భారతదేశ రాజకీయాలలో చైనా-భారత సరిహద్దు యుద్ధం, తదనంతర కాలంలో చైనా నక్సలైట్లను బలపరుస్తూ సి పి.ఐ.(యం)ను నియో రివజ నిస్టులుగా చిత్రించి, తెగనాడుటతో సి.పి.ఐ.(యం) వైఖరి, అవగాహలలో మార్పు రాసాగింది. సి,పి.ఐ. (యం. యల్) సోవియట్ యూనియన్‌పై సి.పి.ఐ.(యం) చేసిన విమర్శనంతా పునరుద్ఘాటించుతూ, ప్రత్యేకంగా చైనాకు ఆ సహాయం చేయాలి గాని, పెట్టుబడిదారి విధానాన్ని పెంపొందించుతున్న నూతన స్వతంత్ర దేశాలలో బూర్జువా వర్గాలకు కాదని, అదనంగా విమర్శన చేసింది. అంతేకాక, సి. పి. ఐ. (యం.యల్) సోవియట్ యూనియన్‌ను సోషలిస్టు దేశంగా గుర్తించకపోగా, సోషల్ సామ్రాజ్యవాదంగా చిత్రించుతూ, చైనా నినాదాలను పునశ్చరణ చేయ సాగింది.

భారతదేశం అంతర్జాతీయ, విదేశాంగ వ్యవహారాలలో "ప్రపంచ శాంతి, సహ జీవనం, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో సముచిత పాత్ర వహించుటకు జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం మాత్రమే వాటిని దృఢతరం చేయగలదని"సి.పి.ఐ. (యం) కార్యక్రమం పేర్కొనగా, "జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వం, "భారత దేశ స్వతంత్ర విదేశాంగ విధానమైన శాంతి, అలీన, వలస వ్యతిరేక విధానాలను బలహీనపరచే అన్ని చర్యలను వమ్ము చేస్తుందని"పేర్కొన్నది. అంతేకాక, ప్రపంచ శాంతికాముక దేశాల వుద్యమాన్ని, సంపూర్ణ ప్రపంచ నిరాయుధీకరణ, అణు ఆయుధాల నిషేధం,విదేశ సైనిక కేంద్రాల,స్థావరాల నిర్మూలనను బలపరుస్తున్నది. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా మైత్రీ, సహకార, సౌభ్రాతృత్వాలను, అలీన విధానాలను పెంపొందిస్తుందని కూడ పేర్కొంది. భారతదేశం బ్రిటిష్ కామన్‌వెల్తు నుండి వైదొలగాలని, భారత-పాకిస్తాన్, భారత-చైనా, తతితర నేపాల్, బర్మా, సింహళ సమస్యలను శాంతి, సంప్రదింపులు, వొప్పందాలద్వారా పరిష్కరించు కొనాలని కార్యక్రమం స్పష్టం చేసింది. ఈ విషయాలలో సి.పి.ఐ.(యం) యిదే వైఖరిని అవలంబించింది. సోషలిస్టు దేశాలతో సన్నిహిత సంబంధాలను రెండు

పార్టీలు వాంఛించుతున్నవి. అయితే, సోవియట్ తదితర సోషలిస్టు దేశాలు సి.పి.ఐ. యెడల స్నేహభావంతో, తమ యెడల పక్షపాత వైఖరితో వ్యవహరించుతున్నవని సి.పి.ఐ.(యం) స్పష్టంచేసి యున్నది. సి.పి.ఐ.(ఎం.ఎల్), ప్రపంచ మంతటా సామ్రాజ్యవాదం బలహీన పడుటతో, భారతదేశ పాలక వర్గాలు తమ సేవలను అమెరికా సామ్రాజ్యవాదానికి, సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదానికి కుదువ బెట్టాయి అనే అవగాహనతో, వాటి పూర్తి వ్యతిరేక విధానాన్ని చేబట్టారు. అమెరికన్ సామ్రాజ్యవాద వ్యతిరేకతకు సంబంధించినంతవరకు మూడు కమ్యూనిస్టు పార్టీలు వొకే వైఖరిని కలిగి వున్నాయి. సోవియట్ యూనియన్, యూరప్ సోషలిస్టు దేశాల ఎడతెగని మైత్రీ, సహకార సంబంధాలను సి.పి.ఐ. కలిగి వుండగా, సి.పి.ఐ.(ఎం) 1960 దశకంలో కొంతకాలం చైనా ప్రభావంలో వున్నపుడు, యీ సంబంధాలు కొంవ మనస్తాపాలకు గురి అయ్యాయి. ఇక సి.పి.ఐ. (ఎం.ఎల్) అమెరికా, సోవియట్ యూనియన్‌లు రెండూ మైత్రి నెరపుతున్న రెండు సామ్రాజ్యవాద దేశాలని, ప్రపంచాన్ని తమ మధ్య విభజించుకొనే ప్రయత్నం చేస్తున్నవని, వొకటి గుత్త పెట్టుబడి సామ్రాజ్యవాదం, మరొకటి సోషల్ సామ్రాజ్యవాదంగా నిర్వచించి, తదనుగుణంగానే, రాజకీయ, ఎత్తుగడల వైఖరులను చేబట్టాయి.

రాజ్యాంగ యంత్ర నిర్మాణ విషయంగా, సి.పి.ఐ., జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వం, జాతీయ స్వాతంత్ర్యాన్ని దేశ ప్రాంత సమగ్రతి. ప్రజా సార్వభౌమాధికారాన్ని బలవత్తరపరచే చర్యలను చేపట్టాలి. ప్రభుత్వపు సెక్యులర్ - మతాతీత నైజాన్ని బలోపేతం చేయుటకు అన్ని చర్యలు తీసుకొని భారత జాతీయ ఐక్యత, జాతీయ రాజకీయ జీవితాన్ని సుస్థిరం చేయనెంచింది. అదే విషయమై సి.పి.ఐ(ఎం) జనతా ప్రజాస్వామ్య యంత్రాంగం, ప్రభుత్వం ప్రజల సృజనాశక్తిని వెల్లువగా పైకితెచ్చి ప్రధాన ప్రజాస్వామ్య కర్తవ్యాలను, సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక నూతన సంస్కృతిని, ప్రజాస్వామ్యంలో విస్తరింప చేస్తుంది. అంతేగాక, ప్రతి జాతి, ఉప జాతులు, ఆటవిక తెగలు వారి స్వయం కృషితో అభివృద్ధి చెందుటకు, ప్రజాస్వామ్య ప్రజలు తమ జీవన విధానాలు అభివృద్ధి చేసుకొనుటకు, కుల, మత విద్వేషాలను విడనాడుటకు, ప్రజలలో సోదర, సౌభ్రాతృత్వ సమాన భావాలు వ్యాప్తి చెందుటకు తోడ్పడుతుంది. జాతి, మత, కుల విద్వేషాలు రూపుమాపుటకు కృషి చేస్తుందనే వైఖరి చేబట్టింది.

ప్రజాస్వామాన్ని బలోపేతం చేసి, అభివృద్ధిచేయు విషయమై వివిధ కమ్యూనిస్టు శ్రేణుల అభిప్రాయాలు ఎలా వున్నవో చూద్దాం.

జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వం, నేటి బురాక్రటిక్ విధానాలకు స్వస్తిచెప్పి, పరిపాలనను, ఉద్యోగవర్గాలను, అన్ని స్థాయిలలో ప్రజలచే ఎన్నికైన వారి ప్రతినిధులకు పరిపాలకులకు బాధ్యులను చేస్తుంది. రాజ్యాంగంలో నిర్దేశించిన ఆదేశసూత్రా

లను అమలు చేయుటకు నిర్దిష్ట చర్యలు, పనిచేయుహక్కు, జీవనస్థాయి వేతనం విద్య, సామాజికరక్షణ చేబడుతుంది. వ్యక్తి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను, సభా, పత్రికా, సమావేశ, నిర్మాణ, సమ్మె, ఉద్యమ స్వాతంత్ర్యాలను, వృత్తి స్వేచ్ఛను అందరికీ గ్యారంటీ చేస్తుంది. మత, కుల, ఆడ, మగ, జాతి, తెగ భేదాలు లేకుండా అందరికీ సమానహక్కులు, ఆడ, మగ భేదం లేకుండా సమానంగా పనిచేసినవారికి సమానజీతం ధృవీకరిస్తుంది. సామాజిక అసమానతలచే బాధలకు గురవుతున్న ఆడ-మగ తేడాలను రద్దుచేస్తుంది. తల్లి, పిల్లలసంక్షేమ చర్యలు చేబడుతుంది. సామాజిక ఆర్థిక దోపిడి ఒక కులము మరో కులాన్ని చేసే దోపిడిని రద్దుచేస్తుంది. అగ్రవర్ణ కులాలు షెడ్యూల్డు కులాలపై సాగించే మత, సాంప్రదాయాల పేరుతో సాగించే సామాజిక దోపిడి, వివక్షత నిషేధాలు రద్దుచేసి, వారికి ఆర్థిక సౌకర్యాలను కలుగ చేస్తుంది. మన సెక్యులర్ ప్రభుత్వ నైజం బలపడుటకు, ప్రభుత్వ పరిపాలనాది విష యాలలో మత సంబంధ సంస్థలకు యెట్టి ప్రమేయం వుండరాదు. అన్ని ఎన్నికలు రహస్య వోటింగులపై జరగాలి. దామాషా నిష్పత్తులలో ఎన్నికల విజయాలు నిర్ణ యించబడాలి. ప్రభుత్వ ఉత్సవాలలో మత సంబంధ పూజలు, మంత్ర, తంత్రాలు జరుగరాదు. పార్లమెంటు, అసెంబ్లీలలో వాటిపై మరొక వ్యవస్థ వుండరాదు. ఎన్ని కయిన సంస్థలకు తగినన్ని అధికారాలు వుండాలి. వాటికి వనరులు పెంచాలి. న్యాయవ్యవస్థ స్వతంత్రతను కాపాడాలంటే పరిపాలనా శాఖలనుండి విడగొట్టాలి. వారి ప్రమేయముండరాదు. న్యాయవ్యవస్థ సాధారణమైనదిగా, విపరీతఖర్చులకు గురి అయినదిగా వుండరాదు. న్యాయవ్యవస్థ న్యాయాన్ని సత్వరం కలుగజేసేదిగా వుండాలిగాని, వారు చనిపోయిన తరువాతే విచారణ జరిగేదిగా ఉండరాదు. పేద లకు న్యాయవ్యవస్థ ఉచితంగా న్యాయాన్ని లభించునట్లు చేయాలి. ఈ అంశాలు సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లు వివిధ సందర్భాలలో తమ తమ కార్యక్రమాలలో పేర్కొన్నవే. అంతేగాక వీటిలో ప్రజాస్వామ్య వాదులెవరూ వ్యతిరేకించే అంశాలు ఏమీ లేవు.

పారిశ్రామిక, వ్యాపారరంగాలలో సి.పి.ఐ. అవగాహనలు యిలా ఉన్నవి. జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వం, విదేశీపెట్టుబడి ప్రవేశాన్ని నిరోధించే సమర్థవంత మయిన చర్యలు తీసుకొంటుంది. అదేకాలంలో ప్రస్తుతం వున్న విదేశీ పెట్టుబడిని, తగినచర్యలు తీసుకొని పూర్తిగరద్దు చేస్తుంది. భారత గుత్తపెట్టుబడిదారీ వర్గాల ప్రజా వ్యతిరేకచర్యలకు స్వస్తి చెప్పుటకు, వారి గుత్తపెట్టుబడిని బ్రద్దలుచేసే చర్యలతీసు కొంటుంది. వారి పెట్టుబడులకు, అధికారాలకు పరిమితులు విధించుతుంది. దేశం లోని బ్యాంకులను జాతీయంచేసి, అప్పులు ద్రవ్యవ్యవస్థలలో మార్పులుతెస్తుంది. విని మయ వస్తువుల ఉత్పత్తుల ధరలను నిర్ణయించి కంట్రోలుచేస్తూ, లాభాలపై పరిమి తులు విధించుతుంది. ప్రభుత్వరంగంలో పరిశ్రమలను గణనీయంగా విస్తరింపజేసి నూతనంగా అనేక పరిశ్రమలను స్థాపించుతుంది. ఆ విధంగా ప్రభుత్వరంగాన్ని

ప్రధానరంగంగా చేస్తుంది ప్రభుత్వచర్యలు యాజమాన్యపు తప్పుడు విధానాలను, లంచగొండితనం, వారి అధికలాభాలను అదుపులో పెట్టుటలో విఫలమయిన పరిశ్రమలను ప్రభుత్వం స్వాధీనం చేసుకొని నడుపుతుంది. యాజమాన్యాన్ని ప్రజాస్వామికీకరణచేసి, అసమర్థులను బురాక్రాట్లను తొలగించి వేస్తుంది. వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమలను పెడుతుంది. చేతి పరిశ్రమలను పెంపొందించి, వాటికి చౌకగా ముడిసరుకులు సప్లయిచేసి వారి ఉత్పత్తులకు మార్కెటింగు సౌకర్యాలు కలుగజేస్తుంది. నేటి పన్నుల చట్టాలను రద్దుచేసి భారం మోయగలిగిన వర్గాలపై అధికభారాన్ని మోపి, మోయలేని వర్గాలపై వృద్ధి క్రమానుసార పన్నులవిధానాన్ని ప్రవేశ పెడుతుంది. లాభాలు, ఆదాయాలపై గరిష్ట పరిమితి నిర్ణయిస్తుంది. ప్రజల నిత్యావసరాలయిన ఆహారపదార్థాలు, గుడ్డలు, నూనెలు వగయిరాలు సరసమయిన ధరలకు అందరికీ అందించుట ప్రభుత్వ వ్యాపార సంస్థలద్వారా జరిపించాలి. అనుబంధంగా సహకారోద్యమాన్ని విస్తరించి బలపరచాలి. వామపక్షాల సాధారణ ఆమోదం పొందిన అంశాలపై వ్యతిరేక అభిప్రాయాలకు తావులేదు. ఈ కార్యక్రమాల అమలుపై కొద్దితేడాలువున్నా మౌలికభేదాలు లేవు.

కార్మికులు మధ్యతరగతి వుద్యోగుల హక్కులను కాపాడుట ప్రభుత్వం చేబట్టుతుంది. జాతీయ కనీస వేతనం, త్రైపక్ష కన్వెన్షన్ సిఫార్సుల ప్రాతిపదికపై నిర్ణయించి, అమలుచేస్తుంది. కరువు బత్తెము, బోనస్, గ్రాట్యుటీ, జీతముతో శలవులు నిర్ణయిస్తుంది. క్రమేణా పనిగంటలు తగ్గించ ప్రయత్నిస్తుంది. సామాజిక సంక్షేమానికి, నిరుద్యోగభృతి, అనారోగ్యభృతి, వృద్ధాప్య భృతులను, చవకగా అద్దెకు నివాసాలను ఏర్పాటుచేసు ప్రయత్నాలు చేస్తుంది. కార్మిక సంఘాలను వాటి ప్రజాస్వామిక హక్కులను గుర్తించి, రహస్య వోటింగుపై వారి సంఘాలకు అధికార గుర్తింపునిచ్చి, సమిష్టి సంప్రదింపులు, సమ్మెలను గుర్తిస్తుంది. యాజమాన్యంలో కూడ కార్మికులకు పాత్రనిస్తుంది. కార్మికుల వుత్పత్తిశక్తిని పెంచుటకు వారిలో చొరవను, నూతన విధానాలను వారు కనుగొనే అవకాశాన్నిచ్చి, పనిలోడు విషయమై ఆలోచించి, తగుచర్యలు తీసుకొంటుంది.

వ్యవసాయ ఆర్థిక విధానాన్ని పునర్నిర్మించుటకు సమర్థవంతమైన యీ క్రింది చర్యలు చేబట్టుతుంది. రైతాంగ సమస్యలను పరిష్కరిస్తుంది. వ్యవసాయంలో భూముల కేంద్రీకరణను, అన్నిరకాల భూస్వామ్య విధానాలను గరిష్ట భూముల పరిమితిని సమర్థవంతంగా అమలుచేయుట ద్వారా రద్దుచేస్తుంది. మిగులు భూములను వ్యవసాయ కూలీ కు, పేదరైతులకు పంచివేస్తుంది. చిన్నరైతుల ప్రయోజనాలు కాపాడబడుతవి. గ్రామంలోని సమిష్టి ప్రయోజనాలకు వుద్దేశించబడిన భూములు మినహా అన్ని బంజరుభూములను పైవిధంగా పంచివేస్తుంది. బంజరుభూములను సాగులోనికి తెచ్చుటకు అవసరమైన అప్పులను ప్రభుత్వంయిచ్చి సహాయంచేస్తుంది. అన్ని భూసంస్కరణ చట్టాలు, ప్రజాకమిటీలద్వారా అమలుచేయ

బడతవి. ఆర్థిక సాంకేతిక సహాయం చేస్తుంది. వ్యవసాయభూముల సంస్కరణ వలన భూస్వాములకు యింకా యివ్వవలసిన నష్టపరిహారం యిచ్చుట ఆపివేయబడుతుంది. అదేవిధంగా భూస్వాములకు యివ్వవలసిన అప్పులు రద్దు చేయబడతవి. భూమిశిస్తు రద్దుచేసి, ఆదాయాన్నిబట్టి, పన్ను విధించే విధానం ప్రవేశపెట్టబడుతుంది. వ్యవసాయ వుత్పత్తులను పెంచుటకు అన్ని సౌకర్యములు కలుగజేయబడుతవి వ్యవసాయరంగంలో అన్నివిధములైన సహకార సంఘాలు ప్రోత్సహించబడుతవి. గిట్టుబాటు ధరలుగా గ్యారంటీ చేయబడతవి. వ్యవసాయ కూలీలకు జీవన వేతనాలుగా గ్యారంటీ చేయబడతవి. వేతన నిర్ణయ బోర్డులలో వ్యవసాయ కూలీల ప్రతినిధులకు ప్రాతినిధ్యం యివ్వబడుతుంది. ప్రభుత్వ భూములలో సహకార వ్యవసాయ సంఘాలను యేర్పరచి, వాటికి ఆర్థిక సహాయం, సాంకేతిక సహాయాలను ప్రభుత్వం అందిస్తుంది. ఉచిత యిండ్లస్థలాలు, గృహనిర్మాణాలకు ఆర్థిక సహాయం అందివ్వాలి. గ్రామీణ ప్రాంతాలలోని వ్యవసాయ కూలీలలోని నిరుద్యోగాన్ని నిర్మూలించాలంటే విరివిగా గ్రామ కుటీర పరిశ్రమలను స్థాపించాలి. పనిలేనిరోజులలో ప్రత్యామ్నాయ పనులను కల్పించాలి.

ఆటవిక తెగలు ఎంతో వెనుకబడి నాగరికతకు, జనవాసాలకు దూరంగా వుండిపోయారు. అంచేత ప్రభుత్వం ఆటవిక తెగల జీవితాలను కొంత మెరుగు పరచుటకు ప్రత్యేక చర్యలు చేపట్టుతుంది. ఆటవిక జాతులకు ప్రాంతీయ స్వపరిపాలన, భారత రిపబ్లిక్ యూనియన్‌లో భాగంగా ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పాటు చేయాలి. నాగాలాండు, గూర్ఖాలాండ్, జార్ఖండు తదితర అట్టి ప్రాంతాలకు స్వపరిపాలనను యేర్పాటుచేసి, నాగరికత సమాజంలోనికి క్రమేణా తీసుకొని రావాలి. ధనం, సాంకేతిక సహాయం యీ ప్రాంతాల అభివృద్ధికి చేసి తోడ్పడాలి. పరిశ్రమలు, రవాణా సౌకర్యాలు అభివృద్ధి చేయబడాలి. వారు బయట ప్రాంతాలవారిచే దోపిడీ చేయబడకుండా రక్షణ కల్పించాలి. వారి భూములను మైదాన ప్రాంతాలవారు వచ్చి, దురాక్రమణ చేయకుండా చూడాలి. అడవులలోని వివిధ వృత్తులను వారు స్వేచ్ఛగా వినియోగించుకొననివ్వాలి. మార్కెటింగు సహకార సంఘాలనేర్పరచి, దళారుల దోపిడిని అరికట్టాలి. ఆటవిక తెగలు వారి భాష, సంస్కృతులను అభివృద్ధి చేసుకొను అవకాశాలు కల్పించాలి. వారికి ఉచిత విద్య, ఆరోగ్య సౌకర్యాలు కల్పించాలి.

మత అల్పసంఖ్యాక వర్గాలకు ప్రభుత్వం వారి మత, సాంస్కృతిక హక్కులకు రక్షణ కల్పించుతుంది. వారియెడల ఆర్థిక, విద్యా, సాంస్కృతిక, విచక్షణ చర్యలను ప్రభుత్వం అరికట్టుతుంది. మత, కుల సంబంధ దుష్ప్రచారాన్ని నిషేధిస్తుంది.

దేశఐక్యత, సమగ్రతలను భాషాప్రయుక్త రాష్ట్రాలను యేర్పరచుట ద్వారా, ఆంగ్లభాష పరిపాలనా భాషగా రద్దుచేసి, ఆయా ప్రాంతాల మాతృభాషలలోనే పాలన సాగించు యేర్పాటులు చేస్తుంది. ఆంగ్లభాషను తొలగించి రాష్ట్రాల మధ్య సంధానభాషగా హిందీని అభివృద్ధి చేస్తుంది. విశ్వవిద్యాలయాలతోగూడ మాతృభాష లోనే విద్య గరుపుటను తీసుకొస్తుంది. ఉరుదు, సింధి, నేపాలీ మొదలైన భాషలకు రక్షణ కల్పించుతుంది.

# 8

# నక్సలిజంలో వివిధ ధోరణులు, పరిణామాలు

మార్క్సిజం-లెనినిజం సామాజిక, ఆర్థిక, రాజకీయ విధానాలను దాని సమగ్ర పురోగతికి మార్గాలను అన్వేషించి, అమలుచేస్తూ, పోరాడే శాస్త్రీయ విధానం. భౌతిక, రసాయనిక శాస్త్రాల సూత్రాలవలె మరోదేశంలో కనుగొనబడిన శాస్త్రీయ విషయాలను పునరుత్పత్తిక్రమంలో దిగుమతిచేయువిధంగా సామాజికశాస్త్ర నిర్ధారణలు దిగుమతిచేయుట పెద్దపొరపాటు అగుతుంది. మానవ సమాజపరిస్థితులు ముఖ్యంగా జీవితవిధానాలను నిర్ధారించే దేశ,కాలపరిస్థితులతోపాటు సామాజిక,ఆర్థిక, రాజకీయ పరిస్థితులు, ప్రజల చైతన్యస్థాయి దేశదేశానికి, దేశంలోనే వివిధప్రాంతాల భిన్నభిన్న రూపాలను, అంశాలను కలిగివుంటుంది ఈ వాస్తవిక పరిస్థితులను అధ్యయనం చేయుటలో వివిధ వర్గాలనుండి, వివిధ స్థాయిలలోనుండి వచ్చిన విద్యావేత్తలు గాని, మరొకరుగాని, ఆ జీవనవిధానంలో పాత్రధారులుగాక, ప్రేక్షకులుగా వచ్చి అధ్యయనం చేయుటలో వివిధ వ్యక్తులు భిన్న అవగాహనలకు వచ్చుటకు ఆవకాశా లెన్నో వున్నాయి. అట్టి పరిస్థితులలో, సామాజిక శాస్త్రాల వివిధ ధోరణులు గల విద్యాలయాల ధోరణులలో అధ్యయనాలు, పరిశోధనలు సాగించి వచ్చిన శాస్త్రజ్ఞులు సైతం తమ తమ స్వీయ మానసిక శాస్త్రీయ అవగాహన ధోరణులలోనే అధ్యయనం చేయుట, నిర్ధారణలు చేయు అవకాశాలు అధికంగా వున్నవి. ఇట్టి పరిస్థితులలో వొక భౌతికవాద శాస్త్రీయ దృక్పథంతో అధ్యయనం చేస్తేనే "శాస్త్రీయ సత్యాన్ని" పూర్తిగాకాదు, ఎక్కువ భాగాన్ని, అవగాహన, అర్థం చేసుకొనగలుగు

తారు. అంతేగాక, అవగాహనను ఆసమాజంలోనే ఆచరణలో పెట్టి అనుభవాలతో సరి చేసుకొని, విస్తృత ప్రాంత ఆచరణలో కూడ అట్టి ఫలితాలే వచ్చిన, నిర్ధారణలు అప్పటికి సత్యాలుగా నెంచాలి. సమాజం నిరంతర చలన ప్రవాహం వంటిది. వేగోద్ధృతిలో తేడాలుండవచ్చు, యీ పరిణామంలో నూతనాంశాలు ఆవిర్భవించుటతో అవగాహనలలో మార్పులు సహజం, వాటికి ప్రతిఘటన మొండిగా కొనసాగితే పెడధోరణులుగా రూపొందవచ్చు. పెడధోరణులు దీర్ఘకాలం సాగిన అభివృద్ధి శూన్యమై, తీవ్రమై చీలికలకు దారితీయవచ్చు. ఇదే పార్టీల చీలికలకు మౌలిక సైద్ధాంతిక కారణంగా నెంచవచ్చు. ఈ చీలిక భౌతికంగా, నిర్మాణ సంబంధమైన చీలికకు దారితీయవచ్చు.

అదే విధంగా, మార్క్సిజం, లెనినిజం, ప్రపంచ కమ్యూనిస్టు, కార్మిక, ప్రజోద్యమాల అనుభవాల వెలుగులో అధ్యయనం, అవగాహనలను పెంపొందించుటలో కూడ భిన్న ధోరణులు, అవగాహనలు యేర్పడుటకు అవకాశాలున్నవి. సమిష్టిగా చర్చించి, నిర్దిష్ట అవగాహనలకు వచ్చి వాటిని ఆచరణలో పెట్టి, అనుభవాలతో సరిచేసుకొని నిర్ధారణలు చేయాలిగాని, తాత్కాలిక అవగాహనలు అందుండి ఏర్పడిన తాత్కాలిక నిర్ధారణలనే యింతుమించు శాశ్వత నిర్ధారణలుగా, పిడి సూత్రాలుగా చేయరాదు. సామాజిక శాస్త్రాన్ని మేధోకర్మాగారాలనుండిగాక బహుళ సామాన్య ప్రజానీకం అనుభవాలనుండే వివిధ ప్రాంతాల నుండి అభివృద్ధి చేసిన అవగాహనలు, సిద్ధాంతీకరణలే పదికాలాలు మనగలుగుతవి.

కలకత్తాలో కమ్యూనిస్టు విప్లవకారులు "ఎ.ఐ.సి.సి.సి.ఆర్."గా ఏర్పడిన నాటినుండి దానిలోపల, బయటా అతివాద అవకాశవాదానికి వ్యతిరేకంగా సైద్ధాంతిక పోరాటం సాగుతూనే వుంది. కొన్ని గ్రూపులు "ఎ.ఐ.సి.సి.సి.ఆర్."లో అసలు చేరలేదు. కొన్ని బయటికి వచ్చాయి. మరికొన్ని నాయకత్వపు అతివాద అవకాశవాద రాజకీయాలతో విభేదించి లేదా తప్పుడు నిర్మాణ ఆచరణలతో విభేదిస్తున్న కారణంగా, బయటికి గెంటివేయబడ్డాయి.

### "ఎ.పి.సి.సి.సి.ఆర్." ఆంధ్ర విప్లవకారులు "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." విప్లవకారుల మధ్య అభిప్రాయభేదాలు.

కేంద్ర "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." విప్లవకారులు ఆంధ్ర "ఎ.పి.సి.సి.సి.ఆర్." విప్లవకారుల మధ్య సైద్ధాంతిక పోరాటం మూడు ప్రధాన లక్ష్యాలతో టి. నాగిరెడ్డి, డి. వెంకటేశ్వరరావుల అవగాహన సాగింది. అవే, అతివాద అవకాశవాదంపై సూత్రబద్ధ పోరాటం, వారిలో వూగిసలాటాడే శక్తులున్నవని గుర్తించి, తగురీతిలో వ్యవహరించుట, చివర లక్ష్యమైన, అతివాద అవకాశవాదులపై పోరాటం, కమ్యూనిస్టు విప్లవకారుల వైఖరులను, ఆచరణను విశదీకరించుతూ, సమర్థించుకొనే

రూపంలో, భిన్నాభిప్రాయాలను వ్యక్తీకరించే రూపంలో వుండాలని తలవారు. అందుకు వివాదాస్పద సమస్యలపై బహిరంగ చర్చలు జరుప ఆనాడు వారు సిద్ధంగా లేకపోవుట, అతివాద అవకాశవాద ధోరణి యింకా తన లక్షణాలను పూర్తిగా బహిర్గతం చేయకపోవుట కారణంగా వివరించి, నిగ్రహాన్ని ప్రదర్శించారు.[1].

అభిప్రాయభేదాల ముఖ్యాంశాలు యిలా వున్నవి. ప్రథమంగా సి.పి.ఐ.(యం)కు వ్యతిరేకంగా సాగించవలసిన నిర్మాణ, సైద్ధాంతిక పోరాటాల యెడల అనుసరించవలసిన వైఖరి, సి.పి.ఐ.(యం) నుండి విడిపోవుటకు అనుసరించవలసిన క్రమ విధానం, ఆచరణంలో విభేదించారు. వ్యవసాయ విప్లవం, సాయుధపోరాటాల అవగాహన, ఆచరణ విషయాలలో "ఎ.పి.సి.సి.సి.ఆర్." కేంద్ర "ఎ.ఐ.సి.సి.సి. ఆర్." అతివాద అవకాశవాదాన్ని అనుసరించుచున్నదని విభేదించింది. అంతేగాక అవసరమైన వివిధ పోరాట, నిర్మాణ రూపాలను చేపట్టవలసిన అవశ్యకతను, యీ పోరాటాలను అత్యున్నత పోరాట రూపమైన సాయుధ పోరాట రూపంలో, అది ఆరంభమైనపుడు, జోడించవలసిన ఆవశ్యకతను "ఎ.పి.సి.సి.సి.ఆర్." నొక్కి చెప్పగా, అతివాద అవకాశవాద "ఎ.ఐ.సి.సి.సి. ఆర్." యీ మౌలిక మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాన్ని, దృక్పథాన్ని ఎగతాళి చేసారు. సాయుధ పోరాటం తప్ప మరే పోరాట రూపం చేపట్టినా అది ఆర్థికవాద మగుతుందన్నారు. ఎన్నికల సమస్యపై గూడ, రెండింటి మధ్య అభిప్రాయ తీవ్రభేదాలుండుటయేగాక "ఎ.పి.సి.సి.సి.ఆర్." వైఖరిని వక్రీకరించి, దుమ్మెత్తిపోసి, బురదచల్లారు. అతివాద అవకాశవాదులు ఎన్నికలను వ్యూహాత్మకమైన సమస్యగా అభిప్రాయపడ్డారు. జనతా ప్రజాస్వామ్య విప్లవదశ అంతటా ఎన్నికలు బహిష్కరించాలంటారు.

ఎన్నికలను "ఎ.పి.సి.సి.సి.ఆర్." ఎత్తుగడల సమస్యగా, అనేక చట్టబద్ధ పోరాట రూపాలలో వొక రూపంగా స్పష్టం చేసింది. వ్యూహ సమస్యగా విప్లవదశ కాలమంతటి సాధారణ బహిష్కరణగా "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." అవగాహనను, ఆచరణను "ఎ.పి.సి.సి.సి.ఆర్" స్పష్టంగా తిరస్కరించింది. "బ్లిట్జ్" వీక్లీ విలేఖరి 1968 ఆగస్టులో టి. నాగిరెడ్డి ఎన్నికలపై విప్లవకారుల వైఖరి యిలా వివరించారు. "వాటి (ఎన్నికల) వంచనాపూరిత స్వభావాన్ని ఎండగట్టటానికి, తమ సమస్యలు విప్లవ మార్గంలో మాత్రమే పరిష్కారమగుతాయని ప్రజలు గుర్తించేలా చేయుటకు, విప్లవ కారులు ఎన్నికల్లోనూ, శాసన సభల్లోనూ పాల్గొంటారు." అని అనుటయేగాక, స్వీడిష్ పత్రికా విలేఖరితో "నిజంగా చాలా విస్తారమైన ప్రాంతంలో మనం సాయుధ పోరాటం సాగిస్తూ కూడా సాయుధ పోరాటం లేని యితర ప్రాంతాలలో పార్లమెంటులో కూర్చుంటామని" కూడా చెప్పారు. మరోవైపు డి. వెంకటేశ్వరరావు

1. భారత విప్లవోద్యమం. (1990) సమీక్ష. "యు.సి.సి.ఆర్." (యం.యల్.) ఏప్రిల్ 1989లో ఆమోదించినది. జనశక్తి ప్రచురణ. పే. 123–4.

మరికొంతమంది. పార్లమెంటరీ వ్యవస్థకు అవసరమైన సాంఘిక పునాదులు మన దేశంలో లేనందున, వాటిని దాదాపు పట్టించుకోవలసిన అవసరం లేదనే అభిప్రాయంతో వున్నారు. వీరుకూడ ఎన్నికల ఎత్తుగడల సమస్యగానే యెంచుతున్నారు. అయితే టి. నాగిరెడ్డి 1969లో అసెంబ్లీకి రాజీనామా చేసినప్పటికి, సాధారణ బహిష్కరణ దృక్పథానికి ఎటువంటి సంబంధమూ లేదు.

## విప్లవకారులలో చీలికలు 1969-71లోనే ప్రారంభం.

అతివాద అవకాశవాద ధోరణి యీ కాలంలోనే పూర్తి పంథాగా మారింది, ఆచరణలో కొనసాగింది. విప్లవోద్యమానికి వినాశనాన్ని తెచ్చిపెట్టి, పలు చీలికలకు కారణమైంది. అఖిల భారత శ్రేణులలోని కొన్ని వర్గాలు ప్రజాపంథావైపు పురోగమనం ప్రారంభమైంది. ఆంతరంగిక సైద్ధాంతిక రాజకీయ పోరాటాన్ని సాగించ నిర్ణయించుకొన్నారు. ఫలితంగా "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." నాయకత్వపు ఆగ్రహానికి గురయ్యారు. కమ్యూనిస్టు విప్లవకారులు అతివాద అవకాశవాదానికి రాజకీయాలకు వ్యతిరేకంగా బహిరంగంగాను, నిర్మాణయుతంగాను పోరాటాన్ని తీవ్రం చేసారు. విప్లవ ప్రజాపంథా ప్రాతిపదికగా మరో వైపున విప్లవకారులందరిని ఐక్యం చేయు ప్రయత్నం సాగించారు.

"విప్లవకారుల", యు. సి. సి. ఆర్. ఐ. (ఎం. ఎల్) మొదటి రెగ్యులర్ కేంద్ర కాన్ఫరెన్స్ ఏప్రిల్ 1989లో ఆమోదించిన రాజకీయ, నిర్మాణ ఉద్యమ సమీక్ష (1967-88). కామ్రేడ్ చారుమజుందార్ రాజకీయ విధానాలను యిలా విమర్శించింది. "రైతాంగ విప్లవ పోరాటాన్ని సాగించుటకు గెరిల్లా యుద్ధపద్ధతే ఏకైక ఎత్తుగడగా", "గెరిల్లా యుద్ధం సాగించుటకు ప్రజావుద్యమాల అవసరం, ప్రజాసంస్థల అవసరంగాని లేదు" "ప్రజా సంఘాలు ప్రజా వుద్యమాలు బహిరంగ ఆర్థికవాద ఉద్యమ ధోరణిని పెంపొందిస్తాయి. విప్లవకారుణ్ణి శత్రువుముందు బహిరంగంచేసి అతనిపై దాడులు సాగించుటకు సులభతరం చేస్తాయి." "బహిరంగ ప్రజావుద్యమాలు, ప్రజాసంఘాలు గెరిల్లా యుద్ధ అభివృద్ధికి, విస్తరణమార్గంలో అడ్డంకులుగా వుంటాయని" చారుమజుందార్ జులై 1969లో ప్రకటించారు. అలాగే డిశెంబరు 1969లో వారి స్వంత అవగాహనకు అనుగుణంగా సాగే "సాయుధ పోరాటరూపం తప్ప యితర పోరాట రూపాలను, సంఘాలను తిరస్కరించేవారి అతివాద అవకాశవాద, మార్క్సిస్టు వ్యతిరేక అవగాహనను సమర్థించుకొని ముందుకు తీసుకొనిపోయే ప్రయత్నంలో భాగంగా యీ బోధనలనన్నిటిని చేసారు. ట్రేడుయూనియనులు, ఆత్మరక్షణ పోరాటం సాగించే కార్మిక సంఘాలని కా. మజుందార్ వొప్పుకొన్నారు. అయినా, ఆయన మార్చి 1970లో యిలా ప్రకటించారు. "నేడు వారికి (కార్మికవర్గం) ట్రేడుయూనియన్ నిర్మాణంతో తమను తాము రక్షించుకొనుట సాధ్యంకాదు. మన కర్తవ్యం కార్మికులలో రహస్య పార్టీని

నిర్మించటము. అతివాద అవకాశవాద నాయకత్వం ప్రేడుయూనియనుల నుండి, యితర ప్రజాసంఘాలనుండి తమ కార్యకర్తలను వుపసంహరించుకున్నారు. కార్మిక వర్గ వుద్యమాన్ని నిర్మించే కర్తవ్యం వదలివేయబడింది. కా. చారుమజుందార్ విద్యార్థులకు చదువులు మానివేయమని గ్రామాలకు వెళ్ళి భూమిలేని పేద రైతులలో మావో ఆలోచనా విధానాన్ని ప్రజా యుద్ధపంథాను ప్రచారం చేయమని సలహా యిచ్చారు. వారిని నగరాలలో చిన్న "రెడ్‌గార్డు దళాలు"గ యేర్పడమని కోరారు. వాటిని సైన్యం యొక్క భావిదళాలుగా పేర్కొన్నాడు. "సాంస్కృతిక విప్లవం పేరిట" భారత విప్లవం మహత్తర సాంస్కృతిక విప్లవంలో భాగంగా" అన్న నినాదం పేరుతో కలకత్తాలో విద్యార్థులు, యువజనులు ప్రయోగశాలలను, కాలేజీలను ధ్వంసం చేయడాన్ని, విగ్రహాలను కూలద్రోయటాన్ని ఆయన ప్రోత్సహించి పొగిడాడు.

చారుమజుందార్ "నక్సల్బరీ రైతాంగ పోరాటం మనకిచ్చిన గుణపాఠం, మిలిటెంటు పోరాటాలు పంట, భూమికోసం కాదని, రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకొనుటకు మాత్రమే సాగించాలని" సిద్ధాంతీకరించి, పంట–భూమికోసం సాగించే విప్లవ పోరాటాల ప్రాముఖ్యతను నిరాకరించారు. ఇది నక్సల్బరీ, శ్రీకాకుళం వ్యవసాయ విప్లవ పోరాటాల అనుభవాలను త్రోసిబుచ్చుటయే అగుతుంది. ఈ నిర్వాహణ ఫలితంగా ఉన్నతస్థాయికి చేరి వెనుకంజ వేసిన నక్సల్బరీ, శ్రీకాకుళం, దేబ్రా, గోపీవల్లభపూర్ తదితర రైతాంగ విప్లవోద్యమాలను నిలబెట్టుకొని, మరింత ఉన్నత స్థాయికి తీసుకొని వెళ్ళలేకపోయాము."[1] ఈ సుదీర్ఘ ఉదహరింపు "ఎ.ఐ.సి.సి.సి.ఆర్" అతివాద అవకాశవాదుల సైద్ధాంతిక, రాజకీయ విధానాల, ఎత్తుగడల, ఆచరణలలోని పెడధోరణులను, తప్పిదాలను స్పష్టం చేస్తున్నది. అంతేగాక చారుమజుందార్ "వర్గశత్రు నిర్మూలన వర్గ పోరాటంయొక్క ఉన్నత పోరాటరూపం కాగా, గెరిల్లా చర్యద్వారా వర్గశత్రువులను నిర్మూలించే చర్య, గెరిల్లా పోరాటంయొక్క ప్రాథమికదశ" అని, జనవరి 1970లో గెరిల్లా వర్గపోరాటాన్ని వక్రీకరించి, అపభ్రంశం చేసారు, తీరని నష్టం కలుగజేసారు. భారతదేశ విప్లవ పరిస్థితుల అసమానాభివృద్ధి సిద్ధాంతాన్ని గుర్తించక, "సత్వర విజయం" అనే సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టి, 1970 ఫిబ్రవరిలో 1975 నాటికి భారతదేశపు కోట్లాది ప్రజలు విముక్తి అనే మహా కావ్యాన్ని రచిస్తారు" అనే స్వీయ మానసిక అందవిశ్వాసాన్ని ప్రకటించారు. అతివాద అవకాశవాద వివిధ ధోరణులకు, నిర్మాణ పద్ధతులకు వ్యతిరేకత పెరిగి, వుద్యమం తిరోగమన దశలో పడినపుడు చారుమజుందార్‌పై నినాదాలను యిచ్చుటను మరువరాదు.

1.——అదే——పే. 111-112.

## సి.పి.ఐ. [యం.యల్] లో చీలికలకు బీజాలు :

అతివాద అవకాశవాద యం.యల్. విప్లవ కమ్యూనిస్టు నాయకులు, ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారుల విప్లవ ప్రజాపంథాకు "మధ్యేమార్గవాదం" అనే పేరు పెట్టి మే 1970 సి.పి.ఐ. (యం.యల్) మహాసభకు కా. మజుందార్ యిచ్చిన సందేశంలో మనం దానికి (ప్రజాపంథాకు) వ్యతిరేకంగా పోరాడాము. నాగిరెడ్డి తదితరులను మన ఆర్గనైజేషన్‌నుండి గెంటివేశాము" అని ప్రకటించారు. అంతేగాక, "పార్టీలోపల నుండే మధ్యేమార్గవాదం" దాడి చేస్తున్నది. "శతృ నిర్మూలనా యుద్ధాన్ని ఎవరైతే వ్యతిరేకిస్తారో వారు మాతో వుండజాలరు. వారు పార్టీలో వుండుటకు అనుమతించము" అన్నారు. నాడు "ఏ.ఐ.సి సి.సి.ఆర్." సి.పి.ఐ. (యం.యల్) నాయకత్వం దాదాపు అందరూ చారుమజుందార్‌ను అనుసరించారు. హవురాకు చెందిన కొద్దిమంది రాజకీయ తీర్మానంలోని అవాస్తవికత, అతిశయోక్తుల అంచనాలను ప్రశ్నించి, ప్రధాన వైరుధ్యం ఫ్యూడలిజానికి ప్రజలకు మధ్య వుందన్నారు. ప్రజా సంఘాలు, ప్రజోద్యమాలకు వ్యతిరేక ధోరణులను ఖండించారు. వీరు తరువాత పార్టీనుండి బహిష్కరించబడ్డారు.

చీలికలకు గల కారణాలను సత్యం 1980 దశకంలో వివరిస్తూ "విప్లవకారులు అనుసరించిన అతివాద విధానాలు, తప్పుడు నిర్మాణ పద్ధతుల వలననే విప్లవోద్యమం అనేక చీలికలకు గురైంది విప్లవకారులలో చీలిక విప్లవోద్యమానికి తీవ్రమైన నష్టాన్ని కలిగిస్తున్నది." అని వ్యాఖ్యానించారు.

"విప్లవకారుల చీలికలకు సైద్ధాంతిక, రాజకీయ, ఎత్తుగడలు, ప్రస్తుత పరిస్థితుల అంచనాలు వంటి సమస్యలపై తీవ్ర అభిప్రాయభేదాలతోపాటు, కేంద్రీకృత ప్రజాస్వామిక నిర్మాణసూత్రాల అవగాహన, ఆచరణలోగల తీవ్ర అభిప్రాయబేదాలు ప్రధాన కారణాలుగ వున్నాయి. ఇన్ని విభేదాలున్నప్పటికీ అవి ఎంత తీవ్రమైనవి అయినప్పటికి వర్గశతృ నిర్మూలనను వ్యతిరేకిస్తూ, ప్రజాపంథాను అనుసరించే గ్రూపులన్నీ ఒక పార్టీలో ఐక్యమగుటకు కావలసిన కనీస ప్రాతిపదిక వుంది. వీరు కేంద్రీకృత ప్రజాస్వామిక సూత్రాలకు కట్టుబడి పనిచేస్తూ, ఆచరణలో అనుభవాల ద్వారా సమస్యలను చర్చలు, సంప్రదింపులద్వారా పరిష్కరించుకొనవచ్చు. అంతే గాని, చీలిక అనివార్యం, చీలికలు మంచివే అనే సైద్ధాంతిక తప్పుడు ధోరణులు" అని కమ్యూనిస్టు విప్లవకారులలో ప్రబలంగావున్న చీలికల సిద్ధాంతాన్ని నిర్దిష్టంగా ఖండించారు.

ఇంకా "చీలిక-ఐక్యత"లపై విప్లవకారులలో సైద్ధాంతిక తప్పుడు అవగాహనలను కలిగివుండుటను వివరించారు. "యం.యల్. పార్టీ చీలికలైపోవుటకు కారణం సిద్ధాంతపరమైన విభేదాలు కావు. అయితే వ్యక్తిగతమైనవికూడ కాదు. మావో ఆలోచనా విధానాన్ని వొక్కొక్కరు వొక్కొక్క విధంగా అర్థం చేసుకోవడంవల్లనే,

చీలికలు ఏర్పడినవి. అయితే చీలికకు కొద్దిపాటి వ్యక్తిగత ద్వేషాలు కూడ తోడ్పడ వచ్చు. కాని చీలికలకు యివే ప్రధానంకావు."[1] అని వివరించారు.

అంతేగాక "వ్యక్తిగత హింసావాదం, పార్లమెంటరీ పోరాట రూపాన్ని విని యోగించుట, ప్రజాసమస్యలపై ఐక్యకార్యాచరణ, పాలక ప్రతిపక్షాల మధ్యగల తేడాలను, వైరుధ్యాలను వినియోగించుట, చట్టబద్ధ చట్టవ్యతిరేక అన్ని పోరాట రూపాలను, బహిరంగ రహస్య కార్యకలాపాలను జోడించుట, సాయుధ పోరాటంపై అవగాహన అన్నీ సైద్ధాంతికపరమైన ఆచరణాంశాలుగానే వుంటాయి. ఇవన్నీ మార్క్సిస్టు-లెనినిస్టు-మావో ఆలోచనా విధాన సిద్ధాంతంలోని అంతర్భా గాంశాలుగానే ఉన్నవి. విభేదాలు మార్క్సిజాన్ని అర్థం చేసుకొనుటలోగాదు, మార్క్సిస్టు మహోపాధ్యాయుల బోధనలను ఆచరణాంశాలుగా చేయుటలో వస్తు న్నవి.ఇవే చీలికలకు ప్రధాన కారణాలు.వీటిపై ఎంత తీవ్ర అభిప్రాయభేదాలున్నప్ప టికీ ప్రజాపంథాను అనుసరించినంతకాలం కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రాలకు కట్టుబడి, పనిచేసినంతకాలం విడిపోవలసిన అవసరం ఎంత మాత్రం లేదు. కనుక చీలికలు తప్పు, విప్లవోద్యమాలకు తీవ్రనష్టాన్ని కలుగజేయుటకు తోడ్పడు తాయి.[2]"

"మన పార్టీలో తలెత్తిన దుస్సాహసిక ధోరణిని ప్రతిఘటించండి" అనే పత్రాన్ని రూపొందించి, సుశితల్‌రాయ్‌చౌదరి నవంబరు 1970లోనే పార్టీ శ్రేణులలో సర్క్యులేట్ చేశారు. ఈ విమర్శనలోని ముఖ్యాంశాలు ఇలా వున్నవి.

ఆర్థిక, రాజకీయ పోరాటాలను విడనాడుటతప్పు. ఈ పోరాటాలలో రైతాంగ జనబాహుళ్యాన్ని సమీకరించకుండా అత్యున్నత పోరాటరూపమైన గెరిల్లా యుద్ధం, రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకొనే పోరాటం సాగించలేము. గెరిల్లా దళాలను పూర్తి రహస్య,కుట్రపూరిత పద్ధతులలో నిర్మాణ అవగాహన, ఆచరణ,వర్గశత్రువును భౌతికంగా నిర్మూలించుట, ప్రజలపాత్ర లేకుండా చేయుటతప్పు. రైతాంగ సాయుధ పోరాటానికి,అభివృద్ధికి, స్థావరప్రాంతాల అభివృద్ధికి హానికరము. పట్టణప్రాంతాలలో ఆర్థిక, రాజకీయ పోరాటాలలో ప్రజలను చైతన్యవంతులనుచేసి సమీకరించే కర్త వ్యాన్ని వదలివేయుట తప్పు. నగరాలలో శత్రునిర్మూలనాదాడులు తప్పు. విద్యా లయాలు, ప్రయోగశాలలు ధ్వంసం చేయుట తప్పు. భారత విప్లవం సత్వర విజ యాన్ని సాధించుననే సిద్ధాంతం తప్పు. పట్టణాలలో ఎర్రభయోత్పాతాన్ని సృష్టించే విధానం తప్పు. ఆ విధంగా కమ్యూనిస్టులు రాటుదేలుతారనే అవగాహన తప్పు.

1. సత్యం (1988) పీపుల్స్‌వార్ గ్రూపు అతివాద పెడధోరణి. సి.పి.ఐ. (యం.యల్) ఆంధ్రప్రదేశ్ కమిటి ప్రచురణ 12. నెం. పే. 45-46.

2. —అదే— పేజి 46.

అది నగ్న దుస్సాహసిక వ్యక్తిగత హింసావాదమవుతుంది. పార్టీ "దాడుల పార్టీ" అనుట తప్పు. పార్టీ విధానాలను ప్రశ్నించినా,సృహృద్భావంతో విమర్శించినా"రివిజనిజం" లేదా "మధ్యేమార్గవాదంగా" ముద్రలువేసారు. బీహారు రాష్ట్రకమిటీ విమర్శను "నీచమయినదిగా" త్రోసిబుచ్చారు. అతివాద అసహనానికి ఉదాహరణగా ప్రవర్తించారు.[1]

వీటన్నిటికితోడు రాజకీయ సైద్ధాంతిక అభిప్రాయభేదాలను చర్యలు, పరస్పర సంప్రదింపులద్వారా సమిష్టి అవగాహన పెంపొందించుటద్వారా పరిష్కరించే ప్రయత్నం చేయక, నిర్మాణ చర్యలతో పరిష్కరించుట పెద్ద తప్పు.

## ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులు అతివాద అవకాశవాదంపై సాగించిన సైద్ధాంతిక పోరాటం :

మొదట్లోనే ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులు అతివాద అవకాశవాదంపై సూత్రబద్ధ రాజకీయ సైద్ధాంతిక పోరాటాన్ని సాగించారు. ఈ పోరాటం శ్రీకాకుళం జిల్లా కమిటీ నేరుగా "ఎఐసిసిసిఆర్"కు అనుబంధంగా పనిచేస్తూ చేబట్టిన పోరాటంపై సహృదయంతో సైద్ధాంతిక పోరాటంగా సాగింది.

శ్రీకాకుళంజిల్లా కమిటీ రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటం విముక్తి కోసం సాగించే పోరాటం కాన, భూసమస్యతో సంబంధం లేకుండా, ప్రారంభించి, కొనసాగించవచ్చనే అవగాహన, దృక్పథంతో ఆచరణ ప్రారంభించింది. రైతుల విముక్తి అంటే ఫ్యూడలిజం, సామ్రాజ్యవాదశక్తులు వారిని బలపరచే వారినుండి విముక్తి అనే అవగాహనతో రాష్ట్ర కమ్యూనిస్టు విప్లవకారుల నాయకత్వం వుంది. వ్యవసాయ విప్లవ కార్యక్రమాన్ని తప్పనిసరి ప్రాతిపదికగా ఆరంభించి, రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాన్ని తప్పనిసరిగా అధికారాన్ని హస్తగతం చేసుకొనే దృక్పథంతో నడపాలి. భూస్వాముల దోపిడి తీవ్రంగా, నగ్నంగా ఎక్కడవుందో అక్కడ సహజంగా ప్రారంభమై బలపడి విస్తరిస్తుంది. వ్యవసాయ విప్లవకార్యక్రమాన్ని తిరస్కరించి వదలివేస్తే ప్రజలపాత్ర బలహీనపడి, ఫలితంగా రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటం విఫలమగుతుంది. భూమి సమస్యకు జోడించని ఏ విముక్తి పోరాటంలో అర్ధఫ్యూడలు, అర్థవలస దేశాలలో గ్రామీణ బడుగు, వ్యవసాయకూలి, రైతాంగ ప్రజాసామాన్యం ఉత్సాహం, చొరవతో పాల్గొనదు. విముక్తి పోరాటంగా అభివృద్ధి చెందదు.

---

1. భారత విప్లవోద్యమం (1990) సమీక్ష, యు.సి.సి.ఆర్ (యం. యల్) జనశక్తి ప్రచురణ. పేజి 121.

శ్రీకాకుళంజిల్లా కమిటి ప్రజలలో కదలిక అవసరంలేదని, సాయుధ పోరాటం ప్రారంభించితే ప్రజలు వారంతట వారే కార్యరంగంలోకి దిగుతారని, గెరిల్లా పోరాటాలకు ప్రత్యేక శిక్షణ అవసరంలేదని, పోరాట క్రమంలోని నేర్చుకొంటారని, సాయుధ పోరాటం సాగిస్తే సరిపోతుందనే వైఖరి చేబట్టింది. రాష్ట్ర కమిటీపై వాదనలను తిరస్కరిస్తూ ప్రజలలో కదలిక వుండాలని, నాయకత్వానికి ప్రజాపంథా దృక్పథం వుండాలని, పోరాట క్రమంలోనే నేర్చుకుంటారన్న దానిని కొంతవరకు వొప్పుకొంటూ, శ్రేణులలో అనవసర నష్టాలు నివారించుటకు, శతృవుతో సమర్థవంతంగా పోరాడుటకు కనీస శిక్షణ అవసరమన్నది. అంతేగాక సాయుధ పోరాట మొక్కటే చాలదని, ఐక్యసంఘటనా నిర్మాణ అవసరాన్ని నొక్కిచెప్పింది, దానితో పాటు ప్రజల పాత్ర నొక్కిచెప్పింది[1].

ఏప్రిల్ 1969 లో పైవిధంగా శ్రీకాకుళం జిల్లా నాయకత్వ అవగాహనలను, పోరాట విధానాలను తీవ్రంగా విమర్శించిన రాష్ట్ర నాయకత్వం, సెప్టెంబరు 1970 లో టి. నాగిరెడ్డి పత్రికల కిచ్చిన ఇంటర్వ్యూలో సి.పి.ఐ. (యం.యల్.)తో గల మూడు ప్రధాన భేదాభిప్రాయాలను యిలా వివరించారు.

ప్రథమంగా, ప్రజాయుద్ధం సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాల రూపంలో భూస్వాములు వారి గూండాలకు వ్యతిరేకంగా వ్యవసాయ విప్లవంగా ప్రారంభమై, ప్రభుత్వ హింస, నిర్బంధానికి ప్రజా ప్రతిఘటన రూపంలో సాగుతుంది. దళాల కర్తవ్యం కూడ ప్రతిఘటనగా వుంటుంది. కాని, సి. పి. ఐ. (యం. యల్.) ప్రజా వుద్యమం ఏ మాత్రం లేనిచోట్ల దళ చర్యలు జరుపుతున్నందున వారి దళాలు ప్రజల నుండి వేరగుతున్నవి. ప్రజల పాత్ర లేకుండా పోయింది.

రెండవ అంశం ప్రజా యుద్ధం ప్రతిఘటనా రూపం మాత్రమే, ఎదురుదాడి రూపం చేబట్టదు. సి.పి.ఐ. (యం.యల్.) అవగాహనలో ప్రజల కోర్కెలకు పోరాటాలకు సంబంధం లేదు. ప్రజా వుద్యమం లేకుండానే భూస్వాములపై దాడి చర్యలు చేబట్టుతున్నారు, అది అతివాద అవకాశవాద చర్య అవుతుంది.

మూడవ అంశం, సాయుధ పోరాటం మౌలిక ప్రధాన పోరాట రూపమైనా అన్నిచోట్లా, అన్ని కాలాలలో యిదొక్కటే పోరాటరూపం కాదు. ప్రజా చైతన్యాన్ని అన్ని ప్రజాపోరాట రూపాలను వినియోగించాలి. ప్రధానంగా ప్రజల పాత్ర వుండాలి.

"భారత విప్లవకారులలో అతివాద అవకాశవాద ధోరణి" అన్న సుదీర్ఘ సమగ్ర విమర్శనను 1970 సెప్టెంబరు చివరకు ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులు ప్రజల కందించారు. పూర్వ, ప్రస్తుత విప్లవోద్యమాల అనుభవాల వెలుగులో ప్రజా

---

1. భారత విప్లవోద్యమం (1990) సమీక్ష. "యు. సి. సి. ఆర్. (యం. యల్.) ఏప్రిల్ 1989 లో ఆమోదించినది. జనశక్తి ప్రచురణ. పే. 123-4.

విప్లవ పంథా అవగాహనల వెలుగులో చేయబడిన మార్క్సిస్టు - లెనినిస్టు విశ్లేషణగా పేరొందింది. పూర్వ ప్రకరణలలో, యీ విమర్శనాంశాలు వివరంగా యివ్వబడినవి.

అవి :

1. సి.పి ఐ. (యం.యల్.) రాజకీయ తీర్మానం, ముసాయిదా కార్యక్రమంలో ప్రధాన వైరుధ్యం, వ్యవసాయ విప్లవంపై చేసిన సూత్రీకరణల వైఫల్యాలను విశ్లేషించి, వివరించారు. మన విప్లవ దశలో ప్రధాన వైరుధ్యం, ఫ్యూడలిజానికి విస్తృత ప్రజా బాహుళ్యానికి మధ్య వుందని పరిష్కారానికి వ్యవసాయ విప్లవం శక్తివంతమైన సాధనమని వివరించింది.

2. దేశంలో విప్లవ పరిస్థితి ఉందని, ఆర్థిక, రాజకీయ పరిస్థితి, ప్రజోద్యమాల అభివృద్ధిలలో అసమానతలు వున్నవని అంటూ, విప్లవ పరిస్థితిని విప్లవోద్యమాలతో యం.యల్. తీర్మానం, కార్యక్రమం గందరగోళపరచి, బ్రహ్మాండమైన విప్లవ పరిస్థితి వుందని అతివాద అవకాశవాదులు చేసిన వాదనలను తీవ్రంగా విమర్శించి, లోపాలను ఎత్తిచూపింది.

3. ఆర్థికవాదాన్ని ఆర్థిక పోరాటంతో సమానంచేసి గందరగోళ పరచే "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." అతివాద అవకాశవాదాన్ని తిరస్కరించింది. భూసమస్యకు సాయుధ పోరాటానికి వైరుధ్యాన్ని చూపే వైఖరిని తిరస్కరించింది. వ్యవసాయ విప్లవం సాయుధ పోరాటాల మధ్యగల పరస్పర సంబంధం ప్రజలు గుర్తించునట్లు చేయుటలో అతివాద అవకాశవాద వైఫల్యాలను తీవ్రంగా విమర్శించింది.

4. విప్లవ రైతాంగ ఉద్యమం కేంద్రస్థానమాక్రమించాలని, అన్ని పోరాట రూపాలు, ఉద్యమాలు వ్యవసాయ విప్లవానికి దోహదపడాలి. రైతాంగ విప్లవ పోరాటాన్ని సాగించుటకు వొకే వొక ఎత్తుగడ, గెరిల్లా యుద్ధం అనే సి. పి. ఐ. (యం.యల్) వైఖరిని "ఎ.పి.సి.సి సి.ఆర్." విమర్శనాపత్రం వివరించింది, ఖండించింది శత్రునిర్మూలనా పంథాను, సూత్రీకరణలను విమర్శనాత్మకంగా విశ్లేషించి మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానానికి వ్యతిరేకమని త్రోసిబుచ్చింది. సాయుధపోరాటం సహజంగా దాడి స్వభావం కలదే అయినా, విప్లవ శక్తుల బలహీనత కారణంగా ప్రతిఘటనారూపంలో దీర్ఘకాల సాయుధ పోరాటంగా వుంటుందని వివరించి, అతివాద అవకాశవాదుల సత్వర విజయం వైఖరిని ఆంధ్రపత్రం విమర్శించింది.

5. మావో ఆలోచనా విధానం నక్సల్బరీలోనే మొట్టమొదటిసారిగా అన్వయించబడిందనే అతివాద అవకాశవాదుల వాదన అవాస్తవమని, 1949లోనే మావో ఆలోచనా విధానము, ప్రజా యుద్ధపంథా అన్వయించబడిందని, "ఎ.పి.సి.సి.సి.ఆర్" సుదీర్ఘ విమర్శనాపత్రం వివరించింది.

6. ప్రత్యేక తెలంగాణా 1968 ఆందోళనపట్ల అతివాద అవకాశవాదులలోని వొకవర్గం అవలంభించిన వైఖరిని "ఎ.పి.సి సి.సి.ఆర్." విమర్శనాపత్రం విమర్శించి తిరస్కరించింది. పాలకవర్గంలోని వొక శాఖ, అధికారదాహంతో తెలుగుజాతిని చీల్చ ప్రయత్నించగా అతివాద అవకాశవాద సి పి.ఐ. (యం.యల్) వర్గాలు "తెలంగాణాలో ప్రజారాజ్యం" నినాదాన్ని చేబట్టి, చారిత్రాత్మక తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటాన్ని అపఖ్యాతిపాలు చేశారని పత్రం విమర్శించింది.

7. "చైనా చైర్మన్ మన చైర్మన్" అన్న నినాదానికి, కార్మికవర్గ అంతర్జాతీయ భావానికి, ఆచరణకు ఎట్టి సంబంధం లేదు. అతివాద అవకాశవాదులు యీ విషయంలోనేగాక మావో ఆలోచనా విధానాన్ని అనేక మౌలిక సమస్యలపై వక్రీకరించి, అసభ్యంగా మార్చివేశారని "ఎ.పి.సి సి.సి ఆర్." విమర్శనాపత్రం స్పష్టం చేసింది.

8. విప్లవ ప్రజోద్యమాలకు "ఎ.ఐ.సి.సి.సి.ఆర్" అతివాద అవకాశవాదంతో నాయకత్వం యిచ్చుటలో విఫలమై, నిర్మాణ క్రమశిక్షణ చర్యలతో సైద్ధాంతిక సమస్యలను పరిష్కరించ ప్రయత్నించి, విచ్ఛిన్నపంథావైపు పయనించిందని "ఎ.పి. సి.సి.సి.ఆర్" విమర్శనాపత్రం స్పష్టం చేసింది.

**"ఎ.పి.సి.సి.సి.ఆర్." నుండి పుల్లారెడ్డి చీలిపోవుట:**

అతివాద అవకాశవాద "ఎ.ఐ.సి.సి.ఆర్." నాయకత్వప్రభావంలోనికి శ్రీకాకుళం జిల్లా కమిటిలోని బలమైనవర్గం వెళ్ళిపోయిన నేపథ్యంలో, రాష్ట్ర నాయకత్వం డిశెంబరు 1969లో అరెస్టు అయిన పరిస్థితిని వుపయోగించుకొని, సమీక్షించుకొని తప్పులను సరిచేసుకొంటూ, అనుభవాలను సిద్ధాంతీకరించుకొంటూ సి. పుల్లారెడ్డి రాష్ట్ర నాయకత్వాన్ని వ్యతిరేకించే ధోరణిలో నిర్మాణంలో సమీకరించే ప్రయత్నాలు చేయసాగారు. వాస్తవానికి రాష్ట్ర ప్లీనం సదస్సులో ఆమోదించిన పంథా, నిర్ణయాలకు వ్యతిరేకంగా ఖమ్మం ప్రాంతంలో సి. పుల్లారెడ్డి సాయుధ చర్యలకు నాయకత్వం వహించారు. తదనంతరం యీ సాయుధ చర్యలు వరంగల్లు జిల్లాకు విస్తరించాయి. ఈ చర్యలు విప్లవ ప్రజాపంథానుండి అతివాద, సాహసిక పెడధోరణి వైపు పయనించుటకు దారితీసాయి. వ్యవసాయ విప్లవోద్యమాన్ని విస్తార ప్రాంతాలలో అభివృద్ధి చేయుటకు ప్రతిబంధంగా వుండుట అందరికి స్పష్టమైంది. ఆత్మవిమర్శనా రూపంలో పుల్లారెడ్డి తన తప్పును, తన బాధ్యతను వొప్పుకొనుట, సరియైన పంథాలోనికి వచ్చుట సాధ్యమైనదిగా తలచబడింది. కాని, నాయకత్వం అరెస్టు అయిన తరువాత, తన ఆలోచనా ధోరణికి తగినట్లుగా ఫారెస్టు ఉద్యమంనుండి, అనుభవాలు క్రోడీకరించ మొదలుపెట్టాడు. రాష్ట్ర నాయకత్వం జైలునుండి బయట వున్న నాయకత్వపు అభిప్రాయాలపైనా, ఆచరణపైనా పదునైన విమర్శనలు వివరంగా పంపినపుడు, సూత్రబద్ధమైన ఆంతరంగిక చర్చలద్వారా సమస్యలను పరిష్క-

ంచుకొనే క్రమాన్ని విడనాడి, నాయకత్వానికి వ్యతిరేకంగా బహిరంగ తిరుగుబాటు చేసి, నిర్మాణంలో చీలికను తెచ్చి తన గ్రూపును నిర్మాణం చేసారు.

ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారుల విధానాన్నుండి పుల్లారెడ్డి తీవ్రవాదంవైపు పయనించుటను సమర్థించుకొంటూ "ప్రజలు చైతన్యవంతులై సాయుధ పోరాటాన్ని చేబట్టు అవసరాన్ని గుర్తించువరకు శతృవు చేతులు ముడుచుకొని కూర్చోదని పోలీసులు రంగంలోనికి ప్రవేశించినపుడు ప్రజల కొరకు వేచిచూడకుండా, "ఆత్మ రక్షణ కొరకు సాయుధ పోరాటం ప్రారంభించవచ్చని, జైలులోవున్న కమిటీతో బయట పుల్లారెడ్డి నాయకత్వంలోవున్న కమిటి వాదనలు పెట్టింది. దళాల సైనిక శక్తిపై విశ్వాసం యేర్పడిన తరువాత మాత్రమే రైతాంగం భూస్వాముల భూము లను ఆక్రమించుటకు ముందుకు వస్తారనికూడ సూత్రీకరించి తన చర్యలను సమ ర్థించుకొన్నది. అంతేగాక ప్రజలు మూకుమ్మడిగా ఆత్మరక్షణకు సిద్ధమయ్యేదాకా, అగ్రగామి శ్రేణులకు ఆత్మరక్షణ అంటూ ఏమీ వుండదని "ఎ.పి.సి.సి.సి.ఆర్." చెప్పటమేనని బయటి కమిటి తేల్చివేసింది. ఇంకా, అది ఆయుధాలు క్రింద పెట్టడ మని, సాయుధ పోరాట పంథాను విడనాడమని చెప్పుటతో సమానమని వాదించింది. ఈ అవగాహన తప్పని నాటి "ఎ. పి. సి. సి. సి. ఆర్" నాయకులు టి. నాగిరెడ్డి, డి. వెంకటేశ్వరరావులు సుదీర్ఘ విమర్శనాపత్రాలలో తీవ్రంగా విమర్శించి, తీవ్ర అతివాద అవకాశవాద దుందుడుకు చర్యలని, మార్క్సిజం-లెనినిజం ఆమోదించదని స్పష్టం చేశారు.

ఈ ఘటనల నేపథ్యంలో, అదేకాలంలో సి.పి.ఐ. (యం.యల్) లోపలా, బయటా అతివాద అవకాశవాద దుందుడుకు చర్యలపై సైద్ధాంతిక పోరాటాలు ప్రారంభమై ఫలితంగా పెదధోరణులు, వినాశకర చీలికలు సంభవించాయి. అందులో భాగంగానే "ఎ.పి.సి.సి.సి.ఆర్." నుండి విడిపోయి శ్రీకాకుళం జిల్లాకమిటీ నేరుగా కేంద్ర సి.పి.ఐ.(యం.యల్)లో అనుబంధ సంస్థగా చేరింది, అతివాద అవ కాశవాదంవైపు పయనించింది. అంతేగాక, యీ సందర్భంలో సి.పి.ఐ. (యం.యల్) నిర్మాణమే సాహసిక అతివాద వక్రీకరణలతో సి. పి. ఐ. (యం) నుండి చీలిక ఏర్పడుటతో ప్రారంభమైందని మరువరాదు. అట్టి చీలిక తదనంతరం ఏర్పడిన "ఎ.ఐ.సి సి.సి.ఆర్" నిర్మాణ అవగాహన, కర్తవ్యాలను పూర్తి చేయకముందే, కొన్ని వర్గాలు అతిక్రమించుటతో నిర్మాణ వక్రీకరణలకు గురైంది. అంచేతనే సి.పి.ఐ. (యం)పై సరియైన పద్ధతులలో సైద్ధాంతిక, నిర్మాణ, అంతర్గత పోరాటంతో విస్తారమైన క్రింది శ్రేణులను తమ విధానాలవైపు సి.పి.ఐ.(యం) నుండి ఆకర్షించు టతో విఫలమైంది. చారుమజుందార్ నాయకత్వంలో "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." సెక్టేరి యన్ వొంటెత్తు పోకడలు అవలంబించినందుననే దేవులపల్లి, టి. నాగిరెడ్డిల నాయ కత్వంలో ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారులు చీలిపోయి వేరే "ఎ.పి.సి.సి. సి.ఆర్" నిర్మాణంగా యేర్పడుట, యింతకుముందే తెలుసుకొన్నాము. ఈ ఘటనల

వెంటనే "ఎ.ఐ.సి.సి.సి.ఆర్" సమావేశమై సి.పి.ఐ. (ఎం.ఎల్)గా యేర్పడినట్లు ప్రకటించింది. అతివాద, సాహసిక, సెక్టేరియనిజంతోపాటు అధికార, నిర్మాణ నిరంకుశత్వం పెరుగుటతో చీలికలు, విచ్ఛిన్నతలకు మార్గ మేర్పడింది, పార్టీ నిర్మాణం, స్థిరత్వం ఆదిలోనే దెబ్బతిన్నది, విప్లవకారులలో అనైక్యతా బీజాలు వృద్ధి చెందసాగాయి భారత కమ్యూనిస్టు ఉద్యమ సైద్ధాంతికా బలహీనతా వారసత్వమూ, సాహసిక అతివాద పెడపోకడ కొనసాగింది.

ఈ సందర్భంలో పూర్వ కథనం వొక్కింత గుర్తు చేయుట అవసరంగా వుంది. మధురై సి.పి.ఐ.(ఎం) పార్టీ కాంగ్రెసు రాజకీయ సిద్ధాంత పత్రంపై ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్లీనంలో పుల్లారెడ్డి, వెంకటేశ్వరరావు, నాగిరెడ్డి, కొల్లా వెంకయ్యలు తీవ్ర విమర్శనా దాడిని సాగించుటలో ప్రముఖ పాత్ర వహించారు. అదే విధంగా బర్ద్వాన్ అఖిల భారత సి.పి.ఐ.(ఎం) ప్లీనంలో గూడ మధురై రాజకీయ విధానాన్ని తీవ్ర విమర్శకు గురిచేసి, పాలకొల్లులో తాము రూపొందించుకొన్న రాజకీయ విధానాన్ని సమర్థించుకొన్నారు. ఆ విధంగా నలుగురు కలసే సి.పి.ఐ.(ఎం) విధానాలపై దాడి చేసారు. ఆంధ్రప్రదేశ్ విప్లవ కమ్యూనిస్టు కమిటీగా యేర్పడిన తరువాత సి. పుల్లారెడ్డి గోదావరి లోయ అడవి ప్రాంత కమ్యూనిస్టు విప్లవకారులకు నాయకత్వం వహించుటకు అడవులలోనికి వెళ్ళారు, వ్యవసాయ విప్లవంలో భాగంగా ప్రతిఘటన పోరాటాలు సాగించారు, క్రమేణా పోరాట నాయకత్వానికి, జైలులో వున్న సైద్ధాంతిక నాయకత్వానికి ఆచరణలో అఘాతం యేర్పడింది, చర్యలు, సంప్రదింపులు సమన్వయ సమిష్టి అవగాహన రూపొందుటకు, వొకవర్గం అడవిలో మరో వర్గం జైలులో వున్న భౌతిక పరిస్థితులలో అవకాశం లేనందున, పుల్లారెడ్డి చీలిపోవుట అనివార్యమైందని చెప్పుకొనవలసి వుంటుంది.

పుల్లారెడ్డి వొకవైపు సి.పి.ఐ.(ఎం) "మితవాదం, నయా సంస్కరణ వాదాలపై సైద్ధాంతిక పోరాటం జరుపుతూ, మరోవైపు చారుమజుందార్ తీవ్ర అతివాద అవకాశవాదంపై కూడా సైద్ధాంతిక పోరాటం సాగించాడు. సి.పి.ఐ.(ఎం) "నియో రివిజనిజంపై" పోరాడుతున్నా మంటూనే కమ్యూనిస్టు విప్లవకారులలో అత్యధికులు నియో అతివాద వక్రీకరణ మార్గంలో పయనించారు. ఒక దశలో చైనా కమ్యూనిస్టు పార్టీ వీరికి బహిరంగ మద్దతు ప్రకటించుటతో దురదృష్టకరంగా మరింతగా తీవ్ర అతివాద సాహసిక అవకాశవాద వక్రీకరణలకు గురయ్యారు. చారుమజుందార్ ప్రారంభంలో అఖిల భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ కమిటీని యేర్పరచినపుడు, ఆంధ్రప్రదేశ్‌లో డి.వి. రావు, నాగిరెడ్డి, పుల్లారెడ్డి, కొల్లా వెంకయ్యలు కలసి మొదట ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ కమిటీని యేర్పరచారు. ఆ కమిటీ అగ్ర నాయకులందరూ అరెస్టు అయిన తరువాత గోదావరి లోయ అడవి ప్రాంతంలో రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాలు నడుపుతున్న పుల్లారెడ్డి,

తన అనుచరులు, బయట వున్న నీలం రామచంద్రయ్య, పి. రామ నరసయ్య, మరి కొందరితో ఆంధ్రప్రదేశ్ విప్లవ కమ్యూనిస్టు పార్టీని తన నాయకత్వంలో యేర్పర చారు. దీనిని సమర్థించుకొనుటకు సమన్వయ కమిటీలను యేర్పాటు చేయట మంటేనే ఆ పార్టీలో అనేక గ్రూపులున్నవనే అవగాహనను బలపరుస్తుంది. ఒక రాజకీయ పంథాకు ఒకేవొక శిలా సదృశ్య పార్టీ నిర్మాణం, కేంద్రీకృత ప్రజాస్వామ్యం, విమర్శ, ఆత్మవిమర్శ, ఉక్కు క్రమశిక్షణ ప్రాణప్రదమైనవి. సమన్వయ కమిటీలు పార్టీలుగా మనజాలవు, పార్టీ నిర్మాణం, సమిష్టి సైద్ధాంతిక అవగాహనలు, రాజకీయ విధానం, వ్యూహం, ఎత్తుగడలు రూపొందించు వొక క్రమదశలో కొంతకాలంపాటు, పార్టీ నిర్మాణ లక్ష్యంతో పని చేస్తాయి. లక్ష్యం నెరవేరినంతనే సమసిపోతాయి.

విప్లవ కమ్యూనిస్టుల పరిణామాల యీ దశలోనే టి. నాగిరెడ్డి, డి.వి.రావులు ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ కమిటి నాయకులుగా జైలునుండి రహస్య పత్రంలో గోదావరి లోయ వుద్యమాన్ని తీవ్రంగా విమర్శించుతూ "తీవ్ర అతివాద సాహసిక వక్రీకరణ"గా పేర్కొంటూ సుదీర్ఘ "అతివాద అవకాశవాదంపై పోరాటం" అనే సైద్ధాంతిక విశ్లేషణ పత్రాన్ని ప్రకటించారు. ఈ సిద్ధాంతపత్రం నాడు ఆంధ్రప్రదేశ్ విప్లవ కమ్యూనిస్టుల ముందున్న సైద్ధాంతిక, రాజకీయ, నిర్మాణ సమస్యలతోపాటు విప్లవ పంథా, వ్యూహం, ఎత్తుగడల సమస్యలన్నిటిని చర్చించింది.

ఆంధ్రప్రదేశ్ విప్లవ కమ్యూనిస్టు కమిటి రాష్ట్ర కాన్ఫరెన్సును 1973లో కా. పుల్లారెడ్డి నాయకత్వంలో జరుపుకొంది. పుల్లారెడ్డితోపాటు నీలం రామ చంద్రయ్య, పి. రామ నరసయ్యలు ప్రధాన పాత్ర వహించి, ఆంధ్రప్రదేశ్ విప్లవ కమ్యూనిస్టుపార్టీని యేర్పాటు చేసారు. పార్టీ వ్యవసాయ విప్లవ ప్రజా వుద్యమ మార్గ దర్శక సూత్రాలను ఆమోదించింది.

## సత్యనారాయణ సింగ్ నాయకత్వంలోని కమ్యూనిస్టు విప్లవకారులు :

చారుమజుందార్ అనుసరించే అతివాద దుస్సాహసిక పంథాను తీవ్రంగా విమర్శించిన సత్యనారాయణ సింగ్ నాయకత్వంలోని సి.పి.ఐ.(ఎం.ఎల్) వర్గాలు ప్రజా పంథాను చేబట్టి మరో గ్రూపుగా యేర్పడ్డారు. ఈ గ్రూపు సి. పుల్లారెడ్డి నాయకత్వంలో ఆంధ్రప్రదేశ్‌లోని విప్లవ కమ్యూనిస్టు గ్రూపుతో కలసి, చారుమజుందార్ విధానాన్ని త్రోసిరాజని సత్యనారాయణ సింగ్ నాయకత్వంలో సి.పి.ఐ.(ఎం.ఎల్) యేర్పడినది. ఈ కాలంలోనే ఇందిరాగాంధీ అత్యవసర పరిస్థితి ప్రకటించి, ప్రజాస్వామ్య హక్కులను పూర్తిగా హరించివేసి, తీవ్ర ఫాసిస్టు నిర్బంధ, హింసాకాండలను ప్రవేశ పెట్టుటతో తదితర విప్లవ కమ్యూనిస్టు గ్రూపులు కూడ సత్యనారాయణ సింగ్, పుల్లారెడ్డీల నాయకత్వంలోని సి.పి.ఐ.(ఎం.ఎల్)గా యేర్పడింది.

అత్యవసర పరిస్థితి ఎత్తివేసిన తదనంతరం జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు ఘోర పరాజయం పొందుట, ఫలితంగా యేర్పడిన జనతా ప్రభుత్వం ప్రజాస్వామ్య,

పౌరహక్కులు పునరుద్ధరించుటతో ప్రజా వుద్యమాలు తిరిగి కొనసాగినవి. అదే కాలంలో క్రమేణా, సి.పి.ఐ. (యం. యల్) జనరల్ సెక్రటరీ సత్యనారాయణ సింగు నాయకత్వంలో భారత బూర్జువా పాలకవర్గంలో మరో శాఖను బలపరుస్తూ, అనుసరించసాగింది. అంతర్జాతీయంగా "రష్యన్ సోషల్ సామ్రాజ్యవాదం"కు వ్యతిరేకంగా, అంతర్జాతీయ ఐక్య సంఘటనను రూపొందించాలనే నినాదాన్ని చేబట్టి, పరోక్షంగా అమెరికన్ సామ్రాజ్యవాదంతో సహకరించసాగింది. అమెరికన్ సామ్రాజ్యవాద అనుకూల దేశీయ పెట్టుబడిదారి వర్గాలతో ఐక్య సంఘటనను రూపొందించే కార్యక్రమాన్ని చేబట్టారు. ఆంధ్రప్రదేశ్‌లో పుల్లారెడ్డి నాయకత్వంలో భూస్వాములు, ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్న సాయుధ రైతాంగ వ్యవసాయ విప్లవోద్యమాన్ని విరమించమని కోరసాగారు. వ్యవసాయ విప్లవోద్యమాన్ని, సాయుధ రైతాంగ భూస్వామ్య వ్యతిరేక ప్రతిఘటనోద్యమాన్ని బలపరిచే వర్గాలు సి.పి.ఐ.(యం.యల్)లో మైనారిటీ వర్గాలయ్యాయి. సత్యనారాయణసింగ్ రాజీ విధానాలపై పుల్లారెడ్డి తీవ్ర విమర్శన, ఆ పార్టీ శ్రేణులలో క్రమేణా ఆధిక్యతను సంపాదించుటతో సింగు విధానం వోటమిసెందింది. ప్రత్యేక సి.పి.ఐ. (యం.యల్) కాంగ్రెసులో యస్. యన్. సింగ్ రాజకీయ విధానం వోటమి చెంది, సి. పుల్లారెడ్డి ప్రత్యామ్నాయ రాజకీయ విధానం విజయం పొందుటతో పార్టీ జనరల్ సెక్రటరీగా ఎన్నుకొనబడ్డారు. సి.పుల్లారెడ్డి తెలంగాణా, గోదావరిలోయ వ్యవసాయ విప్లవ పోరాట అనుభవాలతో మార్క్సిస్టు-లెనినిస్టుల సారధ్యం చేపట్టారు.

ఈ సందర్భంలో సమానాంతరంగా భారత కమ్యూనిస్టు విప్లవకారులలో జరిగిన పరిణామాలను తెలుసుకొనుట అత్యవసరము. ఆంధ్ర విప్లవ కమ్యూనిస్టులు ఒక గ్రూపుగా ఏర్పడిన నాటినుండి సత్యనారాయణసింగు, పశ్చిమబెంగాల్ ఉత్తరజోన్ కమిటీల కమ్యూనిస్టు విప్లవకారులతో సన్నిహిత సంబంధాలనే కలిగియున్నారు. ఈ గ్రూపులేగాక నాడు 1980 దశకంలో సి.పి.ఐ. (యం.యల్) పేరులతో అనేక గ్రూపులు పనిచేస్తూ వుండుట నాటి రాజకీయ వాస్తవికత. ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారులగ్రూపు ప్రారంభంనుండి ఉత్తరజోన్ కమిటీ,పశ్చిమబెంగాల్ కమ్యూనిస్టు విప్లవకారులతో కలసి ఒకే పార్టీగా ఏర్పడుదామనే ప్రతిపాదనలు పరస్పరం చేసుకొంటూనే వున్నవి. ఈ విషయంలో పరస్పరం సంప్రదింపులు, అభిప్రాయాల మార్పిడివంటి సూత్రబద్ధ విధానాలను అనుసరించకుండా యాంత్రికంగా పుల్లారెడ్డి సత్యనారాయణసింగు గ్రూపులు రెండూ కలసి, అనవసర తొందరపాటు చర్యగా 1975 జూన్‌కు ముందే ఏర్పడినట్లు సంయుక్త ప్రకటన గావించాయి. అంతేగాక కలిసిపోయాక సంభాషణలు, సంప్రదింపుల అవసరం కన్పించకపోవుటతో వాటిని చేబట్టి, వొక సమిష్టి రాజకీయ అవగాహన రూపొందగల అవకాశాన్ని జారవిడుచుకొన్నారు. ఈ సంయుక్త గ్రూపు తదనంతర కాలంలో రెండుగా చీలినపుడు అవి తిరిగి తిరిగి అనేక చిన్న చిన్న గ్రూపులుగా ఏర్పడినవి.

ఈ పరిణామాలకు భిన్నంగా మరోవైపున ఆంధ్రప్రదేశ్ విప్లవకారులు, పశ్చిమ బెంగాల్ ఉత్తరజోన్ కమిటీవారి అనుచరులు కలసి "యూనిటి సెంటర్ ఆఫ్ కమ్యూనిస్టు రివల్యూషనరిస్ ఆఫ్ ఇండియా (యుసిసిఆర్-యం యల్)గా 1975 ఏప్రిల్‌లో ఏర్పడి సూత్రబద్ధంగా సంప్రదింపులు, సంభాషణలు, పరస్పర అవగాహనల మార్పిడుల ఐక్యతా ప్రాతిపదికలపై తమ సంస్థలో విలీనంచేసుకొనుటకు ప్రయత్నించారు. పశ్చిమబెంగాల్ సిసిఆర్ వర్గాలు తప్ప మిగిలిన నూతన విప్లవవర్గాలేవీ కలసిరాలేదు.

అత్యవసర పరిస్థితి కాలంలో యస్.యన్.సింగు- పుల్లారెడ్డిల సంయుక్త గ్రూపుల "సోషల్ సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనను, అమెరికాతోసహా కలసి ఏర్పాటు చేయుటకు సెంట్రల్ ఆర్గనైజింగు కమిటి (సి.ఒ.సి), యుసిసిఆర్ (ఎం.యల్)లను సంప్రదింపులకు ఆహ్వానించింది. వారు యిచ్చిన నినాదానికి ఐక్యసంఘటన నినాదానికి ఎట్టి సంబంధం లేదని, ఐక్యసంఘటనా భావన అవకాశవాదమని, ఆహ్వానాన్ని యు.సి.సి.ఆర్.ఐ. తిరస్కరించింది. ఈ విధంగా రెండు దృక్పథాలు సమానాంతరంగా అభివృద్ధి ప్రారంభమైంది.

జనతాపార్టీ అధికారంలోనికి వచ్చిన వెంటనే యస్. యన్. సింగు గ్రూపు వర్గ రాజకీయపంథాను అనుసరించి పాలకపార్టీకి మద్దతునివ్వ ప్రారంభించుటతో యు.సి.సి.ఆర్.ఐ "లొంగుబాటు రాజకీయాలు" అనే చిరుపుస్తకంలో, "సంభాషణలు ఎందుకు?" అనే పత్రికా ప్రకటనలో తీవ్రవిమర్శలకు గురిచేసింది. అదే విధంగా పుల్లారెడ్డి వర్గాలుకూడ యస్.యన్.సింగు పంథాను వ్యతిరేకించనట్లు చెప్పబడుతున్నది. ఆంధ్రప్రదేశ్‌లో వారి రాష్ట్రకమిటి మాత్రం బలపరచుట చేస్తున్నట్లు చిరుపుస్తకం స్పష్టంచేసింది. ఈ పరిణామాలు సింగు గ్రూపులో చీలిక ఏర్పడుటను అదే పుల్లారెడ్డి గ్రూపుగా చెప్పవలసి వుంటుంది.

మే 1980 "న్యూ డెమోక్రసీ" లోని రచనలు, ప్రకటనలలో "వ్యవసాయ విప్లవం" అను పదాలను ఎంతగా వాడినా సింగు గ్రూపును తీవ్రంగా విమర్శించినా, అమెరికా అనుకూల విధానాన్ని రెండవ ప్రపంచశక్తులు ముఖ్యంగా అమెరికాతో కలసి, సోవియట్ వ్యతిరేక ఐక్యసంఘటన అనే నినాదాన్ని అమలుచేయ ప్రయత్నించారని, ఆదిత్య అనే కలంపేరుతో దేవులపల్లి తీవ్రంగా విమర్శించారు.[1] అంతేగాక సోవియట్ వ్యతిరేక ప్రపంచ ఐక్యసంఘటన, ప్రపంచ విప్లవకమ్యూనిస్టు నినాదంగా వుంది. అట్టి ఐక్యసంఘటనను సోవియట్ యూనియన్‌ను బలపరచే సి.పి.ఐ.(ఎం.),

---

1. ప్రోవిటేరియన్‌లైన్ పబ్లికేషన్. సప్లిమెంటు : ఎస్.ఎన్.ఎస్. గ్రూప్స్ రైట్ ఆపర్చ్యూనిజం అండర్ ది గాబ్స్ ఆఫ్ లెఫ్ట్ ఫ్రేజ్ మోంగరింగ్. సెప్టెంబరు, 1980 ఫోర్‌వర్డ్. పే. 2.

సి.పి.ఐ. లతో కలసి పుల్లారెడ్డి-సింగులు సంయుక్తంగా నిర్మించ తలబెట్టుట, అది వ్యవసాయ విప్లవసాధనమనుట మితవాద అవకాశవాదంగా దేవులపల్లి తీవ్రంగా విమర్శించి, ఇందిరా కాంగ్రెసువేపు పయనించుటతప్ప మరొకటి కాదన్నారు.

సింగుగ్రూపు ఐక్యసంఘటన పోరాటాల క్రమంలోనే ఏర్పడుతుందన్న సర్వజనామోద సత్యాన్ని చెప్పింది. పుల్లారెడ్డి గ్రూపు ఇందిరాగాంధివేపుకు పయనించుటకు, బలపరచుటకు, సమస్యకు సంబంధం లేని, 18 ఫిబ్రవరి 1980 పెకింగు రివ్యూలోని వ్యాసాన్ని ఉదహరించి దని విమర్శించారు. యు.ఎస్.ఎస్.ఆర్. ను, సి.పి.ఐ., సి.పి.ఐ.(ఎం)లు, స్థూలంగా ఇందిరాగాంధీని బలపరుస్తూ వుండుటతో, వారితో ఐక్యసంఘటన సరికాదన్నారు. సింగు గ్రూపు సి.పి.ఐ.(ఎం.ఎల్) "కార్మిక, కర్షక ఐక్యత ప్రజాస్వామికదేశ భక్తవర్గాల విస్తృత ఐక్యసంఘటనకు పునాది అవుతుందని" అనుటలో స్పష్టం చేయని కార్మికవర్గ నాయకత్వం యిమిడివుంది. జనతా ప్రజాస్వామ్య విప్లవంలో రైతాంగం పూర్తిగా తనకాళ్ళమీదే నిలబడజాలదు. అది కార్మికవర్గ నాయకత్వంలో వ్యవసాయ విప్లవపంథాలో పురోగమిస్తుంది. బూర్జువా, మితవాదవర్గాలు నాయకత్వం వహించితే వ్యవసాయ విప్లవం సంపూర్ణ విజయం పొందజాలదు. వాగ్దానాలు లేక కొన్ని సంస్కరణలతో ముగుస్తుంది." [1] అని దేవులపల్లి నిర్ధారించారు. అనగా "ఐక్యసంఘటన మితవాద ప్రజాస్వామ్యవాదుల నాయకత్వంలో" ఏర్పడాలని ఎస్.ఎన్ ఎస్ గ్రూపు వాంఛింపతున్నదన్నారు. అంటే ఐక్యస-ఘటనపై కార్మికవర్గం ఏకైక నాయకత్వాన్ని త్రోసిబుచ్చుట అవుతుందన్నారు. రైతాంగపు ప్రశ్నయే వుండదని మొత్తంగా మార్క్సిజం—లెనినింల నుండి వైదొలగుట అవుతుందని తేల్చారు.

## లిబరేషన్ గ్రూపు :

1. కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా (ఎం.ఎల్) నుండి విడివడి "లిబరేషన్ గ్రూపు"గా 1970 దశకం ప్రారంభంలో వొక కాన్ఫరెన్స్ జరిగి, వొక ప్రత్యేక నిర్మాణ స్వరూపాన్ని పొందింది. అయినా డిసెంబరు 1992లో జరిగిన అఖిలభారత పార్టీ కాంగ్రెసులో రాజకీయ పంథాను రూపొందించుకొనగలిగింది. ఈ పంథాను సి.పి.ఐ. పంథాకంటె అతివాదంవేపు మొగ్గుచూపునదిగాను, అతివాద సి.పి.ఐ. (ఎం. ఎల్)తో పోల్చిన మితవాద సంస్కరణవాదంవేపు మొగ్గినట్లుగా, అదేకాలంలో సి.పి. ఐ., సి.పి.ఐ. (ఎం)లకు భిన్నంగా రూపొందించుకొన్నట్లు కన్పడుతున్నది. సహజంగానే యీ ప్రయత్నం కొన్ని ముఖ్య విషయాలలో అస్పష్టత చోటుచేసుకొనుట జరిగింది. అంచేతనే లక్ష్యం పాక్షికంగా నెరవేరింది.

---

1. —అదే—(1976) ఎస్.ఎన్.ఎస్.పై విమర్శనాపత్రం. పే. 8.

భారత విప్లవ పంథా సమస్యపై, ఒకే వొక కమ్యూనిస్టుపార్టీ నిర్మాణ సమస్యలపై, జాతుల, ఉపజాతుల సమస్యలపై కేంద్ర ప్రభుత్వంతో పోరాట విషయాలలో అంతర్జాతీయ స్థాయిలో సోషలిజం-సంస్కరణవాదాల సంఘర్షణా సమస్యలపై వారు చేబట్టిన విధానాలు వారిని సంస్కరణవాద పంథాలోనికి చేర్చాయి. సి.పి.ఐ. సి.పి.ఐ. (యం)ల సంబంధాలు "తీపి-చేదుల"సమ్మిశ్రంగా వుంటున్నవి. సంస్కరణ వాదులు సంతోషాన్ని వెలిబుచ్చుతున్నారు. సి. పి. ఐ. (యం) 1992 (?) గత కాంగ్రెసులో తమ పత్రాలతో, "నక్సలైట్లలోని కొన్ని వర్గాలలో" తెలివితేటలు కన్పబడుతున్నవని అంటూ, వారు "రాటుదేలిన" వారైనందున వారి వర్గ చైతన్యం, ప్రయోజనాలు వారి నంటిపెట్టుకొనే వున్నవి. అంచేతనే వారు "లిబరేషన్ గ్రూపును కౌగలించుకొనలేకపోయారు, అంటే సన్నిహితులు కాలేకపోయారు. వినోదమిశ్రా మాటలలో "పెద్ద అన్న వైఖరి" కొనసాగించుతున్నారని, సి.పి.ఐ. (యం.యల్) జనశక్తి గ్రూపు అభిప్రాయంగా వుంది.[1]

2. సి.పి.ఐ. (యం.యల్.) లిబరేషన్ గ్రూపు 1992లో జరుపుకొన్న తమ పార్టీ కాంగ్రెసులో ఆమోదించిన కార్యక్రమంలో "విప్లవ పంథా" అన్న ఉప శీర్షికలో "సాధారణ పరిస్థితులలో చట్టబద్ధంగా, బహిరంగంగా కమ్యూనిస్టులు పార్లమెంటరీ పోరాటాలు చేయుటకు భారతదేశంలో తగిన రాజకీయ పరిస్థితులున్నవని అంగీకరించాలి. ఎన్నికలలో కమ్యూనిస్టులు వివిధ స్థానాలలో విజయం సంపాదించుట, స్థానిక సంస్థలలో, రాష్ట్ర అసెంబ్లీలలో మెజారిటి సంపాదించుట సాధ్యము. దీర్ఘ రాజకీయ పోరాటాల ద్వారా, దేశంలో రాజకీయ శక్తుల బలాబలాలలో మార్పు తీసుకొని వచ్చుట సాధ్యం, కాన కమ్యూనిస్టుపార్టీ అవకాశాలను వినియోగించుకొని స్వతంత్రగా కాని లేక అట్టి అభిప్రాయాలనే గల యితర శక్తులతో కలసి, సంకీర్ణ పాలనా వ్యవస్థలనే చేబట్టి, తమపై విశ్వాసం వుంచి ఎన్నుకొన్న వోటరులకు, ప్రజా సామాన్యానికి న్యాయం చేకూర్చ నెంచుతున్నదని పార్టీ కాంగ్రెసు అభిప్రాయపడింది.

"అట్టి ప్రభుత్వాలలో పార్టీ (సి. పి. ఐ. (యం.యల్) లిబరేషన్) పాత సంక్షిప్త క్రింది మార్గదర్శక సూత్రాలపై ఆధారపడి వుంటుంది.

"పార్టీ నిర్మాణ స్వతంత్రతను, ఆచరణ, రాజకీయ చొరవను ఎట్టి పరిస్థితులలోను విడనాడదు. ప్రభుత్వాధికారాలన్నిటిని వినియోగించి, ప్రజాచైతన్యాన్నిబట్టి నూతన ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయ, అభివృద్ధికర సంస్కరణలను చేస్తుంది. అట్టి ప్రభుత్వాల యంత్రాంగం, విస్తృత విప్లవ ప్రతిపక్షంలో భాగంగానే సేవలందించుతుంది. ప్రభుత్వం, పార్టీ, ప్రజాస్వామ్య శక్తులు, ప్రజాస్వామ్య చైతన్యం, ప్రజా

---

1. ప్రంలెప్టిజం ఎ సోమర్ స్టార్ టు రాబిడ్ రివిజనిజం (1994) జనశక్తి, జూన్ 1994. పే. 35.

వుద్యమాలు స్వేచ్ఛగా అభివృద్ధి చెందుటకు, ఎట్టి పరిస్థితులలోను ఎట్టి ఆటంకాలు లేకుండా చూడాలి. పరిస్థితులలో, రాజకీయాలలో వచ్చే "మలుపులు, మెలికలకు" అంత్య నిర్ణయాత్మక విజయంకై పోరాడుటకు సంఘటన, పార్టీ సర్వసన్నద్ధంగా ఎప్పుడూ వుంటుంది.

సి.పి.ఐ.(యం.యల్.) లిబరేషన్‌పై అవగాహనకు వచ్చుటకు జరిపిన నేపథ్య రాజకీయ సైద్ధాంతిక పోరాటాన్ని సంక్షిప్తంగా తెలుసుకొంటేనే, వ్యూహం, ఎత్తుగడలలో వచ్చిన సమగ్ర మార్పు అవగతమౌతుంది.

3. విప్లవ కమ్యూనిస్టులు శాశ్వతంగా ఎన్నికలను బహిష్కరించుట పొరపాటనే పునరాలోచన 1980 ప్రాంతంలో లిబరేషను గ్రూపులో ఏర్పడింది. సి.పి.ఐ. (యం.యల్.) 1982 పార్టీ కాంగ్రెసులో వొక డాక్యుమెంటులో అస్పష్టంగా, గందరగోళంగానైనా, ఎన్నికలలో పాల్గొనాలనే పంథా ప్రతిపాదించబడింది. అదే సమస్యపై అక్టోబరు 1984 లిబరేషన్ సంచికలో ఆగస్టు 1920 కొమింటరను 2వ పార్టీ కాంగ్రెసు "కమ్యూనిస్టుపార్టి, పార్లమెంటు"అనే డాక్యుమెంటును ప్రకటించారు. ఆ పత్రం, శాంతియుత పరిణామ భ్రమలను త్రోసి బుచ్చుతూ, ఎన్నికలలో పార్లమెంటులో సాధారణ పరిస్థితులలో అత్యధిక మెజారిటీని సంపాదించటనే భ్రమను కూడ త్రోసిబుచ్చింది. ఒకవేళ మెజారిటి లభించితే కమ్యూనిస్టుపార్టి చేబట్టవలసిన చర్యలను యిలా పేర్కొన్నది.

అవి, "ఎ) కేంద్ర బూర్జువా ప్రభుత్వాధికారానికి వ్యతిరేకంగా విప్లవ ప్రతిపక్షాన్ని రూపొందించాలి. బి) బడుగువర్గాలకు, ప్రజలకు అన్ని విధానాల పూర్తి సహాయ, సహకారాలను అందచేయాలి. సాయుధ కార్మిక వలంటీర్ల నిర్మాణం చేబట్టాలి. సి) కొన్ని ప్రత్యేక పరిస్థితులలో స్థానిక ప్రభుత్వాలను తొలగించి, కార్మిక, కర్షక ప్రతినిధుల సోవియట్లను పాలనా సంస్థలుగా ఏర్పాటు చేయాలి.

అంతేగాక, 1920 కొమింటరను పత్రం ప్రకటించి, 1984 లో ఎన్నికల యెడల వొక సమగ్ర అవగాహనాభివృద్ధికి తోడ్పడుతూ, 1992 లో అట్టి అవగాహనాభివృద్ధి క్రమంలో ఎన్నికలలో పాల్గొనుట, మెజారిటి లభించిన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయుట, మైనారిటీయైన, అట్టి అభిప్రాయాలు కలిగిన యితర పార్టీలతో కలసి "సంకీర్ణ ప్రభుత్వాన్ని" ఏర్పాటు చేయుట అనే అవగాహనకు లిబరేషన్ గ్రూపు చేరుకున్నది.

4. సి.పి.ఐ. (యం.యల్.) లిబరేషన్ గ్రూపు రాజకీయ వ్యూహం, ఎత్తుగడల అవగాహనలపై, జనశక్తి వర్గాల విమర్శనా, అవగాహనలు యిలా వున్నవి.

"మావో శాంతియుత పరివర్తనను," అవగాహనను చర్చించుట అంటే మావో దృక్పథానికి సుముఖంగా కృశ్చేవ్ దృక్పథాన్ని త్రోసిబుచ్చుటయే అగు

తుంది. మావో "శాంతియుత పరివర్తనను" వొక ఎత్తుగడగా బలపరచగా, కృశ్చేవ్ దానిని వ్యూహంగానెంచి, ఆచరణ కొనసాగించారు. అంటే రాజ్యాధికారం కొరకు జరిగే పోరాటపంథా వ్యూహంలో సాయుధ పోరాటం, తగిన పరిస్థితులలో చేబట్టుట జరుగుతుంది. మావో ఆలోచనా విధానంలోని వ్యూహంలో సాయుధ పోరాటం త్రోసిబుచ్చుట జరుగలేదు. కృశ్చేవ్ ఆలోచనా విధానంలో పోరాట వ్యూహం ఎత్తుగడలు రెండింటిలోను సాయుధ పోరాటం లేనేలేదు. ఇదే ప్రధానంగా గుర్తు పెట్టుకొనవలసి వుంది. మరో విషయం కృశ్చేవ్ యీ యుగాన్ని సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన యుగంగా నిర్వచించి, సాయుధ పోరాటాన్ని వ్యూహం, ఎత్తుగడలు రెండింటినుండి త్రోసివేసి, ఎత్తివేయబడింది. సంగ్రహంగా "శాంతియుత పరిణామం" ఎత్తుగడల పంథాగా మావో ఆమోదం పొందింది. అదే కాలంలో "రాజ్యాధికారం చేబట్టుటకు ఆయుధ, సైనికశక్తిని వినియోగించుట తప్పనిసరి వ్యూహంగా" మావో ఆమోదం పొందింది. అయితే ఎత్తుగడలలో వ్యూహంలో ద్వంద్వవిధానం మావో అవగాహనగా వుండుటలో స్థూలభేదాన్ని విప్లవ కమ్యూనిస్టు వర్గాలు, ముఖ్యంగా ఎం.ఎల్. వర్గాలు దానిని గందరగోళపరచాయి. "ప్రజా స్వామ్య సంస్థలన్నీ ప్రధానంగా సంకుచిత బలహీన పునాదులపై ఆధారపడి వున్న దేశాలలో, అంతేగాక కొద్దిపాటి విజయాలు, సంస్కరణలు, ప్రజల మిలిటెంటు పోరాట చైతన్యం, శక్తిపై మాత్రమే సాధ్యం కాగల పరిస్థితులలో, "సాధారణ పరిస్థితులలో" రాష్ట్రప్రభుత్వాలను యేకంగా వారు ఏ విధంగా యేర్పాటు చేయగలమని యెంచుతున్నారనే ప్రశ్నకు, అందులో ఎట్టి వైరుధ్యాన్నిగాని, భ్రమలుగాని తలచరాదంటూ సాయుధ విప్లవం కొరకై వారి సన్నాహాలను వాస్తవాలు తెలియ జేయగలవనే" అభిప్రాయాలు లిబరేషన్ గ్రూపు అవగాహనగా వుందని, జనశక్తి ఎం.ఎల్. గ్రూపు వివరించింది. [1]

"నాటినుండి "తప్పులు దిద్దుకొనే మార్గంలో" 13 సంవత్సరాల సుదీర్ఘ ప్రయాణం, చివరకు బహిరంగ కలకత్తా పార్టీ కాంగ్రెసులో పార్టీని బహిరంగపార్టీ చేసి, బహిరంగ కేంద్రకమిటిలో చర్చించి, ప్రతిది నిర్ణయించే, ప్రజాస్వామ్య విధానాలను అనుసరించ ప్రారంభించారు.

విప్లవ పంథాకు సంబంధించినంతవరకు, ఆ కార్యక్రమాలను లిబరేషన్ గ్రూపు వదలివేయుట జరిగింది. ఆదేకాలంలో సి.పి.ఐ., సి.పి.ఐ(ఎం)లవిధానాలనుండి మరోవైపున యితర ఎం.ఎల్. విప్లవ కమ్యూనిస్టు గ్రూపుల విధానాలనుండి తమ రాజకీయ విధానాలను వేరుపరచి, రివిజనిజం, నియోలిజనిజం, అతివాదం, ఉగ్రవాదాలనుండి తమ విధానాలను స్పష్టంచేయుట జరిగింది. తమ పార్టీని 20వ, శతా

1. ఫ్రం "లెఫ్టిజం" ఎ సోమర్‌సాల్ట్ టు రాబిడ్ రివిజనిజం (1994) జనశక్తి మంత్లీ, వా 2. నం. 4, 5, 6, ఏప్రిల్ 1994. పే. 47-48.

ద్ధాంతానికి అన్నిటికంటె పెద్ద పార్టీగా చేయ కాంగ్రెసులో ప్రతిన బూనారు. అదే కాలంలో తమ ప్రత్యేక పోరాట పంథాను చేబట్టారు. ఐక్యకమ్యూనిస్టుపార్టీని రూపొందించే వ్యూహాన్ని రూపొందించి, ఆచరణలో సి.పి.ఐ., సి.పి.ఐ.(ఎం) లతో, తమ రాజకీయ విధానాలను, ఎత్తుగడలు, నిర్మాణ నిబంధనలను అమలుచేయ మొదలు పెట్టారు.

## సి.పి.ఐ.(ఎం.ఎల్.) లిబరేషన్ 6వ పార్టీ కాంగ్రెసు :

అక్టోబరు 1977లో జరిగిన లిబరేషన్ 6వ పార్టీ కాంగ్రెసు రాజకీయ విధానం, ఎత్తుగడలను ఆమోదించి విడుదల చేసింది. ముఖ్యాంశాలు యిలా వున్నవి.

నూతన లేక జనతా ప్రజాస్వామ్య విప్లవం లక్ష్యంగా వ్యూహం, ఎత్తుగడలను స్పష్టం చేసింది. బడాబూర్జువా, భూస్వామ్య పాలక వర్గాలను కూలద్రోసి, విప్లవ జనతా ప్రజాస్వామ్య నియంతృత్వాన్ని ఏర్పరచాలి. పాలకవర్గాలను, దానిని బలపరచే సామ్రాజ్యవాద శక్తులను వోడించాలి. వివిధ వ్యూడలు రూపాలకు, అవశేషాలకు భారత సామాన్య ప్రజానీకానికి మధ్య కలదే ప్రధాన వైరుధ్యంగా, సామ్రాజ్యవాదానికి భారత జాతీయతకు, బడా పెట్టుబడిదారి వర్గానికి భారత ప్రజలకు ముఖ్యంగా కార్మిక వర్గానికి, పాలకవర్గాలలోని వివిధ శాఖల మధ్య గల మౌలిక, ప్రాథమిక వైరుధ్యాలను అనుసరించవలసిన ఎత్తుగడలను, రాజకీయ తదితర తీర్మానాలలో వివరించారు.

మితవాద అభివృద్ధి నిరోధకశక్తులు, మరోవైపున మతవాద, వేర్పాటువాద శక్తులు భారత రాజకీయాలలో అత్యంత వేగంగా అభివృద్ధిచెంది, బలపడనపుడు, నూతన సరళీకృత ఆర్థిక విధానాలతో మధ్యేమార్గవాద శక్తులు, ప్రజాపోరాటాల వాడిని, తీవ్రతను మొద్దుబారించుచున్నవి. ఈ పరిస్థితి నూతన నమూనా వామపక్ష ఐక్యత స్థిరపునాదిపై ఏర్పడవలసిన అవసరముంది. అవకాశవాద వామపక్ష ఐక్యత కాదు. ఆశయాలతో రాజీపడనిది, రాష్ట్రప్రభుత్వాల బతుకును ఏ విధంగానైనా కొనసాగించుటకు రాజీపడనిది, చివరకు మౌలిక అస్థిత్వానికై రాజీపడే బూర్జువా పార్టీల "కలగూరగంప" కాకూడదు. అదే లక్ష్యంతో లిబరేషన్ గ్రూపు "వామపక్షాల కాన్ఫెడరేషన్" అనే వామపక్షాల సంస్థా నిర్మాణాన్ని ప్రతిపాదించింది. జాతీయ రాజకీయాలలో యిది వామపక్ష సంయుక్త శక్తిగా పనిచేస్తుంది. అన్ని వామపక్షాలు ఆమోదించిన సమిష్టి కనీస కార్యక్రమంపై పనిచేస్తుంది. అది వొక పోరాట సమిష్టిశక్తి. ఈ వామపక్ష కాన్ఫెడరేషన్ మితవాద అభివృద్ధి నిరోధకశక్తులకు వ్యతిరేకంగా, వామపక్షేతర బూర్జువా పార్టీలతో వొప్పందాలు చేసుకొని పోరాడుతుంది. అట్టి వామపక్ష కాన్ఫెడరేషన్ వామపక్ష శక్తుల అత్యంత బలమైన సమిష్టిశక్తిగా అవతరించుటకు తోడ్పడుతుంది, ఒక మార్గాన్ని నిర్దేశించుతుంది.

వామపక్ష కాన్ఫెడరేషన్ ఐక్యకార్యాచరణ, పోరాటాలను చేబట్టు క్రమంలోనే వామ పక్ష ఐక్యత రూపొందుట సుగమం అగుతుందనేది సి పి.ఐ.(ఎం.ఎల్.) లిబరేషను వైఖరిగా వుంది. [1].

నూతన ప్రజాస్వామ్య విప్లవంలో పార్టీ కేంద్ర మౌలిక కర్తవ్యమైన జనతా ప్రజాస్వామ్య లేక నూతన ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణంలో వర్గశక్తుల పొందిక ప్రాధాన్యత వహించుతుంది. అట్టి సంఘటన కనీస కార్యక్రమ ప్రాదిపదికపై కార్మిక, కర్షక ఐక్యత పునాదిగా కార్మికవర్గ నాయకత్వంలో జనతా ప్రజాస్వామ్య విప్లవదశలో ప్రజాస్వామ్య నియంతృత్వం యేర్పడువరకు కొనసాగుతుంది. ఆ సంఘటనలో శక్తులు శూన్యంలోగాక వివిధ సమస్యలపై వివిధ పార్టీల జండాల క్రింద, పాక్షిక కార్యక్రమాలపై సమీకరించబడుతవి. సమస్యల ప్రాతిపదికపై ఐక్యసంఘటనల ఎత్తుగడలు, వాస్తవికతల అభివృద్ధి, అవగాహనలతో రూపొందు తవి. వర్గసారాంశంగా సమాజ వైరుధ్యాల సంఘర్షణలు ముందుకు వస్తాయి. సమ స్యల వెలుగులో ప్రధాన శత్రువును యేకాకిని చేయుటకు ఐక్యసంఘటనా ఎత్తు గడలు మంచి సాధనాలుగా పరిగణించాలి.

సి.పి.ఐ. (ఎం.ఎల్) 6వ పార్టీ కాంగ్రెసు తాజా రాజకీయ విధానంలో, "రెండుఎత్తుగడల పోరాటం"గా పేర్కొంటూ, ఎత్తు గడలను యిలా వివరించింది. [2]

"ఏ విప్లవ ఎత్తుగడల పంథాకైనా, కార్మికవర్గ స్వతంత్రపాత్ర, నిర్దిష్ట కేంద్ర మౌలికసూత్రం, విప్లవ కమ్యూనిస్టులు అంతర్జాతీయ కార్మికవర్గ ఐక్యతా జండాను బూర్జువా జాతీయ తత్వానికి వ్యతిరేకంగా చేబట్టారు. సామ్రాజ్యవాద వ్యతిరేకత, జాతిని అగౌరపరిచే ప్రతి బూర్జువావర్గ ద్రోహాన్ని ప్రతిఘటించుటకు కార్మిక, కర్షక విస్తృత ప్రజాసామాన్యాన్ని సమీకరించుతారు. ప్రాంతీయతత్వాలను, ఏర్పాటు వాదాన్ని వ్యతిరేకించుతారు. ఇరుగు పొరుగు దేశాలతో సన్నిహిత సంబం ధాలు కోరతారు. విప్లవోద్యమాలను పెంపొందించుతూ, అవకాశవాద, అరాచక శక్తులకు వ్యతిరేకంగా పోరాడుతారు.

"పార్టీ స్వతంత్ర పాత్రను యితరులనుండి దూరమయ్యే పంథాగా సాగదీయ రాదు. కార్మికవర్గం చురుగ్గా ఉద్యమాలలో పాల్గొనునపుడు స్వతంత్రపాత్రను కోల్పో రాదనేది మౌలికాంశము. నిర్వాపారతత్వాన్ని, తోకపట్టుకొని పయనించే తత్వాన్ని చేరనీయరాదు. ఈ రెండు ఎత్తుగడల పంథాల సంఘర్షణలే ప్రజాస్వామ్య, విప్లవ

1. పోలసీ రిజల్యూషన్స్ ఆఫ్ ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా (ఎం. ఎల్.) వారణాసి 6వ పార్టీ కాంగ్రెసు, అక్టోబరు 1997లో ఆమోదించినవి. (ఆంగ్లంలో) పే. 6.

2. అదే పే. 9

దృక్పథాల సంఘర్షణగా నెంచాలి. కార్మికవర్గ నాయకత్వానికై పోరాడుటయే విప్లవ ఎత్తుగడల లక్ష్యం. ప్రజాస్వామ్య విప్లవంలో సాధించవలసినదీ అదే. అవకాశవాదం బూర్జువా వర్గంలోని ఏదో ఒక శాఖపై దృష్టిని సారించుతూ వుంటుంది. దానితో సహకారాన్ని నెరపుతూ, కార్మికవర్గానికి అధికారంలో భాగస్వామ్యాన్ని ఆశించుతూ వుంటుంది.

"అంటే మరో మాటలలో, కార్మికవర్గ పాత్రను అభివృద్ధిచేసి, దానిని క్రమేణా కార్మికవర్గ నాయకత్వంగా పరిణామమొందునట్లు చేయుటయే, విప్లవ కమ్యూనిస్టుల మౌలికాంశం, ఎత్తుగడల సారాంశము".

"వ్యూహం-ఎత్తుగడల మధ్య సమతూకం–గ్యారంటీచేయుట మరో ముఖ్య కీలకాంశము. ఉద్యమ ప్రారంభంలో వ్యూహచట్రంలో ఎత్తుగడల సమస్యలను ముఖ్యంగా పోరాట రూపాలను నిర్ణయించుటలో విఫలమయ్యాయి. ఎన్నికలను బహిష్కరించి, సాయుధ పోరాటమే ఏకైక మార్గంగా నొక్కిచెప్పుట, 1960 దశకపు విప్లవ సంక్షోభంలో ట్రేడ్ యూనియన్‌లను త్రోసిబుచ్చి, ఎత్తుగడల విధానాలలో స్పందించుట సమర్థనీయమే అయింది. ఈ కార్యాచరణలను ప్రజాస్వామ్య విప్లవ దశకంతటికి వ్యూహస్థాయికి కొనిపోవుటతో వుద్యమం అతివాద వక్రీకరణలకు గురైంది. అవకాశవాద వర్గాలు మరోవైపున వ్యూహపరిధిలో నుండి ఎత్తుగడలను రూపొందించారు. వ్యూహదృక్పథం లేనందున స్వతంత్ర ఎత్తుగడలను అనుసరించుట తోకపట్టుకొని సాగుట జరిగింది. నాయకత్వాలు ఎత్తులపై ఎత్తులతో బూర్జువా వర్గాలపై ప్రజలలో భ్రమలు, ప్రభావాలను కలిగించుటలో పరోక్షంగా తోడ్పడ్డారు.

"మా పార్టీ ఎల్లప్పుడూ "రెండు ఎత్తుగడల"తో పోరాటం సల్పుతూనేవుంది. అవకాశవాద ఎత్తుగడల అనుభవం, విరుద్ధ పాఠాలను నేర్పుతూ, సమర్థవంతమైన విప్లవ కమ్యూనిస్టు ఎత్తుగడలు రూపొందుటకు భారతదేశంలో అవకాశాలను కలుగజేసింది.

### లిబరేషన్ గ్రూపుపై రెడ్‌ఫ్లాగ్ విమర్శన :

సి.సి.ఐ.(ఎం.ఎల్) లిబరేషన్ విప్లవపంథాపైన వివరించిన అవగాహనలను సి.పి.ఐ.(ఎం.ఎల్) రెడ్ ఫ్లాగ్ కేంద్ర విప్లవ కమిటి సైద్ధాంతిక జర్నలు, జులై-సెప్టెంబరు 1997 తీవ్రవిమర్శనను క్రింది విధంగా చేసింది.

సి.పి.ఐ. (యం.యల్) రెడ్‌ఫ్లాగ్ సి.పి.ఐ., సి.పి.ఐ. (యం) లను రివిజనిస్టులు, నియో రివిజనిస్టులుగా, ప్రజాస్వామ్య విప్లవాన్ని విడనాడి, పాలకవర్గాల ప్రయోజనాలను పరోక్షంగా కాపాడుతున్నవారిగా తీవ్రంగా విమర్శించి, 1982 సి.పి.ఐ. (యం.యల్) లిబరేషన్ వర్గాల 3వ, పార్టీ కాంగ్రెసు తదనంతరం, సోవియట్ యూనియన్ సోషల్ సామ్రాజ్యవాద విశ్లేషణలను, పెట్టుబడిదారి విధా

నాన్ని అనుసరించుతున్న డెంగ్ చైనా విధానాలను, భారతదేశ పరిస్థితి, రాజకీయ విధానాలు, పార్టీలపై లిబరేషన్ వర్గాల అవగాహనలను, వారి ఇందిరాగాంధీ నిరంకుశత్వ వ్యతిరేక ఐక్యసంఘటనను అట్టి అభిప్రాయాలు కలవారితో కలసి ఏర్పాటు చేయాలనుటను 1977 సి. పి ఐ. (యం.యల్) కార్యక్రమం, అమెరికా సామ్రాజ్యవాదం, సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదం, భారత కంప్రెడరీ బూర్జువావర్గం, ఫ్యూడలిజంలు ప్రధాన శతృవులనే అవగాహనను లిబరేషన్ వర్గాలు త్రోసిబుచ్చాయని తీవ్రంగా విమర్శించింది. అంతేగాక, అఖిల భారత స్థాయిలో సి. పి. ఐ. (యం.యల్) లిబరేషన్‌వర్గాలు సోషల్ సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనను నిర్మించాలనే అవగాహనను విడనాడారని విమర్శించింది.

జాతీయ పరిస్థితిపై అవగాహనలలో మార్క్సిజంలో రివిజనిస్టు, రివల్యూషనరీగా చేసిన విశ్లేషణను విడనాడి, జాతీయ ప్రజాస్వామ్య విప్లవ దృక్పథంలో లిబరేషన్‌వాదుల అవగాహనలు ఉన్నవని, వారి విశ్లేషణ కాంగ్రెసు, బి.జె.పి.ల రాజకీయ విధానాల విశ్లేషణలతోనే పరిమితమై, వారి 1992లో ప్రధాన వైరుధ్యం ఫ్యూడలు అవశేషాలు విస్తృత భారత ప్రజానీకం మధ్య వున్నవని, ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి ఫ్యూడలు అవశేషాలు ప్రధానఅడ్డుగోడలుగా వున్నవనే వారి అవగాహనను విడనాడారని రెడ్‌ఫ్లాగ్ విమర్శించింది. అంతేగాక, సి.పి.ఐ. (యం.యల్) లిబరేషన్‌వారి 5వ పార్టీ కాంగ్రెసు తరువాత, 1991లో నరసింహారావు ప్రభుత్వం గాట్ ఒడంబడిక భారతదేశానికి ప్రపంచ ట్రేడు ఆర్గనైజేషనులో చేరుటతో అంతర్జాతీయ బహుళ జాతుల కార్పొరేషన్‌లోనికి ఆహ్వానించుటకు ద్వారాలన్నిటిని బాహాటంగా తెరచుట, అదే విధానాన్ని ఐక్యసంఘటన ప్రభుత్వం కొనసాగించుతూ, పబ్లిక్ సెక్టరు పరిశ్రమలలో నూతన పెట్టుబడి పెట్టకపోగా, నిరుత్సాహపరచుటలను పరిగణించుటలో విఫలమైందని విమర్శించింది.

సి.పి.ఐ.(యం.యల్) లిబరేషనువర్గాలు ప్రధాన నాలుగు వైరుధ్యాలు తీవ్రమగుట, అందులో సామ్రాజ్యవాదం, భారత ప్రజాసామాన్యం మధ్యగల వైరుధ్యం మరింత తీవ్రమగుటను గుర్తించుటలో విఫలమగుటతో వ్యూహాత్మక జాతీయ ప్రజాస్వామ్య విప్లవ విజయానికై విప్లవ, ప్రజాస్వామ్య శక్తులను సమీకరించుటలోకూడ వైఫల్యాన్నెదుర్కొనవలసి వచ్చింది. కాంగ్రెసు, బి.జె.పి.లు రెండూ వాటిమధ్య, వాటికి అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచబ్యాంకుల మధ్య ఎట్టి వైరుధ్యం లేనందున, భారత కంప్రెడరీ బూర్జువావర్గ విశ్వాసం పొందిన పార్టీలయ్యాయి. అంచేతనే కాంగ్రెసు, బి.జె.పి.లు రెండూ, తదితర ప్రాంతీయ పార్టీలు ముఖ్యంగా తెలుగు దేశం, ఐ.యం.యఫ్. ప్రపంచ బ్యాంకుల ఆనతులను పాటించుతూ మన ఆర్థిక విధానాన్ని ప్రపంచీకరణంచేస్తూ, ప్రపంచ మార్కెట్టు, ప్రపంచ సామ్రాజ్యవాదంతో "బ్రహ్మముడి" వేయజూస్తున్నారు. ఈ ప్రమాద తీవ్రతను గుర్తించుటలో విఫలమై దానికి వ్యతిరేకంగా ప్రజాసమీకరణ కావించుటలో సి.పి.ఐ.(యం.యల్) లిబరేషన్

వర్గాలు విఫలమయ్యాయని సి.పి.ఐ.(యం.యల్) రెడ్‌ఫ్లాగ్ పత్రిక తీవ్రంగా విమర్శించింది.

అంతేగాక, సి.పి.ఐ., సి.పి.ఐ. (యం)ల యెడల సి.పి.ఐ. (యం.యల్) లిబరేషన్ వర్గాలు చేపట్టిన వైఖరి తీవ్రవక్రీకరణకు గురైందని రెడ్‌ఫ్లాగ్ తీవ్రంగా విమర్శించింది. కమ్యూనిస్టు విప్లవకారులు 1964లో కృశ్చేవ్ వర్గ సామరస్య, రాజీ విధానాలను అనుసరిస్తున్న డాంగేవాదులు కమ్యూనిస్టు ఉద్యమాన్ని కాంగ్రెసుకు తోకగా మార్చే ప్రయత్నాలను తీవ్రంగా ప్రతిఘటించి, విడిపోయి సి.పి.ఐ.(యం)ను ఏర్పాటుచేసి సైద్ధాంతిక పోరాటాన్ని సాగించారు. అదేకాలంలో కృశ్చేవ్ పంథా నుండి పూర్తిగా వేరుపడి, బయటకు వచ్చుట, ప్రజాస్వామ్య విప్లవ పంథాను, వ్యూహాన్ని విడువజాలకపోవుటతో సి.పి.ఐ. (యం) నుండి విప్లవకారులు సి.పి.ఐ. (యం.యల్)ను స్థాపించుట జరిగింది. దశాబ్దాల అనుభవాలు వదలివేసి, సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)లతో "అవి సోషల్ డెమోక్రటిక్ పార్టీలు"గా పరిణామం చెందిన తరువాత వాటితో సత్సంబంధాలు, ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటనల నేర్పాటు చేయు సి.పి ఐ.(యం.యల్) లిబరేషన్ వర్గాల ప్రయత్నాలను తీవ్రవక్రీకరణగా రెడ్‌ఫ్లాగ్ విమర్శించింది. అంతేగాక, కేంద్రంలో ఐక్యసంఘటన ప్రభుత్వం, 18 మాసాల పాలన, పశ్చిమబెంగాల్, కేరళ, త్రిపురలలో వామపక్ష సంఘటన, వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనలు పాలన, రాజకీయ విధానాల ఆచరణ తమ అవగాహనలనే బలపరుస్తుందని రెడ్‌ఫ్లాగ్ వ్రాసింది.

సామ్రాజ్యవాదం, ఐ.యం.యఫ్, ప్రపంచబ్యాంకుల విధానాలను అమలు చేస్తున్న ఐక్యసంఘటన రాష్ట్ర ప్రభుత్వ విధానాలను, వారి రాజకీయ విధానాలు, అవగాహనలను ఖండించక, లిబరేషన్ వర్గాలు "వృద్ధ కమ్యూనిస్టుపార్టీలని", "అధికార కమ్యూనిస్టు పార్టీలని" గౌరవాలను ఆపాదించే లిబరేషన్ కమ్యూనిస్టు వర్గాలను రెడ్‌ఫ్లాగ్ విమర్శించింది. ఈ సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)ల విధానాలకు వేరుపడి, దూరంగా ఉండుటకు బదులు లిబరేషన్ కమ్యూనిస్టు వర్గాలు కాంగ్రెసు వ్యతిరేక, బి.జె.పి. వ్యతిరేకంగా అనే పేరుతో "మూడవశక్తి" నిర్మాణం అనేపేరుతో "అధికార కమ్యూనిస్టుపార్టీలు" అంటూ సి.పి.ఐ, సి.పి.ఐ.(యం)లతో సహకరించుట, ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటనల రూపొందించే అవగాహనలను రెడ్‌ఫ్లాగ్ తీవ్రంగా విమర్శించింది. సి.పి.ఐ., సి.పి.ఐ.(యం)ల ఐక్యసంఘటనలు కాంగ్రెసు మద్దతుపై ఆధారపడే హీనస్థితిని గుర్తించలేకపోవుటలోని లిబరేషన్ వర్గాల వైఫల్యాన్ని విమర్శించింది.[1]

---

1. సి.పి.ఐ.(ఎం.ఎల్) లిబరేషన్ పరస్పెక్టివ్ పేపరు, ఎ క్రిటిక్. ది రెడ్ ఫ్లాగ్ జులై - సెప్టెంబరు 1997. పే. 12-13.

## సి.పి.ఐ.[యం.యల్] రెడ్‌ఫ్లాగ్ :

సి. పి. ఐ. (యం. యల్) రెడ్‌ఫ్లాగ్ 1979లో ప్రథమంగా సి.పి.ఐ. (యం. యల్) నుండి విడిపోయినపుడు "రివల్యూషనరీ కమ్యూనిస్టు ఆఫ్. సి. పి. ఐ. (యం. యల్)గా పిలువబడ్డారు. మావో మరణానంతరం చైనాలో అధికారంలోకి వచ్చిన "డెంగ్ హూవా" గ్రూపును, "మూడు ప్రపంచాల సిద్ధాంతం" పేరుతో మార్క్సిజం-లెనినిజాన్ని వదలివేసి, వర్గ రాజీ విధానాన్ని అనుసరించు తున్నారని తీవ్ర పదజాలంతో విమర్శించి, మావోయిజాన్ని ఉన్నతంగా నిలబెట్టా లని రెడ్‌ఫ్లాగ్ సి పి.ఐ.(ఎం.ఎల్)గ్రూపు పిలుపునిచ్చి, అత్యుగ్రవాదాన్ని చేబట్టింది. ఈ గ్రూపు మొదటి అఖిల భారత పార్టీ కాంగ్రెసు 1982 లో జరిపింది, అప్పటి నుండి సి.ఆర్.సి., సి.పి.ఐ.(ఎం.ఎల్)గా పిలువబడుతున్నది. ఆ కాంగ్రెసులోనే 1970 కాన్ఫరెన్సులో ఆమోదించిన సి.పి.ఐ.(ఎం.ఎల్) కార్యక్రమాన్ని సవరణలతో తిరిగి ఆమోదించింది అంతర్జాతీయ జాతీయ, కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన పరి ణామాలు,కర్తవ్యాలు వివరించబడినవి.అఖిల భారత 1985ప్లీనంలో నూతన వలసవాద శక్తుల దోపిడిని వివరించుటను పార్టీ నాయకత్వపు కర్తవ్యంగా స్పష్టం చేయబడింది. ఈ గ్రూపు పార్టీ ప్రజాస్వామ్య విధానాలను వదలి వేసినందున 1987లో చీలికకు దారి తీసిందనే అభిప్రాయం కొన్ని వర్గాలలో వుంది. తరువాత, సి.పి.ఐ (ఎం.ఎల్) రెడ్‌ఫ్లాగ్ అనే పేరుతో 1982 సమావేశం 1970 కార్యక్రమానికి చేసిన సవరణల అమలుతో ఉన్నత ఐక్యతను రూపొందించే ప్రయత్నం చేసింది. వర్గ ప్రజా సంస్థల నిర్మాణంపై వొక పత్రాన్ని ఆమోదించి సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం, పార్టీ సంబంధాలపై వొక అవగాహనను అభివృద్ధిపరచి సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతి రేక అఖిల భారత రెండవ విస్తృత 1989 సమావేశం, తదనంతరం 1991 జనవరి అఖిలభారత సమావేశం, పార్టీ రాజకీయ విధానం,వ్యూహం,ఎత్తుగడల రూప కల్పనలలో ముఖ్యపాత్ర వహించాయి. ఈ ప్రయత్నాలన్నిటి కొనసాగింపుగా 1993 ప్లీనం సమావేశం అంతర్జాతీయ, జాతీయ పరిణామాలను, పరిస్థితులను నూతనంగా అంచనావేసి, ఎత్తుగడల, నిర్మాణ పంథాలను రూపొందించి, ఆమోదించింది. ఈ ప్రాతిపదికపైనే అన్ని స్థాయిలలో సైద్ధాంతిక పోరాటాన్ని సాగించి, సైద్ధాంతిక రాజకీయ, నిర్మాణ మౌలిక విధానాలను నిర్దిష్టంగా రూపొందించి, పార్టీ పున ర్నిర్మాణాన్ని చేబట్టి, వాస్తవ పరిస్థితుల అధ్యయన ప్రాతిపదికపై పార్టీని అభి వృద్ధి చేయ నిర్ణయించింది. పార్టీ 1982లో కొన్ని సవరణలు చేసినా, మౌలి కంగా 1970 కార్యక్రమాన్ని అనుసరించుట, 1988 ప్రత్యేక కాన్ఫరెన్స్ కార్య క్రమాన్ని మౌలిక అవగాహనలతో తిరిగి రచించే క్రమాన్ని ప్రారంభించింది. తదనంతర పార్టీ కాంగ్రెసులో పూర్తిస్థాయి చర్చల అనంతరం ఆమోదించు

ప్రయత్నం చేసింది. అందులో భాగంగా నేటి పరిస్థితి, మన కర్తవ్యాలు, ఎత్తుగడలు అను మూడు పత్రాలను చర్చల నిమిత్తం విడుదల చేసింది.

1) దేశ పరిస్థితి, సి.పి.ఐ.(ఎం.ఎల్) కర్తవ్యాలు, అవగాహనలను క్లుప్తంగా యిలా చెప్పుకొనవచ్చును.

సామ్రాజ్యవాద శక్తులు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని దాదాపు పాలక వర్గాలన్నిటిని తమ ఆధిపత్యా, ప్రభావాల క్రిందకు తెచ్చుకొనగలిగాయి. ప్రపంచ సోషలిస్టు శక్తులు అంతరించుటతో ప్రపంచం అమెరికా ఆధిపత్య, ప్రభావాల క్రిందకు రాసాగింది. మారిన యీ పరిస్థితులలో తృతీయ ప్రపంచ దేశాల అలీనోద్యమం, వామపక్షాలకు మద్దతునిచ్చే ఉద్యమాలు ప్రత్యేకతను కోల్పోయినవి, రెండు ధృవాల ప్రపంచ పరిస్థితులలో అలీనశక్తిగా తృతీయ ప్రపంచం నిర్వహించిన మహత్తర శక్తివంతమైన పాత్రకు నేడు స్థానం లేకుండాపోయింది. ఏక ధృవ ప్రపంచం అమెరికను సామ్రాజ్యవాద నాయకత్వంలో యేర్పడుతున్నట్లు కన్పడుతున్నది. మరోవైపున సామ్రాజ్యవాదంలోని అంతర్గత వైరుధ్యాలు తాత్కాలికంగా నివురు కప్పిన నిప్పులా వున్నాయి. అమెరికన్ సామ్రాజ్యవాదం సంక్షోభంలో ఎప్పుడుపడినా, వైరుధ్యాలు పైకి ఉబుకుతాయి. ఒక్కమాటలో అమెరికా సామ్రాజ్యవాదం ఏక ధృవశక్తిగా తయారగుతున్నది. ప్రపంచ ప్రజలను విపరీతంగా దోపిడి చేస్తున్నది. సంక్షోభరహిత ప్రపంచం వుద్భవించిందని సామ్రాజ్యవాద శక్తుల ప్రచారం బూటకమని అంతర్గత వైరుధ్యాలు సహజంగా బయట పడుటకు ఎంతోకాలం పట్టదు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ "మందంగా" వుండుట, సంక్షోభ మార్గంలో పయనించుటనే తెల్పుతుంది.

సామ్రాజ్యవాద ఆర్థిక మాంద్యంలో భారాన్నంతటిని భారత ప్రజలపై మోపే ప్రయత్నాలను సి.పి.ఐ.(ఎం.ఎల్) రెడ్‌ఫ్లాగ్ రెండవ అఖిల భారత కాన్ఫరెన్సు 1991లో వివరించుట దీనినే రుజువు చేస్తున్నది. భారతదేశంలో ద్రవ్యోల్బణం పెరుగుటతో యేర్పడిన "వ్యాపార లోటును" పూర్తి చేయుటకై ఐ.ఎం.ఎఫ్; ప్రపంచ బ్యాంకు అప్పు నిచ్చుట "తమ వ్యాపార మాంద్యమునుండి" బయట పడుటకు చేసే ప్రయత్నంలో భాగం తప్ప మరొకటికాదు. డిసెంబరు 1991 అప్పు యిచ్చుటలో అమెరికా లక్ష్యమిదే. అదే విధంగా అప్పు క్రింద కట్టవలసిన వడ్డీ చెల్లింపులకై తిరిగి అప్పుగా భారతదేశం పొందిన 7మిలియనుల-700కోట్లుఅప్పు అటువంటిదే. విదేశీ అప్పు 1993కే 3 లక్షల కోట్లు రూపాయలు అయింది. అప్పులు తీసుకొని వడ్డీలు చెల్లించే భారతదేశ విధానం, అప్పులు "ఊబి"లోనికి మరింత దించుతుంది. మన ఆర్థిక ద్రవ్య విధానాలు ఐ.ఎం.ఎఫ్., ప్రపంచ బ్యాంకు, గాట్‌ల సలహాల మేరకు నడుపబడుతూ పైకి రాలేని "ఊబి"లో దిగబడిపోతున్నారు. దీని నుండి బయట పడుటకు వారిచ్చే సలహా రైతులు అధిక పంటలు పండించుటలై ఎరువుల

కిచ్చే సబ్సిడీలను రద్దు చేయమని, యిది ఆహారోత్పత్తి పడిపోయి, ఆ లోటును భర్తీ చేయుటకు వారినుండే వారి అదనపు మిగులు ఉత్పత్తులకు, మార్కెట్టుగా మారి, ఆహార పదార్ధాలను దిగుమతి చేసుకొనుట అందుకు వారినుండే, వారి షరతులకు లోబడి "అప్పుల వూబిలో" మరింతగా కూరుకొని పోవుటకు వారి సలహాలు బాగా వుపయోగ పడుతవి. ఇదంతా ఐ.ఎం.ఎఫ్. ప్రపంచ బ్యాంక్ మనకిచ్చే "నూతన ఆర్థిక విధాన" సలహాల మార్గం. "ఆర్థిక, ద్రవ్య, అప్పుల "వూబి" దిగబడుటయే కాని బయటపడే మార్గం కాదని రెడ్‌ఫ్లాగ్ గ్రూపువారి అవగాహనగా వుంది. అన్ని కమ్యూనిస్టు వర్గాలు యీ విషయంలో ఏకాభిప్రాయాన్నే కలిగియున్నారనుటలో అతిశయోక్తిలేదు.

ఈ పరిస్థితులలో మౌలిక వైరుధ్యాలన్నీ తీవ్రతర మగుతున్నవి. పోరాడే ప్రజానీకం, పోరాడే శక్తులు సామ్రాజ్యవాద వ్యతిరేక కంప్రెడరీ బూర్జువా, భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు మరింత తీవ్రమగుటకు దారి యేర్పడుతున్నది. సామ్రాజ్యవాద శక్తుల నూతన వలస విధానాల ఫలితంగా తీవ్ర తరమయ్యే దుర్భర పరిస్థితులు, వలస వ్యతిరేక ప్రజా పోరాటాలను తీవ్రస్థాయికి చేరుస్తాయి. ఆ పోరా టాలే వలస వ్యతిరేక క్రమంలోనే నూతన సహకార మైత్రీ కూటములలో ప్రజలు సమీకరించబడుటకు దారి తీస్తాయి. అందుండే వారికి మార్గదర్శిక వెలుగు లభించు తుంది, సమస్యల పరిష్కారానికి మార్గం లభిస్తుంది.

2) అఖిల భారత 1991 కాన్ఫరెన్సులో సంస్కరణ వాదానికి వ్యతిరేకంగా నిరవధికంగా పోరాడాలనే ఆచరణ పత్రాన్ని ఆమోదించుట జరిగింది. జాతీయంగా, అంతర్జాతీయంగా వచ్చిన రాజకీయ పరిణామాల ప్రాముఖ్యతను పరిగణలోనికి, సామ్రాజ్యవాదులు, వారి ననుసరించే శక్తులలో వచ్చిన మార్పులను గమనించి, కార్మిక వర్గాల రాజకీయాలను ఉన్నత స్థాయికి కొనిపోవుటకు, అఖిల భారతవ్యాప్తి, స్థాయి పోరాటాలను రూపొందించి నిర్ణయించింది. ఎన్నికల బహిష్కరణోద్య మాన్ని అఖిల భారత స్థాయిలో నిర్మాణంచేయ విఫల ప్రయత్నం చేసింది.

ప్రధాని నరసింహారావు కేంద్ర ప్రభుత్వ నూతన ఆర్థిక విధానం పేరుతో అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచబ్యాంకి, అంతర్జాతీయ బహుళజాతుల సంస్థలకు వ్యతిరేకంగా ఆగస్టు 8-13వకు సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రచారోద్యమవారం జరుప బడింది. "దేశభక్తులారా ఐక్యం కండి! సామ్రాజ్యవాద భూతాన్ని తరిమేయండి!!" అనే నినాదాన్ని సి.పి.ఐ. (ఎం.ఎల్) రెడ్ ఫ్లాగ్ యిచ్చింది. దీనితోబాటు రష్యన్ అక్టోబర్ విప్లవ విజయాలను ప్రచారం చేసింది. దేశపరిణామాలపై "సామ్రాజ్య వాదుల రాబందులను, ఐ.ఎం.ఎఫ్., ప్రపంచబ్యాంకి, అంతర్జాతీయ బహుళజాతుల సంస్థలను దేశంనుండి పారద్రోలండి" అనే ప్రచారం 1992 జనవరి 26 నుండి "సామ్రాజ్యవాద వ్యతిరేక దినోత్సవం, ప్రాణత్యాగం చేసినవారి కలలను పండిం

చండి" అనే నినాదం యివ్వబడింది. అంతేగాక మత, కులతత్వవాదులకు వ్యతిరేకంగా, వారు వ్యాప్తిచేసే మతతత్వ విషప్రచారానికి వ్యతిరేకంగా ప్రచారోద్యమం చేబట్టారు. అయోధ్య దేవాలయ మతప్రచారాన్ని, మతకలహాలను రెచ్చగొట్టుటను, వారి రాజకీయాధికారానికి వేసే ఎత్తుగడలుగా బట్టబయలు చేసారు. నక్సల్బరీ రజతోత్సవ సందర్భంలో కమ్యూనిస్టు జండాను సమున్నతంగా ఉంచుటకు, సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేకపోరాటాన్ని పెంపొందించుటకు ప్రచారం సాగించింది. జూన్ 1992లో ఐ.ఎం.ఎఫ్., ప్రపంచబ్యాంకి, గాట్, అంతర్జాతీయ బహుళ జాతుల సంస్థలకు వ్యతిరేకంగా ప్రచారోద్యమాన్ని పార్టీ చేబట్టింది.[1]

సి.పి.ఐ.(ఎం.ఎల్) రెడ్‌ఫ్లాగ్ ప్లీనం, నూతన వలస విధానంలో సామ్రాజ్యవాదులు సాగించుతున్న నిర్దాక్షిణ్య దోపిడిని వివరించింది. దానికి వ్యతిరేకంగా ప్రజా సమీకరణచేయ మొదలుపెట్టింది. సామ్రాజ్యవాదం అణచబడిన జాతుల మధ్య వైరుధ్యం ప్రపంచవ్యాప్తంగా యీ వైరుధ్యం తీవ్రమయింది. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రపంచమంతటా అతివిస్తృత ప్రజాసామాన్యపు ప్రతిఘటన వ్యాపించుచున్నది. ఈ ప్రజాయుద్ధ ప్రతిఘటన రోజు రోజుకూ పెరుగుతున్నది. అక్టోబరు మహావిప్లవం, చైనా ప్రజా విప్లవాల అనుభవాలు, సరియైన సైద్ధాంతిక, రాజకీయ దృక్పథం, ఉక్కుశిక్షణ, నిర్మాణంగల పార్టీయే విప్లవ పరిస్థితులను వినియోగించుకొని విజయం పొందగలదని రుజువుచేసాయి.

3) సి.పి.ఐ.(ఎం.ఎల్) రెడ్‌ఫ్లాగ్ 1993 ప్లీనం ఎత్తుగడల పంథాను వివరించింది. క్లుప్తంగా యిలా చెప్పుకొందాము. అంతేగాక, ఎత్తుగడలు రూపొందించుటకు రెడ్‌ఫ్లాగ్‌కు యీ క్రింది అవగాహనలు ప్రాతిపదికలయ్యాయి.

బ్రిటిష్ సామ్రాజ్యవాదం భారతదేశపు ఫ్యూడలు సమాజాన్ని పాదాక్రాంతం చేసుకొన్నది. వలస విధానాన్ని స్థాపించింది. పతనమైన భారత ఫ్యూడలు సమాజం బ్రిటిష్ ఆర్థిక, రాజకీయ, సైనికవ్యూహం, పెట్టుబడిదారీ విధాన దాడికి నిలబడజాలకపోయింది. సామ్రాజ్యవాదం తను వోడించిన ఫ్యూడలిజాన్ని రద్దుచేయకుండా, తనదోపిడికి సాధనంగాచేసి రాజీ పడింది. అది రెండు సమానశక్తుల మధ్య రాజీకాక పాలకులు-పాలితుల మధ్య రాజీ, యీ మౌలిక అవగాహనలేనిదొ సమగ్ర అవగాహనా స్వరూపం చూడజాలం. బ్రిటిష్ సామ్రాజ్యవాదం భారత ఫ్యూడలిజాన్ని తన పెట్టుబడిదారీ విధాన దోపిడిలో యిముడ్చుకొంది. ఫ్యూడలిజాన్ని సైనికంగా, రాజకీయంగా, ఆర్థికంగా అణగద్రొక్కి, పెట్టుబడిదారి సంబంధాలు పెంపొందుటకు భూమికను ఏర్పరచింది. ఒకవేపున చేతివృత్తులను నాశనం చేయుట, వలస పరిశ్రమల ప్రయోజనాలను పెంపొందించుటకు కంప్రెడరీ బూర్జువా పెట్టుబడిదారి శక్తుల అభివృద్ధికి తోడ్పడింది. వలసదోపిడి పెట్టుబడి, రాజకీయ అధికారం రెండూ

---

1. సి.పి.ఐ(ఎం.ఎల్) రెడ్‌ఫ్లాగ్. 1993 ప్లీనం డాక్యుమెంట్సు. పే. 19-20.

పెరుగుటకు తోడ్పడింది. అందుకు ఫ్యూడల్ హింసా, దౌర్జన్యం, దోపిడి పెరుగు టకూ తోడ్పడింది.

విప్లవదశ, నాయకత్వం, ఐక్యసంఘటనలపై సి.పి.ఐ (ఎం.ఎల్) రెడ్‌ఫ్లాగ్ గ్రూపు అవగాహనలు తెలుసుకొందాం. పెట్టుబడిదారీ విధానాభివృద్ధికి మధ్యయుగపు ఫ్యూడలు సంబంధాలు, సామ్రాజ్యవాదం, రెండూ వొక కూటమిగా ఆటంకాలుగా ఉన్నవి. ఈ రెంటికి తోడుగా కంప్రెడరీ బ్యురాక్రటిక్ బూర్జువావర్గం కూడ అభివృద్ధి చెంది, ఆ కూటమిలో భాగస్వామి అగుటతో అది బలపడింది. ఈ కూటమికి వ్యతి రేకంగా నూతన ప్రజాస్వామ్య విప్లవం, రెండు ప్రధాన కర్తవ్యాలను అనగా జాతీయ విముక్తిని, వ్యవసాయ విప్లవాన్ని సంపూర్తి చేయాలి, ఉత్పత్తి శక్తులను విముక్తి చేయాలి.

సమాజంలో తెరమరుగు అవుతున్న ఫ్యూడలిజం, బలహీన ఉత్పత్తి సంబం ధాలు, మత, కులవైరుధ్య సంబంధాల సంస్కృతితో బలహీనపడిన సమాజ సంబం ధాలు ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి ప్రతిబంధగాలుగా, ముఖ్యంగా వ్యవసాయ వర్గాలలో తయారయ్యాయి. సామ్రాజ్యవాద పెట్టుబడి సంబంధాల చైతన్యం గ్రామీణ ప్రాంతా లకు చేరకుండా ప్రజాస్వామ్యం అభివృద్ధి చెందకుండా వారు చీకటిలోనే వుండునట్లు చేస్తున్నవి. భారతదేశంలో ఫ్యూడలిజాన్ని పరిరక్షించే ప్రధానశక్తి సామ్రాజ్యవాదం. కాన దానిని రూపుమాపకుండా, ఫ్యూడలిజాన్ని నాశనం చేయజాలం. ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా కోట్లాది రైతాంగాన్ని సమీకరించి, వర్గపోరాటాలను ఉన్నతస్థాయికి తీసుకొనిపోకుండా రైతాంగ విముక్తిని సాధించజాలము. భారత విప్లవ ఎత్తుగడల పునాది, సారాంశంపైన ఉదహరించిన ఫ్యూడలు, సామ్రాజ్యవాదవ్యతిరేక కర్తవ్యాల రెండింటిని సంలీనం చేయుటలోని పోరాట విజయం ఆధారపడి వుంటుంది. ఆ విధంగా జాతివిముక్తి, రైతాంగ విముక్తి, ప్రజాస్వామ్యాభివృద్ధి కార్మికవర్గ నాయ కత్వంలో విజయం పొందగలవు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదంచే రూపొందించబడిన టీ, కాఫీ, రైల్వే, ప్రత్తిమిల్లుల పరిశ్రమలతోనే నవీన పారిశ్రామిక కార్మికవర్గం, పారిశ్రామిక బూర్జువావర్గం రెండు జన్మించాయి. ఈ క్రమంలో ముందుగా కార్మికవర్గం, తరువాత క్రమంగా బూర్జువా వర్గమూ పుట్టి, పెరిగి, బట్టకట్టాయి. అదేకాలంలో సామ్రాజ్యవాద, బూర్జువా వర్గాల వ్యతిరేక పోరాటాలతో వొకవైపు కార్మికవర్గం పోరాటశక్తిని పెంపొందించుకొనగా, మరోవైపున దేశీయ బూర్జువా వర్గం సామ్రాజ్యవాదం సత్సంబంధాలను, రాజీ మార్గా లను రూపొందించుకొంటూ అభివృద్ధి చెందింది. నిర్మాణయుతమైన కార్మికవర్గమే నవీన శాస్త్రీయ అత్యంత అభ్యుదయకర వర్గవైఖరిని, జాతీయస్థాయి ప్రజాఆందోళన పోరాటాలలో అమూల్యమైన అనుభవాలతో భారతదేశంలోని అన్ని అభ్యుదయ

కర విప్లవ వర్గాలకు నాయకత్వమివ్వగలదు.[1]

గ్రామీణ నిరుపేదలు, భూములులేని రైతాంగం, దుర్భర దారిద్ర్యంలో మునిగి, నికృష్ట జీవులయిన వ్యవసాయ కూలీలుగావున్న అశేష ప్రజా సామాన్యం, అత్యంత మెజారిటీగలదయి కార్మికవర్గంచే సమీకృతులయి, అత్యంత బలీయమైన ప్రధానశక్తి అవుతుంది. కార్మిక, కర్షక నాయకత్వంలోని బలమయిన ఈ శక్తి చుట్టూ నగర, గ్రామీణ బడుగువర్గాలు సమీకృతులవుతారు. ఈ మధ్యతరగతి బహుళ సంఖ్యాకులతో మధ్యతరగతి, ధనిక రైతులు, చిన్న పరిశ్రమల అధిపతులు, చిన్న, మధ్యతరగతి పెట్టుబడిదారులు, ప్రభుత్వ, తదితర ఉద్యోగులు, చేతివృత్తుల వారు కలసిన బ్రహ్మాండమైన ప్రజాశక్తి రూపొందుతుంది. ఆ శక్తి తోడుగా నగర, గ్రామీణ నిరుద్యోగ విద్యార్థి, యువజను లందరు కలసిన మహాశక్తి అగుతుంది.

నేడు భారతదేశం అప్పుల సుడిగుండంలో వుంది. జాతీయ ఆదాయంలో 38 శాతం అప్పుల వడ్డీల చెల్లింపులకే పోతున్నది. ఈ అప్పుల భారం రోజురోజుకి పెరిగిపోతున్నది. అప్పుల వడ్డీల చెల్లింపులకే తిరిగి అప్పులు చేయవలసి వస్తున్నది. కాంగ్రెసు "ఆవడి సోషలిజం" "మిశ్రమ ఆర్థిక విధానం,"పెట్టుబడిదారేతర పంథాలో ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధి అనే భ్రమలు పటాపంచలగుతున్నవి. అలీన విధానానికి పునాదిగా వున్న విదేశాంగ, ఆర్థిక విధానం-పెట్టుబడిదారి-సోషలిజంల మధ్యే మార్గ విధానంగా చేసిన బహుళ ప్రచార "ముసుగు" తొలగిపోయింది. నగరాలలో పెట్టుబడిదారి వర్గాల, గ్రామీణ ప్రాంతాలలో ఫ్యూడలు భూస్వాములు ఆధిక్యత, ప్రభావాల అభివృద్ధి నిరాటంకంగా సాగుతూనే వుంది.

భారత ప్రభుత్వ ఆర్థిక, రాజకీయ, సామాజిక విధానాల మౌలికాంశాల అవగాహనకు, దాని వర్గ పొందిక లేక కూర్పు తెలుసుకొనాలి. వాస్తవానికి నవీన భారత ప్రభుత్వాన్ని ఏర్పరచింది బ్రిటిష్ సామ్రాజ్యవాదం. రాజ్యాధికారంలో పెట్టుబడిదారి వర్గాలను, ఫ్యూడలు భూస్వామ్య వర్గాల ఆధిపత్యాలను నిలబెట్టింది. అధికార మార్పిడి 1947 లో జరిగి, స్వాతంత్ర్య ప్రధానం జరిగినపుడు, వలస విధానంలో పెరిగిన కంప్రెడరీ బూర్జువా వర్గానికి, ఫ్యూడలు వర్గాలకు అధికారాన్ని బ్రిటను అప్పజెప్పి, తన ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలకు రక్షణలు కల్పించుకొన్నది. ఈ వర్గ కూటమి పాలన సామర్థ్యాన్ని, వర్గ ప్రయోజనాలను కాపాడగల శక్తి, సామర్థ్యాలను బ్రిటిష్ పాలన కాలంలోనే రుజువు చేసుకొన్నది. ఫలితంగా, విదేశీ వలస సామ్రాజ్యవాద శక్తుల ప్రయోజనాలను కాపాడగలదనే విశ్వాసాన్ని పొందింది. ఈ విధంగా బ్రిటను పరోక్షంగా తన విధానం కొనసాగించింది.

ప్రపంచంలో మరెక్కడా లేనివిధంగా భారత సమాజంలో వ్యవసాయ, కుటీర

1. సి.పి.ఐ.(యం.యల్) రెడ్‌ఫ్లాగ్, ప్లీనం డాక్యుమెంట్సు. ఎ రెడ్‌ఫ్లాగ్ పబ్లికేషన్, 1993. పే. 28.

పారిశ్రామిక ఉత్పత్తి సంబంధాలలో "కులం-వర్గాలు" "వొక భారతీయ లేక ఏషియాటిక్" ప్రత్యేకతగా పెనవేసుక పోయాయి. అంచేత యీ సున్నిత సమస్యను మార్క్సిస్టులు-లెనినిస్టులు శ్రామికవర్గ ప్రయోజనాలు, రాజ్యాధికారంకై శ్రామిక వర్గాలను బలోపేతంచేయు దృక్పథం, అవగాహనల ప్రాతిపదికలపై ఎత్తుగడల సమస్యగా సమన్వయం, సంలీనంచేసి, రాజకీయంగా పరిష్కరించవలసి వుంటుంది. కులాలు వర్గదోపిడికి సాధనాలు కారాదు, సమాజం నూతన ప్రజాస్వామ్య దృక్పథాలకు అడ్డుగోడ కారాదు. బహుళ సంఖ్యాకులైన అణచబడి, వెనుకబడిన వర్గాలలోని వివిధ కులాలవారు నగ్న దోపిడికి గురి అగుతున్నారు. కాన వీరు నూతన ప్రజాస్వామ్య విప్లవంలో కార్మికవర్గ నాయకత్వంలో ప్రధాన పోరాట వర్గాలు, శక్తులు, వర్గపోరాటంలో అణచబడే జాతుల కులాల పోరాటం మేళవించబడి, ప్రధాన పాత్రధారి కావాలి. ఈ కర్తవ్య నిర్వహణలో కమ్యూనిస్టులు విజయాన్ని పొందారని చెప్పజాలం. ఈ అణచబడిన చారిత్రిక వర్గాల పోరాటాలను, వర్గ పోరాటాలతో మేళవించినపుడే కమ్యూనిస్టులు విప్లవ విజయ పంథాలో పయనిస్తారని చరిత్ర చెప్పుతున్నది. కమ్యూనిస్టుల వర్గపోరాటాల భవిష్యత్తును యిది వొక్క నిర్ణయాత్మక కార్యాచరణపై ఆధారపడి వుంది. ఈ చారిత్రిక కర్తవ్యాన్ని కమ్యూనిస్టులు నిర్వహించుటలో విజయులు కాగలరని ఆశిద్దాము.

పాలక వర్గాలలోని వైరుధ్యాలు, తరచుగా సంఘర్షణ వైరుధ్యాలుగా రూపొందినపుడు, జనతా ప్రజాస్వామ్య విప్లవ శక్తులు తగిన ఎత్తుగడలు ఆనుసరించు మార్గంలో పాలక వర్గాలలో కొన్ని శెషనులతో కార్మికవర్గ నాయకత్వంలో ఐక్య సంఘటనా కార్యాచరణను చేబట్టుతుంది. ఐక్యసంఘటనా కార్యక్రమం అమలుకై పొరవను, కార్మికవర్గ నాయకత్వం ప్రదర్శించుతుంది.

4) మధ్యయుగపు ప్యూడలు భూస్వామ్య ఉత్పత్తి సంబంధాలు, అత్యంత నగ్నదోపిడికి, దురంతాలకు గురి అగుతున్న ప్రాంతాలు సాయుధ రైతాంగ గెరిల్లా, వ్యవసాయ విప్లవ పోరాటాలకు మిక్కిలి అనుకూలంగా వున్నవి. ప్యూడలు భూస్వాములు వారి గూండాల దురాగతాలు రైతాంగంపై మితిమీరిపోవుటతో ఆ ప్రాంతాలలో విప్లవ పోరాటాల విస్తరణ జరుగుచున్నదని ప్లీనం అవగాహనగా వుంది. అలాగా కొన్ని ప్రాంతాలు వ్యవసాయ విప్లవ సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాలకు అనుకూలంగా వున్నది. విస్తారమైన భారతదేశంలోని వాస్తవ పరిస్థితులను అధ్యయనం చేసి, ఏ ప్రాంతంలో ఏఏ పోరాట రూపాలను చేపట్టాలో వాటినే చేపట్టుతుంది. ఈ కార్యక్రమం గెరిల్లా స్థావర రైతాంగ సాయుధ పోరాటాలతో అనుసంధానం చేయబడాలని ప్లీనం, వ్యూహపు దీర్ఘకాలపు కార్యాచరణగా వివరించింది[1].

---

1. సి.పి.ఐ. (యం.యల్.) రెడ్‌ఫ్లాగ్ 1993 ప్లీనం డాక్యుమెంట్సు. పే. 83-84.

## కమ్యూనిస్టు లీగ్ ఆఫ్ ఇండియా (యం. యల్.)

కమ్యూనిస్టు లీగ్ ఆఫ్ ఇండియా 3వ, కాన్ఫరెన్స్ అక్టోబరు 1992 లో జరిగింది. సి.యల్.ఇ. (యం.యల్.) కాన్ఫరెన్స్ రాజకీయ పంథా, పార్టీ కార్యక్రమము, రాజకీయ తీర్మానం, అంతర్జాతీయ కార్మికవర్గ చారిత్రిక అనుభవాలు, ఐక్యతాభివృద్ధిలో నూతన పురోగమనాలపై సైద్ధాంతిక పత్రాలను, సమీక్షలను, తీర్మానాలను ఆమోదించింది. ఆమోదించిన తీర్మానాలు, కార్యక్రమాలలోని ముఖ్యాంశాలు యిలా వున్నవి.

బ్రిటిష్ వలస పాలన అంతమైన నాటి నుండి భారత వలస, సెమీఫ్యూడలు సమాజం ప్రధానంగా సహజ మౌలిక మార్పుల అత్యంత విస్తృతికి గురై, పెట్టుబడిదారి విధానం ఆధిక్యత కలదైనదిగా రూపొందింది. ఇది దరిద్రులను మరింత దరిద్రులుగా, ధనవంతులను మరింత ధనవంతులుగా చేయు బాధాకర పరిణామముగా జరిగింది, యింకా కొనసాగుతూనే వుంది. ప్రపంచంలో పెట్టుబడిదారి విధానం వెనుకడుగు వేసిన దశలో, మనదేశంలో వెనుకబడినదై, సామ్రాజ్యవాదపు పరిమితుల వలయంలోనే కొట్టుమిట్టాడుతున్నది.

భారత రాజ్యం, బూర్జువా పార్లమెంటరీ ప్రజాస్వామ్యమనే పేరులో వున్న బూర్జువా నియంతృత్వం. ఇది, బడా బూర్జువా, బ్యురాక్రటిక్ బూర్జువా, గ్రామీణ బూర్జువా వర్గాల ఆధిపత్యంలోని నియంతృత్వం. శ్రామికవర్గాల అణచివేత అతి క్రూరంగా కొనసాగుతున్నది. నగర, గ్రామీణ, శ్రామిక, బడుగు వర్గాలు ప్రజానీకంలో 90 శాతం దాకా వున్నారు. పేదరైతాంగం, వ్యవసాయ కూలీలు, వివిధ చేతివృత్తులవారు సెమీ కార్మికవర్గంగా వున్నారు. నగర, గ్రామీణ, పెటీ బూర్జువా మధ్యతరగతుల వర్గాలు యీ వాస్తవాలకు అతీతులుకారు. ఈ నిరంకుశ ప్రభుత్వ యంత్రాంగ అంగాలే సైన్యం, పారా మిలిటరీ సైనికులు, పోలీసులు. వీరికి అండగా కోర్టులు, జైళ్ళు, పాలనా యంత్రాంగం, మంత్రులు, వివిధ బ్యురాక్రటిక్ మేనేజరులు శ్రామిక వర్గాలను వివిధ దోపిడులకు గురిచేయు వర్గాలు. మొత్తం ప్రభుత్వ యంత్రాంగమంతా బూర్జువా వర్గాల సేవలకు వాస్తవంగా ఆచరణలో వినియోగానికై యేర్పరచబడినవి. అదేకాలంలో యీ యంత్రాంగమంతా పరోక్షంగా సామ్రాజ్యవాద సేవల సంసిద్ధతనే తెల్పుతుంది. బూర్జువావర్గ నియంతృత్వ పాలన, ప్రభుత్వం, యంత్రాంగం, సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు ఉపయోగపడుటయేగాక, వర్గదోపిడిలో భాగస్వాములు. సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడిదారి వర్గాలు, దేశీయ పెట్టుబడిదారి వర్గపు, ఫ్యూడలు భూస్వామ్య వర్గాలు అన్నీ పొత్తు నెరపుటతో నిరంకుశత్వానికి దేశీయ, అంతర్జాతీయ వర్గాల మద్దతు కోరకనే లభించుచున్నది. అదే మద్దతు కార్మిక, కర్షక, ఉద్యోగ, మధ్యతరగతి వర్గాలు తమ జీవనస్థాయిని కాపాడుకొనుటకై చేసే ప్రజా పోరాటాలను క్రూరంగా అణచివేయుటకు లభించుచున్నది.

భారత బూర్జువావర్గం, మన సార్వభౌమాధికారంపై సామ్రాజ్యవాదం, దేశీయ బడా బూర్జువా వర్గాలు చేయు దాడిని నామమాత్రంగా ప్రతిఘటించుతూనే, తన విధానాలను తానే నిర్ణయించుకొనుటకై పోరాటం వొకవైపు సాగించుతూ, మరోవైపున తన ద్వంద్వ విధానాన్ని తృతీయ ప్రపంచంలో తాను బలహీన బూర్జువా వర్గమైనందున, సామ్రాజ్యవాద, ఆర్థిక, రాజకీయ వొత్తిడులకు, రాజీలకు తలవొగ్గుతున్నది. అదేకాలంలో భారత బూర్జువా వర్గం, రాజ్యం, ప్రభుత్వములపై అభివృద్ధి నిరోధకుల ఆధిక్యత కారణంగా, ఉపరితల యంత్రాంగం ప్రజలను, ప్రజాపోరాటాలను అమానుషంగా అణచివేస్తూ, నిరంకుశత్వానికి మారుపేరుగా వ్యవహరిస్తున్నది.

భారత పెట్టుబడిదారి విధానం పశ్చిమదేశాల అత్యాధునిక పెట్టుబడిదారి విధానాలతో పోల్చితే, యౌవనదశలోనే వృద్ధాప్యంలో వచ్చే తీవ్ర ఆర్థిక సంక్షోభ అంటు వ్యాధితో కృశించిపోవుచున్నది. భారత సమాజం దుర్భర, నికృష్ట జీవన పరిస్థితులలో కుమిలిపోవుట, పెట్టుబడిదారి విధానపు ఉత్పత్తి సంబంధాలను అనుసరించుట వలన ఏర్పడుతున్నది. ఉత్పత్తిశక్తులు అభివృద్ధి చెందుటకు అదే పెద్ద ఆటంకంగా వుంది. భారత ప్రజలలోని సగం ప్రజలు అర్థనగ్నంగా వున్నపుడే, పెద్ద పెద్ద గుడ్డలమిల్లులు మూసివేయబడుతున్నవి. మరోవైపున చేతిమగ్గాలవారు ఆకలి కరువు వాత పడుతున్నారు. అధిక లాభాల ఆపేక్షతో ధరలు ఆకాశాన్నంటుట, ప్రజల కొనుగోలుశక్తి విపరీతంగా పడిపోవుటతో ఈ పరిస్థితి ఏర్పడింది.

మధ్యయుగ భూస్వామ్య సమాజపు అవశేషాలు, పెట్టుబడిదారి విధాన పూర్వ సమాజ వర్గ సంబంధాలు భారత సమాజంలో యింకా కొనసాగుతూనే వున్నవి. అంచేతనే భారత సమాజపు ఉపరితల అంగాలలో పూ్యడలు, పెట్టుబడిదారి సమాజపు సంబంధాలు కొనసాగుతున్నవి. ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలు అసంపూర్తిగా అలాగే వున్నవి. బూర్జువావర్గ నియంతృత్వ ప్రభుత్వంలో ఆ వర్గ ప్రయోజనాలే ప్రాధాన్యత వహించుట, అట్టడుగు బడుగువర్గాల ప్రయోజనాలు పట్టించుకొనకపోవుట జరుగుతున్నది. ఈ ప్రజాస్వామ్య కర్తవ్యాల పరిపూర్తి చేయుటకు మరో సామాజిక విప్లవ అవసరం ఎంతగానో వుంది. అది, కార్మిక, కర్షక ఐక్యతా పునాదిపై కార్మికవర్గ నియంతృత్వాన్ని బూర్జువావర్గ నియంతృత్వానికి ప్రతిగా నేర్పరచి, శేష ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను పూర్తిచేస్తుంది. అదే సోషలిజపు పురోగమనానికి రాచబాట నేర్పరుస్తుంది.

ఈ సామాజిక రెండో విప్లవానికి కమ్యూనిస్టులీగ్ ఆఫ్ ఇండియా భారతీయ విప్లవపంథాను యిలా వివరించింది. బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని నాశనంచేసి, బూర్జువావర్గాన్ని రాజ్యాధికారాన్నుండి కూలద్రోసి, రాజ్యాధికారాన్ని కార్మికవర్గ నియంతృత్వం స్వాధీనం చేసుకొంటుంది. ఇది కార్మికవర్గ విప్లవ కమ్యూనిస్టుపార్టీ

నాయకత్వంలో పాలకవర్గాలకు వ్యతిరేకంగా అన్నివర్గాల ఐక్య సంఘటనను ఏర్పర చుట ద్వారా యీ కర్తవ్య నిర్వహణలో విజయం సాధించుతుంది. ఆ సంఘటనయే అన్నిరంగాలలో పాలకవర్గాలపై పోరాటాలను సాగించుతుంది, అన్ని రంగాలలో సమానాంతర ద్వంద్వపాలన నేర్పరచే క్రమంలో పురోగమిస్తుంది. చివరకు అదే బూర్జువా రాజ్యాధికారాన్ని సాయుధ పోరాటంలో స్వాధీనం చేసుకుంటుంది.

ఏ దేశంలోనైనా ఆ దేశ ప్రత్యేక పరిస్థితులనుబట్టి ఆ దేశ విప్లవ పంథా నిర్ధా రించబడుతుంది. దానిని నిర్ణయించుటలో ఆ కాలపు అంతర్జాతీయ పరిస్థితులు పంథాపై అత్యంత ప్రభావాన్ని కలుగజేస్తవి. నాటి వాస్తవ పరిస్థితులు విప్లవంలో వివిధ అంతర్జాతీయ, దేశీయ శక్తులు కలుగజేసుకొనే విధానాలపై, ప్రత్యేక విప్లవ పంథా వివిధాంశాలు నిర్ధారించబడుతవి. అదేవిధంగానే భారతీయ విప్లవ పంథా, ప్రత్యేకతలు ఆచరణ ఫలితాల వివరణలచే నిర్ధారించబడతవి. ఆ విధంగా రూపొం దిన సరియైన, భారత పరిస్థితులకు అనుగుణమైన, అదేకాలంలో అంతర్జాతీయ పరి స్థితులను పరిగణనలోనికి తీసుకొనుటతో విప్లవ విజయావకాశాలు మెరుగు అగుతవి.

పెట్టుబడిదారి విధానాన్ని రద్దుచేయు దీర్ఘకాల లక్ష్యంతో వ్యూహాత్మక ఐక్య సంఘటనను రూపొందించాలి. అదే పెట్టుబడిదారి వర్గపాలనుండి కార్మికవర్గానికి విముక్తిని కలుగజేస్తుంది. భూస్వాములు, అర్ధభూస్వాములు, పెట్టుబడిదారి విధాన పూర్వ అవశేషాలు భారతీయ సమాజాన్ని "పెట్టుబడి" రెండుగాచేసి, విడదీస్తున్న వాస్తవా నికి తెరవేసి, మరుగుపరుస్తున్నవి. వీటికి కుల, మత, భూస్వాములు విభజనలు మరింత తోడ్పడుతున్నవి. మధ్యతరగతి పెటీబూర్జువా వర్గాలు అభివృద్ధి చెందుటకు అడ్డు గోడలగుతున్నవి. ఈ పెద్దవిభజన అఘాతాన్ని పరిగణలోనికి తీసుకొనే ఐక్య సంఘటన రూపొందుతుంది. సంఘటనలో నగర, గ్రామీణ కార్మికులు, సెమి కార్మికులు, తదితర బడుగువర్గాలు, నగర, గ్రామీణ పెటీబూర్జువా వర్గాలు కలసే పోరాడుతవి. ఈ సంఘటన గుత్త పెట్టుబడిదారివర్గం, నిరంకుశ బూర్జువా అధికార వర్గాలు, గ్రామీణ భూస్వాములు, బూర్జువావర్గాల కూటమికి వ్యతిరేకంగా పోరాడుటకై ఏర్పడుతుంది. దీర్ఘకాల పోరాటాలలో నగర, గ్రామీణ శ్రామికవర్గాల ఐక్య సంఘ టనకు కార్మికవర్గం నాయకత్వం వహించుతుంది. పేద రైతాంగం, నగర, గ్రామీణ సెమీ కార్మికవర్గం, తదితర బడుగువర్గాలు నిలకడగల, ధృఢపోరాశటక్తులు. క్రింది మధ్యతరగతి నిలకడగల మిత్రులుకాగా, మధ్యతరగతి పైవర్గాలు వూగిసలాడే మిత్రవర్గాలు. విప్లవ విజయావకాశాలు బలంగా, స్పష్టంగా ఉన్నప్పుడు మాత్రమే విప్లవశక్తులవైపు వస్తవి. పోరాటక్రమంలోనే ఐక్యసంఘటన రూపొంది, వర్గ పోరా టాలు ఉన్నత రూపాలు చేబట్టినకొలది ఐక్యత, నిర్మాణం బలబడుతూ వుంటుంది. విప్లవం విజయవంతమై, రాజ్యాధికారం చేజిక్కించుకొనే దశకు చేరుటతో పాలక వర్గాలను ప్రజలనుండి వేరుచేస్తూ, పోరాడవలసిన శత్రువర్గాలను బలహీనపరుస్తుంది.

పెట్టుబడిదారి విధానానికి వ్యతిరేక పోరాటం, "దోపిడి, అణచివేతలకు" వ్యతిరేకంగా "వాటిని తుదముట్టించాల"నే నినాదంతో పోరాటాలు చేబట్టాలి. "సమానత్వం", "గౌరవప్రద పని" అనే నినాదాలు పోరాటాల క్రమంలో వినపడతాయి. అది సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాల పరిపూర్తికై జరిగే పోరాటము.

నగరాలలో నేరుగా పెట్టుబడిదారి విధానం, బూర్జువా ప్రభుత్వాల దోపిడీల వ్యతిరేక నినాదాలు, జీవనభృతి గ్యారంటీ, మానవత్వ జీవన పరిస్థితులు, సమాన ప్రాతిపదికపై వనరులు, గృహవసతి, పౌర సౌకర్యాలపై కేంద్రీకరించాలి. ఈ సమస్యలపైనే ప్రజాసామాన్యాన్ని సమీకరించి పోరాటాలు సాగించాలి.

గ్రామీణ ప్రాంతాలతో విప్లవ పోరాట నినాదాలు సాధారణ, ప్రత్యేక సమస్యలపై ప్రజాసమీకరణకావించే నినాదాలై వుండాలి. వ్యవసాయంలో పెట్టుబడిదారి విధానాభివృద్ధి అత్యంత అసమానతలకు గురైంది. కాన గ్రామీణ సమాజ పరిస్థితి అత్యంత క్లిష్టమైనదిగా వుంది. అత్యధిక జనాభా అతినికృష్ట, దుర్భర దారిద్ర్యం అనుభవిస్తున్నారు. విప్లవాత్మక వ్యవసాయ భూముల సంస్కరణలు మౌలిక ప్రధాన నినాదం కావాలి. అదే గ్రామీణ శ్రామికవర్గాన్ని, పేద రైతాంగాన్ని సమీకరించే నినాదం, వారి జీవన పరిస్థితిగతులను మెరుగుపరచే పోరాట నినాదం. వ్యవసాయంలో అభివృద్ధి చెందుతున్న పెట్టుబడిదారి విధానం పేద రైతాంగాన్ని మరింత పేదరికానికి గురిచేస్తున్నది.

## సి.పి.ఐ. [యం.యల్] పీపుల్స్‌వార్:

సి.పి ఐ. (ఎం.యల్) పీపుల్స్‌వార్ గ్రూపు 1980లో ఏర్పడింది. ఆంధ్ర ప్రదేశ్‌లో సి.ఒ.సి. నాయకులు కొందరు కొండపల్లి శీతారామయ్య నాయకుడుగా యీ గ్రూపును ఏర్పరచారు. కమ్యూనిస్టు పార్టి చీలికకుముందే క్రమశిక్షణాచర్యను అతిక్రమించిన కారణంగా పార్టీనుండి బహిష్కరించబడ్డారు. అంచేతనే, చీలిక తరువాతకూడ సి.పి.ఐ., సి.పి.ఐ.(ఎం)ల దేనిలోనూ సభ్యుడుకాదు. ప్రారంభంలో సి.ఒ.సి నాయకులు ఎ.పి.సి.సి.సి.ఆర్.లో శ్రీకాకుళంజిల్లా నాయకత్వంలో భాగస్వాములుగా వున్నారు. చారుమజుందార్ నాయకత్వంలోని ఎ.ఐ.సి.సి.సి.ఆర్ పార్టీ ప్రజాస్వామ్య విధానాలు ఉల్లంఘించి, అఖిల భారత పార్టీనుండి, ఎ.పి.సి.సి.సి.ఆర్.ను, దాని నాయకుడు టి. నాగిరెడ్డి, తదితరులను బహిష్కరించారు. అదేవిధంగా సి. పుల్లారెడ్డి నాయకత్వంలోని ఎ. పి. ఆర్. సి. పి.పై కూడ విషం క్రక్కారు. అప్పటికే, ఎ.పి.ఆర్.సి.పి. గోదావరి లోయలో సాయుధ ప్రతిఘటన ప్రారంభించింది. ఈ పరిణామాల తరువాతగూడ కె. శీతారామయ్య అతని అనుచరులు అధికార సి. పి. ఐ.(యం.యల్)ను, దాని నాయకుడు సత్యనారాయణ సింగు నాయకత్వాన్ని బలపరచలేదు. అయినా, శీతారామయ్య గ్రూపు రాజకీయ,

నిర్మాణసంబంధమైన అతివాద సాహసిక హింసావాద పొరపాట్లను సరిదిద్దుకొను ప్రయత్నం చేయలేదు. కనీసం శ్రీకాకుళం ఉద్యమం వెనుకాడిన తరువాతకూడ తమ అతివాద దుందుడుకు, సాహసిక చర్యలను విడనాడలేదు, పొరపాట్లను సరిదిద్దుకొను ప్రయత్నం చేయలేదు, తమ వైఖరులను, ఆలోచనా విధానాన్ని, వక్రీకరణలను సరిచేసుకొనలేదు. తమ దళాలకు మైదాన ప్రాంతాలలో "వర్గశత్రు నిర్మూలనకు" "ఆజ్ఞలు జారీచేస్తూ, ప్రజా సంఘాలను, ప్రజోద్యమాలను రద్దు చేయుట, నిర్వీర్యం చేయుట చేసారు. గుంటూరుజిల్లాలో వొక పోలీసుస్టేషనుపై దాడిచేసి, ఆయుధాలు సేకరించారు. ఆ దాడి వెంటనే పోలీసులు వారినందరిని పట్టుకొని కాల్చి చంపివేశారు. వారి దళాలు కృష్ణా, గుంటూరు, వరంగల్లు, కరీంనగర్, ఆదిలాబాద్, కడప జిల్లాల మైదాన ప్రాంతాలలో 1976 వరకు అనేక దళ చర్యలు సాగించారు. ఫలితంగా అత్యవసర పరిస్థితి ఎత్తివేయునప్పటికి, వారి దళాల మనుగడయే కష్టమైంది.

అత్యవసర పరిస్థితి ఎత్తివేయుటతో విప్లవ కమ్యూనిస్టులకు అతివాద పొరపాట్లను సరిదిద్దుకొనుటకు, ప్రజా సంఘాలను,విప్లవ ప్రజోద్యమాలను పునర్నిర్మాణం చేయుటకు అవకాశాలు ఏర్పడినవి. కా. సత్యనారాయణ సింగు, సి. పుల్లారెడ్డిలు చొరవతో ప్రజోద్యమాలను నిర్మించే ప్రయత్నం చేసారు. కా. కె.జి. సత్యమూర్తి కోర్టులో సెంటర్ ఫర్ ఆర్గనైజేషన్ ఆఫ్ కమ్యూనిస్టు నాయకులు సాయుధ పోరాటాన్ని వుపసంహరించుకొన జాలమని, అవసరమైతే ఆయుధాలను వొక భుజాన్నుండి మరొక భుజానికి మార్చుకొంటామని ప్రకటించారు. అప్పటికి నిజానికి నిర్మాణయుతమైన దళాలులేవు, ఆయుధాలులేవు. అయినా అట్టి ప్రకటన చేసారు. తరువాత కొద్దిరోజులకు అదే కోర్టులో తాము సాయుధ పోరాటాన్ని ఉపసంహరించుకొంటున్నామని ప్రకటించారు.

పీపుల్సువార్ ఉద్యమం 1978లో ప్రారంభమైనా, 1980లో వొక స్వరూపాన్ని చేకూర్చుకొన్నది. కాని అది అభివృద్ధి చెందుతున్న కారణంగా ఉద్భవించిన సమస్యలను పరిష్కరించుటలో విఫలమైనందున సంక్షోభంలో కూరుకొని పోయింది. ఆదిలాబాద్, కరీంనగర్ రైతాంగ పోరాటాలను ఉన్నతదశకు అంటే "గెరిల్లాజోన్" నిర్మాణస్థాయి లక్ష్యంతో చేబట్టిన "మూడో ఉద్యమం" కలగానే వుండిపోయింది. దీని వైఫల్యాన్ని అంగీకరిస్తూనే వున్నా 13వ రాష్ట్ర మహాసభ యీ వైఫల్యాన్ని నిర్దిష్టంగా ఆమోదించినా, ఆ వైఫల్య కారణాలను అన్వేషించలేక పోయింది పైగా వైఫల్యాలకు ప్రధాన కారణమైన "ఎత్తుగడల పంధాను" అవగాహనలను మరింత పట్టుదలతో ఏకగ్రీవంగా ఆమోదించి ఆచరణలో పెట్టుటలో వైఫల్యం మరింత తీవ్రత, లోతుకు గురైంది. "నాయకత్వం" మిలిటెంటు ఆర్థికవాద పంధా అవగాహనలను, "మూడు ప్రపంచాల సిద్ధాంతం", "యన్.టి.ఆర్."తో ఐక్య సంఘటన

అనే వైఖరులను చేబట్టి, మితవాద పురిటికంపు పోలేదని రుజువు చేసుకొన్నది. ఉద్యమ రాజకీయ సమస్యలను లేవనెత్తిన ముఖ్యులను "కుట్ర" "విచ్ఛిన్నం" పేరుతో, విప్లవ రాజకీయాలను విడనాడారని పార్టీ నుండి బహిష్కరించింది. ఈ పని చేయుటకు ముందు పార్టీలో అంతర్గత సైద్ధాంతిక చర్చ, తదుపరి జరిగే పార్టీ కాంగ్రెసుకే అట్టి అధికారముంది. కారణం, యీ పనిని నిర్వహించే కేంద్ర కమిటీని రద్దు చేసింది. దొడ్డి దారిన పార్టీ శ్రేణులలో బలాన్ని పెంపొందించుకొనుటకు పార్టీ నిర్మాణ సూత్రాలను త్రోసిబుచ్చి, బహిష్కరణలు చేబట్టారు. [1].

కా. కె. సీతారామయ్య నాయకత్వంలో రాజకీయ సైద్ధాంతిక పోరాటం బహిరంగ చర్చగా, పార్టీశ్రేణుల శ్రేయస్సుకై అనివార్యంగా చర్చకొచ్చింది. వాస్తవంగా పీపుల్సువార్‌లో ఏమి జరిగిందో విప్లవ శ్రేణులకు, ప్రజానీకానికి తెలియదు. ప్రతివాదుల వాదనలు వినలేదు. అదే నాయకత్వంలో సి.పి.ఐ.(ఎం.ఎల్) పీపుల్సువార్, ఆంధ్రప్రదేశ్ శాఖ 13వ, రాష్ట్ర మహాసభలు మే 1987లో జరిగాయి. మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానాల సారాంశాలు యిలా వున్నవి.

"చైనాలోని డెంగ్ ముఠాకు వ్యతిరేకంగా పోరాడండి!" అనే పత్రాన్ని ఆమోదించింది. "యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చండి" అనే కేంద్ర కమిటి ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానాన్ని, రాష్ట్ర మహాసభ పునరుద్ఘాటించింది. మూడు ప్రపంచాల సిద్ధాంతంపై కొండపల్లి సీతారామయ్య వ్రాసిన "మార్క్సిజం-లెనినిజం మావో ఆలోచనను, ఖూనీ చేయటమే మెజారిటీ మూడు ప్రపంచాల సిద్ధాంత విమర్శన లక్ష్యం" అనే పత్రాన్ని కూడ ఆమోదించింది. కొండపల్లి సీతారామయ్య, యన్.టి. ఆర్.తో ఐక్య సంఘటన అనే వైఖరిని సమర్థించుకొంటూ వ్రాసిన "యన్.టి.ఆర్. సమస్యపై మెజారిటి వారి వాదన అంతర్యం మావో ఆలోచనకు విరుద్ధంగా తలుపులు మూసుకోవడం, భారత విప్లవంలో నూతవదశ పేరుతో దశాబ్దంనాటి ఎస్.ఎన్. సింగు "విప్లవ ప్రతిఘాతక సిద్ధాంతానికి తిరోగమనం" అన్న పత్రాన్ని ఆమోదించి, "నిర్మాణ సమస్యల"పై అన్న తీర్మానాన్ని కూడ ఆమోదించింది.

## పీపుల్సువార్ ఉగ్రవాదంపైపు పయనం :

పీపుల్సువార్ గ్రూపు ప్రస్తుత రాజకీయ పరిస్థితిని, ఉద్యమ స్థాయిని అతిగా అంచనా వేయుటవలననే "వాస్తవాలనుండి సత్యాన్ని గ్రహించాలనే" సూత్రాన్ని విడనాడి, సమస్యలను సరిగా అర్థం చేసుకొనుటలో విఫలమయ్యారు. కేవలం స్వీయ మానసిక దృక్పథంలో మునిగిపోయింది. ఈఅతి అంచనాలే జరుగుతున్న తప్పులకు, లోపాలకు మౌలిక పునాదిగా వున్నాయి. అంచేతనే దేశంలో "విప్లవకర పరిస్థితి

1. ఉద్యమాన్ని బలపరచేందుకు మిలిటెంటు ఆర్థికవాద ఎత్తుగడల పంథాను కలసికట్టుగా భూస్థాపితం చేద్దాం (1989) పీపుల్సువార్ ఎత్తుగడల పంథాపై వొక విమర్శ. మార్క్సిస్టు-లెనినిస్టు అధ్యయన కేంద్రం, నెల్లూరు. పే. iv.

పరిపక్వమైంది", "ప్రజా వుద్యమం సాయుధ పోరాట స్థాయికి చేరుకొన్నది", "ప్రజలు సాయుధ పోరాటానికి సిద్ధంగా వున్నారు" అని అంచనావేస్తూ "గెరిల్లా జోన్" నిర్మాణానికి నిర్ణయించినట్లుగా ప్రకటించుకొన్నారు. ఈ విషయాన్ని కా. కె. శీతారామయ్య ఉదయం పత్రికకు 24, 31 మార్చి 1988లో యిచ్చిన ఇంటర్వ్యూలో "మా పార్టీ ఆధ్వర్యంలో అడవులలో పని చేస్తున్న "గెరిల్లా సైన్యం మొత్తంలో మూడింతలు గిరిజనులు. ప్రతి ఏటా "మా గెరిల్లాలకు సైనిక శిక్షణ" యిస్తున్నాము. అని ప్రకటించారు. దీని కనుగుణంగా "గెరిల్లా దళాలు" "గెరిల్లా సైన్యం" ఏర్పరచి సైనిక శిక్షణ కూడ యిచ్చినట్లు ప్రకటించుకొన్నారు. గెరిల్లా పోరాటంలో భాగంగానే "ఆయుధాల కొరకు సాయుధ బలగాలపై దాడి జరుపుతున్నట్లుగా, అవి ప్రస్తుతానికి "స్థానిక నిర్ణయాలపై జరుగుతున్నాయని" "యాదృచ్ఛికంగా జరుగుతున్నాయని" పేర్కొన్నారు. దీని అర్థం సాయుధ పోరాటం సాగిస్తున్నామని భావించుకొంటున్నారు. ఇది వాస్తవాలకు ఏమాత్రమూ సంబంధంలేని అతి అంచనా తప్ప మరొకటి కాదు.[1]

విప్లవోద్యమం ప్రారంభదశలో వున్నపుడు; అతివాద అంచనాలు, ఒంటెత్తు ఎత్తుగడలు, ఉద్యమం ఉన్నత దశలో వున్నపుడు మితవాద అంచనాలు, వర్గ సంకర విధానాలు ఎక్కువ నష్టాన్ని కలుగజేస్తాయి. మితవాద పెడధోరణి వ్యతిరేక పోరాటంలో మరో చివరకు అతివాద పెడ ధోరణివైపుకు కొట్టుకొనిపోవుట అనుభవం నేర్పినపాఠం. భారత విప్లవం నూతన ప్రజాస్వామిక విప్లవంగా పురోగమించాలని దాదాపు కమ్యూనిస్టు శ్రేణులన్నీ గుర్తించాయి. సామ్రాజ్యవాదం, నిరంకుశ దళారి బూర్జువా భూస్వామ్య వర్గాలు శత్రువులుగా, కార్మిక, కర్షక ఐక్యత పునాదిగా, జాతీయ బూర్జువా వర్గాన్ని మిత్రులుగా సరిగానే గుర్తించారు. నూతన ప్రజాస్వామ్య విప్లవాన్ని ప్రజాయుద్ధ పంథాలో, ముందు గ్రామీణ ప్రాంతాల విముక్తి అంతిమంగా నగరాల విముక్తి చేయుటద్వారా పురోగమించాలని, మార్గ నిర్దేశం చేశారు. ఈ వ్యూహాత్మక అవగాహనను దేశ నిర్దిష్ట పరిస్థితులకు అన్వయించుటలో, దేశ పరిస్థితిని, ఉద్యమ స్థాయిని అతిగా అంచనావేసి విఫలులయ్యారు. తెలంగాణా, నక్సల్బరీ ఉద్యమాలు తెలియజేయు ప్రధాన గుణపాఠమిది.

ఉద్యమాలను ఎప్పటికప్పుడు సమీక్షించుకొంటూ, గుణపాఠాలను తీసుకొంటూ, పొరపాటులను, తప్పులను సవరించుకొనుటకు మారుగ బూటకపు ప్రతిష్టలకు నాయకత్వాలు గురై, చివరికి వారు తాము తప్పులు చేయలేదనే పెటీ బూర్జువా అహంభావానికి లోనయ్యారు. విమర్శన, ఆత్మవిమర్శన పెటీబూర్జువా

---

1. సత్యం (1988) పీపుల్సువార్ గ్రూపు అతివాద పెడధోరణి, కె. శీతారామయ్య ఉదయం దిన పత్రికకు యిచ్చిన యింటర్వ్యూపై వొక పరిశీలన, సి పి.ఐ (ఎం.ఎల్) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటి, ప్రచురణ. పే. 3.

ప్రభావాలతో "మొక్కుబడి"గా సాగాయి. దేనికితోడు అత్యధికులలో సైద్ధాంతిక స్థాయి, ఆచరణాత్మక అనుభవాల విశ్లేషణకొరవై, అతివాద ఆలోచనా విధానాన్ని కలుషితం చేయుటతో, ప్రజలనుండి నేర్చుకొనుట జరుగక, సంక్షోభ పరిస్థితులు ఏర్పడువరకు తప్పులు కొనసాగాయి.

దేశంలో విప్లవ పరిస్థితులు పరిపక్వమైనవని, ఉద్యమం సాయుధ పోరాట దశకు చేరిందని, ప్రజలు సంసిద్ధులై వున్నారని, నిర్ధారించుట పెద తప్పు. లెనిన్ విప్లవ పరిస్థితిని, పరిపక్వతను యిలా పేర్కొన్నారు: ప్రజలు పాత పద్ధతులలో జీవించుటకు నిరాకరించుట, మొత్తం వ్యవస్థను మార్చుటకై ఎట్టి త్యాగాలకైనా సంసిద్ధులగుట, పాలకవర్గాలు పాతపద్ధతులలో పాలించలేకపోవుట, యిట్టి పరిస్థితులను వినియోగించుకొనగల బలమైన కమ్యూనిస్టుపార్టీ వుండుటను లెనిన్ పేర్కొన్నారు. అంతేగాక, దేశవ్యాప్తంగా సర్వతోముఖ విప్లవ సంక్షోభ పరిస్థితులున్నపుడే విప్లవం విజయవంతమగుతుందన్నారు దేశంలో యే ప్రాంతంలో సాయుధపోరాటం ప్రారంభించాలన్నా లెనిన్ పేర్కొన్న అంశాలు నిర్దిష్ట ప్రాంతంలో తప్పనిసరిగా వుండాలి. అంతేగాక, లెనిన్ విప్లవంతో చెలగాటమాడరాదని హెచ్చరించారు.

లెనిన్ పేర్కొన్న "విప్లవ పరిస్థితి-పరిపక్వతా 1967లో కాని, నేడు కాని మనదేశంలో రూపొందలేదు. పరిస్థితులు వాస్తవంగా పరిపక్వమయ్యాయని భౌతిక శక్తులు పరిపక్వతకు చేరలేదనే వాదనలుకూడ సరియైనవికావు. పైగా అట్టి పరిస్థితులు పోరాటాల క్రమంలోనే యేర్పడగలవని చెప్పుట మరింత తప్పుగా మన వర్తమాన చరిత్రే రుజువు చేసింది. విప్లవ పరిస్థితి పరిపక్వమైనదనగా "వస్తుగత-స్వీయాత్మక పరిస్థితులు రెండూ కలసి మొత్తంగా పరిపక్వమైనాయని అర్థం. కాని రెండూ వేరుకాదు విడదీయరాదు. విప్లవ పరిస్థితి పరిపక్వతకు గీటురాయి అయిన అంశాలు మనదేశంలో ప్రాథమికదశలో వున్నాయి. క్రమంగా అభివృద్ధి చెందుతున్నవి. అంటే, దేశంలో సాధారణ ఆర్థిక సంక్షోభం పెరుగుతున్నది. పాలకవర్గాల మధ్య వైరుధ్యాలు పెరుగుతున్నవి. పాత నల్లచట్టాలకుతోడు అనేక నూతన నల్లచట్టాలు చేయబడుతున్నవి. మరోమాటలో మౌలిక వైరుధ్యాలన్నీ తీవ్రతరమగుతున్నాయి. విప్లవోద్యమం ప్రాథమికదశలో, కొన్ని ప్రాంతాలకే పరిమితమై వుంది. ప్రజాపంథాలో తప్పులను సవరించుకొని, చీలికలను అధిగమించుటకు వివిధ విప్లవ కమ్యూనిస్టు గ్రూపులు పనిచేయుట తక్షణ ముఖ్యావసరముగా వుంది.

సాయుధ పోరాటం అంటే, వ్యవసాయ విప్లవంగా భూమి సమస్యతో ముడి వడి రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటంగా ప్రారంభమై, రాజ్యాధికారం కోసం ప్రభుత్వ సాయుధ బలగాలకు వ్యతిరేక పోరాటం కావచ్చును. ప్రజలు గతంలో పోరాడి సాధించుకొన్న విజయాలను, హక్కులను రక్షించుకొనుటకు కూడ ప్రారంభంకావచ్చు. ఎలా ప్రారంభమైనప్పటికీ గెరిల్లా దళాలు ప్రభుత్వ సాయుధ బలగాలను ప్రతిఘటించుట, దెబ్బతీయుట, తుడిచిపెట్టుట, ప్రజాసాయుధ బలగాలను

అంతకంతకు పెంచుకొను లక్ష్యంగా వుంటుంది. గెరిల్లా పోరాట ప్రాంతాన్ని క్రమంగా స్థావర ప్రాంతంగా, చివరకు విముక్తి ప్రాంతంగా అభివృద్ధి చేయుట లక్ష్యంగా వుంటుంది. ప్రజాగెరిల్లాదళాలు ప్రధానంగా ప్రభుత్వ సాయుధ బలగాలతో సాయుధ పోరాటం సాగించుటయే కర్తవ్యంగా కలిగివుంటవి. గెరిల్లా ఎత్తుగడలు, పద్ధతులు విప్లవకారులు అవలంబిస్తారు. పై అవగాహనకు భిన్నంగా సాయుధ గెరిల్లాదళాలు ఏర్పడుట వర్గశత్రువుల నిర్మూలించుటయే సాయుధ పోరాటంగా కొందరు భావిస్తున్నారు. వర్గశత్రు నిర్మూలన గెరిల్లా సాయుధ పోరాటంలో ప్రారంభదశగా చారుమజుందారు ప్రస్తుతం పీపుల్స్‌వార్ గ్రూపులు తప్పుడు అవగాహనలను కలిగియున్నవి.

ప్రజాయుద్ధం అంటే ప్రజలు చేయుపోరాటము. పీపుల్స్‌వార్ గ్రూపుల సాయుధదళాలు సాగిస్తున్నదానిలో ప్రజలు లేరు. యుద్ధం యేమాత్రం కాదు. కేవలం కొంతమంది వ్యక్తులు సాయుధ దళాలుగా ఏర్పడ్డారు. ఇది గెరిల్లాదళం కాదు, గెరిల్లా సైన్యమూ కాదు. ఈ దళాలు చేస్తున్న దాడులు, హత్యలు, కిడ్నాపింగులు, విద్రోహక చర్యలు వ్యక్తులపై హింసాచర్యలేగాని, వ్యవస్థను నాశనంచేయు చర్యలుకావు. వ్యక్తిగత హింసావాద, టెర్రరిస్టు చర్యలు. వీటిలో ప్రజల పాత్ర లేదు. కేవలం తిరుగుబోతుదళాల అరాచక చర్యలు తప్ప మరొకటికావు. [1].

ప్రతిఘటనా పోరాటం అనేదానికి కమ్యూనిస్టు సాహిత్యంలో ఒక నిర్దిష్ట అర్థముంది. ప్రజలు పోరాట విజయాలను, హక్కులను కాపాడుకొనుటకు భూస్వాముల తదితర దోపిడిదారుల వారి గూండాల దాడులకు వ్యతిరేకంగా ప్రభుత్వ నిర్బంధ హింసలకు వ్యతిరేకంగా ప్రజలు సామూహికంగా నిర్మాణ చైతన్యయుతంగా, విచక్షణతో సాగించే ప్రతిఘటనా పోరాటం, అందులో భాగంగా ప్రతిహింస, ఉద్యమ విస్తృతికి అభివృద్ధికి విస్తారంగా ప్రజాసమీకరణకు, ఉద్యమాన్ని ఉన్నత పోరాట రూపాలకు కొనిపోయే లక్ష్యంతో సాగే సాయుధ ప్రతిఘటనా పోరాటం. ఉద్యమ అవసరాలు యేవిధంగా ప్రతిఘటించాలనేదానికి, ఏ రూపంలో యెదిరించాలనేదానికి గీటురాయిగా వుంటాయి.

పీపుల్స్‌వార్ గ్రూపు విశాల ప్రాంతంలో ప్రజావుద్యమాలు నిర్మించి, ఆ క్రమంలో వచ్చే నిర్బంధాన్ని, ప్రభుత్వ హింసను ప్రజలు సంఘటితంగా ప్రతిఘటించిన అనుభవాలను కె.యస్. పేర్కొనివుంటే, ఎవరైనా అర్థం చేసుకొనుటకు తోడ్పడివుండేది. ప్రజలను ప్రేక్షకులుగాచేసి, వారి చొరవను, పోరాట పటిమను

---

1. సత్యం (1988) పీపుల్స్‌వార్ గ్రూపు అతివాద పెడధోరణి, కొండపల్లి సీతారామయ్య ఉదయం దినపత్రికకు యిచ్చిన ఇంటర్వ్యూపై ఒక పరిశీలన, సి.పి.ఐ. (యం.యల్) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రకమిటి ప్రచురణ పే. 10.

నిర్వీర్యం చేయుటకు, ఉద్యమాన్ని దెబ్బతీయుటకు మాత్రమే తోడ్పడ్డాయి. ప్రతిఘటనోద్యమం నిర్మించుటలో భాగంగా హింసాచర్యల సమర్థించారు. ఇటువంటి దళ చర్యలు ప్రతిఘటనోద్యమంగాని, అందులో భాగంకాని కావు. కేవలం ప్రజలతో, ప్రజోద్యమాలతో సంబంధంలేని దళ చర్యలు మాత్రమే.

**అతివాద దుందుడుకు ఎత్తుగడలు :**

పీపుల్స్‌వార్ గ్రూపు రాజకీయ పరిస్థితిని, ఉద్యమస్థాయిని అతిగా అంచనా వేస్తున్నది. ప్రజలు సంసిద్ధులై వున్నందున సాయుధ పోరాటం ప్రారంభించి కొన సాగిస్తున్నామని అతిశయోక్తులతో "పోలీసు ఏజంట్లను, పోలీసులను ఖతంచేయుట" సాయుధ పోరాటంలో అంతిమలక్ష్యం యొక్క ప్రాథమికరూపంగా నెంచుతున్నామన్నారు. ప్రభుత్వం అమలుజరుపుతున్న నిర్బంధాన్ని ప్రతిఘటించుటలో భాగంగా "దుర్మార్గులైన భూస్వాములను, పోలీసులు, వారి ఏజంట్లను ఖతం కార్యక్రమాల రూపంలో శిక్షిస్తున్నామని", "దాడులు, కిడ్నాపింగులు, బస్సులు, రైళ్ళు వంటి ప్రభుత్వ ఆస్తులు ధ్వంసం చేస్తున్నామని ప్రకటించుకొన్నారు. ఇవన్నీ అతివాద దుందుడుకుచర్యలు. ప్రజల పాత్ర, సంబంధంలేని చర్యలు. మార్క్సిజం-లెనినిజం -మావో ఆలోచనా విధానంకు వ్యతిరేకమైన చర్యలు. వ్యక్తిగత హింసావాదం, అరాచకవాదాలలో భాగంగా కొనసాగించే టెర్రరిస్టు చర్యలు.

విప్లవ పోరాటాలు తగ్గుముఖం పట్టినపుడు వ్యక్తిగత హింసావాదం పోరాట క్రమంలో ముందుకొస్తుంది. మార్క్సిజానికి పూర్తి వ్యతిరేకమైన వొక ధోరణి. మార్క్సునుండి మావోవరకు ఎవ్వరూ వ్యక్తిగత హింసావాదాన్ని అంగీకరించకపోగా సైద్ధాంతికంగాను, రాజకీయంగాను ఆచరణలో తీవ్రంగా వ్యతిరేకించారు. అది విప్లవోద్యమ బలహీనతకు చిహ్నం. విప్లవోద్యమం ప్రజావెల్లువగా విజృంభించుచున్నపుడు వ్యక్తిగత హింసావాదం వోడించబడుతుంది. దోపిడి వర్గాలను రద్దు చేయటమంటే వ్యక్తుల నిర్మూలన కాదు. రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకొని, దోపిడివర్గ పాలనకు పునాదిగావున్న ఆస్తి సంబంధాలను మార్చుట లేక రద్దుచేయుట. ఆ విధంగా వ్యవస్థను నిర్మూలించుట, వ్యక్తులను ఖతంచేయుట కాదు. వ్యక్తిగత హింసావాదం కొంతమంది వ్యక్తులను ఖతంచేస్తే, దోపిడి వ్యవస్థను మార్చగలమనే భ్రమలను కలిగిస్తుంది. దోపిడివ్యవస్థ చెడును గుర్తించకుండా, పాలనా వ్యవస్థలో దుర్మార్గులు కొంతమంది వుండుటయే యీ చెడుకంతటికీ కారణమని, అందుచేత అట్టి దుర్మార్గులను ఖతంచేస్తే వ్యవస్థ బాగుపడుతుందని, తప్పుడు అభిప్రాయాన్ని కలుగజేస్తుంది. ఈ భావం ప్రజలను ప్రేక్షకులుగా చేయుటకు, ప్రజా వుద్యమాన్ని, పోరాట పటిమను నిర్వీర్యం చేయుటకు మాత్రమే తోడ్పడుతుంది. ప్రజోద్యమానికి అత్యంత హానికరమైనది.

కిడ్నాపింగులు విప్లవ ప్రజాపోరాట రూపంకాదు. ప్రజల ప్రత్యక్ష పాత్ర లేదు. డిసెంబరు 1987లో తూర్పుగోదావరి జిల్లా గుర్తేడులో శ్రీ శంకరన్ తదితర ఐ.ఎ.యస్. అధికారులను పీపుల్సువార్ కిడ్నాప్ చేసింది. రాష్ట్ర ప్రభుత్వం ఐ.ఎ. ఎస్. అధికారులను సురక్షితంగా విడిపించుకొనుటకు కొంతమంది పీపుల్సువార్ కార్యకర్తలను విడుదల చేసింది. కిడ్నాపింగ్ విధానాన్ని కె.సీతారామయ్య, పీపుల్సు వార్ రాష్ట్ర కార్యదర్శి పి. కిరణ్‌కుమారులు బలపరచారు. ప్రజలు పాల్గొనని యీ చర్యలో కొన్ని తాత్కాలిక ప్రయోజనాలు కలిగినా, ప్రజల విప్లవ పోరాటశక్తిని, చొరవను, దీర్ఘ కాల ప్రయోజనాలకు తీరని నష్టాన్ని కలుగజేస్తుంది. ఇదే కోవకు చెందినదే బస్సులు, రైలు పెట్టెలు, రైల్వే‌స్టేషనులు, పాఠశాలలు, ప్రభుత్వ కార్యాలయాలు తగులబెట్టుట ప్రజావిప్లవోద్యమ పోరాట రూపాలుకావు. ఈ చర్యలు విప్లవోద్యమాల దీర్ఘ కాల ప్రయోజనాలకు నష్టదాయకమేగాక, ప్రజల పోరాటశక్తిని నిర్వీర్యం చేస్తాయి.

పీపుల్స్‌వార్ రాష్ట్రకమిటీలో 1982 నుండి "గెరిల్లాజోన్" మార్గదర్శిక సైద్ధాంతిక దృక్పథపత్రంపై ఎడతెగకుండా సాగుతున్న చర్చల పర్యవసానంగా కమిటీ రూపొందించిన వాక సమీక్షా పత్రాన్ని మహాసభ ఆమోదించింది. మహాసభ పీపుల్సువార్ విప్లవ కమ్యూనిస్టులు ఆచరణలో పెట్టుతున్న "ఎత్తుగడల పంథా"ను ఆమోదించుటతోపాటు, కె. సీతారామయ్య కేంద్రకమిటీని రద్దుచేయాలని ప్రతిపాదించిన తీర్మానాన్నికూడా మహాసభ ఆమోదించింది.

## పీపుల్స్‌వార్ రాజకీయ విధానాలు, అవగాహనలోని కొన్ని పరస్పర వైరుధ్యాలు :

పీపుల్స్‌వార్ నాయకుడు కె. సీతారామయ్య ఆధ్వర్యంలో జరిగిన రాష్ట్ర మహాసభ చేసిన నిర్ణయాలతో పరస్పర వైరుధ్యాలుగల అంశాలు ఉన్నవి.

ప్రపంచ సోషలిస్టు శిబిరం లేదని ప్రకటించి, మరోవైపున మూడు ప్రపంచ శిఖరాల సిద్ధాంతాన్ని ఏకగ్రీవంగా ఆమోదించుట పరస్పర వైరుధ్యం అనుట స్పష్టం. అట్టి మహాసభ చైనా కమ్యూనిస్టుపార్టీ డెంగు ముఠా నాయకత్వాన్ని వ్యతిరేకించి పోరాడండి అనే పత్రాన్నికూడ మహాసభ ఆమోదించింది.

యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చండి, అనే రాజకీయ తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించిన కేంద్రకమిటీ, అదేకాలంలో రెండు అగ్రరాజ్యాలకు వ్యతిరేకంగా ఐక్యసంఘటనను నిర్మించండి" అని ప్రతిపాదించిన మూడు ప్రపంచ శిబిరాల సిద్ధాంతాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు. విరుద్ధ అంశాలను ఏకకాలంలో ఆమోదించుటలోని అనౌచిత్యం స్పష్టం.

అంతర్జాతీయ సామ్రాజ్యవాదానికి, వెనుకబడిన దేశాలలోని ప్రజాస్వామ్య విప్లవాలకు మధ్యనున్న వైరుధ్యమే ప్రధాన వైరుధ్యమన్న రాజకీయ తీర్మానాన్ని

ఆమోదించారు. అదే మహాసభలో రెండు సామ్రాజ్యవాద అగ్రరాజ్యాలు, వారి తాబేదార్లు వొకవేపున ప్రపంచంలో అన్నిపీడితజాతులు అగ్రరాజ్యాల దురాక్రమణ, జోక్యం, అజమాయిషీకి, బెదిరింపులకు గురవుతున్న దేశాలన్నీ మరోవేపున ఉన్నా వని ప్రతిపాదించే మూడు ప్రపంచ శిబిరాలు అన్న సిద్ధాంతాన్ని ఏకగ్రీవంగా ఆమో దించారు.

ప్రస్తుతదశలో పాలక వర్గాలలోని ఏ వొక్క సెక్షన్‌తోనూ ఐక్య సంఘట నను నిర్మించరాదన్న రాజకీయ తీర్మానాన్ని ఆమోదించిన మహాసభే దానిని వ్యతిరే కించే మూడు ప్రపంచ శిబిరాల సిద్ధాంతాన్ని, ఎన్.టి.ఆర్ తెలుగుదేశంతో ఐక్య సంఘటనను ఆమోదించే పత్రాలను ఏకగ్రీవంగా ఆమోదించింది.

ఈ దేశం స్వతంత్రదేశం కాదని, పాలకవర్గానికి దళారీ బడా బూర్జువా వర్గం నాయకత్వం వహించుతున్నదనే రాజకీయ తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమో దించారు. అదే మహాసభ "ఈ దేశం స్వతంత్రదేశం, పాలకవర్గం బడా బూర్జువా వర్గమే కాని, దళారీ బడా బూర్జువావర్గం కాదని" ప్రతిపాదించిన "మూడు ప్రపంచ శిబిరాల సిద్ధాంతాన్ని" ఏకగ్రీవంగా ఆమోదించుటలో పరస్పర వైరుధ్యం స్పష్టం.

"విప్లవదశ అంతటా రాజకీయ వ్యూహం మారదు, ఎత్తుగడలు రాజకీయ పరిస్థితినిబట్టి మారుతూ వుంటాయి" అనే రాజకీయ తీర్మానాన్ని ఆమోదించింది. మరోవేపున "ప్రపంచ పరిస్థితులలో, సామాజిక సంబంధాలలో పేర్కొనతగిన మార్పులు సంభవించిన ప్రతిపర్యాయం వ్యూహం, ఎత్తుగడలు జంటగా మారతా యన్న మూడు ప్రపంచశిబిరాల సిద్ధాంతాన్ని, పరస్పర వైరుధ్యాలు కలదయినా ఆమోదించింది. [1]

ఈ విధంగా పరస్పర విరుద్ధమౌలిక అంశాలుగల తీర్మానాలను , పత్రాలను మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించుట, కొండపల్లి ఆలోచనల గందరగోళాన్ని తెల్పుతుంది.

వ్యవసాయ విప్లవ కార్యక్రమంద్వారా రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకొనా లనే రాజకీయ ప్రచారంతో, పాక్షిక పోరాటాలను సాయుధ చర్యలతో సమ్మేళనంతో రైతాంగంలో విప్లవ చైతన్యాన్ని పెంచగలమని ఈ విధంగా రెండవదశలో గెరిల్లా జోన్ ఏర్పాటకై జరిగే పోరాటానికి ప్రజాపునాదిని నిర్మించగలమని ఎత్తుగడలపంథా వివరించింది.

---

1. ఉద్యమాలను బలపరిచేందుకు మిలిటెంటు ఆర్థికవాద ఎత్తుగడల పంథాను కలసి కట్టుగా భూస్థాపితం చేద్దాం (1989) మార్క్సిస్టు-లెనినిస్టు అధ్యయన కేంద్రం, నెల్లూరు పే. 3-4.

ఈ విధంగా రహస్య పార్టీని, ప్రజా సంఘాలను, గ్రామ కమిటీలను, గ్రామ మిలీషియాలాంటి రహస్య యంత్రాంగాన్ని నిర్మించి, గెరిల్లా జోన్ నిర్మాణానికై జరిగే పోరాటాన్ని విజయవంతం చేయాలని ఎత్తుగడల పంథా ప్రతిపాదించింది. ఎత్తుగడల పంథా విప్లవోద్యమాన్ని మూడు దశలుగా విభజించింది. మొదటి దశలో విప్లవ ప్రచారం చేస్తూ మిలిటెంటు పోరాటాలు నిర్వహించుట ద్వారా, గెరిల్లా జోన్ నిర్మాణంకై జరిపే రెండవ పోరాట దశకు పూర్వరంగాన్ని సంసిద్ధం చేయాలి. మూడవ దశను విప్లవ యుద్ధ స్థావర ప్రాంత నిర్మాణ పోరాట దశగా ఎత్తుగడల పంథా పేర్కొన్నది.[1]

అంతేగాని, మారుతున్న రాజకీయ పరిస్థితి, వర్గ శక్తుల పొందికలపై ఆధారపడి నూతన రాజకీయ కర్తవ్యాలను, రాజకీయ ఎత్తుగడలను నిర్ణయించుకొనాలనే ప్రస్తావన లేదు. ఎత్తుగడల పంథా, పోరాట రూపాలను మాత్రమే చూడగలిగింది కాని, వాటి రాజకీయ సారాంశాన్ని గ్రహించలేకపోయింది. ఎత్తుగడల పంథా ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిస్థితిని, వాటి చలనంలో మార్పుల సహితంగా చూడ నిరాకరిస్తోంది. ఎత్తుగడల పంథా దృక్పథం జడాత్మకంగా వుంది. మార్క్సిస్టు-లెనినిస్టుల ఎత్తుగడల పంథాగా కాక మిలిటెంటు అర్థిక పోరాటాల ఎత్తుగడ పంథాగా వుంది. రణదివే సెక్టేరియనిజం 1947-50 లలో ప్రతిపాక్షిక ఆర్థిక పోరాటాన్ని సార్వత్రిక సాయుధ పోరాటంగా చేయాలనే ఎత్తుగడలతో అతివాద దుందుడుకు సాహసిక వాదంలో మునిగిపోయింది. పీపుల్స్‌వార్ ఎత్తుగడల పంథా మిలిటెంటు పాక్షిక అర్థిక పోరాటాలను కూడ విముక్తి పోరాటంకై జరిగే ప్రజాయుద్ధంగా మార్చాలనే విఫల యత్నాలు చేస్తున్నది. రెండూ అతివాద సాహసిక దుందుడుకు సెక్టేరియన్ పంథాలే, పెద్ద తేడాలేదు. ఫలితాలూ వేరుగా వుండవు.

---

1. — అదే — పే. 8, 2-0.

# 9

# విప్లవకారుల ఐక్యతా ప్రయత్నాల నత్తనడక

సి.పి.ఐ. చీలిక 1964లో వాస్తవరూపం ధరించినా నేపథ్యం 1947-51లలో సైద్ధాంతిక చర్చలలో, నిర్మాణ విధానాలలో వచ్చిన తీవ్ర అభిప్రాయ భేదాల ఫలితంగా "మితవాద" "అతివాద" గ్రూపులు ఏర్పడిన కారణంగానే జరిగింది. నూతన మార్క్సిస్టు పార్టీలోనూ వారసత్వంగా 1964 నుండి 1967 వరకు విప్లవ పంథా, రాజకీయ విధానం, వ్యూహం, ఎత్తుగడలపై ఎడతెగని తీవ్ర చర్చలు జరిగి విప్లవ కమ్యూనిస్టుల గ్రూపు ఏర్పడి మాతృసంస్థ నియోరివిజనిస్టుగా తయారైందని, విడిపోయి, అఖిల భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) సమన్వయ కమిటీగా ఏర్పడ్డారు. నక్సలైట్లు, మార్క్సిస్టు-లెనినిస్టులుగా పిలువబడ్డారు.కొందరిలో అతివాద అవకాశవాదం, ఉగ్రవాదంతో "వర్గ శత్రువు నిర్మూలన" అంటూ సాహసిక వ్యక్తిగత హింసావాదాన్ని చేబట్టుటతో ఆంధ్రప్రదేశ్ విప్లవకారులు ఎ.ఐ.సి.సి.సి.ఆర్. తదుపరి సి.పి.ఐ. (యం.యల్)గా పిలువబడినవారు అతివాద సాహసిక వ్యక్తిగత హింసావాదాన్ని చేబట్టారని సుదీర్ఘ విమర్శనా పత్రాన్ని సమర్పించగా బహిష్కరించబడ్డారు. ఇంతకుముందే కమ్యూనిస్టు విప్లవకారులు ఎప్పటికప్పుడు అభిప్రాయ భేదాలతో గ్రూపులుగా ఏర్పడ్డారు. ఇప్పుడు కమ్యూనిస్టు విప్లవకారుల గ్రూపులు కొన్ని ఐక్యతను రూపొందించుటకై చేసిన ప్రయత్నాలు అధ్యయనం చేద్దాం.

అతివాద అవకాశవాదం సాహసిక వాదంపై ప్రప్రథమంగా సైద్ధాంతికంగా విమర్శించిన ఎ.పి.సి.సి.సి ఆర్. ఆంధ్ర విప్లవకమ్యూనిస్టు శ్రేణులు ఐక్యతాప్రయత్నాలను సమాంతరంగా ప్రారంభించారు. అంతేగాక "సరియైన పంథా కోసం జరిగే పోరాటం, ఎంతగా ముందుకు సాగితే, విప్లవకారులు అంతగా ఆ పంథా చుట్టూ ఐక్యమౌతారు. విప్లవకారులు ఎంతగా ఐక్యమైతే, పంథాను అంతశక్తివంతంగా ముందుకు తీసుకొని పోగల్గుతారు" అనే అవగాహనతో సరియైన పంథాకై సైద్ధాంతిక పోరాటం, నిజాయితీతో విప్లవ శక్తుల ఐక్యతకై జరిపే పోరాటం "యీ రెండూ విడదీయరానివని" ఎవరైనా" "సరైన పంథా లేకుండా ఐక్యతను గూర్చి ఆలోచిస్తే అది వూహాజనితమే[1]" అగుతుందని కూడ స్పష్టం చేశారు.

ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారుల కమిటి తమ పత్రం "భారత విప్లవ

---

1. భారత విప్లవకారులలో అతివాద ధోరణి (1973) ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు కమ్యూనిస్టు కమిటి (విప్లవకారులు) పే. 82.

కారుల్లో అతివాద ధోరణి"లో విప్లవకాములైన వ్యక్తులతోను, గ్రూపులతోను ఎలా ఐక్యమవ్వాలో వివరించింది.

వ్యక్తులు "మాతో ఐక్యమగుటకు మా డాక్యుమెంట్లు అన్నీ అధ్యయనం చేసి, అన్ని ముఖ్యాంశాలపైనా తమ అభిప్రాయాలు వ్యక్తం చేయాలి. తగిన కమిటి అతని అభిప్రాయాలను పరిశీలిస్తుంది. ఐక్యతకు ప్రాతిపదిక ఉన్నదీ లేనిదీ పరిశీలిస్తుంది. ఐక్యతా ప్రాతిపదిక వుంటే మా డాక్యుమెంట్లలోని కొన్ని అంశాలను వివరించే మా ముఖ్య డాక్యుమెంట్లను అందజేస్తుంది. వాటిని అధ్యయనంచేసి, కమిటి నుండి అవసరమయిన వివరములను పొందవచ్చును. అతను విప్లవ శ్రేణులలో కొత్తగా చేరినవాడు కానిచో, గత మూడు సంవత్సరాలుగా తాను సాగించిన కార్య కలాపాలపై వొక నివేదిక అందచేయాలి. తాను వ్రాసిన డాక్యుమెంట్లు ఏమయినా వుంటే అందజేయాలి. తగిన కమిటి వాటిని పరిశీలించి, మా నిర్మాణంలోనికి తీసు కొనవచ్చని సంతృప్తి చెందితే, నియమావళికి అనుగుణంగా అవసరమయిన చర్యలు తీసుకొంటుంది. తగిన కమిటి వాటిని పరిశీలించి, మా నిర్మాణంలోనికి తీసుకొన వచ్చని సంతృప్తి చెందితే, నియమావళికి అనుగుణంగా అవసరమైన చర్యలు తీసు కొంటుంది. అంతిమ నిర్ణయం కమిటీ చేస్తుంది.

పార్టీలో చేరదలచిన గ్రూపులు అనుసరించవలసిన విధాన క్రమాన్ని యిలా వివరించింది. ఇది నిస్సందేహంగా క్లిష్ట సమస్య. దేశంలో అనేక విప్లవ గ్రూపు లున్నవి. "మాపట్ల శతృపూరితంకాని వైఖరి తీసుకొన్న గ్రూపులతో చర్చలు సాగిం చుటకు మేము సిద్ధంగా వున్నాం· చర్చలకు ముందు మా డాక్యుమెంట్లపై చేరదల చిన ఆ గ్రూపుల అభిప్రాయాలు తెలుసుకొనగోరుతాము. తగినన్ని సామాన్యఅంశాలు లేకుంటే, మా వైఖరి వివరించుటకు, మా యితర డాక్యుమెంట్లపై మరింత చర్చ అవసరం కావచ్చు. ఆ గ్రూపు దృక్పథం తెలుసుకొనుటకు వారి డాక్యుమెంట్లను సమగ్రంగా చర్చిస్తాము. ఈ క్రమం సన్నిహితంచేసి, ఐక్యతకు దారివేస్తుంది.

"మా డాక్యుమెంట్లు, ఆ గ్రూపు మొత్తం సభ్యులకు పంపిణీ చేయబడి, చర్చించబడాలని మేము కోరుతున్నాము. ఆ గ్రూపు నాయకత్వం అవసరమని భావిస్తే తమ వ్యాఖ్యానాలను వారి శ్రేణులకు పంపవచ్చును. ఈ విధమైన విస్తృత చర్చ ఎదుటిపక్షం యొక్క దృక్పథాన్ని స్పష్టం చేస్తుంది. అర్థవంతమైన ఐక్యతకు తోడ్పడుతుంది.

ఇచ్చి పుచ్చుకొనే పద్ధతిలో సంబంధాలు కోరుతున్నారు. ఒకే నిర్మాణంలో ఐక్యమగుటకు పరస్పరం డాక్యుమెంట్లు అందజేసుకొనుట,అనుభవాలపై పరస్పరం అభిప్రాయాలు తెలుసుకొనుట, ప్రాముఖ్యతగలది, ఐక్యతకు తోడ్పడునదిగా వుంది.[1]

1. — అదే— పే. 100–102.

ఇటీవలివరకు మా నిర్మాణంలో భాగంగా వుండిన పుల్లారెడ్డి గ్రూపు, ఆయుధాలు క్రింద పెట్టమని చెప్పుతున్న రివిజనిస్టులమని మమ్ము పిలుచుటద్వారా మాపట్ల ద్వేషపూరిత వైఖరిని తీసుకొన్నది....కాబట్టి మాతో ఐక్యం కాగోరేవారు ఈ క్రింది అంశాల ప్రకారం ఐక్యం కావచ్చును.

1. మా పార్టీ డాక్యుమెంట్లలోని పంథాను ఆమోదించి, అమలు చేయాలి.

2. గత మూడేళ్ళకాలంలో వారి కార్యకలాపాలపై ఆత్మవిమర్శనాత్మకంగా పరిశీలించుకొనాలి. తగిన పార్టీ కమిటి మార్గదర్శికత్వంలో పాత తప్పులను సరిచేసుకొనాలి.

3. పార్టీ పంథాను అమలుకై చేబట్టే నిర్మాణ చర్యలను బలపరచాలి.

ముగింపుగా ఎ.పి.సి.సి.సి.ఆర్. వారికి వొక మౌలిక పంథా వుందని, వ్యవసాయ విప్లవ రైతాంగ సాయుధ పోరాటానికి కట్టుబడి వుండాలి.

తక్షణ కార్యక్రమంకూడ పై వ్యూహానికి అనుగుణంగా వుంది. సాయుధ పోరాటం భూమి పంపకపుదశలో అనుసరించబడే పోరాట రూపంగా వుండగలదే కాని, పాక్షిక పోరాటాలదశలో అనుసరించబడే రూపంకాదని, తెలంగాణా సాయుధ పోరాటాల అనుభవం రూఢిగా నిరూపించిందని, భూమి పంపకం నేడు వ్యవసాయ విప్లవోద్యమాన్ని నిర్మించి, పురోగమించుటకు అవసరం, సాధ్యమని రాష్ట్ర సదస్సు నిరూపించింది. మౌలిక పంథాను ప్రాతిపదిగా చేసుకొని మాత్రమే నిర్మాణ ఐక్యత సాధ్యమని విశ్వసించుతున్నామన్నారు. ఆచరణ అనుభవాలు దానిని మెరుగు పరచాలన్నారు. ఈ ప్రాతిపదికపైనే ప్రతినిధుల సమావేశం జరగాలని, అదే క్రమంలో నిర్మాణాన్ని ఐక్యపరచి, పటిష్ఠం చేయబడగలదని విశ్వసించుతున్నామని ముగించారు.

## ఐక్యతా సదస్సు - యు.సి.సి.ఆర్.ఐ. (యం. యల్) నిర్మాణం :

ఐక్యతా చర్యలకు ఎ.పి.సి.సి.సి.ఆర్. రూపొందించిన కార్యక్రమం, పంథా, నిబంధనావళి ప్రాతిపదికలయ్యాయి. ఐక్యమవ్వాలనే అవగాహనకు వచ్చిన నిర్మాణాలు, యీ ముసాయిదాల్లో కొన్ని మార్పులు చేయుటకు అంగీకరించాయి.

ఐక్యతా సదస్సుకు సమాన ప్రాతినిధ్య సూత్రం పాటించబడింది. ఆయా నిర్మాణాల స్థితి పరిగణలోనికి తీసుకొనబడలేదు. ప్రాతినిధ్యం నిర్ణయించే సమావేశంలో ఎ.పి.సి.సి.సి,ఆర్., పశ్చిమ బెంగాల్ సి.సి.ఆర్; యన్.జడ్.సి; పశ్చిమ బెంగాల్ సి.యు.సి.లు పాల్గొన్నాయి. ఐక్యతా సదస్సు నాటికి చివర పేర్కొన్న రెండు నిర్మాణాలు కలసి ఎ.ఐ.పి.సి.గా ఏర్పడినా రెండూ, సదస్సులో పాల్గొన్నవి. కా. టి. నాగిరెడ్డి సదస్సులో పాల్గొనలేకపోగా దేవులపల్లి వొక్కరే ఎ.పి.సి.సి. ఆర్.కు ప్రాతినిధ్యం వహించారు. సదస్సులో సంఖ్యారీత్యా ఎ.ఐ.పి.సి. ఆధిక్యత

సంపాందిచగలిగింది.[1].

సుదీర్ఘమైన ఐక్యతా క్రమంలో ఆచరణాత్మకంగా సాగాలని ప్రారంభంలో సదస్సు నిర్ణయించింది. ఈ క్రమంలో ప్రథమ అంశం, మౌలికంగా ఏకాభిప్రాయం గల సంస్థలతో ఐక్యమగుట, ద్వితీయాంశం, కొన్ని సూత్రాలు ప్రవర్తనావళి ప్రాతిపదికగా అతివాద అవకాశ వాదానికి వ్యతిరేకంగా వున్న సాధ్యమైనన్ని ఎక్కువ సంస్థలతో "సంప్రదింపుల" స్థాయి సంబంధాలు ఏర్పరచుకొనుట, అంతిమంగా ఐక్యతను సాధించుటకు యీ సూత్రాలు, ప్రవర్తనావళి వుద్దేశించబడ్డాయి. చివర అంశంగా, సంప్రదింపుల సంబంధాల్లోనికి వచ్చిన సంస్థలమధ్య సాధ్యమైన ఐక్య కార్యాచరణను అభివృద్ధి చేయటం అన్న మూడు అంశాలున్నాయి.

అఖిల భారత నిర్మాణాన్ని త్వరితంగా ఏర్పాటు చేయాలనే ఆతురతతో పై క్రమాన్ని పట్టుదలగా ఆచరించుటలేదు. ఐక్యతాకృషి కాలంలో వ్యక్తమైన తప్పులను, అవకాశవాద ధోరణులను శక్తివంతంగా వ్యతిరేకించి పోరాడుటలో పాక్షికంగా విఫలమైంది. ఉదారవాదానికి అవకాశ మిచ్చింది. అంచేత, ఆనాడు ఎ. పి. సి. సి. ఆర్.తో ఐక్యతను కోరుకొన్న కొన్ని సంస్థలు వేచి చూచే వైఖరి చేబట్టాయి.

ఐక్యతా సదస్సు ఏప్రిల్ 1975లో జరిగింది. కార్యక్రమం,పంథా, నిబంధనావళి, పని విధానాలపై తీర్మానాలను ఆమోదించింది. ఐక్యతా సమస్యపై తీర్మానాన్ని చర్చించి, ఆమోదించింది. ప్రధానంగా పంథా సమస్యపై చర్చలు పరిమితంగా జరిగినవి. అన్ని సందర్భాలలో యీ పద్ధతి ఐక్యతకు దోహదకారి కాదని అనుభవం చూపెడుతున్నది. సదస్సు కేంద్ర కమిటిని, అది కా. దేవులపల్లిని కేంద్ర కమిటి కార్యదర్శిగా ఎన్నుకొన్నది. కార్యదర్శి "వాస్తవిక సమాచారాన్ని ఆధారం చేసుకొని చర్చల ద్వారా విభేదాలను పరిష్కరించుకొనాలని" అన్నారు.[2].

అనేక తీవ్ర పరిమితులకు లోనైనా "ఐక్యతా కాన్ఫరెన్స్ మౌలిక పంథాపై ఏకాభిప్రాయం, ఐక్యత కల గ్రూపులన్నీ ఐక్యం కావాలనే పిలుపునిచ్చే తీర్మానం ఆమోదించబడింది. ముఖ్య మౌలికాంశాలపై భిన్నాభిప్రాయాలు ఉన్నప్పుడు రెండు పక్షాలు పరస్పరం, మూడో పక్షంతో కూడ అట్టి ఐక్యతా భావ సంబంధాలనే కలిగివుండాలి, వాటినే అభివృద్ధి చేయాలి. కాలం గడచిన కొలది యీ విషయంలో అశ్రద్ధ వహించిన ఫలితంగా అవాంచనీయ పరిస్థితులు వృద్ధిచెంది, ఐక్యతా ప్రయత్నాలను బలహీన పరచాయి.

---

1. భారత విప్లవోద్యమం. కొన్ని గుణపాఠాలు. అనుభవాలు. (1990) జనశక్తి ప్రచురణ. విజయవాడ పే. 170.

2. భారత విప్లవోద్యమం. కొన్ని గుణపాఠాలు–అనుభవాలు (1990) జనశక్తి ప్రచురణ, విజయవాడ. పే. 173.

1) ఒకవైపున విచ్ఛిన్నకర ప్రాక్షను శక్తులు మరోవైపున ఐక్యతా శక్తులు పని చేస్తూనే వున్నవి. మేజువాణి ఐక్యతా ప్రకటనలు చాలవు. ఆచరణయే గీటు రాయి. విప్లవకారులలో ఐక్యత నెలకొల్పుటలో విచ్ఛిన్నకారులకు ఎట్టి పాత్ర వుండదు.

2) అదే విధంగా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై సంస్కరణవాదులు చేయుచున్న దాడిని త్రిప్పికొట్టి, ఐక్యతను కాపాడాలి.

అంచేత, మన ఐక్యతా ప్రయత్నాలు మన సాధారణ పంథాను పరిరక్షించుతూ, మితవాద, అతివాద అవకాశ వాదాలపై నిరవధిక పోరాటం సాగించుట ద్వారానే మార్క్సిజం-లెనినిజం, కార్మికవర్గ అంతర్జాతీయత కాపాడబడుతుంది.[1]

ఒకవైపున చారుమజుందార్ నాయకత్వంలో "వ్యవసాయ విప్లవం" "వర్గ శత్రు నిర్మూలన" నినాదాలతో సాగిన "అతివాద వ్యక్తిగత హింసా దౌర్జన్యవాదాల నుండి బయటపడిన వారు, నూతన విధానంతో ఐక్యతను పునరుద్ధరించు ప్రయత్నాలు జరుపుతున్న కానూసన్యాల్, సౌరిన్‌బోస్, తేజేశ్వరరావులు, మరోవైపున నియో అతివాద అవకాశవాదాన్ని చేబట్టిన అషించటర్జీ, "ఫ్రాంటియర్" పత్రిక అనుయాయులు వివిధ రాష్ట్రాలలో యింకా అనేక రాష్ట్రాలలో వివిధ గ్రూపులుగ చీలిపోయివున్న "నక్సల్బరీ ముద్దుబిడ్డలు" అతివాద కమ్యూనిస్టులలో సైద్ధాంతిక గందరగోళాన్ని కలుగజేస్తున్నారు. అంచేత ఐక్యతా ప్రయత్నాలు నత్తనడకలో సాగుతున్నాయి.

**విప్లవకారులలో ఐక్యత-పెడధోరణుల పాత్ర :**

"విప్లవకారులలో గ్రూపులుండుట ఎంత యదార్థమో, వారిలో వివిధ సమస్యల యెడల విభేదాలుండుటకూడా అంతే యదార్థం. విప్లవకారులంతా వొకేపార్టీతో ఐక్యం కావాలన్నది నేటి భారత కమ్యూనిస్టు ఉద్యమపు ప్రధాన కర్తవ్యం. దీనికై విప్లవకారులలోవున్న విభేదాల స్వరూప, స్వభావాలేమిటో అర్థం చేసుకొనుట, వాటిని పరిష్కరించుకొనుటకు సూత్రబద్ధమైన పద్ధతులు అనుసరించుట అవసరము, సాధ్యము. గతంలో వివిధ గ్రూపులు చేసిన తప్పులు యిప్పటికి అవి అనుసరించుతున్న పెడధోరణులు, ఐక్యత కొరకు చేసే కృషి అడ్డుగా వుండవలసిన అవసరం లేదు. ఇలా యేర్పడిన ఐక్యత సంపూర్ణం, సమగ్రం, ఏకీకృతమైనది కాకపోయినప్పటికి, విభేదాలు చర్చించుకొనుటకు తగిన వాతావరణాన్ని కలిగిస్తుంది. కాని తమతో మౌలికంగా విభేదించేవారిని, మత్సరహ లేక సరికొత్త రివిజనిస్టులని సూత్రీకరించుట ప్రారంభమగుటతో విభేదాలు చర్చించుకొనుటకు కనీస ఐక్యతా

---

2. వెంకటేశ్వరరావు దేవులపల్లి (1982) సప్లిమెంటు ఆన్ యూనిటీ. ది ప్రొలిటేరియన్ లైన్. నం. 26 సెప్టెంబరు 1982. పే. 5-6.

వాతావరణం లేకుండాపోతుంది. వాస్తవం ఏమంటే యీ గ్రూపులు ముందుకు తెస్తున్న మధ్యతరహా లేక సరికొత్త రివిజనిజం చర్చనీయాంశాలుకావు, కాకూడదు. ఈ గ్రూపులు సిద్ధాంత, రాజకీయ విధానాలు, ఆచరణలే చర్చనీయాంశాలు కావాలి, అదే ఐక్యతామార్గం.

"కావున వీరి విధానాలు విప్లవోద్యమ ప్రారంభానికి, దానిని కాపాడి అభివృద్ధి చేయుటకు వుపయోగపడకపోగా, విచ్ఛిన్నానికే తోడ్పడుతున్నాయని మా నిశ్చితాభిప్రాయం. విప్లవకారులు "మనవాళ్ళే" అనే ధోరణిని వదులుకొని తమ అభిప్రాయ భేదాలను సవ్యమైన పద్ధతులలో పరిష్కరించుకొని, సరైన పంథా, కార్యాచరణలను ఆధారం చేసుకొని వొకే పార్టీగా ఐక్యం కావాలని మేము కోరుతున్నాము. [1]

"ఏ అవకాశవాదమైతే సి.పి.ఐ.(ఎం.ఎల్)ను కమ్యూనిస్టు విప్లవకారులనుండి దూరమగుటకు కారణమైందో అదే అవకాశవాదం సి.పి.ఐ.(ఎం.ఎల్)ను గ్రూపులుగ ఉపగ్రూపులుగ చీల్చింది. అవి వేర్వేరు గ్రూపులుగా మనగలిగేందుకు రకరకాల అవకాశవాదాలను అనుసరిస్తున్నారు. కమ్యూనిస్టు విప్లవకారులు సి.పి.ఐ (ఎం.ఎల్) గ్రూపులకు భిన్నమైనవారని దీని అర్థం. ఒక గ్రూపుకు ప్రజావిప్లవపంథా వుండగా రెండవ గ్రూపుకు సి.పి.ఐ. (ఎం.ఎల్) వారికి అటువంటిదేమీలేదు. ఇదే వాటిమధ్య గల మౌలిక భేదము. యితరులకు యీ భేదము అంతగా తెలియదు. [2]

"సి.పి.ఐ.(యం)తోను, సి.పి.ఐ. మినహా వామపక్ష ఐక్యసంఘటన లేక ఐక్యకార్యాచరణ ప్రబోధించేవారు వున్నారు. మనం ఐక్యసంఘటన కట్టేది భాగ స్వాముల అనుచరవర్గాన్ని మనవైపు తిప్పుకొనుటకుమాత్రం కాదు. కొందరు మన వైపుకు వస్తే అది మన సరైన పంథా ఫలితం. మన ఐక్యసంఘటనా విధానంయొక్క ముఖ్యోద్దేశం విప్లవ శత్రువులకు వ్యతిరేకంగా యావత్తు విప్లవ శక్తులను పోరాటంలో ఐక్యపరచుటయే లక్ష్యం.

మరికొందరు అంగీకృత అంశాలను వెతుకుటలో నిమగ్నులై వున్నారు. ఆ అంశాలు దాదాపు అన్నీ వివాదాస్పదమైనవే. వీరందరూ మార్క్సిజం-లెనినిజం-మావోయిజంల యెడల విశ్వాసం ప్రకటించినవారే. కాన సైద్ధాంతిక సమస్యలేవీ అడ్డుగా లేవుకాని భారత విప్లవాచరణకు అన్వయించుటలో వివాదాంశాలు ఉద్భవించుటకు అవకాశముంది. వాటిని పరిష్కరించు ప్రయత్నం వారికి మించినదగుటతో దాని జోలికి పోరు.

రెండు గ్రూపులుగాని, అంతకుమించిన గ్రూపులుగాని ఏవో కొన్ని సర్దుబాట్లు

---

1. పార్టీలో మితవాద అవకాశవాదం (1973) ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారుల కమిటి. ఉపోద్ఘాతం. పే. 12.

2. కమ్యూనిస్టు విప్లవకారుల ఐక్యతా సమస్యలు (1980) ప్రొలిటేరియన్ లైన్, 7వ సంచికనుండి పునర్ముద్రితము. జనశక్తి ప్రచురణ. గుంటూరు. పే. 10.

సమన్వయ కమిటీలు, విలీనంద్వారానో ఐక్యమగుతున్నాయన్నది సత్యం. అదే సమయంలో కొత్తగ్రూపులు తలెత్తుతున్నదీ వాస్తవం. ఈనాడు ప్రధానమైన గ్రూపులు అయిదో ఆరో కాగా, అనేక ఉపగ్రూపులుగ ఎంత చిన్నవైనా చీలిపోయి ఉన్నవి. ఐక్యతవైపు అన్ని గ్రూపులు పయనిస్తున్న దాఖలాలు లేవు. వ్యక్తిగత విభేదాలు కావచ్చు లేక ప్రధాన అప్రధాన సమస్యలపై విభేదాలు కారణం కావచ్చు.

"మూడు గ్రూపులు విలీనం అయిన ఫలితంగా 1975లో భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమైక్యతాకేంద్రం (మా.లె.) ఏర్పడింది. అవి; ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారుల కమిటి, ఉత్తర బెంగాల్ నార్త్ జోన్ కమిటి సహచరులు, పశ్చిమ బెంగాల్ సి.సి.ఆర్.లు చర్చల దశలోనే కొన్ని అప్రధాన భేదాభిప్రాయాలున్నప్పటికి, కార్యక్రమం, విప్లవ పంథాలపై సమిష్టి అవగాహనకు రావటంతోనేగాక, అతివాద అవశేషాలను కొన్నింటిని ఎత్తి చూపినపుడు నాయకత్వం పాక్షికంగా తమ తప్పులను ఆమోదించి, కాలక్రమంలో చర్చల ద్వారాను, ఆచరణద్వారా పరిష్కరించుకొనగలమనే విశ్వాసం"తో పురోగమించారు.

"కాని ఐక్యతను సాధించే విషయంలో ఎదుటి గ్రూపు నాయకత్వానికి తమ స్వంత అవగాహన, ఆచరణ వున్నాయి. రాజకీయాలలో రాజీ పడుతూ వచ్చారు, నిర్మాణం విషయంలో కుట్ర పద్ధతులు సాగించారు. సమైక్యతా కేంద్రం ఏర్పడక ముందే, చర్చలు కొనసాగుతున్నపుడే, వివిధ రాష్ట్రాలలో తమ పరిచయస్థులతో యూనిట్లు ఏర్పాటు చేయుటద్వారా, తమ బలాన్ని హెచ్చుచేసి చూపారు. కొన్ని అవాంఛనీయ కెరీరిస్టులు బొంబాయి, పంజాబులలో సి.పి.ఐ.(ఎం.ఎల్) నుండి వేరుపడ్డారు. కొందరు వివిధ ప్రాంతాలలోని విప్లవకారులలో భేదాభిప్రాయాలు సృష్టించ ప్రయత్నించారు. రాజకీయ, సైద్ధాంతిక, నిర్మాణ ఐక్యతలు లేనప్పుడు యిట్టి అవాంఛనీయ పరిణామాలనెన్నిటినో ఎదుర్కొని అధిగమించగలిగినపుడే ఐక్యత ఏర్పడగలదు. ఐక్యతకై పోరాటమంటే అర్థమిదే, గ్రూపుల నాయకత్వాలు, శ్రేణుల స్థాయి వొకే రకంగాలేదు. "నాయకులు కుట్రల కళలలో అందెవేసిన వారు కాగా, మిగిలినవారు అణగి మణగి వుండి తరచు నాయకులు చెప్పిన దానిలోకొట్టుకుపోయేవారు. ఆంతరంగిక సైద్ధాంతిక పోరాటం జరిపేందుకు తగిన అవగాహన స్థాయి, రాజకీయ అనుభవం లేనివారు. ఈ గ్రూపులలో భిన్నాభిప్రాయాలు తరువాతే వెల్లడయ్యాయి.[1]

---

1. కమ్యూనిస్టు విప్లవకారుల ఐక్యతా సమస్యలు (1980) ప్రొలిటేరియన్ లైన్ 7వ, సంచిక నుండి పునర్ముద్రితము. ప్రజాశక్తి ప్రచురణలు, గుంటూరు. పే. 20–21.

**కమ్యూనిస్టు విప్లవకారుల సమైక్యతా కేంద్రం (యం. యల్.) దాని ఐక్యతా దృక్పథం :**

విప్లవకారులను ఐక్యం చేయుటకు, భారత విప్లవానికి నాయకత్వం వహించ గల సమర్థవంతమైన విప్లవ పార్టీని, నాయకత్వాన్ని రూపొందించే కర్తవ్యాన్ని నిర్వహించడానికి చేసే ప్రయత్నాలలో కా. నాగిరెడ్డి రూపొందించిన దృక్పథం మార్గదర్శికంగా వుంటుంది. దానిని పట్టుదలతో అమలు చేసిన మేరకు అనుకూల ఫలితాలు లభించాయి. దానికి భిన్నమైన పెడ ధోరణులు మన ప్రయత్నాలను, పౌరవను దెబ్బతీసాయి. అంతేగాక, విప్లవకారుల ఐక్యపరచే లక్ష్యానికి కూడ హాని జరిగింది.

"మన ఐక్యతా ఆకాంక్ష సూత్రబద్ధమైనది. ఈ పంథానుండి మనలను పెడ మార్గం పట్టించుటకు జరిగిన ప్రయత్నాలను తిరస్కరించాము. ఐక్యత త్వరగా నిర్మించే ఆదుర్దాతో సిద్ధాంత రాజకీయ చర్చలకు సుదీర్ఘకాలం అవకాశం యివ్వ నందుకు మనలను కొంతమంది నిందించవచ్చు. కాని సూత్రబద్ధ ఐక్యతపై గొప్పగా మాట్లాడే గ్రూపులు సూత్రరహిత ప్రతిపాదనలు చేయుటను అర్థం చేసుకొన్నాము. ఐక్య కార్యాచరణలో స్వల్ప భేదాలకు అత్యంత ప్రాధాన్యత నివ్వటం, నిర్మాణ సమస్యలతో సూత్రరహిత విధానాలను ఆశ్రయించటం, వాకరి నౌకరు లోబరచు కొనాలనే ప్రయత్నాలు విప్లవకారుల మధ్య ఐక్యతా సాధనకు అడ్డుగా వున్నాయి.[1].

"ఐక్యతాకృషి, ఐక్య కార్యకలాపాలు విప్లవ ప్రజానీకంలో గొప్ప ఉత్తేజాన్ని, ఆశాభావాన్ని రేకెత్తించాయి. కార్యకర్తలు, అభిమానులు యీ ప్రయత్నాలను ఆహ్వానించారు. విప్లవ గ్రూపుల మధ్య వైషమ్యాలు, శతృత్వాలు పెరగకుండా ఐక్య కార్యకలాపాలు తోడ్పడగలవని ఆశించారు. కాని కొన్ని పెడ ధోరణులు పెరుగుతున్న ఐక్యతా వాతావరణాన్ని కలుషితం చేసాయి.

"అనుభవంలో విప్లవకారుల ఐక్యతా సమస్య అంత తేలికగా పరిష్కరింప బడదని, దానికై పోరాటం అవసరమన్న విషయం స్పష్టమైంది. ఈ పోరాటం మైత్రీ పూర్వకం, వైషమ్యరహితంగా జరుపుట విప్లవకారుల బాధ్యతగా వుంది. ఐక్యత-పోరాటం-ఐక్యత అన్న సూత్రాన్ని ప్రజా పుద్యమ నిర్మాణంలో మేళవించి, యీ పోరాటం సాగించబడాలి. విప్లవకారుల మధ్య స్థిరమూ, దృఢతరమైన ఐక్య తకు మార్గం యిదే కాగలదు.

"ప్రస్తుత అనుకూల అంశాలనన్నిటిని వినియోగించుకొని ప్రజలమధ్య విప్లవ కారుల మధ్య ఐక్యతనూ, విప్లవోద్యమ పురోగతికి మన శక్తియుక్తులన్నిటిని

---

1. భారత విప్లవకారుల సమైక్యతా కేంద్రం (యం.యల్) మొదటి రెగ్యులర్ కాన్ఫ రెన్సు, ఏప్రిల్ 1989, రాజకీయ నివేదిక. పే. 117.
2. ఆదే పే. 118.

కేంద్రీకరిస్తాము. ఆ విధంగా ప్రజలకు, విప్లవానికి అనుకూల వాతావరణాన్ని ఏర్పరుద్దాము.

విప్లవకారులలో ఐక్యత గురించి మాట్లాడుతూ "ఎం.ఎల్. గ్రూపులన్నీ ఒకే వేదికమీదకు రావాలంటే ఒకే ఫాట్- ఆలోచనా విధానానికి రావాలి. విడిపోయిన తరువాత ఏర్పడిన నిర్మాణం స్థిరత్వంతో కూడినదై వుంటుంది. అయితే వుమ్మడి వేదికమీదకు వచ్చే అవకాశం లేదనే కె.యస్. అభిప్రాయాన్ని సత్యం యిలా ఖండించారు.

"విప్లవకారులు ఒకే వేదిక మీదకు వచ్చుటకు ఒకే ఆలోచనా విధానానికి రావాలనుట తప్పు. విప్లవకారులు మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానాన్ని అంగీకరిస్తూ విప్లవదశ, వ్యూహం విషయంలో ఒకేవిధమైన అభిప్రాయాలను కలిగివున్నారు. ఎత్తుగడలలో మాత్రం తీవ్ర అభిప్రాయ భేదాలను కలిగి వున్నారు. సజీవపార్టీలో భేదాభిప్రాయాలు వుండే అవకాశం ఎప్పుడూ వుంయుంది. పాతవి పరిష్కారమై కొత్తవి పైకి వస్తూవుంటాయి. సైద్ధాంతిక, రాజకీయ భేదాభిప్రాయాలను నిర్మాణచర్యలద్వారా పరిష్కరించ పూనుకొనుట తప్పు. అందుకే విభేదాలు పరిష్కరించుకొనుటకు మెజారిటీ విధానానికి మైనారిటి కట్టుబడి వుండుట మైనారిటి అభిప్రాయాలను మెజారిటి గౌరవించుట, కేంద్రకమిటి నిర్ణయాలకు క్రింది కమిటీలు, సభ్యులు కట్టుబడివుండుట, పార్టీలో పూర్తి ప్రజాస్వామ్యం, మున్నగు కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రాలను మార్క్సిస్టు మహోపాధ్యాయులు రూపొందించారు. అన్నివిషయాలలో ఒకే ఆలోచనా విధానం వున్నపుడే ఐక్యత సాధ్యమనుట ఆచరణలో ఎప్పుడూ సాధ్యంకాదనుటే అగుతుంది. అది ఒక నిర్జీవమైన పార్టీని నిర్మించుటకు మాత్రమే దారితీస్తుంది.

"విడిపోయిన తరువాత ఏర్పడిన కలయిక స్థిరత్వంతో కూడినదై వుంటుందని" ప్రకటించడమంటే "సుస్థిరమైన ఐక్యతకు విప్లవకారులు ముందుగా చీలిపోవాలన్నమాట. ఇది చీలికలను సమర్థించుకొనుటకు చేస్తున్న తప్పుడు, ప్రమాదకర వాదనలు. "చీలిపోయిన తరువాత ఏర్పడే ఐక్యత స్థిరత్వంతో కూడినదై వుంటుంద"నే దానికి పూర్తి భిన్నంగా అనుభవాలున్నాయి. తప్పుడు సైద్ధాంతిక, అవగాహన, వైఖరులు మారకుండా చీలికలు నివారించడంగాని, స్థిరత్వంతో కూడిన ఐక్యతను సాధించుట సాధ్యంకాదు, పైగా మరెన్ని చీలికలకే దారితీస్తాయి. [1].

## సి.పి.ఐ. (యం. యల్.) జనశక్తి, ఇతర యం. యల్. గ్రూపులతో ఐక్యతా సంప్రదింపుల పురోగతి :

సి.పి.ఐ.(ఎం.ఎల్) జనశక్తి విజ్ఞప్తికి సుముఖంగా స్పందించిన సి.పి.ఐ.

1. సత్యం (1988) పీపుల్స్‌వార్ గ్రూపు అతివాద పెడధోరణి, సి.పి.ఐ.(ఎం.ఎల్) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రకమిటి ప్రచురణ నెం. 12. పే. 47.

(యం.యల్) రెడ్‌ఫ్లాగ్ ప్రొవిజనల్ కమిటీ తరచు ఐక్యకార్యాచరణ పెంపొందించుటకు 1993 నుండి సంప్రదింపులు జరుపుతూనే వున్నారు. కాని ఐక్య సంభాషణలకు 21 సెప్టెంబరు 1994న రెండు పార్టీలను సంలీనం చేయుటకు చర్చలు జరిపారు. నేటి భారతదేశదశలో సి.పి.ఐ. (యం.యల్) జనశక్తి విప్లవ పంథా, వ్యూహం, అవగాహనలు మౌలికంగా సరియైనవిగా సమావేశంలో ఆమోదించారు. ఈ సందర్భంలో మార్చి 1994లో సి.పి.ఐ. (యం.యల్) జనశక్తి సి.పి.ఐ. (యం యల్.) భాయిజీ గ్రూపు ప్రతినిధులు ఐక్యతా సంప్రదింపులు జరుపుట, విప్లవ పంథా, కార్యక్రమం, వ్యూహం, ఎత్తుగడల పంథాలపై మౌలిక అంగీకారం కుదురుట, రెండు గ్రూపులను యేకం జేయుటకు ఐక్యనిర్మాణాన్ని సి.పి.ఐ.(యం. యల్.) జనశక్తిగా పిలువబడుటకు సంయుక్త కన్వెన్షనులో ఆమోదించారు. ఇంకా కార్యక్రమం, ఎత్తుగడలపంథా, పార్టీ నిర్మాణ సూత్రాలు, జాతీయ-అంతర్జాతీయ పరిస్థితులపై ఏకాభిప్రాయాలు ఏర్పడి, ఐక్యతా ప్రకటన, ఐక్యతా పంథాపై తీర్మానాలు, సంయుక్త నిర్మాణపత్రాలు ఏకగ్రీవంగా ఆమోదించారు.[1] మార్క్సిజం లెనినిజం మావో ఆలోచనా విధానం విశ్వసించే విప్లవ కమ్యూనిస్టుల, గ్రూపులు, అన్నీ కలసి ఏకపార్టీగా ఏర్పడి నూతన ప్రజాస్వామ్య విప్లవాన్ని ఆవిష్కరించవలసిందిగా విజ్ఞప్తి చేసారు.

ఇంకా సి.పి.ఐ. (యం.యల్) జనశక్తి, రెడ్‌ఫ్లాగ్‌ల సంయుక్త సమావేశం మూడు ముఖ్య నిర్ణయాలు చేసారు. మొదటిది, సి.పి.ఐ. (యం.యల్) జనశక్తి మార్చి 1993లో ఆమోదించిన కార్యక్రమం, విప్లవపంథా, పార్టీ నిర్మాణ సూత్రాలు, నేటి జాతీయ, అంతర్జాతీయ కర్తవ్యాలు, ఐక్యతా పంథాలను సి.పి.ఐ. (ఎం. ఎల్) రెడ్‌ఫ్లాగ్ తాత్కాలిక కమిటీ ఆమోదించింది. రెండవది మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానాలను సైద్ధాంతిక ప్రాతిపదికలుగా ఆమోదించారు. నేటి భారత విప్లవదశ నూతన ప్రజాస్వామ్య విప్లవ దశగా, వ్యవసాయ విప్లవం దాని ఇరుసుగా, దీర్ఘకాల ప్రజాయుద్ధ పంథాయే మార్గంగా, పార్లమెంటరీ విధానాన్ని త్రోసిబుచ్చుతూ ప్రకటించారు. కమ్యూనిస్టు విప్లవకారుల ఐక్యత, విప్లవోద్యమాన్ని పునర్నిర్మించుట తక్షణ కార్యక్రమంగా స్పష్టం చేసారు. మూడవది, సామ్రాజ్యవాద అనుకూల, అభివృద్ధి వ్యతిరేక విధానాలను తిరుగగొట్టి, నూతన ప్రజాస్వామ్య విప్లవాన్ని ఆవిష్కరించుటకు అన్ని విప్లవ కమ్యూనిస్టు గ్రూపులను ఐక్యం చేయుట తప్పనిసరియని ప్రకటించారు. అంతేగాక, కేరళలో సి.పి.ఐ. (ఎం.ఎల్) జనశక్తి, రెడ్‌ఫ్లాగ్ యూనిట్లు రెండూ ఆమోదించిన పై అంశాలుగల ప్రకటనపై సంతకాలు చేసి, రెండూ కలసి, సంయుక్తపార్టీగా ఏర్పడుటను హర్షించి, కేరళలోని అన్ని కమ్యూనిస్టు శ్రేణులు అనుసరించాలని విజ్ఞప్తి చేశాయి.[2]

---

1. జనశక్తి (ఆంగ్లం) వాల్యూం 2., నెంబరు 4,5,6 జూన్ 1994 పే. 3.
2. —అదే— పే. 4.

**సి.పి.ఐ.(యం.యల్) జనశక్తి, కేంద్రకమిటి, కమ్యూనిస్టు విప్లవ కారుల ఐక్యతకై చేబట్టిన విధానం, అవగాహన, ఆచరణ.**

కమ్యూనిస్టు విప్లవకారులు అనేక గ్రూపులుగా చీలుట, తిరిగి కలయికలు, విడిపోవుటతో అనేక గ్రూపులుగా అయ్యాయి. సమస్యలు, భిన్నాభిప్రాయాలు పెరిగి పోయాయి. ఫలితంగా భిన్న దృక్పథాలు, ఆచరణలో తలా వొకదారి అగుట జరి గింది. విప్లవ ప్రజా పంథా ననుసరించే వివిధ విప్లవశక్తుల ఐక్యత కొరకై వే చీలికలు కొనసాగుతున్నాయి. స్వీయ మానసిక ధోరణి, సెక్టేరియనిజంలు చొరవను చంపి వేసి, ఐక్యతా పురోగమనాన్ని నీరుగార్చి సంక్లిష్టం చేసాయి. చీలికల తరువాత చేబట్టిన వైఖరులన్నీ చీలికలను సమర్థించి బలపరచాయి. సైద్ధాంతిక, రాజకీయ మౌలిక సమస్యలను సమగ్రంగా విశ్లేషణలతో చర్చించుటకు బదులు మితవాద, అతివాద వక్రీకరణలను స్వీయ మానసిక ధోరణులలో చర్చించి, పాఠాలు తీసుకొను టలో విఫలమైనందున సమన్వయం, అంత్య ఐక్యతా దృక్పథం కోల్పోయినందున విప్లవ కమ్యూనిస్టులు ఏకమై ఎకపార్టీ నిర్మాణంలో నేటివరకు విజయులు కాలేక పోయారు. పైగా పరస్పరనిందా, ఆరోపణలు; పరస్పరం హత్యలు, సాయుధ దాడు లకు వొడిగట్టారు. వర్గశత్రువులు కమ్యూనిస్టు విప్లవకారుల యీ ధోరణులను విని యోగించుట, వారి ఏజంట్లను విప్లవ కమ్యూనిస్టు శ్రేణులలోనికి చేర్చి విప్లవోద్యమా లను బలహీనపరిచారు. తమ బూర్జువా గ్రూపుల రాజకీయాలలో వినియోగించు కొన్నారు.

వివిధ విప్లవ కమ్యూనిస్టు వర్గాలు లేక గ్రూపులలో విప్లవ పంథాపై మౌలిక అభిప్రాయభేదాలు లేనపుడు, ఒకే పార్టీలో వుంటూ, అంత ముఖ్యంగాని అంశాలపై అభిప్రాయభేదాలను సరిచేసుకొను అవకాశాలున్నపుడు వేరు వేరు నిర్మాణాలలో ఉండుటకు ఎట్టి గట్టికారణాలు కనిపించవు. విప్లవకారుల మధ్య పరస్పరం ఆమోదం పొందిన అంశాలే చాలా ఎక్కువగా ఉన్నపుడు అవి ఐక్యపార్టీకి ప్రాతి పదికలుగా అగుటలో ఎట్టి సందేహంలేదు. అయితే, విప్లవ కమ్యూనిస్టు శ్రేణులలో పెటీబూర్జువా విప్లవతత్వం ప్రబలంగా, స్వీయమానసిక ధోరణులు ఆధిక్యతవహించి యున్నందుననే నేటి పరిస్థితులలో అత్యంత ముఖ్యకర్తవ్యమైన, వివిధ కమ్యూ నిస్టు విప్లవకారుల ఐక్యతా నిర్మాణ పురోగమనం నత్తనడకలో సాగు తున్నది.

వర్గపోరాటాల అభివృద్ధి క్రమంలోనే బహుముఖ సమగ్ర అయిక్యత నిర్మాణం, విప్లవనాయకత్వం వహించగల పార్టీ, దాని నాయకత్వం ఏర్పడి బలపడ తుంది. ఆ విధంగా ఐక్యతా సమస్య పరిష్కారానికి మార్గమేర్పడుతుంది. ఐక్యత సంలీనమునకుముందు చ[illegible]త్రక సమీక్ష అవసర నియమంలేదు. కమ్యూనిస్టులందరూ ఐక్యం కావాలి. క్రిందినుండి పార్టీ నిర్మాణం జరగాలి. ఏ పార్టీగ్రూపు అఖిల భారత

స్థాయికి ఎదగలేదు. ప్రాంతీయ పార్టీలుగా ఏర్పడి వున్నాయి. పార్టీల, గ్రూపుల సమన్వయీకరణ, ఏకీకరణకు యిది తగిన కాలం. ఒకే పార్టీ నిర్మాణానికి పరిపక్వత పరిస్థితులలో ఏర్పడలేదు. సి.పి.ఐ. (ఎం.ఎల్.) నిర్మాణాలు, గ్రూపులు మాత్రమే వొకే వొక పార్టీలో ఏకం కావాలి, లేదా సి. పి. ఐ. (యం. యల్) గ్రూపులు, సంస్థలు మాత్రమే ఒకే వొక పార్టీలో ఏకం కావాలి లేదా సి.పి.ఐ. (యం. యల్.) యేతర అన్ని పార్టీలు, గ్రూపులు, సంస్థలు మాత్రమే పార్టీ నిర్మాణానికి సంప్రదించాలి.[1].

ఐక్యతా సమస్యఁను పరిష్కరించి, ఐక్యపార్టీని నిర్మించుటకు కమ్యూనిస్టు విప్లవకారులు నిరవధికధిక ఉద్యమంగా చేబట్టాలి. ఐక్యతా రూపాలు విధానాలకు సంబంధించినంతవరకు ఎట్టి యిష్టాఅయిష్టాలు, స్కీములు ముందుగానే వేసుకొని ప్రారంభించరాదు. పరిస్థితులకు తగినది, ఐక్యతా లక్ష్యానికి చేర్చునదిగా వుండాలి. ద్వైపాక్షిక, బహుళ పాక్షిక సంప్రదింపులు, ఐక త-సంలీననాలకు సంసిద్ధులవ్వాలి ఐక్య కాంగ్రెసు ద్వారా పూర్తి ఐక్యతకై ప్రచారోద్యమాన్ని కొనసాగించాలి. అఖిల భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ సంఘాల ఏర్పాటుకు ప్రయత్నించాలి. అదే కాలంలో పట్టువిడుపులతో కొన్ని నిర్మాణాల పాక్షిక సమన్వయానికైనా, మిగతా నిర్మాణాలు సంసిద్ధులుగా లేనపుడు ప్రయత్నించాలి.

ప్రతిపాదించే సమన్వయ రూపం, పార్టీల సమన్వయ రూపంకాదు. ఈ సమన్వయ కమిటి, నాయకత్వ రూపంకాని, సూపరు నిర్మాణ రూపంకాదు. సమన్వయ కమిటి అనే పేరుకూడ మరో తగిన పేరుతో అదే లక్ష్యంకై వ్యవహరించవచ్చును. అట్టి సమన్వయ కమిటి లక్ష్యం వివిధ సమస్యలపై సంయుక్త పోరాటాలను సాగించాలి, అనుభవాలను అభిప్రాయాలను పరస్పరం అందించుకొనాలి. అందువలన వివిధ ప్రాంతాల అనుభవాలు వివిధ శ్రేణులకు అందుబాటులో వుంటవి. రెండు లేక మూడు పక్షాలు ఐక్యతా సంలీన సంభాషణలకు సంసిద్ధులైతే, వారిలో వారు అనుకొన్న స్థాయిలో సంప్రదింపులు కొనసాగించవచ్చు. అలాగే సమన్వయ సంఘంలోని భాగస్వామ్య పార్టీలు, గ్రూపులన్నీ నిర్మాణాల స్థాయిలో సంప్రదింపులకు సంసిద్ధులైతే అదే క్రమంలో సంప్రదింపులు కొనసాగించి, ఆమోదించిన మార్గంలో ఐక్యతా సంలీనంకావచ్చు. ప్రారంభంలో సమన్వయ కమిటి సమస్యలపై సంయుక్త పోరాటాలవైపే కేంద్రీకరించుటను వాంఛించుతుంది. అదే క్రమంలో వివిధ పార్టీలు, గ్రూపులు, శ్రేణుల మధ్య ఐక్యతా సంప్రదింపులు, సత్సంబంధాల అభివృద్ధి బాగా సాగితే, అత్యున్నత స్థాయిలో ఐక్యతా సంలీన సంప్రదింపులు విజయవంతంగా సాగించి, లక్ష్యం చేరవచ్చును.

---

1. కేంద్ర కమిటీ, సి.పి.ఐ. (యం.యల్.) జనశక్తి యూనిఫికేషన్ ఆఫ్ కమ్యూనిస్టు రివల్యూషనరీస్, అవర్ అప్రోచి, జనశక్తి (ఆంగ్లం) వా 1;నం. 5; మే 1993. పే. 86.

1) ఒకవైపున విచ్ఛిన్నకర ప్రోక్షను శక్తులు మరోవైపున ఐక్యతా శక్తులు పని చేస్తూనే వున్నవి. మేజువాణి ఐక్యతా ప్రకటనలు చాలవు. ఆచరణయే గీటు రాయి. విప్లవకారులలో ఐక్యత నెలకొల్పుటలో విచ్ఛిన్నకారులకు ఎట్టి పాత్ర వుండదు.

2) అదే విధంగా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై సంస్కరణవాదులు చేయుచున్న దాడిని త్రిప్పికొట్టి, ఐక్యతను కాపాడాలి.

అంచేత, మన ఐక్యతా ప్రయత్నాలు మన సాధారణ పంథాను పరిరక్షిం చుతూ, మితవాద, అతివాద అవకాశ వాదాలపై నిరవధిక పోరాటం సాగించుట ద్వారానే మార్క్సిజం-లెనినిజం, కార్మికవర్గ అంతర్జాతీయత కాపాడబడుతుంది.[1]

ఒకవైపున చారుమజుందార్ నాయకత్వంలో "వ్యవసాయ విప్లవం" "వర్గ శత్రు నిర్మూలన" నినాదాలతో సాగిన "అతివాద వ్యక్తిగత హింసా దౌర్జన్యవాదాల నుండి బయటపడిన వారు, నూతన విధానంతో ఐక్యతను పునరుద్ధరించు ప్రయత్నాలు జరుపుతున్న కానూసన్యాల్, సౌరిన్‌బోస్, తేజేశ్వరరావులు, మరోవైపున నియో అతివాద అవకాశవాదాన్ని చేబట్టిన అషించటర్జీ, "ఫ్రాంటియర్" పత్రిక అనుయాయులు వివిధ రాష్ట్రాలలో యింకా అనేక రాష్ట్రాలలో వివిధ గ్రూపులుగ చీలిపోయివున్న "నక్సల్బరీ ముద్దుబిడ్డలు" అతివాద కమ్యూ నిస్టులలో సైద్ధాంతిక గందరగోళాన్ని కలుగజేస్తున్నారు. అంచేత ఐక్యతా ప్రయత్నాలు నత్తనడకలో సాగుతున్నాయి.

**విప్లవకారులలో ఐక్యత-పెడధోరణుల పాత్ర :**

"విప్లవకారులలో గ్రూపులుండుట ఎంత యదార్థమో, వారిలో వివిధ సమ స్యల యెడల విభేదాలుండుటకూడా అంతే యదార్థం. విప్లవకారులంతా వొకేపార్టీతో ఐక్యం కావాలన్నది నేటి భారత కమ్యూనిస్టు ఉద్యమపు ప్రధాన కర్తవ్యం. దీనికై విప్లవకారులలోవున్న విభేదాల స్వరూప, స్వభావాలేమిటో అర్థం చేసుకొనుట, వాటిని పరిష్కరించుకొనుటకు సూత్రబద్ధమైన పద్ధతులు అనుసరించుట అవసరము, సాధ్యము. గతంలో వివిధ గ్రూపులు చేసిన తప్పులు యిప్పటికీ అవి అనుసరించు తున్న పెడధోరణులు, ఐక్యత కొరకు చేసే కృషి అడ్డుగా వుండవలసిన అవసరం లేదు. ఇలా యేర్పడిన ఐక్యత సంపూర్ణం, సమగ్రం, ఏకీకృతమైనది కాకపోయి నప్పటికి, విభేదాలు చర్చించుకొనుటకు తగిన వాతావరణాన్ని కలిగిస్తుంది. కాని తమతో మౌలికంగా విభేదించేవారిని, మధ్యతరహా లేక సరికొత్త రివిజనిస్టులని సూత్రీకరించుట ప్రారంభమగుటతో విభేదాలు చర్చించుకొనుటకు కనీస ఐక్యతా

---

2. వెంకటేశ్వరరావు దేవులపల్లి (1982) సప్లిమెంటు ఆన్ యూనిటీ. ది ప్రొలిటేరియన్ లైన్. నం. 26 సెప్టెంబరు 1982. పే. 5-6.

వాతావరణం లేకుండాపోతుంది. వాస్తవం ఏమంటే యీ గ్రూపులు ముందుకు తెస్తున్న మధ్యతరహా లేక సరికొత్త రివిజనిజం చర్చనీయాంశాలుకావు, కాకూడదు. ఈ గ్రూపులు సిద్ధాంత, రాజకీయ విధానాలు, ఆచరణలే చర్చనీయాంశాలు కావాలి, అదే ఐక్యతామార్గం.

"కావున వీరి విధానాలు విప్లవోద్యమ ప్రారంభానికి, దానిని కాపాడి అభివృద్ధి చేయుటకు వుపయోగపడకపోగా, విచ్ఛిన్నానికే తోడ్పడుతున్నాయని మా నిశ్చితాభిప్రాయం. విప్లవకారులు "మనవాళ్ళే" అనే ధోరణిని వదులుకొని తమ అభిప్రాయ భేదాలను సవ్యమైన పద్ధతులలో పరిష్కరించుకొని, సరైన పంథా, కార్యాచరణలను ఆధారం చేసుకొని వొకే పార్టీగా ఐక్యం కావాలని మేము కోరుతున్నాము. [1]

"ఏ అవకాశవాదమైతే సి.పి.ఐ.(ఎం.ఎల్)ను కమ్యూనిస్టు విప్లవకారులనుండి దూరమగుటకు కారణమైందో అదే అవకాశవాదం సి.పి.ఐ.(ఎం.ఎల్)ను గ్రూపులుగ ఉపగ్రూపులుగ చీల్చింది. అవి వేర్వేరు గ్రూపులుగా మనగలిగేందుకు రకరకాల అవకాశవాదాలను అనుసరిస్తున్నారు. కమ్యూనిస్టు విప్లవకారులు సి.పి.ఐ (ఎం.ఎల్) గ్రూపులకు భిన్నమైనవారని దీని అర్థం. ఒక గ్రూపుకు ప్రజావిప్లవపంథా వుండగా రెండవ గ్రూపుకు సి.పి.ఐ. (ఎం.ఎల్) వారికి అటువంటిదేమీలేదు. ఇదే వాటిమధ్య గల మౌలిక భేదము. యితరులకు యీ భేదము అంతగా తెలియదు. [2]

"సి.పి.ఐ.(యం)తోను, సి.పి.ఐ. మినహా వామపక్ష ఐక్యసంఘటన లేక ఐక్యకార్యాచరణ ప్రబోధించేవారు వున్నారు. మనం ఐక్యసంఘటన కట్టేది భాగ స్వాముల అనుచరవర్గాన్ని మనవైపు తిప్పుకొనుటకుమాత్రం కాదు. కొందరు మన వైపుకు వస్తే అది మన సరైన పంథా ఫలితం. మన ఐక్యసంఘటనా విధానంయొక్క ముఖ్యోద్దేశం విప్లవ శత్రువులకు వ్యతిరేకంగా యావత్తు విప్లవ శక్తులను పోరాటంలో ఐక్యపరచుటయే లక్ష్యం.

మరికొందరు అంగీకృత అంశాలను వెతుకుటలో నిమగ్నులై వున్నారు. ఆ అంశాలు దాదాపు అన్నీ వివాదాస్పదమైనవే. వీరందరూ మార్క్సిజం-లెనినిజం-మావోయిజంల యెడల విశ్వాసం ప్రకటించినవారే. కాన సైద్ధాంతిక సమస్యలేవీ అడ్డుగా లేవుకాని భారత విప్లవాచరణకు అన్వయించుటలో వివాదాంశాలు ఉద్భవించుటకు అవకాశముంది. వాటిని పరిష్కరించు ప్రయత్నం వారికి మించినదగుటతో దాని జోలికి పోరు.

రెండు గ్రూపులుగాని, అంతకుమించిన గ్రూపులుగాని ఏవో కొన్ని సర్దుబాట్లు

---

1. పార్టీలో మితవాద అవకాశవాదం (1973) ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారుల కమిటీ. ఉపోద్ఘాతం. పే. 12.

2. కమ్యూనిస్టు విప్లవకారుల ఐక్యతా సమస్యలు (1980) ప్రొవిటేరియన్ లైన్, 7వ సంచికనుండి పునర్ముద్రితము. జనశక్తి ప్రచురణ. గుంటూరు. పే. 10.

సమన్వయ కమిటీలు, విలీనంద్వారానో ఐక్యమగుతున్నాయన్నది సత్యం. అదే సమయంలో కొత్తగ్రూపులు తలెత్తుతున్నదీ వాస్తవం. ఈనాడు ప్రధానమైన గ్రూపులు అయిదో ఆరో కాగా, అనేక ఉపగ్రూపులుగ ఎంత చిన్నవైనా చీలిపోయి ఉన్నవి. ఐక్యతవైపు అన్ని గ్రూపులు పయనిస్తున్న దాఖలాలు లేవు. వ్యక్తిగత విభేదాలు కావచ్చు లేక ప్రధాన అప్రధావ సమస్యలపై విభేదాలు కారణం కావచ్చు.

"మూడు గ్రూపులు విలీనం అయిన ఫలితంగా 1975లో భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమైక్యతాకేంద్రం (మా.లె.) ఏర్పడింది. అవి; ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారుల కమిటి, ఉత్తర బెంగాల్ నార్త్ జోన్ కమిటి సహచరులు, పశ్చిమ బెంగాల్ సి.సి.ఆర్.లు చర్చల దశలోనే కొన్ని అప్రదాన భేదాభిప్రాయాలున్నప్పటికి, కార్యక్రమం, విప్లవ పంధాలపై సమిష్టి అవగాహనకు రావటంతోనేగాక, అతివాద అవశేషాలను కొన్నింటిని ఎత్తి చూపినపుడు నాయకత్వం పాక్షికంగా తమ తప్పులను ఆమోదించి, కాలక్రమంలో చర్చల ద్వారాను, ఆచరణద్వారా పరిష్కరించుకొనగలమనే విశ్వాసం"తో పురోగమించారు.

"కాని ఐక్యతను సాధించే విషయంలో ఎదుటి గ్రూపు నాయకత్వానికి తమ స్వంత అవగాహన, ఆచరణ వున్నాయి. రాజకీయాలలో రాజీ పడుతూ వచ్చారు, నిర్మాణం విషయంలో కుట్ర పద్ధతులు సాగించారు. సమైక్యతా కేంద్రం ఏర్పడక ముందే, చర్చలు కొనసాగుతున్నపుడే, వివిధ రాష్ట్రాలలో తమ పరిచయస్థులతో యూనిట్లు ఏర్పాటు చేయుటద్వారా, తమ బలాన్ని హెచ్చుచేసి చూపారు. కొన్ని అవాంచనీయ కెరీరిస్టులు బొంబాయి, పంజాబులలో సి.పి.ఐ.(ఎం.ఎల్) నుండి వేరు పడ్డారు. కొందరు వివిధ ప్రాంతాలలోని విప్లవకారులలో భేదాభిప్రాయాలు సృష్టించ ప్రయత్నించారు. రాజకీయ, సైద్ధాంతిక, నిర్మాణ ఐక్యతలు లేనప్పుడు యిట్టి అవాంచనీయ పరిణామాలనెన్నిటినో ఎదుర్కొని అధిచమించగలిగినపుడే ఐక్యత ఏర్పడగలదు. ఐక్యతకై పోరాటమంటే అర్థమిదే, గ్రూపుల నాయకత్వాలు, శ్రేణుల స్థాయి వొకే రకంగాలేదు. "నాయకులు కుట్రల కళలలో అందెవేసిన వారు కాగా, మిగిలినవారు అణగి మణగి వుండి తరచు నాయకులు చెప్పిన దానిలోకొట్టుకు పోయేవారు. ఆంతరంగిక సైద్ధాంతిక పోరాటం జరిపేందుకు తగిన అవగాహన స్థాయి, రాజకీయ అనుభవం లేనివారు. ఈ గ్రూపులలో భిన్నాభిప్రాయాలు తరువాతే వెల్లడయ్యాయి. [1]

---

1. కమ్యూనిస్టు విప్లవకారుల ఐక్యతా సమస్యలు (1980) ప్రొలిటేరియన్ లైన్ 7వ, సంచిక నుండి పునర్ముద్రితము. ప్రజాశక్తి ప్రచురణలు, గుంటూరు. పే. 20–21.

**కమ్యూనిస్టు విప్లవకారుల సమైక్యతా కేంద్రం (యం. యల్.) దాని ఐక్యతా దృక్పథం :**

విప్లవకారులను ఐక్యం చేయుటకు, భారత విప్లవానికి నాయకత్వం వహించ గల సమర్థవంతమైన విప్లవ పార్టీని, నాయకత్వాన్ని రూపొందించే కర్తవ్యాన్ని నిర్వహించడానికి చేసే ప్రయత్నాలలో కా. నాగిరెడ్డి రూపొందించిన దృక్పథం మార్గదర్శికంగా వుంటుంది. దానిని పట్టుదలతో అమలు చేసిన మేరకు అనుకూల ఫలితాలు లభించాయి. దానికి భిన్నమైన పెడ ధోరణులు మన ప్రయత్నాలను, పౌరవను దెబ్బతీసాయి. అంతేగాక, విప్లవకారుల ఐక్యపరచే లక్ష్యానికి కూడ హాని జరిగింది.

"మన ఐక్యతా ఆకాంక్ష సూత్రబద్ధమైనది. ఈ పంథానుండి మనలను పెడ మార్గం పట్టించుటకు జరిగిన ప్రయత్నాలను తిరస్కరించాము. ఐక్యత త్వరగా నిర్మించే ఆదుర్దాతో సిద్ధాంత రాజకీయ చర్చలకు సుదీర్ఘకాలం అవకాశం యివ్వ నందుకు మనలను కొంతమంది నిందించవచ్చు. కాని సూత్రబద్ధ ఐక్యతపై గొప్పగా మాట్లాడే గ్రూపులు సూత్రరహిత ప్రతిపాదనలు చేయుటను అర్థం చేసుకొన్నాము. ఐక్య కార్యాచరణలో స్వల్ప భేదాలకు అత్యంత ప్రాధాన్యత నివ్వటం, నిర్మాణ సమస్యలతో సూత్రరహిత విధానాలను ఆశ్రయించటం, వాకరి నౌకరు లోబరచు కొనాలనే ప్రయత్నాలు విప్లవకారుల మధ్య ఐక్యతా సాధనకు అడ్డుగా వున్నాయి.[1]

"ఐక్యతాకృషి, ఐక్య కార్యకలాపాలు విప్లవ ప్రజానీకంలో గొప్ప ఉత్తేజాన్ని, ఆశాభావాన్ని రేకెత్తించాయి. కార్యకర్తలు, అభిమానులు యీ ప్రయత్నాలను ఆహ్వానించారు. విప్లవ గ్రూపుల మధ్య వైషమ్యాలు, శతృత్వాలు పెరగకుండా ఐక్య కార్యకలాపాలు తోడ్పడగలవని ఆశించారు. కాని కొన్ని పెడ ధోరణులు పెరుగుతున్న ఐక్యతా వాతావరణాన్ని కలుషితం చేసాయి.

"అనుభవంలో విప్లవకారుల ఐక్యతా సమస్య అంత తేలికగా పరిష్కరింప బడదని, దానికై పోరాటం అవసరమన్న విషయం స్పష్టమైంది. ఈ పోరాటం మైత్రీ పూర్వకం, వైషమ్యరహితంగా జరుపుట విప్లవకారుల బాధ్యతగా వుంది. ఐక్యత-పోరాటం-ఐక్యత అన్న సూత్రాన్ని ప్రజా వుద్యమ నిర్మాణంలో మేళవించి, యీ పోరాటం సాగించబడాలి. విప్లవకారుల మధ్య స్థిరమూ, దృఢతరమైన ఐక్య తకు మార్గం యిదే కాగలదు.

"ప్రస్తుత అనుకూల అంశాలనన్నిటిని వినియోగించుకొని ప్రజలమధ్య విప్లవ కారుల మధ్య ఐక్యతనూ, విప్లవోద్యమ పురోగతికి మన శక్తియుక్తులన్నిటిని

---

1. భారత విప్లవకారుల సమైక్యతా కేంద్రం (యం.యల్) మొదటి రెగ్యులర్ కాన్ఫ రెన్సు, ఏప్రిల్ 1989, రాజకీయ నివేదిక. పే. 117.
2. అదే పే. 118.

కేంద్రీకరిస్తాము. ఆ విధంగా ప్రజలకు, విప్లవానికి అనుకూల వాతావరణాన్ని ఏర్పరుద్దాము.

విప్లవకారులలో ఐక్యత గురించి మాట్లాడుతూ "ఎం.ఎల్. గ్రూపులన్నీ వొకే వేదికమీదకు రావాలంటే ఒకే థాట్- ఆలోచనా విధానానికి రావాలి. విడిపోయిన తరువాత ఏర్పడిన నిర్మాణం స్థిరత్వంతో కూడినదై వుంటుంది. అయితే వుమ్మడి వేదికమీదకు వచ్చే అవకాశం లేదనే కె.యస్. అభిప్రాయాన్ని సత్యం యిలా ఖండించారు.

"విప్లవకారులు ఒకే వేదిక మీదకు వచ్చుటకు ఒకే ఆలోచనా విధానానికి రావాలనుట తప్పు. విప్లవకారులు మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానాన్ని అంగీకరిస్తూ విప్లవదశ, వ్యూహం విషయంలో ఒకేవిధమైన అభిప్రాయాలను కలిగివున్నారు. ఎత్తుగడలలో మాత్రం తీవ్ర అభిప్రాయ భేదాలను కలిగి వున్నారు. సజీవపార్టీలో భేదాభిప్రాయాలు వుండే అవకాశం ఎప్పుడూ వుంటుంది. పాతవి పరిష్కారమై కొత్తవి పైకి వస్తూవుంటాయి. సైద్ధాంతిక, రాజకీయ భేదాభిప్రాయాలను నిర్మాణచర్యలద్వారా పరిష్కరించ పూనుకొనుట తప్పు. అందుకే విభేదాలు పరిష్కరించుకొనుటకు మెజారిటీ విధానానికి మైనారిటి కట్టుబడి వుండుట మైనారిటి అభిప్రాయాలను మెజారిటి గౌరవించుట, కేంద్రకమిటి నిర్ణయాలకు క్రింది కమిటీలు, సభ్యులు కట్టుబడివుండుట, పార్టీలో పూర్తి ప్రజాస్వామ్యం, మున్నగు కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రాలను మార్క్సిస్టు మహోపాధ్యాయులు రూపొందించారు. అన్నివిషయాలలో వొకే ఆలోచనా విధానం వున్నపుడే ఐక్యత సాధ్యమనుట ఆచరణలో ఎప్పుడూ సాధ్యంకాదనుటే అగుతుంది. అది వొక నిర్జీవమైన పార్టీని నిర్మించుటకు మాత్రమే దారితీస్తుంది.

"విడిపోయిన తరువాత ఏర్పడిన కలయిక స్థిరత్వంతో కూడినదై వుంటుందని" ప్రకటించడమంటే "సుస్థిరమైన ఐక్యతకు విప్లవకారులు ముందుగా చీలిపోవాలన్నమాట. ఇది చీలికలను సమర్థించుకొనుటకు చేస్తున్న తప్పుడు, ప్రమాదకర వాదనలు. "చీలిపోయిన తరువాత ఏర్పడే ఐక్యత స్థిరత్వంతో కూడినదై వుంటుంద"నే దానికి పూర్తి భిన్నంగా అనుభవాలున్నాయి. తప్పుడు సైద్ధాంతిక, అవగాహన, వైఖరులు మారకుండా చీలికలు నివారించడంగాని, స్థిరత్వంతో కూడిన ఐక్యతను సాధించుట సాధ్యంకాదు, పైగా మరిన్ని చీలికలకే దారితీస్తాయి.[1]

**సి.పి.ఐ. (యం. యల్.) జనశక్తి, యితర యం. యల్. గ్రూపులతో ఐక్యతా సంప్రదింపుల పురోగతి :**

సి.పి.ఐ.(ఎం.ఎల్) జనశక్తి విజ్ఞప్తికి సుముఖంగా స్పందించిన సి.పి.ఐ.

---

1. సత్యం (1988) పీపుల్స్‌వార్ గ్రూపు అతివాద పెడధోరణి, సి.పి.ఐ.(ఎం.ఎల్ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రకమిటి ప్రచురణ నెం. 12. పే. 47.

(యం.యల్) రెడ్‌ఫ్లాగ్ ప్రొవిజనల్ కమిటి తరచు ఐక్యకార్యాచరణ పెంపొందిం చుటకు 1993 నుండి సంప్రదింపులు జరుపుతూనే వున్నారు. కాని ఐక్య సంభాష ణలకు 21 సెప్టెంబరు 1994న రెండు పార్టీలను సంలీనం చేయుటకు చర్చలు జరి పారు. నేటి భారతదేశదశలో సి.పి.ఐ. (యం.యల్) జనశక్తి విప్లవ పంథా, వ్యూహం, అవగాహనలు మౌలికంగా సరియైనవిగా సమావేశంలో ఆమోదించారు. ఈ సందర్భంలో మార్చి 1994లో సి.పి.ఐ. (యం.యల్) జనశక్తి సి.పి.ఐ. (యం యల్.) ఖాయిజీ గ్రూపు ప్రతినిధులు ఐక్యతా సంప్రదింపులు జరుపుట, విప్లవ పంథా, కార్యక్రమం, వ్యూహం, ఎత్తుగడల పంథాలపై మౌలిక అంగీకారం కుదురుట, రెండు గ్రూపులను యేకం జేయుటకు ఐక్యనిర్మాణాన్ని సి.పి.ఐ.(యం. యల్.) జనశక్తిగా పిలువబడుటకు సంయుక్త కన్వెన్షనులో ఆమోదించారు. ఇంకా కార్యక్రమం, ఎత్తుగడలపంథా, పార్టీ నిర్మాణ సూత్రాలు, జాతీయ-అంతర్జాతీయ పరిస్థితులపై ఏకాభిప్రాయాలు ఏర్పడి, ఐక్యతా ప్రకటన, ఐక్యతా పంథాపై తీర్మా నాలు, సంయుక్త నిర్మాణపత్రాలు ఏకగ్రీవంగా ఆమోదించారు.[1] మార్క్సిజం లెని నిజం మావో ఆలోచనా విధానం విశ్వసించే విప్లవ కమ్యూనిస్టుల, గ్రూపులు, అన్నీ కలసి ఏకపార్టీగా ఏర్పడి నూతన ప్రజాస్వామ్య విప్లవాన్ని ఆవిష్కరించవలసిం దిగా విజ్ఞప్తి చేసారు.

ఇంకా సి.సి.ఐ. (యం.యల్) జనశక్తి, రెడ్‌ఫ్లాగ్‌ల సంయుక్త సమావేశం మూడు ముఖ్య నిర్ణయాలు చేసారు. మొదటిది, సి.పి.ఐ. (యం.యల్) జనశక్తి మార్చి 1993లో ఆమోదించిన కార్యక్రమం, విప్లవపంథా, పార్టీ నిర్మాణ సూత్రాలు, నేటి జాతీయ, అంతర్జాతీయ కర్తవ్యాలు, ఐక్యతా పంథాలను సి.పి.ఐ. (ఎం. ఎల్) రెడ్‌ఫ్లాగ్ తాత్కాలిక కమిటి ఆమోదించింది. రెండవది మార్క్సిజం-లెనినిజం- మావో ఆలోచనా విధానాలను సైద్ధాంతిక ప్రాతిపదికలుగా ఆమోదించారు. నేటి భారత విప్లవదశ నూతన ప్రజాస్వామ్య విప్లవ దశగా, వ్యవసాయ విప్లవం దాని ఇరుసుగా, దీర్ఘకాల ప్రజాయుద్ధ పంథాయే మార్గంగా, పార్లమెంటరీ విధానాన్ని త్రోసిబుచ్చుతూ ప్రకటించారు. కమ్యూనిస్టు విప్లవకారుల ఐక్యత, విప్లవోద్యమాన్ని పునర్నిర్మించుట తక్షణ కార్యక్రమంగా స్పష్టం చేసారు. మూడవది, సామ్రాజ్యవాద అనుకూల, అభివృద్ధి వ్యతిరేక విధానాలను తిరుగగొట్టి, నూతన ప్రజాస్వామ్య విప్ల వాన్ని ఆవిష్కరించుటకు అన్ని విప్లవ కమ్యూనిస్టు గ్రూపులను ఐక్యం చేయుట తప్పనిసరియని ప్రకటించారు. అంతేగాక, కేరళలో సి.పి.ఐ. (ఎం.ఎల్) జనశక్తి, రెడ్‌ఫ్లాగ్ యూనిట్లు రెండూ ఆమోదించిన పై అంశాలుగల ప్రకటనపై సంతకాలు చేసి, రెండూ కలసి, సంయుక్తపార్టీగా ఏర్పడుటను హర్షించి, కేరళలోని అన్ని కమ్యూనిస్టు శ్రేణులు అనుసరించాలని విజ్ఞప్తి చేశాయి.[2]

---

1. జనశక్తి (ఆంగ్లం) వాల్యూం 2., నెంబరు 4,5,6 జూన్ 1994 పే. 3.
2. —అదే— పే. 4.

## సి.పి.ఐ.(యం.యల్) జనశక్తి, కేంద్రకమిటి, కమ్యూనిస్టు విప్లవ కారుల ఐక్యతకై చేబట్టిన విధానం, అవగాహన, ఆచరణ.

కమ్యూనిస్టు విప్లవకారులు అనేక గ్రూపులుగా చీలుట, తిరిగి కలయికలు, విడిపోవుటతో అనేక గ్రూపులుగా అయ్యాయి. సమస్యలు, భిన్నాభిప్రాయాలు పెరిగి పోయాయి. ఫలితంగా భిన్న దృక్పధాలు, ఆచరణలో తలా వొకదారి అగుట జరిగింది. విప్లవ ప్రజా పంథా ననుసరించే వివిధ విప్లవశక్తుల ఐక్యత కొరకై చీలికలు కొనసాగుతున్నాయి. స్వీయ మానసిక ధోరణి, సెక్టేరియనిజంలు చొరవను చంపి వేసి, ఐక్యతా పురోగమనాన్ని నీరుగార్చి సంక్లిష్టం చేసాయి. చీలికల తరువాత చేబట్టిన వైఖరులన్నీ చీలికలను సమర్థించి బలపరచాయి. సైద్ధాంతిక, రాజకీయ మౌలిక సమస్యలను సమగ్రంగా విశ్లేషణలతో చర్చించుటకు బదులు మితవాద, అతివాద వక్రీకరణలను స్వీయ మానసిక ధోరణులలో చర్చించి, పాఠాలు తీసుకొనుటలో విఫలమైనందున సమన్వయం, అంత్య ఐక్యతా దృక్పధం కోల్పోయినందున విప్లవ కమ్యూనిస్టులు ఏకమై ఎకపార్టీ నిర్మాణంలో నేటివరకు విజయులు కాలేక పోయారు. పైగా పరస్పరనిందా, ఆరోపణలు; పరస్పరం హత్యలు, సాయుధ దాడులకు వొడిగట్టారు. వర్గశత్రువులు కమ్యూనిస్టు విప్లవకారుల యీ ధోరణులను వినియోగించుట, వారి ఏజంట్లను విప్లవ కమ్యూనిస్టు శ్రేణులలోనికి చేర్చి విప్లవోద్యమాలను బలహీనపరిచారు. తమ బూర్జువా గ్రూపుల రాజకీయాలలో వినియోగించు కొన్నారు.

వివిధ విప్లవ కమ్యూనిస్టు వర్గాలు లేక గ్రూపులలో విప్లవ పంథాపై మౌలిక అభిప్రాయభేదాలు లేనపుడు, ఒకే పార్టీలో వుంటూ, అంత ముఖ్యంగాని అంశాలపై అభిప్రాయభేదాలను సరిచేసుకొను అవకాశాలున్నపుడు వేరు వేరు నిర్మాణాలలో ఉండుటకు ఎట్టి గట్టికారణాలు కనిపించవు. విప్లవకారుల మధ్య పరస్పరం ఆమోదం పొందిన అంశాలే చాలా ఎక్కువగా ఉన్నపుడు అవి ఐక్యపార్టీకి ప్రాతిపదికలుగా అగుటలో ఎట్టి సందేహంలేదు. అయితే, విప్లవ కమ్యూనిస్టు శ్రేణులలో పెటీబూర్జువా విప్లవతత్వం ప్రబలంగా, స్వీయమానసిక ధోరణులు ఆధిక్యతవహించి యున్నందుననే నేటి పరిస్థితులలో అత్యంత ముఖ్యకర్తవ్యమైన, వివిధ కమ్యూనిస్టు విప్లవకారుల ఐక్యతా నిర్మాణ పురోగమనం నత్తనడకలో సాగుతున్నది.

వర్గపోరాటాల అభివృద్ధి క్రమంలోనే బహుముఖ సమగ్ర అయిక్యతా నిర్మాణం, విప్లవనాయకత్వం వహించగల పార్టీ, దాని నాయకత్వం ఏర్పడి బలపడుతుంది. ఆ విధంగా ఐక్యతా సమస్య పరిష్కారానికి మార్గమేర్పడుతుంది. ఐక్యత సంలీనమునకుముందు చరిత్రక సమీక్ష అవసర నియమంలేదు. కమ్యూనిస్టులందరూ ఐక్యం కావాలి. క్రిందినుంచి పార్టీ నిర్మాణం జరగాలి. ఏ పార్టీగ్రూపు అఖిల భారత

స్థాయికి ఎదగలేదు. ప్రాంతీయ పార్టీలుగా ఏర్పడి వున్నాయి. పార్టీల, గ్రూపుల సమన్వయీకరణ, ఏకీకరణకు యిది తగిన కాలం. ఒకే పార్టీ నిర్మాణానికి పరిపక్వత పరిస్థితులలో ఏర్పడలేదు. సి.పి.ఐ. (ఎం.ఎల్.) నిర్మాణాలు, గ్రూపులు మాత్రమే వొకే వొక పార్టీలో ఏకం కావాలి, లేదా సి. పి. ఐ. (యం. యల్) గ్రూపులు, సంస్థలు మాత్రమే ఒకే వొక పార్టీలో ఏకం కావాలి లేదా సి.పి ఐ (యం. యల్.) యేతర అన్ని పార్టీలు, గ్రూపులు, సంస్థలు మాత్రమే పార్టీ నిర్మాణానికి సంప్రదించాలి.[1].

ఐక్యతా సమస్యలను పరిష్కరించి, ఐక్యపార్టీని నిర్మించుటకు కమ్యూనిస్టు విప్లవకారులు నిరవధికధిక ఉద్యమంగా చేబట్టాలి. ఐక్యతా రూపాలు విధానాలకు సంబంధించినంతవరకు ఎట్టి యిష్టాఅయిష్టాలు, స్కీములు ముందుగానే వేసుకొని ప్రారంభించరాదు. పరిస్థితులకు తగినది, ఐక్యతా లక్ష్యానికి చేర్చునదిగా వుండాలి. ద్వైపాక్షిక, బహుళ పాక్షిక సంప్రదింపులు, ఐక త-సంలీననాలకు సంసిద్ధులవ్వాలి ఐక్య కాంగ్రెసు ద్వారా పూర్తి ఐక్యతకై ప్రచారోద్యమాన్ని కొనసాగించాలి. అఖిల భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ సంఘాల ఏర్పాటుకు ప్రయత్నించాలి. అదే కాలంలో పట్టువిడుపులతో కొన్ని నిర్మాణాల పాక్షిక సమన్వయానికైనా, మిగతా నిర్మాణాలు సంసిద్ధులుగా లేనపుడు ప్రయత్నించాలి.

ప్రతిపాదించే సమన్వయ రూపం, పార్టీల సమన్వయ రూపంకాదు. ఈ సమన్వయ కమిటి, నాయకత్వ రూపంకాని, సూపరు నిర్మాణ రూపంకాదు. సమన్వయ కమిటి అనే పేరుకూడ మరో తగిన పేరుతో అదే లక్ష్యంకై వ్యవహరించవచ్చును. అట్టి సమన్వయ కమిటి లక్ష్యం వివిధ సమస్యలపై సంయుక్త పోరాటాలను సాగించాలి, అనుభవాలను అభిప్రాయాలను పరస్పరం అందించుకొనాలి. అందువలన వివిధ ప్రాంతాల అనుభవాలు వివిధ శ్రేణులకు అందుబాటులో వుంటవి. రెండు లేక మూడు పక్షాలు ఐక్యతా సంలీన సంభాషణలకు సంసిద్ధులైతే, వారిలో వారు అను కొన్న స్థాయిలో సంప్రదింపులు కొనసాగించవచ్చు. అలాగే సమన్వయ సంఘంలోని భాగస్వామ్య పార్టీలు, గ్రూపులన్నీ నిర్మాణాల స్థాయిలో సంప్రదింపులకు సంసిద్ధులైతే అదే క్రమంలో సంప్రదింపులు కొనసాగించి, ఆమోదించిన మార్గంలో ఐక్యతా సంలీనంకావచ్చు. ప్రారంభంలో సమన్వయ కమిటి సమస్యలపై సంయుక్త పోరాటాలనైపే కేంద్రీకరించుటను వాంఛించుతుంది. అదే క్రమంలో వివిధ పార్టీలు, గ్రూపులు, శ్రేణుల మధ్య ఐక్యతా సంప్రదింపులు, సత్సంబంధాల అభివృద్ధి బాగా సాగితే, అత్యున్నత స్థాయిలో ఐక్యతా సంలీన సంప్రదింపులు విజయవంతంగా సాగించి, లక్ష్యం చేరవచ్చును.

---

1. కేంద్ర కమిటీ, సి.పి.ఐ. (యం.యల్.) జనశక్తి యూనిఫికేషన్ ఆఫ్ కమ్యూనిస్టు రివల్యూషనరీస్, అవర్ అప్రోచి, జనశక్తి (ఆంగ్లం) వా 1;నం. 5; మే 1993. పే. 86.

పాక్షిక సమన్వయం, లేక ఐక్యతా సంలీనం కొన్ని పార్టీలు, గ్రూపుల కలయిక మాత్రమే లక్ష్యంగా వుండరాదు. అది భవిష్యత్తులో యితర పార్టీలు, గ్రూపులు ఐక్యతా సంలీనమగుటకు ప్రథమ సోపానాలుగా వుండి, అన్ని పక్షాలు ఐక్యతా సంలీనమగుటకు తోడ్పడునదిగా వుండాలి. ఆ విధంగానే ఒకే ఒక విప్లవ కమ్యూనిస్టుపార్టీ ఏర్పడగలదు, అంచేత అదే లక్ష్యంగా వుండాలి.

కమ్యూనిస్టు విప్లవకారులకు అట్టి సమన్వయ కమిటి లేక ఐక్యతా సంలీననానికి పిలుపు నిచ్చునపుడు కనీస అవగాహనల సారూప్యత వుండుట అవసరం. ఏయే అంశాలలో సారూప్యత వున్నదో, కమ్యూనిస్టు విప్లవకారు లెవరో, వారు ఏ ఏ అంశాలు ఆమోదించాలో సి.పి.ఐ. (యం. యల్.) జనశక్తి కేంద్ర కమిటి యీ క్రింది విధంగా సూచించింది.

మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం ఆచరణలో మార్గదర్శికంగా వుండాలి. భారత దేశంలో విప్లవ దశ, జనతా ప్రజాస్వామ్య విప్లవంగా గుర్తించాలి. సామ్రాజ్యవాదం, బడా బూర్జువా వ్యవసాయ విప్లవం, ఇరుసుగా వర్గాలపై విప్లవ దాడి, వాడి కేంద్రీకరించబడాలి. కార్మికవర్గం, రైతాంగం, మధ్య తరగతులు, జాతీయ బూర్జువా వర్గం విప్లవ శక్తులు. దీర్ఘకాల రక్షణ, ప్రతిఘటనా ప్రజాయుద్ధ పంథా భారత విప్లవ పథం. ప్రజా పంథాను అంటిపెట్టుకొని, పార్లమెంటేరియన్‌తత్వాన్ని, వ్యక్తిగత హింసా విధానాన్ని తిరస్కరించాలి. కేంద్రీకృత ప్రజాస్వామ్య విధానాన్ని సరియైన కమ్యూనిస్టు నిర్మాణ సూత్రాలను అనుసరించాలి. ద్వైపక్షలేక బహుళపక్ష ఐక్యతా సంలీననానికి అదనంగా మరికొన్ని అంశాల షరతులలో ఆమోదం, సారూప్యతా అవగాహన కలిగి యుండుట అవసరము. అవి భారత దేశం అర్ధవలస అర్థ ఫ్యూడలు, దేశము, ప్రపంచ "బృహత్చర్చ"తో మావో నాయకత్వంలో చైనా చేబట్టిన వైఖరి సారాంశం సరియైనది. చైనా నేటి నాయకత్వం మిత వాదాన్ని చేబట్టింది, చైనా బూర్జువా నిరంకుశత్వ పాలనలో వుంది. ప్రజా పంథాను అనుసరించుతూ బహిరంగ, రహస్య, చట్టబద్ధ, చట్టవ్యతిరేక, పార్లమెంటరీ, పార్లమెంటేతర, వివిధ పోరాట రూపాలను పరిగణలోనికి తీసుకొనాలి. కమ్యూనిస్టు విప్లవకారుల ఐక్యతా సంలీనంపై కలసి ఏర్పడే నిర్మాణంపై సమిష్టి ఆమోద దృక్పథం తప్పనిసరిగా వుండాలి. శతృపక్షాలలోని వైరుధ్యాలను వినియోగించు కొనుట సాధారణ ఎత్తుగడ కాని యిది సాధారణ రాజకీయ సంఘటన ఏర్పాటుకాని, ఎన్నికల ఐక్యసంఘటనలకుగాని, దారి తీయరాదు. పాలక పార్టీలో సంస్కరణ వాదులు, నియో సంస్కరణ వాదులతో సంఘటన ఏర్పరచరాదనేది సి.పి.ఐ. (యం.యల్,) జనశక్తి అవగాహనగా వుంది.

ఐక్యతా సంలీనం ఫలితంగా యేకపార్టీ నిర్మాణానికి అన్ని అంశాలలో సారూప్యతా షరతు వుండరాదు. పాక్షిక ఏకీకరణకు కమ్యూనిస్టు విప్లవకారులలో కొన్ని

శక్తులు మాత్రమే ఏకమగుట అన్ని అంశాలలో సారూప్యత వుండాలనే షరతు ఎందుకుండాలి? ఐక్య ఏకైకపార్టీ కలయికతో ఏర్పడిన పార్టీకంటె యెక్కువ భిన్న అభిప్రాయాలను తనలో యిముడ్చుకొనగలగాలి. గ్రూపుల పెత్తనం, చీలికల వాతావరణం వున్నపుడు, మరికొన్ని చీలికల ప్రమాదం వుంటుంది. ఈ చీలికల ప్రమాదం సాధ్యమైనంత తక్కువగా చేయుటకు ద్వైపాక్షిక, పాక్షిక సంలీనాలలో అత్యధిక అంశాలలో ఆమోదం అవసరం.

ఆచరణలో సంలీననానికి, ఐక్యపార్టీ కార్యక్రమాన్ని, ఎత్తుగడల పంధాని రూపొందించుటకు, మౌలిక సమస్యలపైగల భేదాభిప్రాయాలను పరిష్కరించుకొని సమిష్టి అభిప్రాయానికి వచ్చి, మరికొన్నిటిని భవిష్యత్తులో పరిష్కరించుకొనుటకు వాయిదా వేయవలసి వుంటుంది. ఆ అంశాలను యిప్పుడే పరిష్కరింపబడాలనుకొనుట, ఆ సమస్యపై ఆమోద వొప్పందాలకు రాగలరని అర్థంకాదు భిన్నాభిప్రాయాలుగల అంశాలపై, యితరుల అభిప్రాయాలను తీసుకొని నూతనంగా నిర్మించిన ఐక్యపార్టీలో చర్చించి, సమిష్టి ఆమోదం పొందిన అవగాహన రూపొందించి, పార్టీలో ఐక్యతను పెంపొందించాలి.

నేడు వాస్తవంగా దీర్ఘకాలంగా వుంటున్న విప్లవ కమ్యూనిస్టుల నిర్మాణాలను, వాటి నైజాన్ని, లక్షణాలపై భిన్నాభిప్రాయాలున్నవి. ఈ నిర్మాణాలు అన్న పదం కూడ, రాజీమార్గంలో ద్వై, బహుళపక్ష సంప్రదింపుల క్రమంలో రూపొందింది. కొంతమంది లేక గ్రూపు తమను పార్టీగ చెప్పుకొంటూ, కమ్యూనిస్టు విప్లవకారులందరిని "ఒకేపార్టీ"లో ఐక్యపరచాలంటారు. మరికొందరు తమను, యితరులను గ్రూపులుగా చెప్పుకొంటారు. రాజీగా వొప్పందం ప్రకారం "నిర్మాణాలు" అంటారు. ఈ సమస్య వొకే ఒక ఐక్యపార్టీగా రూపొందుటతో పరిష్కరించబడుతుంది. పార్టీని ఏవిధంగా పిలిచినా ఏక ఐక్యపార్టీ అనే అవగాహన యిస్తుంది. కారణం ప్రపంచ కమ్యూనిస్టులందరిలో ఒక దేశంలో ఒకే వొక కమ్యూనిస్టుపార్టీకంటె యెక్కువ వుండవనే నిశ్చితాభిప్రాయం వుంది. కాని వాస్తవంగా నేడు అనేక "పార్టీలు", "నిర్మాణాలు", "గ్రూపులు", "ముఠాలు" వున్నవి, అవి వాటిచే, యితరులచే ఆవిధంగా పిలువబడుతున్నవి. పార్టీ పిలువబడుతున్న యీ పార్టీలలో ఏపార్టీకూడా "ఒకేవొక ఐక్యపార్టీగ" లేదు. "గ్రూపులుగ పిలుచుకొంటున్న, పిలువబడుతున్న ప్రాథమిక రూపంలోవున్న గ్రూపులుకూడ ఐక్యగ్రూపులుగ లేవు. ఈ పార్టీలు, గ్రూపులు కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని అనుసరిస్తున్నవి. పార్టీలాగానే ప్రవర్తిస్తున్నవి. ప్రజాసామాన్యం వారిని పార్టీలుగ గుర్తిస్తున్నారు. పార్టీ సంస్కృతిని వారసత్వంగా పొందుతున్నారు, కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్నే ఆచరిస్తున్నారు. అదేకాలంలో వారు కమ్యూనిస్టు విప్లవకారులు పునర్నిర్మించదలచుకొన్న సి. పి. ఐ. (యం. యల్) జనశక్తి యితర నిర్మాణాలను ఐక్యతా సంలీనంకొరకు తమను, యితరులను పార్టీ

గ్రూపులుగానే, సమానంగానే పరిగణించుచున్నవి.

ఐక్యత యెప్పుడూ నూటికి నూరుపాళ్ళు పవిత్రమైనదిగాఉడదందు. అభిప్రాయ భేదాలు, వైరుధ్యాలు కొనసాగుతున్నా వాంఛించి సాధించవలసినది. కష్టాలలో పని చేయాలనే కాంక్ష, వుత్సాహం, ఓర్పుతో కేంద్రీకృత ప్రజాస్వామ్యంగా పనిచేయాలి. ఆవిధంగా వొక ఐక్య సమిష్టి అవగాహన సరైన రాజకీయ పంథాలో రూపొందించ బడుతుంది, సరిగా అమలు చేయబడుతుంది.

ఐక్యపార్టీ నిర్మాణం తప్పనిసరి. మన విప్లవానికి అంతకంటె అవసరమైనది, వుపయోగకరమైనది లేదు. కాబట్టి ఐక్యత వొక ఆశయమేగాక ఆచరణయోగ్య మైనది. మన చొరవ అంతా ఐక్యత పదఅర్థంలో కమ్యూనిస్టు విప్లవకారులందరిని ఒకేవొక పార్టీలో విలీనం చేయాలి. ఈ విలీనక్రమం పూర్తిఆగువరకు అంటే వొకే వొక ఐక్యపార్టీలో కమ్యూనిస్టు విప్లవకారులలో అత్యధికులు విలీనం అగువరకు విశ్రాంతి తీసుకొనరాదు. కమ్యూనిస్టు విప్లవకారులు ఐక్యమగుతారనే విశ్వాసం వుంది. కాలక్రమంలో వొకే ఐక్యపార్టీగ ఏర్పడుతారని, యీ కర్తవ్య నిర్వహణలో ముఖ్యబాధ్యతలు నిర్వహించుటలో భాగస్వాములవుతారనే విశ్వాసాన్ని సి. పి. ఐ. (యం. యల్) జనశక్తి ప్రకటించింది.

**ఏడు కమ్యూనిస్టు విప్లవ సంస్థల ఐక్యతా ప్రకటన :**

కమ్యూనిస్టు విప్లవ సంస్థలు ఏడు కలసి ఓర్పుతో సూత్రబద్ధంగా జరిపిన సంప్రదింపులు, చర్చలు, కొన్ని సమిష్టి అవగాహనలకు, సుముఖ పరిణామాలకు, దారి తీసిన ఫలితంగా, సంయుక్తంగా సి.పి.ఐ.(ఎం.ఎల్) జనశక్తిగా ఏర్పడుటకు వొప్పందానికి వచ్చి, 30 జులై 1992లో ఐక్యతా ప్రకటనను, విజ్ఞప్తిని చేసాయి. కమ్యూనిస్టు విప్లవకారులందరిని ఏకంచేసి, ఒకే వొక ఐక్యపార్టీగా నిర్మించే ప్రయత్నంలో ప్రథమ ప్రాథమిక చర్యను విజయవంతంగా నెరవేర్చారు. నాడు యిది విప్లవ కమ్యూనిస్టుల తక్షణ ప్రధాన కర్తవ్యంగా, అత్యవసర రాజకీయ చర్యగా ఎంచబడింది.

ఐక్యతా సంప్రదింపులు, ఐక్యతా ప్రకటనతోపాటు సాధ్యమైనన్ని ప్రాంతాలలో ఐక్య కార్యాచరణతో సుహృద్భావం, సదవగాహన, పరస్పర ఐక్యతాభావ స్పందనలలో ఐక్యత పురోగమించగలదని తలచబడింది.

ఈ సంప్రదింపులు, సంభాషణలు, చర్చలలో సి.పి.ఐ. (ఎం.ఎల్) జనశక్తి, సి.పి.ఐ.(ఎం.ఎల్) ప్రతిఘటన-రెసిస్టెన్స్, యు.సి సి.ఆర్.ఐ. (ఎం.ఎల్) సి.పి.ఐ. (ఎం.ఎల్) పైలా, సి.పి.ఐ. (ఎం.ఎల్) కౌశిక్ బెనర్జీ, ఆగామియుగ్, సి.పి.ఐ. (ఎం. ఎల్) కోకస్‌మజుందార్ వర్గం, సి.సి.సి.ఆర్. పరిమళదాస్‌గుప్తా వర్గం, యు.సి.ఆర్. జితేన్ గుప్తా వర్గాల, నాయకులు ప్రతినిధులతో పాల్గొన్నారు.

జాతీయ, అంతర్జాతీయ ఆర్థిక, రాజకీయ పరిస్థితులు, ఇటీవల నిర్దిష్ట

కాలంలో వివిధ కమ్యూనిస్టు శ్రేణుల రాజకీయ, నిర్మాణ, ఆచరణల సమీక్షలపై, కార్యక్రమం, విప్లవ పంథాలపై జరిపిన సంభాషణలు, చర్చలు, వివరణలలో మౌలిక సమిష్టి అవగాహన వివిధ వర్గాలలో ఏర్పడింది. పరస్పర అనుభవాల నుండి నేర్చుకోవాలనే ఆకాంక్షా దృక్పథంతో హృదయ పూర్వక, నిర్మొహమాటంగా సంభాషణలు, సంప్రదింపులు, చర్చలు యిచ్చి పుచ్చుకొనే ధోరణిలో సాగుటతో వివిధ సమస్యలపై సమిష్టి అవగాహనలు రూపొంది సమావేశాలు విజయవంతమయ్యాయి.[1].

సి.సి.ఐ. (ఎం.ఎల్) జనశక్తి, ద్వ్యగుణీకృత విశ్వాసంతో మార్క్సిజం-లెనినిజం-మానో ఆలోచనా విధానాలే మార్గదర్శక ఆచరణ సిద్ధాంతాలని, అవే అర్థ వలస, అర్థ భూస్వామ్య భారతదేశంలో జనతా, ప్రజాస్వామ్య విప్లవాన్ని విజయ వంతంగా ఆవిష్కరించగలవని పునరుద్ఘాటించింది.అదే కాలంలో పార్లమెంటేరియన్ తత్వాన్ని, వ్యక్తిగత హింసావాదాన్ని నిర్ద్వంద్వంగా త్రోసిపుచ్చి ప్రజా పంథాను చేబట్టింది. ఈ అవగాహన వైఖరులనే సమావేశంలో పాల్గొన్న సోదర పార్టీలు, గ్రూపులు ఆమోదించాయి.

ఏడు కమ్యూనిస్టు విప్లవ సంస్థలు సంభాషణలు, చర్చల అనంతరం కలసి పొకే సి.పి.ఐ.(ఎం.ఎల్) జనశక్తి పార్టీగా ఏర్పడి, ఆమోదించిన "ఐక్యతా ప్రకట నను" విడుదల చేశారు. ముఖ్యాంశాలు సంక్షిప్తంగా యిలా వున్నవి.

1. రెండవ ప్రపంచ యుద్ధానంతరం. అసంపూర్తియైన జాతీయ ప్రజాస్వామ్య విప్లవ సమస్య ఏజండా ముందుకొచ్చింది బూర్జువా,భూస్వామ్య పార్టీలైన కాంగ్రెసు, ముస్లిం లీగులు సామ్రాజ్యవాదంతో పోటా పోటీగా రాజీపడి, బ్రిటిష్ కామన్‌వెల్తులో భాగస్వామియైన రాజ్యాధికారాన్ని, దాని బదలాయింపును పొందాయి. సామ్రాజ్య వాద వ్యతిరేక జాతీయ విముక్తి వుద్యమాన్ని ప్రజా పోరాటాలతో నూతన ఉన్నత స్థాయికి కొనిపోయి, నాయకత్వ పాత్రను స్వయంగా చేబట్టుటకు మారుగ, బూర్జువా కాంగ్రెసు, ముస్లింలీగులను అనుసరించి, బలమైన స్వతంత్ర పాత్రను కోల్పోయి, బూర్జువా కాంగ్రెసు, లీగులకు నాయకత్వ పాత్రను ధారాదత్తం చేసినందున ఆ పార్టీలే సామ్రాజ్యవాదం నుండి రాజ్యాధికారాన్ని పొందాయి. కమ్యూనిస్టుపార్టీ "కాంగ్రెసు, ముస్లింలీగు", "గాంధీ-జిన్నాలు" ఐక్యమవ్వాలనే నినాదాలిస్తూ,చొరవను రెండు బూర్జువా పార్టీలకిచ్చుటతో, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా పోరాటాలు ఆకాశాన్నంటుటకు మారుగ మత మారణహోమాలు భూలోక నరకాన్ని సృష్టించాయి. అధికార మార్పిడి కాలంలో విప్లవ ప్రజా పోరాటాలను, కార్మిక, రైతాంగ, విద్యార్థి, యువజన, సైనిక, నావిక, విమాన దళాల స్వాతంత్ర్య పోరాటాలకు, పోరాట నాయకత్వాన్ని కమ్యూనిస్టుపార్టీ యిచ్చుటలో విఫలమైనందుననే, సామ్రాజ్య

1. జనశక్తి (ఆంగ్లం) వా. I. నం. 1, జనవరి 1993. పే. 1-2.

వాద వ్యతిరేక విముక్తి పోరాట ఐక్య సంఘటన విచ్ఛిన్నమై, సామ్రాజ్యవాద, బూర్జువా, భూస్వామ్య, ప్యూడలు వర్గాల కుట్రలు ఫలించి, ఏ దేశ చరిత్రలో యెన్నడూ జరుగనంతటి ప్రజా సామాన్య జనాభా మార్పిడి, మత కలహాల మారణ హోమంతో ఎన్నడూ, ప్రపంచంలో ఎక్కడా జరుగనంతటి మానవ ప్రాణ నష్టం జరిగింది. దీనికంతటికి, నాటి రాజకీయ పార్టీల నాయకత్వాలు, తమ కుట్రలలో విజయం పొందిన హమ్రాజ్యవాదాల పైన చరిత్ర బాధ్యత వుంచుతుంది.

2. బ్రిటిష్‌ప్రభుత్వం రాజ్యాధికారాన్ని బదలీచేయుటను మొదట స్వాతంత్ర్య పోరాట విజయంగాను, తదుపరి స్వాతంత్ర్యం బూటకమయినదని, కుట్రపూరిత తిరుగుదాడిగాను విశ్లేషణచేసి, కమ్యూనిస్టుపార్టీ బూర్జువా ప్రజాస్వామ్య విప్లవ పోరాటాన్ని చేబట్టి, మితవాదంనుండి అతివాద అవకాశవాదంవేపు పయనిలచి, మావో నూతన ప్రజాస్వామ్యాన్ని తెగనాడి, వ్యక్తిగత హింసావాద దౌర్జన్యవాద గమ్యం చేరింది. సి.పి.ఐ. 1955లో స్వాతంత్ర్యం వాస్తవమైనదిగా గుర్తించి, దాని రక్షణకు ప్రాధాన్యతనిచ్చింది. జాతీయ ప్రజాస్వామ్యం సంఘటనా నినాదంతో కేరళలో 1957లో కమ్యూనిస్టుల నాయకత్వంలో ప్రభుత్వం ఏర్పడుట, అది కూలద్రోయబడినా సైద్ధాంతికంగా కేరళమార్గంలో పయనించి, అమృతసర్‌లో "పెట్టుబడిదారీ విధానం, సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన" అనే సోవియట్ రష్యా 20వ పార్టీ కాంగ్రెసు సిద్ధాంతాన్ని చేబట్టి, మితవాద పార్లమెంటరీ విధాన లక్ష్యంచేరి, సోషల్ డెమోక్రటిక్ పార్టీ లక్షణాలు కొన్నింటిని చేబట్టింది. పార్టీలో మితవాద–అతివాద సైద్ధాంతిక సంఘర్షణ పేరుతో, పార్టీలో అంతర్గత సైద్ధాంతిక పోరాట పరిధులను దాటుట, సి.పి.ఎస్.యు. సి.పి.సి.లు పరోక్షంగా చీలికలను ప్రోత్సహించిన కారణంగా కమ్యూనిస్టుపార్టీ చీలి, సి.పి.ఐ., సి.పి.ఐ.(ఎం) అనే రెండు పార్టీలుగా ఏర్పడ్డాయి.

సి.పి.ఐ.(యం.) అసలు సి.పి.ఐ. నుండి మౌలికంగా విభేదించలేదని చీలిక అనంతరం రెండు కాంగ్రెసులు అవలంబించిన విధానాలు స్పష్టం చేస్తున్నవి. రెండు పార్టీలు పార్లమెంటరీ విధానాలనే అవలంబించాయి. విప్లవ పార్టీలని చెప్పుకొంటూ మితవాదాన్ని, నియోమితవాదాన్ని మొత్తంగా సంస్కరణవాదాన్ని చేపట్టాయి.

3. నక్సల్బరీ ప్యూడలు భూస్వామ్య వ్యతిరేక సాయుధ రైతాంగ పోరాటం, వ్యవసాయ విప్లవం, భూపంపక సమస్యను ముందుకు తెచ్చింది. ప్రజాయుద్ధపంథాను విప్లవానికి మార్గదర్శికంగా ఆవిష్కరించింది. రాజకీయ పరిణామాలు పోరాట క్రమంలో సి. పి ఐ. (యం.) నియోసంస్కరణవాదాన్ని సి. పి. ఐ. "శాంతియుతంగా సోషలిజంలోనికి పెట్టుబడిదారీ విధానం పరివర్తన" సిద్ధాంతాలు త్రోసివేయబడ్డాయి. సి. పి. ఐ.(యం) పంథాను త్రోసిబుచ్చి ప్రజాయుద్ధ పంథాను కమ్యూనిస్టు విప్లవకారులు చేబట్టి సి.పి. (ఎం.ఎల్.) పార్టీగా ఏర్పడ్డారు. తదనం

తర రెండు దశాబ్దాల కాలంలో సి.పి.ఐ(యం.యల్) అనేక చీలికలకు వివిధగ్రూపు లుగా ఏర్పడుటకు దారితీసింది.

4. దశాబ్దాల చీలికల అనంతరం ఇటీవల క్రమేణా ఐక్యతా భావపు పిల్లి గాలులు వివిధ (యం.యల్) కమ్యూనిస్టు శ్రేణులలో వీచుచున్నవి. సోషలిస్టు, ప్రజాస్వామ్య, స్వాతంత్ర్యం, శాంతి, సామ్రాజ్యవాదశక్తుల, దోపిడీవర్గాల దాడులకు గురయ్యాయి. ఒకవైపు సోవియట్ నూతన సంస్కరణవాదులు మార్క్సిజం-లెనినిజం ముసుగులు తొలగించుట, మరోవేపున చైనా సంస్కరణవాదులు మావో యిజం, సోషలిజం ముసుగులు కొనసాగించుటతోపాటు విప్లవ శక్తులను వారి కౌగిళ్ళ లోనికిఆహ్వానించుట, మార్క్సిస్టు విప్లవ తత్వంపై దాడిచేయుటతప్ప మరొకటికాదు. భారతదేశంలో కూడ కమ్యూనిస్టు విప్లవకారులపై యిదే విధమయిన దాడి జరుగు చున్నది. అంతేగాక, దోపిడి పాలకవర్గాలు అత్యంత సంక్లిష్ట ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోయి దివాళాకోరులయ్యారు. ప్రపంచ పెట్టుబడిదారీవిధానం ముందెన్నడూ ఎరుగనంతటి ఆర్థిక సంక్షోభంలో దిగబడిపోయింది. విప్లవ శక్తులు యీ అత్యంత అనుకూల పరిస్థితులను పూర్తిగా ఎలా వినియోగించుకొనగలవనేదే నేటి ప్రశ్న. కార్మిక, కర్షక వర్గాల ఐక్యతలు, బలమైన ఐక్య విప్లవ కమ్యూనిస్టుపార్టీ నేటి తక్షణ ఆవశ్యకతగా ఉంది.

5. విప్లవ కమ్యూనిస్టు ఉద్యమాలు అనేక ఆటుపోటులకు, నష్టాలకు గుర య్యాయి. అనేక వైఖరులు అభివృద్ధిచెంది సంఘర్షించుట జరిగింది, పాలక శత్రు వర్గాలు తమ ఏజంట్లను చొప్పించి వున్నవారిని ప్రోత్సహించి చీలికలు తెచ్చి, తమ ప్రయోజనాలను కాపాడుకొనుటకు వినియోగించుకొన్నారు. మౌలికాంశాలలో అధిగ మించలేని భేదాభిప్రాయాలు లేకపోయినా, తప్పుడు విధానాలు, పద్ధతులు, ఆచర ణలు, చీలికలకు కారణాలయ్యాయి. విప్లవ ప్రజా పంథాను అనుసరించేవారు కూడా భిన్న దృక్పధాలు, ఆచరణ, పద్ధతులు చేబట్టుట, స్వీయమానసిక, సెక్టేరియనిస్టు ధోరణులు, రాగద్వేషాలు కారణంగాకూడా చీలికలకు లోనయ్యారు. చీలికల సిద్ధాంతం ఐక్యతా ప్రతిపాదనల ద్వారాలను మూసివేసింది. పిడివాదం, పరిస్థితుల వాస్తవికతా అధ్యయనం, విశ్లేషణ కొరవడిన కారణంగా గ్రుడ్డివాని చేతి రాయి చంద మైంది.

ప్రజా విప్లవపంథా ననుసరించే కమ్యూనిస్టు విప్లవకారులలో మౌలిక భేదాభి ప్రాయాలు లేనపుడు చీలికలకు, శాశ్వత విభజనలకు గురయి వుండవలసిన కార ణాలు లేవని గుర్తించామని కమ్యూనిస్టు విప్లవకారులన్నారు. ఒకసారి చారిత్రక పొర పాటుగా ఒక పార్టీ చీలి రెండుగా ఏర్పడి నేడు అప్రధాన విషయాలలో మాత్రమే భేదాభిప్రాయాలున్నపుడు, అందులో అవి సంప్రదింపులు చర్యలలో అధిగమించ గలిగిన అభిప్రాయభేదాలయినప్పుడు బూర్జువా ప్రభావాలే కలయిక, ఏకపార్టీ నిర్మా ణానికి అడ్డుగోడలుగా ఉన్నాయని అనుకొనవలసి వుంటుంది.

6· రాజకీయ అవగాహనలలో సారూప్యత, అనుకూల రాజకీయ పరిస్థితులు, ఐక్యతా క్రమాభివృద్ధి వాస్తవికతను గుర్తించిన, ఏకపార్టీ నిర్మాణానికి కమ్యూనిస్టు విప్లవకారులకు తక్షణ అవసరం స్పష్టమౌతుంది. ఐక్యతా సంభాషణలలో ఐక్యతకు సుస్థిరతకూ వివిధ కోణాలనుండి అందరూ కృషి చేయాలి.

కొన్ని విడతలుగా ద్వైపక్ష, త్రైపక్ష బహుళపక్ష సంప్రదింపులు, చర్చలు జరిగాయి. మొదట (సి.పి.ఐ.(యం.యల్.) ప్రతిఘటన, యు.సి.సి.ఆర్. (యం. యల్), సి.పి.ఐ.(యం.యల్) టి.యన్.డి. మూడు సంస్థలు ఐక్యతా సంభాషణల నోటును నవంబరు 1990లో సంతకం చేసాయి. ఈ నోటు ప్రధాన సమస్యలను వెలుగులోనికితెచ్చి, ఐక్యతకు వొక ప్రాతిపదికను సమకూర్చింది. అయినా సి.పి.ఐ. (యం.యల్) టి.యన్.డి. వొప్పందాన్నుండి తిరోగమించింది. అదే కాలంలో సి. పి. ఐ. (ఎం.ఎల్) టి.యన్.డి. పశ్చిమబెంగాల్‌లోని దాని శాఖలు, సి.పి.ఐ. (యం.యల్) ఆగామియుగ్, కేంద్ర కమిటీలోని పైలా గ్రూపు యితర రాష్ట్రాల లోని మరికొన్ని గ్రూపులు ఐక్యతకై పోరాడిన గ్రూపులన్నీ సంయుక్త ఐక్యతా నోటు ఆమోదించిన తమిళనాడు నాయకులు కొందరు ఐక్యతాక్రమంలో కలసి వచ్చారు. ఐక్యతా సంభాషణలు, చర్చలతోపాటు ఐక్యపోరాటాలతో కలసి వచ్చారు.

7. వివిధ పార్టీల, గ్రూపుల భిన్నాభిప్రాయాలు పార్టీల సంలీననానికి ముందే పరిష్కరించబడాలనే షరతులేదు. ఈ దృక్పథంతో మన నాయకత్వాల అభిప్రా యాలు సరిచేయబడగలవని, వారి పాత్ర యెక్కువగా వుంటుందని, యీ విధంగా గతాన్ని పరిగణలోనికి తీసుకొంటూ, అది భవిష్యత్తు పురోగమనానికి సోపానముగా నెంచబడింది.

ఈ మౌలిక దృక్పధాన్ని అనుసరించి యీ క్రింది నిర్ధారణలు చేయ బడినవి.

i) పూర్వ కమ్యూనిస్టు ఉద్యమ కొనసాగింపే, నేటి కమ్యూనిస్టు ఉద్యమం, పోరాటాల ఫలితాలతోపాటు, సంస్కరణ, నియోసంస్కరణ వాదాలను త్రోసి బుచ్చి, నక్సల్బరీ వుద్యమంగా జన్మించి యం.యల్ ఉద్యమంగా పురోగ మించింది.

ii) కమ్యూనిస్టు విప్లవకారులందరిని వొక్క గొడుగుక్రిందకుచేర్చి ఎ.ఐ.సి. సి.సి.ఆర్.ను నిర్మించుట సరియైన చారిత్రిక ఘటన, ప్రయత్నము.

iii) విప్లవకారులు ఎ.ఐ.సి.సి.సి.ఆర్.గా ఏర్పడిన తరువాత అతివాద వైఖరి ఉద్భవించి అది అనుసరించిన విధానాలు పశ్చిమబెంగాలులో రెండు దృక్పథాలు రూపొంది, ఆంధ్రప్రదేశ్‌లో చీలికవచ్చి ఎ.పి.సి.సి.సి.ఆర్. ఏర్పడుట జరిగింది. ఈ విధంగా కమ్యూనిస్టు విప్లవకారులలో రెండు దృక్పథాలు, స్రవంతులు ఏర్పడి, కొనసాగాయి. ఎ.ఐ.సి.సి.సి.ఆర్. ఆంధ్రప్రదేశ్‌లోని కమ్యూనిస్టు విప్లవకారులను

బహిష్కరించుట వొక చారిత్రిక తప్పిదము. వారే ఎ.పి సి.సి.సి.ఆర్. గా ఏర్పడ్డారు.

iv) విప్లవోద్యమానికి నాయకత్వం వహించుటకు విప్లవపార్టీ అవసరం. ఆ లక్ష్యంతో ప్రజాయుద్ధ పంథా ప్రాతిపదికగా 22 ఏప్రిల్ 1969లో మార్క్సిస్టు-లెనినిస్టు సి.పి.ఐ.(ఎం.ఎల్) ఏర్పడింది. నక్సల్బరీ కమ్యూనిస్టు విప్లవకారులు, సి.పి.ఐ.(ఎం.ఎల్.) నాయకత్వాలు అతివాద దుందుడుకు సాహసిక వాదాన్ని చేబట్టి వ్యక్తిగత హింసావాదులయ్యారని ఎ.పి.సి.సి.సి.ఆర్. తీవ్రంగా విమర్శించింది. ఫలితంగా ఎ.పి.సి.సి.సి.ఆర్.ను కేంద్ర సంఘం బహిష్కరించింది.

v) అతివాద సెక్టేరియనిజం, వ్యక్తిగత హింసావాద వ్యతిరేక పోరాటం సి పి.ఐ.(ఎం.ఎల్)లో అంతర్గతంగా, బయటాసాగి, మౌలికంగా ప్రజాపంథా గ్రూపు ఏర్పడి, సైద్ధాంతిక, రాజకీయ పోరాటాన్ని సాగించింది.

vi) గత రెండున్నర దశాబ్దాలలో కమ్యూనిస్టు విప్లవకారులు వివిధ కలయికలకు, విడిపోవుటలకు లోనయ్యారు. సరిఅయిన దృక్పథంతోపాటు అతివాద వక్రీకరణ, ఆచరణలో వ్యక్తిగత హింసావాదం ఏదో రూపంలో కొనసాగింది. వీటితో పాటు మితవాద అవకాశవాదం, సెక్టేరియనిజం, విచ్ఛిన్నకర నిస్పృహ, నిరాశావాదం వివిధ రూపాలలో ఏర్పడింది. ఈ విధంగా వొక్కమాటలో మితవాద, అతివాద వక్రీకరణలు ప్రమాదకరమైనవి అయ్యాయి.

నిర్మాణరంగంలో అనేక అవాంఛనీయ వైఖరులు, ముఠాతత్వం, ఫాక్షనలిజం, అధికార నిరంకుశత్వం, పార్టీ అంతర్గత చర్చలలో ప్రధాన సూత్రాలను వక్రీకరించుట, సైద్ధాంతిక పోరాటాన్ని నిందా అపనింద దూషణలతో ప్రక్కదారులు పట్టించుట జరిగింది. చీలికల కథనాక్రమంతో అవకాశవాదాన్ని, తదితర అవాంఛనీయ, అనారోగ్యకర, పెడధోరణులు పెచ్చుపెరిగిపోయి, ఉక్కు నిర్మాణం, క్రమశిక్షణ కోల్పోవుటతో, ప్రజాస్వామ్య కేంద్రీకరణ అమలు అసాధ్యమైపోయి, క్రమశిక్షణారాహిత్యమే సాంప్రదాయమైంది. ఫలితంగా కమ్యూనిస్టు విప్లవకారులలో సూత్రబద్ధ ఐక్యతా నిర్మాణం కుంటుబడింది.

ఇన్ని తప్పుడు వైఖరులు కొనసాగినా, కొన్ని శ్రేణులు ప్రజాపంథాను అనుసరించే క్రమంలోనే నిజాయితీతో సుముఖ, అసుముఖ అనుభవాలనుండి శాస్త్రీయ గుణపాఠాలను నేర్చుకొనుట పాక్షికంగానే జరిగింది.

8. ఈ ఇరవై సంవత్సరాలలో ఒకేవొక ఐక్యపార్టీని నిర్మించుటలో వచ్చిన అవకాశాలను వినియోగించుకొనుటలో కమ్యూనిస్టు శ్రేణులు విఫలమయ్యాయి. ఫలితంగా అనేక పార్టీలు, గ్రూపులు ఏర్పడినవి. అవి ఎక్కువగా ప్రజాస్వామ్య కేంద్రీకరణ నిర్మాణ సూత్రమన్న పేరుతో అజ్ఞలు జారీచేసే నిరంకుశ విధానాలనే అనుసరించుతు, భిన్నాభిప్రాయాలను చర్చించి నిర్ణయాలను గైకొనుటను మృగ్యం చేయు

టతో గ్రూపులు, ఉపగ్రూపులు అన్నిశ్రేణులలో ఏర్పడుట కొనసాగింది. అందు వలనే నేడు యిన్ని గ్రూపులు వున్నవి. అంచేతనే, కమ్యూనిస్టు విప్లవకారులలోని ఏవొక్క వర్గమూ విప్లవకారులలో మెజారిటీని, తమ నిర్మాణంలోనిరి తీసుకొని రాగలిగామని చెప్పే ధైర్యం యెవ్వరికీలేదు. కమ్యూనిస్టు విప్లవకారుల ఏడు నిర్మాణాలు కలిసి ఐక్యంగా ఒకే నిర్మాణంగా ఏర్పడే ప్రయత్నం చెప్పుకొనదగిన పురోగతిగా నెంచాలి. ఐక్యపార్టీ కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రాలను అనుసరించుతుం దని తెలిపింది. కమ్యూనిస్టు విప్లవకారులందరిని ఒకే వొక నిర్మాణంలోనికి తీసుకొని రావాలనే ప్రధాన కర్తవ్యం పూర్తికాలేదు.

ఈ మౌలిక అవగాహనతో విడివిడి పార్టీల, గ్రూపుల రద్దును వొకే వొక పార్టీగ పునర్నిర్మాణాన్ని చేబట్టుటగా మా నిర్ణయాన్ని ప్రకటించుతున్నామని, అది సి.పి.ఐ. (ఎం.ఎల్) జనశక్తిగా పిలువబడుతుందని, "జనశక్తి" పార్టీ కేంద్ర పత్రికగా పనిచేస్తుందని" ప్రకటించారు. కా. కె. రామచంద్రన్‌ను ఐక్యపార్టీ కేంద్ర కమిటి జనరలు సెక్రటరీగా ఎన్నుకున్నారు.

9. మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం, మార్క్స్, ఎంజెల్స్, లెనిన్, స్టాలిన్, మావోలు వ్యాఖ్యానించి ఆచరించిన విధానం ఐక్యపార్టీకి మార్గదర్శకము. కార్మికవర్గ అంతర్జాతీయత వొక రాజకీయ బాధ్యత, ప్రపంచ కార్మికవర్గానికి అణగారిన జాతులు, ప్రజలకు పోరాట మద్దతు ఎప్పుడూ ఉంటుంది. సోషలిజం, జాతుల విముక్తి, స్వాతంత్ర్యం, ప్రపంచ శాంతికి పార్టీ కృషి చేస్తుంది.

మన విప్లవం, జనతా ప్రజాస్వామ్య విప్లవం, దాని యిరుసు వ్యవసాయ విప్లవం. ఈ విప్లవం సామ్రాజ్యవాద, ఫ్యూడలిజం, కంప్రెడరీ బూర్జువావర్గం, పెట్టుబడిదారి వ్యతిరేక విప్లవం, కార్మికులు, కర్షకులు, మధ్యతరగతి, జాతీయ బూర్జువావర్గం కార్మిక కర్షకవర్గ నాయకత్వంలో కార్మిక కర్షక వర్గాల పునాదిగా విప్లవాన్ని పరిపూర్తి చేస్తుంది. అంతర్జాతీయంగా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని తీవ్రతరం చేస్తుంది. రెండు సూపరు సామ్రాజ్యవాదాల వ్యతిరేక పోరాటమిది.

10. అఖిల భారత సి.పి.ఐ. (ఎం. ఎల్) జనశక్తి—సి.ఒ.సి. జూన్ 1999 కాన్ఫరెన్సులోను, యీ సమావేశానికి ముందు సి.ఒ.ఐ. (ఎం.ఎల్), సి. పి. ఐ. (ఎం.ఎల్) జనశక్తి—సి.ఒ.సి.తో జరిగిన సంయుక్త వొప్పందపు "యూనిటి నోటు" సి.ఒ.ఐ. (ఎం.ఎల్); సి.పి.ఐ. (ఎం.ఎల్), సి.ఒ.సి. జనశక్తి; సి.పి.ఐ.(ఎం.ఎల్) లిబరేషన్; సి.పి.ఐ.(ఎం.ఎల్) న్యూడెమోక్రసీ; సి.పి.ఐ. (ఎం.ఎల్) రెడ్‌ఫ్లాగ్‌లు, 1992 జులైలో ఏడు కమ్యూనిస్టు విప్లవసంస్థలు ఆమోదించిన ఐక్యతా ప్రకటనలోని మౌలికాంశాలన్నిటిని ఆమోదించి 1999 కాన్ఫరెన్సు పునరుద్ఘాటించుటయేగాక, జాతీయ, అంతర్జాతీయ రాజకీయ పరిస్థితులపై సమిష్టి అవగాహన, తక్షణ కార్యక్రమాన్ని ఆమోదించి, కమ్యూనిస్టు విప్లవకారులతో నూతన సహస్రాబ్దిలో ఐక్యతను చిగురింపజేసారు.

30)

# 10

# సమీక్ష - కొన్ని ముఖ్యాంశాలు

## i

**1. 1. యుద్ధానంతర గత 20 సంవత్సరాలలో** ప్రపంచ పెట్టుబడి దారి విధానం 1948-52; 1957-58; 1965-67 లలో మూడుసారులు ఆర్థిక మాంద్యం, సంక్షోభ పరిస్థితులకు గురైంది. అమెరికాలో వుత్పత్తి వాస్తవానికి 1963–66 లలో కొంత మెరుగై 1967 నుండి పడిపోయింది. ఆ పెరుగుదలకూడ వియత్నాం యుద్ధం కారణంగా ఆయుధోత్పత్తికి మార్కెట్టు పెరుగుదలతో తాత్కాలికంగా పెరిగింది. అమెరికా ఆర్థిక, ద్రవ్యవిధానాలు ప్రత్యర్థి జపాన్‌తో పోటీ చేయ జాలకపోయాయి. జపాన్ సరుకులు అమెరికన్ మార్కెట్టులో విపరీతంగా వచ్చి పడుటతో తమ పరిశ్రమల రక్షణ చర్యగా దిగుమతులపై అనేక పరిమితులు, నిషేధాలు చేపట్టింది. బ్రిటన్ పౌండు, జర్మన్ ఫ్రాంక్ విలువలు పడిపోవుటతో ఆర్థిక మాంద్యం వచ్చింది. అమెరికా దిగుమతులపై పెట్టిన ఆంక్షలతో యీ దేశాలలో సంక్షోభ పరిస్థితులు తీవ్రం కాసాగాయి. కొద్దికాలంలోనే అమెరికా తన బంగారపు నిల్వలను 60 శాతం కోల్పోయింది. ప్రెసిడెంటు జాన్సన్ పరిస్థితులను చక్కబెట్టుటకు చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి. ఈ భారాన్ని శ్రామికులు, ప్రజలపై మోపుటకు అధిక పన్నులు, ధరలు అత్యధికంగా పెంచి ప్రజల జేబులు ఖాళీ చేస్తున్నారు. కార్మికులు 1916 లో 1.8, 1967 లో 2.9 మిలియనులు సమ్మెలలో పాల్గొనుట, వెల్లువగా సాగింది.

**1. 2. నూతనంగా స్వాతంత్ర్యం పొందిన** తదితర వెనుకబడిన దేశాల అభివృద్ధి, సామ్రాజ్యవాదపు "ఆర్థిక సహాయం" అనే అధిక వడ్డీల అప్పులపై ఆధారపడివున్నందున "సంక్షోభం"లో పడిపోయినవి. మన విదేశ వ్యాపారం అతి తీవ్రలోటుకు గురై రూపాయి విలువను తగ్గించిన కారణంగా, మన విదేశీ ఋణం వొక్క కలంపోటుతో 50 శాతం పెరిగిపోయింది. సామ్రాజ్యవాదం తన సంక్షోభ భారాన్నంతా, వెనుకబడిన బడుగుదేశాలపై మోపింది. వెనుకబడిన దేశాల అప్పులు 1955-56 మధ్య 10 వేల మిలియనుల నుండి 40 వేల మిలియనుల డాలర్లుగా పెరిగిపోయాయి. వీటిపై ప్రతి సంవత్సరం చెల్లించవలసిన వడ్డీ 500 నుండి 4000 మిలియనుల డాలరులకు పెరిగిపోయింది.

**1. 3. వియత్నాం విముక్తి పోరాటంలో** అమెరికా ఘోర పరాజయం, అమెరికా ప్రపంచ ఆధిక్యతా గౌరవాన్ని మంటగలిపింది. సామ్రాజ్యవాద

శక్తుల కూటములు, వొప్పందాలు, అమెరికా నాయకత్వంపై దాని మిత్రుల ఆశలు అడియాశలయ్యాయి. ప్రపంచ వలస విముక్తి ఉద్యమాలకు, పోరాటాలకు నూతనోత్సాహాన్ని, మార్గదర్శికత్వాన్ని యిచ్చి, పరోక్షంగా తోడ్పడింది. "సామ్రాజ్యవాదం ప్రపంచవ్యాప్తంగా సంక్షోభ వూబిలో" దిగబడుట, వైరుధ్యాలు తీవ్రమగుట జరిగింది.

**1. 4. సరళీకృత అంతర్జాతీయ వ్యాపారం** టారిఫులు తగ్గించుట, రద్దుచేయుట అనే కబుర్లు సామ్రాజ్యవాద దేశాలు చెబుతున్నా, మార్కెట్టు కంట్రోలు చేయుటకై, దేశీయ మార్కెట్లకై వారు చేపట్టుతున్న చర్యలు రక్షణకుద్దేశించబడినవి. యూరోపియన్ కామన్ మార్కెట్‌లో టారిఫ్‌లు రద్దుచేయుట, వారి ప్రత్యర్థి గుత్త పెట్టుబడి వర్గాలపై పోరాడుటకై బాగా అభివృద్ధిచెంది ఆర్గనైజు అయి వున్న గుత్త పెట్టుబడిదారి వర్గాలవారు యితరులపై తలపెట్టిన మార్కెట్టు దాడులకు అత్యంత అనుకూల పరిస్థితులను రూపొందించుకొను ప్రయత్నము. ఇది సంఘర్షణలకు దిగు మార్గము తప్ప మరొకటికాదు. అమెరికా, ఫ్రాన్సుల మధ్య పెరుగుతున్న వైరుధ్యాలు, వ్యాపార సంఘర్షణలపై ఫ్రెంచి అధికార వర్గాలు "ప్రమాదం తూర్పు (రష్యా) నుండి వచ్చుటలేదు. ఫ్రాన్సుపై డాలరు వలస పెత్తనం మొత్తం యూరపు డాలరు పెత్తన ప్రమాదమున్నది, యిది వాస్తవమైనది" అనే అవగాహనతోనే "నాటో" నుండి దూరమగు విధానాన్ని తదనంతర దశకంలో ఫ్రాన్సు చేబట్టుటకు నేపథ్యం విశదం కాగలదు. ఒక్కమాటలో "నాటో" అమెరికా ఆధిక్యతను పెంచుకొనే సాధనంగా ఫ్రాంసు అవగాహనగా వుంది. అందుకే ఫ్రాంసు పేరుకు "నాటో సైనిక సంస్థ" నుండి నిష్క్రమించి తన దేశంనుండి "నాటో" సైన్యాలు ఉపసంహరించబడాలని కోరింది. ఇది సామ్రాజ్యవాద కూటమిలోని అంతర్గత సంఘర్షణల తీవ్రతకు వొక దర్పణము.

**1. 5. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ**– ప్రపంచ సామ్రాజ్యవాదంల మధ్య వున్న వైరుధ్యమే యీ యుగ సంపూర్ణకాలంతో వుండే కేంద్ర వైరుధ్యం తీవ్రమై, లోతైనది. సామ్రాజ్యవాదం అణచివేయబడుతున్న జాతుల మధ్య గల వైరుధ్యం ప్రధాన వైరుధ్యంగా పైకి వచ్చిందని, అందుకు "ఆసియా, ఆఫ్రికా, దక్షిణఅమెరికాలలో విజృంభించుతున్న ప్రజాస్వాతంత్ర్య విప్లవోద్యమాలు, కార్మిక, కర్షక, నగర, గ్రామీణ బడుగువర్గాల పోరాటాల" వెల్లువ స్పష్టం చేస్తున్నది.

**1. 6. భారత ఆర్థిక, అర్థభూస్వామ్య వ్యవసాయ** సంబంధాల సంక్షోభంతోపాటు పెట్టుబడిదారి విధానంలోని వైరుధ్యాలు సంక్షోభ తీవ్రతకు దారితీశాయి. ప్రపంచ పెట్టుబడిదారి విధానం సంక్షోభంలో పడకముందే మనమార్కెట్టు మాంధ్యం, తరువాత సంక్షోభం ప్రారంభమైంది. విదేశ ఆర్థిక సహాయ ఆధారిత ఆర్థిక విధానం సంక్షోభభారాన్ని ప్రజలపై తోసివేయుట జరిగింది. విదేశమారక

ద్రవ్యలోటు, అనావృష్టితో దేశ ఆర్థిక, రాజకీయ మౌలిక పునాదులు కదలిపోయి సంక్షోభ పరిస్థితులు కన్పడసాగాయి. ప్రజల అమెరికా సామ్రాజ్యవాదుల మధ్య వైరుధ్యం తీవ్రమగుటతో సామాన్య ప్రజల జీవన ప్రమాణం పడిపోయి, మనుగడ దుర్భరమైంది.

**1. 7. ఆచరణలో నాల్గవ పంచవర్ష ప్రణాళిక** వదలివేయబడి, దేశ విదేశ ప్రవేటు గుత్తకంపెనీలకు సింహద్వారాలు తెరవబడి స్వాగతం యివ్వబడింది. ఆహార, వనరుల విదేశ మారక ద్రవ్య సంక్షోభంతో ప్రణాళికా సంక్షోభం ఏర్పడి, ప్రభుత్వ దేశ, విదేశాంగ విధానాలలో రాజకీయ సంక్షోభం ఏర్పడింది. సాధారణ రాజకీయ సంక్షోభాలకు దారితీసింది.

**1. 8. ప్రభుత్వం మితవాద, ప్రజావ్యతిరేక,** ప్రజాస్వామ్య వ్యతిరేక విధానాలు అవలంబించుటతో గుత్త పెట్టుబడిదారి వర్గాలు అభివృద్ధి చెందుట, రాజ్యాధికారం కేంద్రీకరించబడుట స్పష్టమగుతున్నది. అధికార మహలనోబిస్ కమిటి, మొనాపలీ కమిషన్ నివేదికలు దీనినే స్పష్టం చేస్తున్నవి.

**1. 9. కేంద్ర-రాష్ట్ర సంబంధాలు** తీవ్ర సంఘర్షణలకు లోనగుతూ, మన ఫెడరల్ రాజ్యాంగ వ్యవస్థ స్వరూపాన్ని ప్రశ్నించుతూ, దేశ అనైక్యతకు పరిస్థితులు దారితీస్తున్నవి. మరోవైపున అత్యంత ప్రమాదకరమైన ఏకఛత్రాధిపత్య, నిరంకుశ ప్రభుత్వం, రాజ్యాంగం ఏర్పరచే ప్రయత్నాలు జరిగాయి. అదేకాలంలో రాష్ట్రాలకు పూర్తి స్వపరినాధికారాలు గల సిసలైన ఫెడరలు రాజ్యాంగం, ప్రభుత్వం ఏర్పడాలనే వైఖరులు బలపడసాగాయి. వామపక్షాలు "దేశం రాజకీయ సంక్షోభపు ప్రాథమిక దశలో వుందనే" అవగాహన కొచ్చాయి.

**1.10. కాంగ్రెసు గుత్తాధికారం బ్రద్దలైంది.** ఎన్నికలలో ఎనిమిది రాష్ట్రాలలో అధికారాన్ని కోల్పోయింది. కేరళ, పశ్చిమ బెంగాల్‌లలో వామపక్ష, ప్రజాస్వామ్య శక్తులు అధికారంలోనికి వచ్చుటతో కాంగ్రెసు తిరోగమనం, పతనం వేగవంతమయ్యాయి. వామపక్ష శక్తులతోపాటు మత, మితవాద అభివృద్ధి నిరోధక శక్తులు కూడ బలాన్ని పొందుటకు కాంగ్రెసు వోటమి దారితీసింది. పరిగణలోనికి తీసుకొనవలసిన ప్రధానాంశము, దేశ రాజకీయాలలో "ఒక మలుపు" ప్రారంభమైంది.

**1.11. ఇండియా-పాకిస్తాన్‌ల** మధ్య ఇటీవలి కాలంలో ఏర్పడుతున్న తీవ్ర సంఘర్షణా పరిస్థితులను, రెండు దేశాలలోని పాలకవర్గాలు క్షీణించుతున్న తమ బలాలను, ప్రతిష్ఠలను పెంపొందించుకొనుట ఘర్షణలను తీవ్రతరం చేయగా రెండు దేశాలమధ్య ప్రపథమ యుద్ధంగా పరిణమించింది. భారత ప్రభుత్వం అత్యావసర పరిస్థితి ప్రకటించి, భారత రక్షణ చట్టాన్ని, తదితర ప్రత్యేక అధికారాలతో

భిన్న అభిప్రాయాలను, ప్రతిపక్షాలను ముఖ్యంగా వామపక్ష శక్తులను అతి క్రూర విధానాలతో అణచివేయు ప్రయత్నంలో క్రూర నిరంకుశత్వంవైపు పయనించింది. "టాస్కెంటు"లో భారత్-పాకిస్తాన్‌ల మధ్య రష్యా మధ్యవర్తిత్వంతో యుద్ధవిరమణ వొప్పందంతో శాంతి పరిస్థితులు ఏర్పడినవి.

**1.12. కాంగ్రెసులో వివిధ దృక్పథాలు,** వైఖరులు చేబట్టిన, భిన్న అభిప్రాయాలు గలవారు అనేకులు గ్రూపులు, గ్రూపులుగా పనిచేయసాగారు. ప్రధాన మంత్రి పదవికై కాంగ్రెసులో అంతర్గత పోరాటం తీవ్రతరమైంది. ఇందిరా గాంధి వ్యతిరేక గ్రూపులలో మురార్జీ దేశాయిని ప్రధాన మంత్రిని చేయుటలో ఏకాభిప్రాయంలేదు. ఈ పోరాటంలో దేశాయ్ వోటమికి కారణం, నెహ్రూ విధానాలను మొరార్జీదేశాయి వ్యతిరేకంచుతూ వుండుట, పార్లమెంటు సభ్యులలో అత్యధికులకు "నెహ్రూ సాంప్రదాయాన్ని" వదలివేయుటకు యిష్టంలేదు. అభివృద్ధి నిరోధకుల వొత్తిడిలకు ఇందిరాగాంధి తలవొగ్గుట మొరార్జీదేశాయిని ఉప ప్రధానిని చేయుటకు అంగీకరించుటతో, రాజీ వొప్పందం జరిగింది. దీనితో కాంగ్రెసులోని పురోగామి శక్తులు నిరుత్సాహంతో నిర్మాణం లేకుండా పోయాయి. అయితేయివేవీ కాంగ్రెసులో ఐక్యతను పెంపొందించకపోగా గ్రూపుల తత్వం మరింత పెరిగిపోవుటకే దారితీసింది.

## ii

**2.1. అంతర్జాతీయ సామ్రాజ్యవాదం,** గుత్త పెట్టుబడిదారి విధానం ఆర్థిక సంక్షోభంలో మునిగిపోతున్నవన్న అవగాహనను భారత కమ్యూనిస్టుఉద్యమంలోని మూడు స్రవంతుల శ్రేణులు మౌలిక అభిప్రాయ భేదాలు లేనందున స్థూలంగా ఆమోదించాయి.

కాంగ్రెసేతర రాష్ట్ర ప్రభుత్వాలను సి. పి. ఐ. నాయకత్వం, మార్పు చెందే కాలంలోని తాత్కాలిక ప్రభుత్వ దశగా విశ్లేషించి, నైజాన్ని నిర్ధారణ చేసి, కేంద్ర కాంగ్రెసు ప్రభుత్వాన్ని కూలద్రోసి, సంకీర్ణ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయుట తొలి చర్యగా చెప్పసాగింది. కేంద్రంలో సంకీర్ణ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలనే నినాదాన్ని యిచ్చింది. ఈ విధమైన బూర్జువా ఎత్తుగడలు, పార్లమెంటరీ తిరుగుబాటు అవగాహనలు తప్పని, అతిగా వేసిన అంచనాలని వర్తమాన చరిత్రే రుజువు చేసింది. సి.పి.ఐ.(యం.) కేరళ, పశ్చిమ బెంగాల్ రాష్ట్ర ప్రభుత్వాలను "ప్రజల సమస్యలు పరిష్కరించగల అధికారాలు గల రాష్ట్ర ప్రభుత్వాలుగా కాక పోరాడే ప్రజల చేతులలోని ఆయుధాలుగాను "వర్గ పరిభాషలో" జనతా ప్రజాస్వామ్య నిర్మాణానికి అవసరమైన కార్మికవర్గాన్ని, దాని మిత్ర ప్రజాస్వామ్యాన్ని మరింతగా సమీకరించే "పోరాట రూపంగాను" తదనంతరం సోషలిజానికి పురోగమిందుటలో వొక

దశగా వివరించింది. కొద్ది రోజులలోనే సి.పి.ఐ(యం)లోని "ఉగ్ర అతివాదులు" తాము పిసలైన విప్లకారులమని, పార్టి ఐక్యసంఘటనలతో "నియో రివజనిస్టు పార్లమెంటరీ పంధానును చేబట్టిందని ఎన్నికలను బహిష్కరించాలనే నినాద మిచ్చారు.

**2.2. నక్సల్బరీ, ఖరిబరి, పణిదేవ ప్రాంతాలు** డార్జిలింగు జిల్లాలోని పర్వత ప్రాంత సిలిగురి రెవెన్యూ సబ్ డివిజనులోని 44 టీ తోటలలో 25 వేలు వ్యవసాయ కూలీలు సంతాల్, ఓరెనులు, ముండా. రాజబన్సీ తెగలకు చెందిన ఆదివాసులు పనిచేస్తున్నారు. పూర్వం యీప్రాంతమంతా ఖాస్ మహల్ స్టేటు క్రింద వుండేది. అంచేత పక్కా రెవెన్యూ రికార్డులు లేవు. ఈభూములనుపాలు కౌలు దారులు సాగు చేస్తున్నారు. క్రమేణా యీ భూములన్నీ బలవంతంగా జోతేదారు భూస్వాముల దురాక్రమణ క్రిందకు వచ్చాయి. ఖాస్ సంస్థాన భూములు నామ మాత్రపు కౌలుకు టీ తోటల యజమానులకు కౌలుకు యివ్వబడ్డాయి. సాగు చేయ బడేది చాల తక్కువ, విస్తార వ్యవసాయ భూములు పడావుగానే వున్నాయి. కాంగ్రెసు ప్రభుత్వాలు ఎస్టేటుల స్వాధీన చట్టం 1953లో, భూ సంస్కరణల చట్టం 1955లో చేయబడినవి. రెవెన్యూ రికార్డులే లేని కారణంగా బినామీ, లాలూచి భూముల బదలీలు లెక్కలేనన్ని జరిగాయి. ప్రభుత్వ భూములెన్నింటినో జోతేదారులు స్వాధీనం చేసుకొనగలుగుటయేగాక, కౌలుదారులను విచ్చలవిడిగా దౌర్జన్యంగా తొలగించారు. ప్రభుత్వం 19 వేల ఎకరాలు మాత్రమే స్వాధీనం చేసుకొనగలిగింది. మూడవ వంతు కౌలు "తెభాగా" వుద్యమం, రెండవ తూరి 1959లో సాగింది.

సిలిగురి సబ్ డివిజన్‌లో 1964లో, గతంలో రైతాంగ వుద్యమంలో అరెస్టు కాబడిన కార్యకర్తలు, నాయకులు విడుదల చేయబడ్డారు. తిరిగి భూమి కొరకై రైతాంగ పోరాటాలు, కమ్యూనిస్టు విప్లవకారులు నక్సల్బరి. ఖరిబరి ప్రాంతాలలో దీర్ఘకాల ప్రజాయుద్ధ పంథాలో గ్రామీణ ప్రాంతాలను విముక్తి చేయుట, రైతాంగాన్ని సాయుధ పోరాటానికై సమీకరించుట, విముక్తి ప్రాంతాలను స్థాపించుటకు ఎత్తుగడలు వ్యూహ లక్ష్యంవైపు కేంద్రీకరించబడినవి.

**2.3.** రైతు ఉద్యమము నక్సల్బరీ పోరాటాన్ని ప్రారంభించినా, ప్రజా చొరవతో వెల్లువ కాలేదని, యాదృచ్ఛికత పాలు యెక్కువగా వుందని, విప్లవోద్యమాలకవసరమైన నిర్మాణం, క్రమశిక్షణ, ప్రణాళికాబద్ధత లేవని కానూ సన్యాల్ నివేదిక స్పష్టం చేసింది. వాటిని అధిగమించుటకు మార్గాలు సూచించాడు. నివేదిక రాజకీయ చైతన్యం లేకపోవుట నొక్కి చెప్పింది. డిసెంబరు 1967 "లిబరేషన్ పత్రిక" పోరాటాలన్నిటిని వ్యవసాయ విప్లవ మార్గంలో మలచుట ప్రథమ కర్తవ్యంగా విప్లవకారులు ప్రకటించినా అస్పష్టత చాలా వుంది. చారుమజుందార్ "విద్యార్థులు రైతాంగంలో లీనమై, విప్లవ రాజకీయ ప్రచారం చేయాలని, గ్రామా

లకు వెళ్ళలేనివారు రైతాంగ పోరాటాలకు మద్దతుగా ప్రజాస్వామ్య పోరాటాలు నిర్మించాలని లిబరేషన్ వివరించింది. కలకత్తాలో మార్చి 1969లో నక్సలైట్లు కన్వెన్షన్ జరిపారు. చారుమజుందార్ 21 ఆగస్టు 1969, దేశప్రతిలో విద్యార్థులకు, యువకులకు పిలుపు అనే వ్యాసంలో నూతన పంథా నిచ్చారు. సి.పి.ఐ.(ఎం.ఎల్ని అన్ని లీగలు అవకాశాలను వినియోగించుట నేర్చుకొని, విప్లవ కార్యాచరణ అభి వృద్ధి చేయాలని, ఎట్టి పరిస్థితులలోను బహిరంగ పార్టీగా పని చేయరాదని, స్పష్టం చేసారు.

**2.4. సంస్కరణ వాదానికి వ్యతిరేకంగా** 1962లో సి.పి.ఐ.లో)· అతివాద వర్గాలు గాడి తప్పిన ఫలితంగా సాగించిన సైద్ధాంతిక అంతర్గత పోరాటం విశాల భారతదేశ వివిధ రాష్ట్రాలలో అనేక గ్రూపులు ఏర్పడి నవి. సి.పి.ఐ.(ఎం) ఏర్పడిన తరువాత ఏదో రూపంలో మౌలిక అంశాలపై అంత ర్గత సైద్ధాంతిక పోరాటం నిరవధికంగా కొనసాగుతూనే వుంది. ఇది ఆంధ్రప్రదేశ్, పశ్చిమ బెంగాలుల ప్రత్యేక లక్షణంగా వుంది. "సి.పి.ఐ.(ఎం) నాయకత్వం వొక ప్రక్క భిన్నాభిప్రాయాలకు హామీల నిస్తూనే, మరో ప్రక్క విభేదిస్తున్న వర్గాలను అణచి వేయుటకు "దుస్సాహసిక వాదులని" ముద్రవేయుటకు వ్యతిరేకంగా, ప్రతిగా వారిని "నియో సంస్కరణవాదులని" కమ్యూనిస్టు విప్లవకారులు విమర్శ చేయ సాగారు. సి.పి.ఐ.(ఎం) నాయకత్వం "విప్లవ శ్రేణులకు నాయకత్వం వహిస్తున్న వారిపై క్రమశిక్షణ చర్యలు ముమ్మరం చేయుటతో, తాము విడిపోయి వేరే "కమ్యూ నిస్టు విప్లవకారుల సమన్వయ కమిటీలను ఏర్పాటు చేసామని సమర్థించుకొన్నారు, పరిమళదాస్‌గుప్తా చాలాకాలంనుండి ప్రత్యేకంగా తన గ్రూపును నిర్మించుకొని సంస్కరణవాద వ్యతిరేక పోరాటంలో మార్క్సిస్టు శ్రేణులలో కలవక విడిగానే కొనసాగాడు. రాష్ట్ర కాన్ఫరెన్సులో శశితల్, పరిమళ, లతీఫ్, కనాయ్ (రహ మాన్)లు మూడు మార్గాలలో ప్రచారం సాగించారు.

బెంగాల్‌లో సి.పి.ఐ.(ఎం)లో వివిధ దృక్పథాలు, అవగాహనలు గల వారు వివిధ గ్రూపులు ఏర్పడినవి. ఒకగ్రూపు విప్లవ సభలో పరిమళ, లతీఫ్, కనాయ్, సుభాస్‌బోస్, అజీజుల్, సాయిబాల్‌లు వున్నారు. శశితల్ గ్రూపులో సుధీర్ భట్టాచార్య, అమూల్యసేన్‌లు వున్నారు. వీరు "చింతన"పత్రికలో పార్టీ కాంగ్రెసుకు ముందు పార్టీ కార్యక్రమం సంస్కరణ వాదానికి ప్రతిబింబమని తీవ్రంగా విమర్శకు గురి చేసారు.

**2.5. సి.పి.ఐ. (ఎం) 1964లో ఏర్పడినా** అందుకు కారణమైన సిద్ధాంత సమస్యలు క్షుణ్ణంగా చర్చించనందున మరుగునపడి, స్పష్టత యేర్పడలేదు. ఆగస్టు 1967లో సి.పి.ఐ. (ఎం) రాజకీయ సిద్ధాంత పత్రం ముసాయిదా వెలు వడింది. కా. సి.పి., డి.వి., టి.యన్., కె.వీలు కేంద్ర కమిటి రాజకీయ విధానానికి

వ్యతిరేకంగా విద్యార్థి, యువజన శ్రేణులను వినియోగించి అనేక కరపత్రాలు, పోస్టర్లు ప్రకటించారు. రాష్ట్ర పాలకొల్లు ప్లీనంలో మెజారిటి వచ్చుటతో, కమ్యూనిస్టు విప్లవకారుల విధానాలు అవగాహనలకు విశేష ప్రచారాన్ని యిచ్చారు.

కమ్యూనిస్టు విప్లవకారులు శ్రీకాకుళం గిరిజన సమస్యలపై చొరవతో పోరాటాలు సాగించి, గిరిజన సంఘాన్ని విస్తృత ప్రాతిపదికపై నిర్మించి, రాజకీయ చైతన్యాన్ని కలిగించారు వ్యవసాయ భూముల సమస్య, రాజ్యాంగం, స్వపరిపాలనా ప్రాంతాలపై రాజకీయ చైతన్యాన్ని మరింత గిరిజనులలో కలుగజేశారు. ఈ సమస్యలు నూతన ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడినపుడే పరిష్కరింపబడగలవనే ప్రచారం చేసారు. గిరిజన కమిటీలు, పాఠశాలలు ఏర్పాటు చేసారు. తెలంగాణా పోరాట అనుభవాలను వివరంగా ప్రచారం చేసారు.

శ్రీకాకుళం గిరిజన సాయుధ రైతాంగ పోరాటం నేరుగా అఖిల భారత "ఎ.ఐ.సి.సి.సి.ఆర్" మార్గదర్శికత్వంలో రాష్ట్ర కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ కమిటీని త్రోసిబుచ్చి పోరాటాన్ని సాగించుటతో వివాదాస్పదం, భిన్న వైఖరుల సైద్ధాంతిక చర్చా వేదికగా అయింది. ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారుల నాయకత్వానికి తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం అనుభవాలు అనేకం ఉన్నవి.

**2. 6. శ్రీకాకుళం సాయుధ రైతాంగ పోరాటంపై** "ఎ.ఐ.సి.సి.సి.ఆర్., ఎ.పి.సి.సి.సి.ఆర్"ల మధ్య రేగిన అభిప్రాయ భేదాలను నాగిరెడ్డి యిలా వివరించారు, సక్షిప్తంగా అవి ప్రథమ సమస్య ప్రజా యుద్ధంలో అనుసరించవలసిన ఎత్తుగడలు, పోలీసులు, భూస్వాముల గూండాల దౌర్జన్య, హింసా, దమనకాండలకు వ్యతిరేకంగా ప్రజా ప్రతిఘటనగా ప్రారంభమై, ప్రతిఘటన దళాల నిర్మాణం జరుగుతుంది. ప్రజా ఉద్యమాలులేని ప్రాంతాలలో దళాల నిర్మాణాన్ని రాష్ట్రనాయకత్వం వ్యతిరేకించింది. రెండవ అంశం, ప్రజాయుద్ధం ఎల్లప్పుడూ ప్రతిఘటన రూపంలోనే ప్రారంభమగుతుంది, దాడి రూపంలో కాదు. కార్మికుల వేతన పెంపు లేక రైతాంగ భూసమస్య దేనిపైనా కావచ్చు, పాలక వర్గాలు, ప్రభుత్వం హింసా, దౌర్జన్యాలతో పోలీసు, గూండాలతో అణచివేయు ప్రయత్నాలకు వ్యతిరేకంగా ప్రతిఘటనా రూపంలో ప్రారంభమై, సాయుధ పోరాటంగా అభివృద్ధి చెందుతుంది.

పోరాట రూపాల విషయంగాగల అభిప్రాయభేదాలు ఇలా వున్నవి. సాయుధ పోరాటం మౌలిక పోరాటం. అత్యంత ప్రాముఖ్యతగలది. ఉన్నత పోరాట రూపం అయినా, అది వొక్కటే పోరాటరూపం కాదు. ప్రాంత పరిస్థితులనుబట్టి పోరాట రూపాలను చేబట్టవలసి వుంటుంది. ప్రజలను కలవరపరచే సమస్యలపై జరిపే పోరాటాల వివిధ దశలలో సంతకాల మహజరులు ప్రదర్శనలనుండి, ప్రజల చైతన్యం, శతృవుల అణచివేతల తీవ్రత, పోరాటశక్తుల నిర్మాణశక్తి, బలాన్నిబట్టి

ప్రజలపాత్రనుబట్టి పోరాట రూపాలను ప్రజాచొరవే నిర్ణయిస్తుంది. ప్రజలు నేరుగా పాల్గొనే పోరాటరూపమై వుంటుందని నాగిరెడ్డి వివరించారు.

**2. 7. ఆంధ్రప్రదేశ్ సి.పి.ఐ. (యం) పాలకొల్లు ప్లీనం** సమావేశం 13 జనవరి 1968న జరిగింది. సి.పి.ఐ. (ఎం) కేంద్ర సమితి మధురైలో రూపొందించిన చిత్తు సిద్ధాంత పత్రాన్ని 158 మంది ప్రతినిధులు వ్యతిరేకించగా వీగిపోయింది. అనుకూలంగా 52 మంది మాత్రమే బలపరచారు. 8 మంది తటస్థంగా వున్నారు. ప్లీనం జాతీయ, అంతర్జాతీయ రాజకీయ పరిస్థితులపై నివేదికలు, పత్రాలు, తీర్మానాలను ఆమోదించింది. అంతేగాక, విప్లవ పంథాను తీర్మానంలో ఆమోదించింది.

సి.పి.ఐ.(ఎం) కేంద్ర కమిటి, ఏప్రిల్ 1969లో సమావేశమై కమ్యూనిస్టు విప్లవకారులు, నక్సలైట్ల తాత్విక, సిద్ధాంత రాజకీయ వైఖరులను అతివాద పెడ మార్గంగా పరిశీలించి వివరించింది. పార్టీ పొలిట్‌బ్యూరో సైద్ధాంతిక చర్చను సమీక్షించి, నిర్ధారణలను ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులకు లేఖపూర్వకంగా వివరించింది. "ఆంధ్రలో ప్రత్యేకంగా అతివాద చీలికవాదులు" అన్న మరో పత్రాన్ని ఆమోదించి విడుదల చేసింది. అతివాదం పుట్టుక, నైజము, లక్షణాలను వివరించింది. అతివాద అవకాశవాదం వలన ప్రమాదం తొలగిపోలేదని, పార్టీ విప్లవోద్యమం దానిపై పోరాటం సాగించాలని స్పష్టం చేస్తూ, పత్రాన్ని విడుదల చేసింది.

**2. 8. సి.పి.ఐ. (యం) లోని కమ్యూనిస్టు విప్లవకారులు,** తిరుగుబాటు పంథా చేబట్టినవారు, పశ్చిమబెంగాలులో నక్సల్బరీ సాయుధ రైతాంగ పోరాటాన్ని, తిరుగుబాటు లేవనెత్తినవారు నవంబరు 1967లో "కమ్యూనిస్టు విప్లవకారుల అఖిలభారత సమన్వయ కమిటిని ఏర్పరచారు, ఆమోదించిన రాజకీయ విధానం ప్రకటించారు. భారత కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో నక్సల్బరీ సాయుధ రైతాంగ తిరుగుబాటు, వొకమలుపుగా చిత్రించారు. మావో ఆలోచనా విధానపు "నమూనా" పోరాటంగా వివరించారు.

సమన్వయ కమిటి ప్రకటన నాలుగు కర్తవ్యాలను నిర్దేశించింది. అవి: 1) కార్మికవర్గ నాయకత్వంలో మిలిటెంటు నక్సల్బరీ విప్లవ పోరాటాలను అభివృద్ధి చేయుట. 2) అర్థికవాదాన్ని త్రోసిబుచ్చి వ్యవసాయ విప్లవ పోరాటాలకు మద్దతుగా కార్మిక, పీడిత వర్గాల పోరాటాలను సమన్వయ పరచి నడుపుట. 3) సంస్కరణవాదానికి, నయాసంస్కరణవాదానికి వ్యతిరేక పోరాటం, మావోయిజం ప్రచారం, దాని ప్రాతిపదికపై విప్లవ శక్తుల ఐక్యత నెలకొల్పుట. 4) మావో ఆలోచనా విధాన వెలుగులో దేశ రాజకీయ పరిస్థితి విశ్లేషణ, విప్లవ పంథాను, ఎత్తుగడలను రూపొందించుట తక్షణ కర్తవ్యంగా పేర్కొన్నది.

**2. 9. ఆంధ్రప్రదేశ్‌లోని కమ్యూనిస్టు విప్లవకారులు** జూన్ 1968లో సి.పి ఐ. (యం) నుండి అధికారికంగా చీలిపోయి, రాష్ట్ర స్థాయిలో ప్రతినిధుల సమావేశం జరిపి, కా. టి. నాగిరెడ్డిని కన్వీనరుగా ఎ.పి.సి.సి.సి.ఆర్. ను ఏర్పాటు చేసారు. కమ్యూనిస్టు విప్లవకారులు నయా రివిజనిస్టు సి.పి.ఐ.(యం) నుండి సాధ్యమైనంత హెచ్చుమందిని చీల్చి, బయటకువచ్చే ఎత్తుగడలు అవలంబించారు. అఖిల భారత సమన్వయ కమిటి దీనిని "అవకాశవాదం"గా నిర్ధారించింది. పైగా, సి పి.ఐ (ఎం) జాతీయ, అంతర్జాతీయ అవగాహనలను ఆంధ్ర నాయకుల విమర్శనాపత్రాన్ని ప్రకటించలేదు.

ఈ నేపథ్యంలో శ్రీకాకుళం సి.పి.ఐ.(ఎం) జిల్లా కమిటి 1959 నుండి జరిగే గిరిజన పోరాటాలపై "ఎ.పి.సి.సి.సి.ఆర్." రాష్ట్ర నాయకత్వం "ఎ.ఐ.సి.సి సి. ఆర్."ల ఆచరణలు సైద్ధాంతిక, రాజకీయ అవగాహనల బేదాభిప్రాయాల జననానికి, పెరిగిపోవుటకు కారణాలు అయ్యాయి. సమిష్టి అవగాహనకై ఆగస్టు 1969 లో "ఎ.పి.సి.సి.సి.ఆర్." నాయకత్వం "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." నాయకత్వంతో చర్చలు జరిపారు. అప్పటికే శ్రీకాకుళం కమ్యూనిస్టు విప్లవకారులు "నక్సల్బరీ సంఘీభావ కమిటి"గా ఏర్పడి, రాష్ట్ర నాయకత్వంపై నిందాప్రచారం సాగించుట. ఆ కమిటీకి "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." ఆశీస్సులు, అండదండలు లభించుటతో సంప్రదింపులు సత్ఫలితాలనివ్వలేదు. శ్రీకాకుళంజిల్లా నాయకత్వం అఖిల భారత నాయకత్వంతో నేరుగా సంబంధాలు పెట్టుకొని, నేరుగా దాని అనుబంధ నిర్మాణంగా పనిచేయసాగాడు. ఆ విధంగా శ్రీకాకుళం, ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు విప్లవకారులకు దూరంగానే వుండిపోయింది.

**2. 10. కమ్యూనిస్టు విప్లవకారులలో వివిధ శ్రేణుల మధ్య** 1968-71ల మధ్య సైద్ధాంతిక సమస్యంపై అంతర్గత పోరాటం జరుగుతూనే వుంది. కమ్యూనిస్టు విప్లవకారులందరు మార్క్సిజం-లెనినిజం- మావో ఆలోచనా విధానాన్ని మార్గదర్శక సిద్ధాంతంగా నెంచుతున్న వారందరూ భారత విప్లవ ప్రస్తుత దశను జనతా ప్రజాస్వామ్య విప్లవదశగాను, ప్రజా యుద్ధ పంధాగాను అంగీకరించుతున్నా ఎత్తుగడలు, వర్తమాన రాజకీయ విధానాలు, ఆచరణలలో బిన్నాభిప్రాయాలను కలిగియున్నారు. తెలంగాణా సాయుధ రైతాంగ విప్లవానుభవాలతో పాటు, శ్రీకాకుళ అనుభవాలను కలిగిన కా. నాగిరెడ్డి, దేవులపల్లిల అనుభవాలను, నిర్దిష్ట ఎత్తుగడలను రూపొందించుట "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." అఖిల భారత నాయకత్వం వినియోగించుటకు నిరాకరించి, చారిత్రిక పొరపాటు చేయుటయేగాక, చీలికలకు అవకాశాలను పెంపొందించింది. మొదటినుండీ "ఎ.ఐ.సి.సి.సి.ఆర్" నాయకత్వం అతివాద అవకాశవాదాన్ని, సెక్టేరియన్ పొంచెత్తు పోకడలను, చీలికలకు దోహదపడేనిరంకుశత్వాన్ని ప్రదర్శించింది. విభేదించినవారిని రివిజనిస్టులుగా చిత్రిం

చసాగింది. "ఎపి.సి.సి.సి.ఆర్." కమ్యూనిస్టు విప్లవకారులు, సి.పి.ఐ.(ఎం.) చీలి పోయిన నాలుగు మాసాలకు నవంబరు 1968 "ఎ.ఐ.సి.సి.సి.ఆర్."లో విలీన మయ్యారు. "ఎ.ఐ.సి.సి.సి.ఆర్." ఐక్యత పెంపొందించుటలో విఫలమై విలీనమైన మూడు మాసాలలోనే ఏకపక్షంగా "ఎ.పి.సి.సి.సి.ఆర్." ను బహిష్కరణకు గురి చేసింది.

సి.పి.ఐ.(యం) నుండి చీలిపోయిన విప్లవకారులలో, ప్రజాయుద్ధ పంథాను అంగీకరించక, 1951 ఎత్తుగడల పంథానే గ్రుడ్డిగా అనుసరించేవారు, ప్రజాయుద్ధ పంథా ఆమోదించుతూ, నాయకత్వంపై విశ్వాసంలేనివారు వున్నారు. ఒక వర్గం విప్లవ ప్రజాపంథాపై దృఢవిశ్వాసం కలిగి, అతివాద అవకాశవాదంపై సూత్రబద్ధ రాజీలేని పోరాటం సాగించాలనేవారు. మరోవర్గం విప్లవ ప్రజాపంథాపై స్పష్టమైన వైఖరి లేనందున అతివాద అవకాశవాదంపైన పోరాటంతో వూగిసలాట ప్రదర్శించే వారు. మూడోవర్గం అతివాద అవకాశవాదంపై మొగ్గుతూ, ఆ ప్రమాదాన్ని తక్కు వగనెంచుతూ, దానిపై పోరాటాన్ని నీరుగార్చేవారు, వివిధ వైఖరులు అవలంబించే వారు వున్నారు. అతివాద అవకాశవాదంపై అగ్రగామిగా పోరాటాన్ని సాగించిన "ఎ.పి.సి.సి.సి.ఆర్"లో కూడ ఛాయామాత్రంగా యీ ధోరణులున్నాయి. వారు "మనం మనకై సమస్యలు తెచ్చుకొనవద్దు" అనే అవకాశవాదాన్ని అవలంబించారు. అతివాద అవకాశవాదం చేసిన విషప్రచారంతో విప్లవ కమ్యూనిస్టులలో సైద్ధాంతిక గందరగోళం పెరిగింది.



**3. 1. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో** గుత్త పెట్టుబడి దారి విధానాలకు ప్రతిఘటన తీవ్రరూపం ధరించుటతో సాంప్రదాయ శ్రామిక వర్గా లతోపాటు, మధ్యతరగతి ఉద్యోగులు, విద్యార్థులు, సాంకేతిక పారిశ్రామిక వర్గాలు మధ్యతరగతి పెటీబూర్జువా విప్లవతత్వం ప్రబోధితులైన వర్గాల నాయకత్వంలో మే 1968లో ఫ్రాంసులో విశ్వవిద్యాలయాలు, పారిశ్రామిక కేంద్రాలను, ఫ్యాక్టరీ లను ఆక్రమించుటలో "నూతన అతివాద ప్రభావం, నాయకత్వం" స్పష్టంగా వెల్లి డైంది. పాలకవర్గాలు సైనిక చర్యలు చేబట్టుతామని బెదరించుటతో, కార్మికవర్గమూ ప్రదర్శన కుపక్రమించుటతో అంతర్యుద్ధ పరిస్థితులు యేర్పడినవి. సాంప్రదాయ వామపక్షవర్గాలు, ప్రతిపక్ష పార్టీలు, ప్రభుత్వం వొకవిధమైన రాజీమార్గాన్ని అవలం బించి అంతర్యుద్ధం, అదేక్రమంలో ప్రపంచయుద్ధం నివారించబడింది. ఈ నూతన అతివాద వర్గాలు సాంప్రదాయ వామపక్షాలు, కమ్యూనిస్టులు మొత్తంగా నాయ కత్వాన్ని వహించుటను, మధ్యతరగతి, పెటీబూర్జువా విప్లవతత్వంతో, కమ్యూనిస్టు లతో విప్లవతత్వం తగినంతగా లేదని వ్యతిరేకించాయి. అయితే వొక్క విషయం

గుత్తపెట్టుబడిదారి వ్యతిరేక పోరాటంలోనికి కార్మికవర్గంతోపాటు, నూతన సాంకేతిక శ్రామికవర్గాలు, మధ్యతరగతి వర్గాలు చేరుటకు సంసిద్ధంగా వున్నవన్నది స్పష్టమైంది. అయితే, వామపక్ష శక్తులు ముఖ్యంగా కమ్యూనిస్టులు వారిలో తమ నాయకత్వం విశ్వాసాన్ని పెంపొందించుటలో విఫలులయ్యారు. కమ్యూనిస్టులు నూతన మధ్యతరగతి వర్గాల గుత్తపెట్టుబడిదారి వ్యతిరేక పోరాటశక్తిని, బలాన్ని గుర్తించి, ఎత్తుగడలను తగువిధంగా సవరించుకొని పురోగమించాలి. ఈ నూతన అతివాదం, కమ్యూనిస్టు పార్టీలన్నీ "గుత్తపెట్టుబడిదారి ప్రభుత్వంలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో భాగస్వాములయ్యాయని, తాము సవరించబడిన మార్క్సిస్టు-లెనినిస్టు విప్లవ సిద్ధాంతాన్ని రూపొందించే ప్రయత్నం చేస్తున్నామంటూ, చైతన్యరహిత శక్తులతో యాదృచ్ఛిక విప్లవ సంఘటనలతో, నూతన సంస్కృతిని, నూతన మానవుని సృష్టిస్తున్నామంటూ, నేడున్న అన్ని బూర్జువా ప్రజాస్వామ్య సంస్థలను వినియోగించుట త్రోసిబుచ్చుతున్నారు.

**3. 2. నూతన అతివాదవర్గాలు** ప్రపంచ విప్లవోద్యమానికి, కార్మికేతర ప్రజాసామాన్యాన్ని అనుసంధించే సైద్ధాంతిక ప్రయత్నం నూతన అతివాదం చేస్తున్నదని, రాజకీయంగా, సైద్ధాంతికంగా "తృతీయ పంథా"ను వామపక్ష రాజకీయాలలోనికి తెస్తున్నామంటూ మార్క్సిజం-లెనినిజానికి దూరంగా వెళ్ళింది. అయినా, పెట్టుబడిదారి విధాన వ్యతిరేక నూతన అతివాద నిరసనోద్యమం సాంప్రదాయ పరిమితులు దాటి, విప్లవోద్యమంగా విజృంభించుటకుగల శాస్త్రీయ కారణాలను చూద్దాము.

ప్రథమంగా, నూతన అతివాద ఉద్యమ నాయకత్వంలో, కార్యకర్తలలో, అనుచరులుగా, బలపరచేవారిలో అత్యధికులు నగర పెటీబూర్జువావర్గాలు. ఈ వర్గం కార్మికవర్గంగా రూపొందు క్రమంలో, పరివర్తన దశలో వుంది. యువత, విద్యార్థులు బూర్జువావర్గపు పూర్వదశలో వుండేవారు, కాని నేడు కార్మికవర్గపు ప్రాథమిక పరివర్తనదశలో వున్నారు. అందుచేత వారి నిరసనోద్యమాలు ద్వంద్వనైజాన్ని కలిగి వున్నవి. నగర పెటీబూర్జువావర్గ మధ్యతరగతిని నాశనం చేస్తున్న గుత్తపెట్టుబడిదారి విధాన వ్యతిరేకత వొకవైపున, వారి ఆశలకు వ్యతిరేకంగా వారు కార్మికవర్గంగా రూపొందు క్రమ పరిణామానికి వ్యతిరేకంగా మరోవైపున వారి నిరసన వ్యక్తమగుతున్నది. గత శతాబ్దంలోనే మార్క్స్-ఎంజెల్స్‌లు పెటీబూర్జువా వర్గపు పతనమార్గంలోనే అరాచకవాద వర్గమౌలిక పునాదులను వివరించారు. అదే, నూతన అతివాదవర్గ సైద్ధాంతిక పునాదులను అర్థం చేసుకొనుటకు తోడ్పడుతుంది. నూతన అతివాదుల వర్గపొందిక అది పూర్తి అతివాదవర్గంగా, విప్లవశక్తిగా కాక అరాచక శక్తిగా రూపొందగల అవకాశాలను తెల్పుతుంది. అందుకే వారు విప్లవకారులుగాక అరాచకవాదులగుటకే అవకాశాలు ఎక్కువగానున్నవి. కార్మికవర్గ నాయకత్వంలోనే

కొంతవరకు విప్లవకారులగుదురు. ద్వితీయంగా, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో 1960 దశకంలో ప్రారంభమై నిరవధికంగా సాగిన సైద్ధాంతిక పోరాటంపై అధ్యయనం కేంద్రీకరింపబడనందున, నూతన అతివాద పరిశీలన, వివేచన, విశ్లేషణ, అధ్యయనాలు నిరవధికంగా వాయిదాపై వాయిదాలు వేయుట జరిగి, అసంపూర్తిగానే వుండిపోయాయి. మూడవ ముఖ్య అంశం, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం బహుళంగా వ్యాప్తిచెంది, బలోపేతమైనదగుటతో కార్మికవర్గేతర శక్తులు, కార్మికవర్గంగా రూపొందుతున్న నగర, గ్రామీణ, పేద, బడుగు, మధ్యతరగతి శ్రేణులెన్నో ప్రవేశించాయి. ప్రపంచ పెట్టుబడిదారి, సామ్రాజ్యవాద శక్తుల నెదుర్కొని, ప్రతిఘటించు కార్యాచరణలో అనేక నిర్మాణ సరళీకృత చర్యలు, అన్యవర్గ ధోరణులు పార్టీలలో వ్యాపించాయి. కార్మికవర్గ నాయకత్వం పలుచబడిపోయింది వామపక్ష శక్తుల ఐక్యత, పోరాటం క్లిష్టతరమైంది.

**3. 3. నక్సల్బరీ పూర్వ ఉగ్రవాద అతివాద ధోరణులు భారత** కమ్యూనిస్టు ఉద్యమంలో వున్నవి. సి.పి.ఐ. (యం) ఏర్పడిన తరువాత 1965-67 లలో చారుమజుందార్ పార్టీలో జరుగుతున్న సైద్ధాంతిక చర్చల భాగంగా వివిధ అంశాలపై ఎనిమిది సిద్ధాంత పత్రాలను అనధికారంగా కమ్యూనిస్టు శ్రేణులకు విడుదల చేసారు. వీటిలో చివరిది మాత్రమే నక్సల్బరీ ఘటనలు తరువాత వ్రాయబడినది.

వివాదాస్పదం, మార్క్సిజం-లెనినిజం అంగీకరించని, వర్గశతృవులను వ్యక్తిగతంగా నిర్మూలించుట, మొదట శ్రీకాకుళంలో జరిగినట్లు తెలుస్తున్నది. విప్లవదాసు గుప్తా, వర్గశతృ నిర్మూలనాభిప్రాయాలను చారుమజుందార్ కలిగియున్నారనుటకు 1965లోని రచన 5వ డాక్యుమెంటు స్పష్టం చేస్తుందన్నారు. ఆగస్టు 1966లో చారుమజుందార్ 6వ, డాక్యుమెంటు నిర్మూలనం చేయవలసిన వర్గశతృవులను వివరించి, అధికారం స్వాధీనం చేసుకొను వ్యూహంలో భాగంగా సూచించారు. చివర డాక్యుమెంటులో నక్సల్బరీ వ్యవసాయ విప్లవ జ్వాలలు భారతదేశమంతటా కారుచిచ్చులా వ్యాపించే పరిస్థితులు లేవు. గతంలో వ్యవసాయ విప్లవ పోరాటాలను అధికారాన్ని స్వాధీనం చేసుకొను పోరాటాలు సాగించినందుననే విఫలమయ్యాయి.

నక్సల్బరీ సాయుధ రైతాంగ విప్లవ పోరాటాలకు ముందే సి.పి.ఐ. (యం) నాయకత్వంపై విశ్వాసాన్ని చారుమజుందార్ కోల్పోయారు. క్రమశిక్షణా చర్యలను సి.పి.(యం) నాయకత్వం చేబట్టకుముందే యీ వైఖరులు కొనసాగాయి. చారుమజుందార్ 6 డాక్యుమెంట్లలో సి.పి.ఐ.(యం) విధానాలను అన్నింటిని సంస్కరణవాదంగా త్రోసిబుచ్చి ముగించారు. ప్రజాసంఘాలలో "ఆర్థిక తత్వపూరిత కార్యక్రమాలు చేబట్టినందున, రాజకీయ కార్యక్రమాలు చర్యలకు ప్రాముఖ్యతనివ్వకుండుటతో, పార్టీలో ప్రజాసంఘాల ప్రాధాన్యత, ఆధిక్యతనిచ్చుటతో పార్టీ నాయ

కత్వం బలహీనపడి, సంస్కరణవాదంవైపు పయనించిందని మజుందార్ తీవ్రంగా విమర్శించారు.

**3. 4. నక్సల్బరీ సాయుధ రైతాంగ గెరిల్లా పోరాట ఉద్యమా**నికి చైనా కమ్యూనిస్టుపార్టీ యిచ్చిన రాజకీయ, నిర్మాణ, సైద్ధాంతిక మద్దతుతో ఉద్యమం ప్రారంభంలో కొంత బలపడినా, చివరకు ఉద్యమం బలహీనపడి, అనేక చీలికలైంది. వాస్తవానికి ఉద్యమంలోని ఉగ్రవాదాన్ని, వివిధ అంశాలను నాగిరెడ్డి, దేవులపల్లి, అసిత్ సేన్, పరిమళదాస్‌గుప్తా, సుషితల్‌రాయ్ చౌదరీలు ప్రారంభం నుండి మజుందార్ విధానాలను తీవ్రంగా విమర్శిస్తూనే వున్నారు. తరువాత చైనా తమ మద్దతునుపసహరించుకొన్నది. అయినా యింకా కొన్ని నక్సలైట్ల వర్గాలు, నేటి చైనా నాయకత్వ వర్గాలకు దూరంగా వున్నవి.

**3. 5. సి.పి.ఐ. నాయకత్వ శ్రేణుల కొన్ని 1948-50** లలో చైనా విధానాలను భారతదేశ పరిస్థితులకు అన్వయించకుండా, దిగుమతిచేయు ప్రయత్నం చేసిన విధంగానే, 1970 దశకంలో నక్సలైట్ల వర్గాలు తిరిగి అదే పొరపాటును చేసాయి. సి.పి.ఐ. ఐక్యపార్టీగా వున్నపుడే 1948-50 నాటి తెలంగాణా సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాల అనుభవాలను పార్టీ శ్రేణులకు అందించి, రాజకీయ, పోరాట చైతన్యాన్ని కలిగించియుండినచో, యీ చారిత్రిక పొరపాటులు తిరిగి పునరావృతమయ్యేవికావు. నక్సలైట్ల ఉద్యమమే బహుశా వుద్భవించి వుండేదికాదు. ఐక్య కమ్యూనిస్టు ఉద్యమం యీవైఫల్యానికి "చరిత్ర కసి" తీర్చుకొన్నది. విప్లవోద్యమాల మౌలిక సిద్ధాంత అభిప్రాయభేదాలు చర్చల కొనసాగింపును వాయిదాపై వాయిదాలు వేసుకుంటూ నాయకత్వాలు పోతూవుంటూ సమస్యలు పేరుకుపోయి, విమర్శన ఆత్మవిమర్శన పేరుకు నామమాత్రంగాచేసి, విమర్శ ప్రతివిమర్శకు దారితీస్తుందని, వినాయకుని బొడ్డులో వేలుపెట్టినవాని చందంగా, ఒకరిపై ఒకరు వేలు చూపని "బూర్జువా నాగరికతను" అలవరచుకొంటూపోతే కమ్యూనిస్టు పార్టీలుగా మనజాలక, సోషల్ డెమోక్రటిక్ పార్టీలుగా రూపొందినా ఆశ్చర్యంలేదు.

నక్సల్బరీ కమ్యూనిస్టు విప్లవకారులు కార్మికవర్గ పాత్రను అలక్ష్యం చేయుట, మావోయిజాన్ని అనుసరించుటను స్పష్టంచేయుట, వారిని "మార్క్యూస్ సిద్ధాంతాలకు" చేరువ చేస్తుంది. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి దేశాలలో కార్మికవర్గం తన నైజాన్ని కోల్పోయి సంకీర్ణవర్గంగా అయిందనే మార్క్యూస్ సిద్ధాంతం, అంచేత దానిని విప్లవశక్తిగా నెంచరాదన్నాడు. మార్క్యూస్ "నూతన హింసావాదులు" సమాజం త్రోసివేసిన దొంగలు, రౌడీలు, వ్యభిచారులు, అసంఘటిత నగర దరిద్ర బడుగువర్గాలపై, విద్యార్థులపై, నిరుద్యోగులపై సమాజంలో సంలీనంకాని వర్గాలపై ఆధారపడ్డారు. మార్క్యూస్ యీ సిద్ధాంతాన్ని ప్రవచించే రోజులలోనే మే 1968లో కోటిమంది ఫ్రెంచి కార్మికులు పారిస్‌లో సార్వత్రిక సమ్మె, ఫ్యాక్టరీల ఆక్రమణ,

విశ్వవిద్యాలయాలను ఆక్రమించిన విద్యార్థులతో కలసి బ్రహ్మాండమైన ప్రదర్శన చేసారు. పారిస్ కమ్యూనును మరపించే, అంతర్యుద్ధ వాతావరణమేర్పడింది. ఈ కార్మిక పోరాటాలలో నిర్మాణంలోని ట్రేడ్‌యూనియనులు, ముఖ్యంగా కమ్యూనిస్టులు, సోషలిస్టుల ఆధ్వర్యంలోనివేవీ పాల్గొనలేదు. అయినా ఆ ట్రేడుయూనియనులను ధిక్కరించి పారిస్ కార్మికవర్గమంతా పాల్గొన్నది. ఈ సంఘటనలపై, మార్క్యూస్ మొత్తంమీద మార్క్సు అభిప్రాయాలు సరియైనవే, కాని కొన్నింటిని పునరాలోచించాలనే అభిప్రాయం వెలిబుచ్చారు

**3. 6. విద్యార్థులలో కోహన్ బెండిట్**, తదితర "వామపక్ష అతివాదులున్నారు". విప్లవంలో కార్మికవర్గ ప్రధాన పాత్రను గేలిచేసారు. "నాయకత్వ పాత్రను కోల్పోయిందన్నారు". "తుప్పుపట్టిన కమ్యూనిజానికి తాము వ్యతిరేకులమని" పురాతన బకునిన్ "వామపక్ష ప్రత్యామ్నాయాన్ని" ప్రతిపాదించారు. శతాబ్ద పూర్వమే మార్క్సు "కలగూరగంప" "శాంతిసమాజం" "యువవీరులు" కార్యాచరణకు నాయకత్వం వహించుతారనే అవగాహనను మార్క్సు ఖండించారు. "విప్లవం తన మార్గాన్ని తానే నిర్ధారించుకొంటుందన్నారు. ఫ్రెంచి గుత్తపెట్టుబడిదారి వర్గాలు, ప్రచార సాధనాలు "వామపక్ష అతివాదులకు", "యువవీరులకు" పూర్తిగా ప్రచారం చేయుట ఆశ్చర్యం. గుత్తపెట్టుబడిదారివర్గాలు కార్మికులను, కమ్యూనిస్టులను రెచ్చగొట్టి, సాహసచర్యలు చేబట్టునట్లు చేసి, డీగాల్ నాయకత్వంలో ఇండోనేషియాలో "కమ్యూనిస్టుల ఘోర హత్యాకాండ"ను పారిస్‌లో జరుప తలపెట్టారు. మూడు సంవత్సరాల తరువాత కోహన్‌బెన్‌డిట్‌గాని, వాని సిద్ధాంతాలుగాని, వామపక్ష అతివాదులుకాని కానరాలేదు. కాని కమ్యూనిస్టుపార్టి బలపడింది.

**3. 7. ఇంచుమించుగా ఆదేకాలంలో రేజిస్ డిబ్రే**, క్యూబన్ విప్లవ సిద్ధాంత వ్యాఖ్యాతగా "విప్లవంలో విప్లవం" అనే రచనలో "నూతన వామపక్ష అతివాద సిద్ధాంతాన్ని" ప్రబోధించాడు. విప్లవ కార్యాచరణ, సాయుధ పోరాటంతో ప్రారంభమగుతుందనే సిద్ధాంతం చెప్పాడు. అంతేగాక, "సాయుధ పోరాటం అనే చిన్న మోటారు" బ్రహ్మాండమైన ప్రజోద్యమాలకు "పెద్ద మోటారుశక్తి"గా పనిచేస్తుందని ప్రకటించాడు. ఇంకా అధికారంతోపాటు "బలమైన కమ్యూనిస్టుపార్టీకూడ తుపాకి గొట్టంద్వారా పుట్టుకొస్తుందని" అన్నాడు. అంతేగాక, "విప్లవంలో విప్లవం" చేపట్టవలసిన సైద్ధాంతిక ప్రథమ చర్య నేడున్న కమ్యూనిస్టు పార్టీలను చీలికలు, తగాదాలతో నాశనమగునట్లు చేయాలని సిద్ధాంతీకరించాడు.

**3. 8. సాధారణ రెండు పెద్దఘోరతప్పులు** గుర్తించుట జరిగింది. ఒకటి, కార్మికవర్గ పోరాట కార్యాచరణను ఆర్థిక పోరాటాలకే పరిమితం చేయుట ఆర్థికతత్వమగుతుంది. కాని, ఆర్థిక పోరాటాలు సాగించుట ఆర్థికతత్వం కాదు. నక్సలైట్లు యీ రెంటింటిని గందరగోళం చేస్తున్నారు. రెండవ పెద్ద సైద్ధాంతిక

అవగాహన, కార్మికవర్గం దైనందిన పోరాటాల ద్వారాగాక, వాటి వెలుపలనుండే సామాజిక చైతన్యాన్ని కలిగించుటకు చేయు ప్రయత్నాలు పెడమార్గాన్ని పట్టించునవి. లెనిన్ మేధావివర్గం సామాజికపాత్ర నిర్వహించాలన్నారు. దీని అర్థం కార్మిక వర్గానికి నాయకత్వం వహించమనికాదు. శాస్త్రీయ సోషలిస్టు, రాజకీయ పరిజ్ఞానాన్ని పొందిన మేధావివర్గాలు సామాజిక పాత్రను నిర్వహించుట అంటే కార్మిక వర్గంలో సామాజిక చైతన్యాన్ని కలిగించుట. శ్రామికవర్గాలనుండి వచ్చిన మేధావి వర్గాలు యీ కర్తవ్యాన్ని సమర్థవంతంగా నిర్వహించగలుగుతున్నారు. ఇదే గ్రాంసీ కూడ నొక్కి చెప్పారు.

జీన్‌పాల్‌సార్త్రే ప్రవచించిన "ఆస్థికత లేక ఉనికితత్వం మూసలో-నూతన వామపక్ష అతివాదం" తన దృక్పధాన్ని రూపొందించింది. సార్త్రేతోపాటు కామస్‌లు "ఆస్తికత లేక ఉనికి తత్వానికి" రెండవసారి ప్రాణంపోసి అభివృద్ధి చేసారు. అదే "వామపక్ష అతివాదంలో దాని ప్రవక్తలు విమర్శించిన "వికృతి రూపం"లో ప్రత్యక్షమైంది. నాటి "నూతన వామపక్ష అతివాద" సిద్ధాంతవేత్తలు ఆస్తికత లేక ఉనికి తత్వంలో శిక్షణ పొందారు. వారిలో హెడెగ్గిర్ శిష్యుడు మార్క్యూస్, అదేవిధంగా సార్త్రె, ఫ్రాంజ్‌ఫానాన్‌ల శిష్యుడు రేజిస్‌డెబ్రే మరో ముఖ్యుడు ఆస్తికత లేక ఉనికి తత్వంలో ప్రతిభావంతుడయ్యాడు.

**3.9. లాటిన్ అమెరికా, ఆసియా, ఆఫ్రికాలో "నూతన అతివాదం"** పై, యూరప్‌లో "యూరోకమ్యూనిజం"పై చెలరేగిన వాదోపవాదాలు సైద్ధాంతికతిక బహిరంగ చర్చలు, భారత కమ్యూనిస్టు వివిధ శ్రేణులలో చెలరేగుతున్న సైద్ధాం చర్చలపై తీవ్రమైన ప్రకంపనాలను కలిగించకపోలేదు. కొన్ని శ్రేణులలో విప్లవ లక్ష్యం, వ్యూహం లాంటి మౌలిక సమస్యలపై తీవ్రప్రభావాన్ని కలుగజేసాయి. అవి అంతర్జాతీయ నైజాన్నేగాక సైద్ధాంతిక విస్తృతిని కలిగి వున్నవి. అనేక కమ్యూనిస్టు పార్టీలు "యూరో కమ్యూనిజం"ల అవగాహనలను, దృక్పదాలను తీవ్రంగా విమర్శించి, యూరో కమ్యూనిజం సైద్ధాంతికాంశాలు, సమిష్టి శాస్త్రీయ అనుభవాల సారాంశం కాదని స్పష్టం చేసాయి. అయినా భారత కమ్యూనిస్టు శ్రేణులలో అవి కలుగజేసిన ఆంతరంగిక సైద్ధాంతిక చర్చా తరంగాలు అంత స్వల్పమైనవి కావు.

మౌలిక సమస్య ప్రధానమైనది, "జాతీయ కమ్యూనిజం" లేక "ప్రాంతీయ కమ్యూనిజం"లు మార్క్సిజం—లెనినిజంల శాస్త్రీయ సమ్మతిని పొందజాలవు. కమ్యూనిజం, మార్క్సిజం, లెనినిజంలు విశ్వజనీయం, అంతర్జాతీయమైనవి. వాటి సారాంశం విశ్వవ్యాప్తం, అనుసరణీయము. కమ్యూనిజం, మార్క్సిజం, లెనినిజం లను ప్రాంతీయమైనవిగా చెప్పుట వాటి శాస్త్రీయ నైజాన్ని త్రోసిపుచ్చుటయే అగుతుంది.

భారత కమ్యూనిస్టు శ్రేణులలోని ప్రధాన సిద్ధాంతకర్తలు నంబూద్రిపాడ్, రణదివె, మోహిత్‌సేన్, దిలిప్ బోసులు 1980 దశకంలో "నూతన అతివాదం" "యూరో కమ్యూనిజం" సమస్యలపై తమ తమ రచనలలో "జాతీయ", "ప్రాంతీయ" కమ్యూనిజం ధోరణులపై తీవ్ర విమర్శనా వ్యాసాలు వ్రాసారు, ఖండించారు.

**3. 10. నూతన అతివాద, యూరో కమ్యూనిజంలు** లేవనెత్తిన వివిధ ధోరణులపై భారత కమ్యూనిస్టుల స్పందనలు యిలా వున్నవి.

★ కమ్యూనిజం, మార్క్సిజం–లెనినిజంలను "జాతీయ కమ్యూనిజం" లేక "ప్రాంతీయ కమ్యూనిజం"లుగా వెనుకబడిన పూర్వ రష్యాకు మాత్రమే వర్తించునదిగా బూర్జువా రాజకీయ శాస్త్రవేత్తలు చెప్పుతూ, విశ్వజనీన, అంతర్జాతీయ ఆచరణాత్మకమైన సజీవ తత్వ, ఆర్థిక, రాజకీయ శాస్త్రీయ సిద్ధాంతాలను, మానవీయతను నీరుగార్చే ప్రయత్నాలు గతంలో, వర్తమానంలో చేసారు. విఫలులయ్యారు. ఇది చారిత్రిక అనుభవ సత్యం.

చైనాలో లీషౌచీ 1940లో మొట్టమొదటగా "మావో ఆలోచనా విధానం" అనే సమాసాన్ని వాడారు. దురదృష్టకరంగా 1966-68లో ఆ విధానానికే బలి అయ్యారు. నాడు లీషౌచీ మావో "మార్క్సిజాన్ని చైనీయం" చేసాడని ప్రస్తుతించి, 1949-50లలో "మావోయిజం అంటే ఆసియా మార్క్సిజం–లెనినిజంగా, విశ్వజననీనమైనదిగా" వ్యాఖ్యానించాడు. చైనీయ ప్రత్యేకతలో విశ్వజనీనతను శోధించక, చైనీయ ప్రత్యేకతనే విశ్వజనీనతగా, వక్రీకరించి తప్పుదారి పట్టించాడు. దీనికి మౌలిక పునాదులు "పెటీ బూర్జువా జాతీయత, జాతీయ దురహంకారాలలో కానవస్తుంది. అదే "జాతీయ", "ప్రాంతీయ కమ్యూనిజం"లలో ప్రతిబింబించింది.

★ మార్క్సిజం, లెనినిజంలకు పునాదులైన తత్వ, ఆర్థిక, రాజకీయ, శాస్త్రీయ, సోషలిజాలను వేరు వేరుగా చూస్తూ, నూతన ఆచరణానుభవాలతో సోషలిజంలో మౌలిక మార్పులు చేయాలంటూ దానిని భ్రష్టుపట్టించే ప్రయత్నాలు పాక్షికంగా జరిగాయి. నూతన అతివాదులు, యూరో కమ్యూనిజం సిద్ధాంతవాదులు లెనినిజాన్ని తొలగించి, మార్క్సిజాన్ని ఆకాశానికెత్తారు. అంటే దాని వాడి, పదునును మొద్దుబారించి నిరుపయోగం చేయప్రయత్నించారు. వాస్తవానికి మార్క్స్–ఎంజెల్స్‌ల కమ్యూనిస్టు మౌలిక సూత్రాలను, సిద్ధాంతాలను లెనిన్ మరింత సంపద్వంతం, ఆచరణాత్మక ఆయుధంగా చేసారు.

భారత కమ్యూనిస్టు ఉద్యమంలోని కొన్ని శ్రేణులు వర్గపోరాటాలలో, పునర్నిర్మాణంలో కార్మికవర్గ నియంతృత్వాన్ని నీరుగార్చుటయేగాక, పెట్టుబడిదారి విధానం శాంతియుతంగా సోషలిజంలోనికి పరివర్తన చెందు అవకాశాలు ఏర్పడిన

వని సంస్కరణవాదంవైపు పయనించి, వెనుతిరిగారు.

★ బూర్జువా పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రభుత్వ యంత్రాంగం, సోషలిస్టు దేశాలలో గల "రాజ్యం", రాజ్యాంగ యంత్ర సమస్యలు లేవనెత్తి సమస్కరణ వాదం వైపు పయనించారు. కార్మికవర్గ నియంతృత్వం అనే పదాన్ని తొలగించుట మంచిదనే అభిప్రాయాన్ని కొన్ని కమ్యూనిస్టు పార్టీలు వెలిబుచ్చాయి. ఐక్యసి.పి.ఐ. 1958లోనే ఏకగ్రీవంగా "కార్మిక నియంతృత్వం" అనే పదాలకు బదులు "కార్మిక రాజ్యం" –ప్రొలిటేరియన్ స్టేట్ హుడ్ అనే పదాన్ని వాడుట ప్రారంభించింది.

"యూరో కమ్యూనిజం" వాదులు బూర్జువా ప్రజాస్వామ్యం, కొలమానాలు, రూపాలు సోషలిజం కంటె మిన్నవైనవిగా ఎంచసాగారు. అధికార సమస్య మౌలిక వర్గ దృక్పథం వదలివేయుట అంటే సోషలిజాన్ని, కమ్యూనిజాన్ని వదలి సోషల్ ప్రజాస్వామ్య అవకాశవాదాన్ని చేబట్టుటయే అగుతుంది. అభివృద్ధి చెందిన కొన్ని దేశాలలో సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన బహుశా వొక మార్గం కావచ్చు అనే అభిప్రాయంతో ఉన్నారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్య అభివృద్ధికై పోరాటం, దాని రూపాన్ని మార్చే పోరాటం కొన్ని దేశాలలో ప్రధానమైనదిగా రూపొంద వచ్చు. గ్రాంసీ చెప్పినట్లు "కందకం నుండి పోరాటం" కంటె "ప్రజోద్యమాల మెరుపుదాడి యుద్ధం" కొన్ని దేశాలలో మరింత తగినది కావచ్చును.

"చట్ట సంస్కరణల పంథా ద్వారా విప్లవానికి పురోగమించవచ్చు." అనేది ఇటలీ నాయకుడు టోగ్లియాటి సిద్ధాంతంకూడ యిదే వివరణ యిస్తుంది. "చారిత్రిక రాజీ" కూడ "ఐక్యసంఘటన" ద్వారా ప్రజాస్వామ్య మార్గంలో అధికారానికి తదనంతరం సోషలిస్టు పరిణామం, సరియైన పంథాగా నిర్ధారణ కావచ్చుననేదే వారి అభిప్రాయం.

అంతర్జాతీయ, జాతీయ పరిస్థితులలో మార్పులు, పరిపక్వతనుబట్టి మౌలిక సూత్రాలను, వైఖరిని, దృక్పథాలను మార్చుకొనుట గాక, దేశంలోని పరిణామాలకు ప్రాధాన్యత నిచ్చి, వ్యూహం, ఎత్తుగడలు రూపొందించుకొనాలనే అభిప్రాయాని కొచ్చారు.

సోషలిజానికి ప్రత్యేక పంథాలకై అన్వేషణ, సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన వొక విప్లవ రూపంగా పరిగణించే అవకాశాలు పెరుగుటతో, ప్రజాస్వామ్య రక్షణకై తీవ్ర ప్రజా పోరాటాలు, వాటిని సోషలిజంకై జరిగే పోరాటాలతో సంలీనం చేయుటపై ఆలోచనలు సాగాయి. ఈ అన్వేషణకు "యూరో కమ్యూనిజం" అని పిలువసాగారు. కొన్నిచోట్ల యీ అన్వేషణ సోవియట్, చైనాలకు దూరంగా పోయే మార్గంలో పడింది. ఆచరణలో ప్రభుత్వ యంత్రాంగ నైజం మారిందని, నేటి పెట్టుబడిదారి దేశాలలోని ప్రభుత్వాలను గుత్త పెట్టుబడిదారి వర్గాల నియంతృత్వా లనే నిర్వచనాన్ని వ్యతిరేకించ ప్రారంభించారు.

ఒక దేశంలో సోషలిజంకై జరిగే పోరాటానికి, చైనా, సోవియట్, యితర సోషలిస్టు దేశాలకు మధ్య వుండవలసిన సంబంధాల సమస్య చర్చనీయాంశంగా ముందు కొచ్చింది. యూరో కమ్యూనిస్టు వర్గాలు కమ్యూనిస్టులు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఐక్యత అన్న పేరుతో కమ్యూనిస్టుపార్టీలు తమ విధానాలను మార్చు కొనుటతో "సోవియట్ నియంతల ఆజ్ఞల ప్రకారం తమ విధానాలను మలచుకొను టతో "సోవియట్ ఏజెంట్లు" అనే నింధా ప్రచారానికి గురి అగుతున్నారు. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ కేంద్రంగాని, నాయకత్వంగాని లేదని, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ అగ్రగామి పార్టీ మాత్రమేనని అందరకు తెలుసు, అయినా నిందా ప్రచారం సాగుతూనే వుంది.

ప్రతి కమ్యూనిస్టుపార్టీ తన స్వతంత్రతను కాపాడుకొంటూ, అంతర్జాతీయ తను సౌహార్ద పార్టీలతో సరియైన అవగాహన ఐక్యతలను సమాన స్థాయితో సంభా షణలు, చర్చలు సంప్రదింపుల ద్వారా పెంపొందించుకొనాలి.

కమ్యూనిస్టు పార్టీలు ప్రజాసామాన్యంలో విప్లవ చైతన్యాన్ని కలిగించనిదానికి వ్యతిరేకంగా రాజీలేని నిరవధిక పోరాటం జరుపుట ద్వారానే ప్రజాసమీకరణ చేయ గలుగుతవి.

# iv

**4.1.** నేటి పాలక వర్గాల ప్రభుత్వాన్ని కూలద్రోయుటకు సాయుధ పోరాట మొక్కటే మార్గమని, నక్సలిజం యువతరాన్ని, ఆకర్షించు తున్నది. కుళ్ళిపోతున్న నేటి సమాజాన్ని పునరుద్ధరించుటకు అదే ఏకైక మార్గ మంటున్నది.

సి.పి.ఐ. (యం. యల్) చారుమజుందారు నాయకత్వంలో మహాత్మాగాంధీ, సంఘ సంస్కర్త విద్యాసాగర్ 150వ జయంతి సందర్భంలో వారి విగ్రహాలను నాశనంచేసి సాంస్కృతిక విప్లవాన్ని, వర్గ శత్రు నిర్మూలనం ద్వారా వ్యవసాయ విప్ల వాన్ని ఆవిష్కరించాలని వ్యక్తిగత హింసా దౌర్జన్య వాదాన్ని చేబట్టారు. "సాంస్కృ తిక విప్లవానికి విగ్రహాల విచ్ఛిన్న పండుగ ప్రారంభం మాత్రమే." "ఒక నూతన సాంస్కృతిక విప్లవం, విద్యావిధానం, దేశభక్తియుత విప్లవకర విధానం, సాయుధ వ్యవసాయ విప్లవంలో భాగమని" దేశబ్రతి 15 ఆగస్టు 1970 సంచికలో చారు మజుందార్ సిద్ధాంతీకరించారు. మార్చి 10, 1970 వ్యాసంలో "కుళ్ళిపోతున్న గాంధీయిజపు కలుపు మొక్కలను ఏరివేయుట ప్రస్తుత సాయుధ వ్యవసాయ విప్ల వానికి సహాయ చర్యగా ప్రస్తుతించి ధన్యవాదాలు తెలిపారు."

నూతనంగా ఏర్పడిన సి.పి.ఐ. (యం.యల్.) ఛైర్మెన్ "నక్సల్బరీ పోరా టాన్ని జాతీయ, అంతర్జాతీయ పోరాటంగా నెంచాడు అంతేగాక, "పంట భూమి

పోరాటంగానే కాక రాజ్యాధికారంకై జరిగేపోరాటంగా "నెంచుతున్నాడు. డెబ్రాతానా కమిటి యీ పోరాటాన్ని "రాజ్యాధికారాన్ని పట్టుకొనే సాహసిక వీరుల చర్యగా" పేర్కొన్నది.

**4.2. గ్రామీణ ప్రాంతాలలో** గెరిల్లా పోరాట స్వరూప, స్వభావాలను సి.పి.ఐ. (యం.యల్) నాయకులు చారుమజుందార్ వివరించారు. ఈ అవగాహనలో యాదృచ్ఛికత, యాంత్రిక తత్వం స్పష్టం. సాంప్రదాయ వర్గపోరాటాన్ని త్రోసివేసి, "వర్గ శతృ నిర్మూలన" అనే పేరుతో "వ్యక్తులపై హింసా"కాండ చోటు చేసుకొన్నది. చారు మజుందార్ రచన "గెరిల్లా చర్యలపై కొన్ని మాటలు"అన్న వ్యాసం, యీ వైఖరినే ప్రతిబింబించింది. "ఒక్క సంవత్సరంలో నక్సల్బరీ పోరాటం" అన్న వ్యాసంలో చారుమజుందారు "కొన్ని పాక్షికమైన ప్రయోజనాల కొరకు గాక రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకోవాలనే ఉద్దేశ్యంతో పోరాటం చేయుటకు నక్సల్బరీయే నాంది." అని వ్రాసారు.

ఉద్యమ వాస్తవికత అనే పోరాట శక్తుల బలం, పోరాట శక్తి, ఎదిరి బలాన్ని శక్తులను, విప్లవ పరిస్థితిని, భౌతిక పరిస్థితులను, వాస్తవికతపై ఆధార పడిన వ్యూహం, ఎత్తుగడలు అనే భూమికను వదలి ఊహాచిత్రం గాలిమేడలలో చారుమజుందార్ నాయకత్వంలో సి.పి.ఐ. (యం.యల్) విహరించ సాగింది. కళ్ళెదటి సంఘటనలు, విషయాలు, ప్రజలు, వారి విషాదగాధలు వదలి, గెరిల్లా పోరాటాలనే పేరుతో, అత్యున్నత వర్గపోరాటమంటూ, వర్గశతృ నిర్మూలనంటూ వ్యక్తిగత హింసా దౌర్జన్య సాహసికవాదాన్ని చేబట్టారు.

**4.3. పునరాలోచన, నక్సలైట్ల ఎత్తుగడలు,** నిర్మాణ, ఆచరణలలో ఆశించిన ఫలితాలనివ్వకపోవుటతో కమ్యూనిస్టు విప్లవ కారులలో ప్రారంభమైంది. అంతర్గత భేదాభిప్రాయాలు తీవ్రమగుట, చీలికలకు చేరువగుటతో తదనంతర కాలం లోని వివిధ పత్రాలలో వారి ఆలోచనా విధానాలనో వచ్చిన గణనీయమైన మార్పు ప్రతిబింబించింది. కానూసన్యాల్ తెరై నివేదిక దీనినే స్పష్టం చేస్తున్నది. ఆచరణలో పార్టీ పని స్తంభించిపోయి, విఫలమైందని నివేదికలో సన్యాల్ స్పష్టం చేశారు. ఇంకా, శక్తివంతమైన ప్రజా పునాదిపై ఆధారపడపోవుట, బలమైన పార్టీ నిర్మాణం లేకపోవుట, సైనిక పరిజ్ఞాన శూన్యత, పాత పద్ధతులలోనే ఆలోచించుట, భూ సంస్కరణలపై విప్లవాత్మకంగా కాక మొక్కుబడి అవగాహన, సోషలిజం వైపు పురోగమనం తేలికైనదిగా నెంచుట, వ్యూహాత్మకంగా తిరోగమనాలు, కష్టాలు వూహింపజాలకపోవుట, బ్రహ్మాండమైన ప్రజాపోరాట ప్రయత్నంగా నెంచకపోవుటలో వైఫల్యాలకు కారణాలుగా పేర్కొన్నారు. అన్నిటికంటే ముఖ్యమైనది లేని "విప్లవ పరిస్థితులు అత్యంత అనుకూలంగా వున్నవని" స్వీయ మానసిక ధోరణిలో ఊహించి, ఆ భూమికపై సాయుధ గెరిల్లా రైతాంగ పోరాట కార్యక్రమాలను విప్లవ కమ్యూనిస్టులు సాగించారు.

పునరాలోచన ప్రారంభమైన నక్సలైట్ల ఉద్యమానికి "మహాపథాన్ని" వర్గ శత్రు నిర్మూలనా సిద్ధాంతాన్ని చారుమజుందార్ గెరిల్లాలకు మార్గదర్శికం చేసారు. అదే సెప్టెంబరు 1969లో "ఎఐసిసిసిఆర్" ఉద్యమాన్ని "వ్యక్తిగత హింసావాద" పెడమార్గాన్ని పట్టించింది. సి.పి.ఐ. (ఎం.ఎల్.) ప్రజాపంథా, ప్రజల నుండి తిరో గమన పంథా అయింది.

సి.పి.ఐ (ఎం.ఎల్) కమ్యూనిస్టు విప్లవకారులు నగరాలను కేంద్రంగా చేసు కొన్న నేటి దశ, కొత్తపుంతలు త్రొక్కి, గ్రామసీమలవైపు పయనించినట్లు కన్పడు తున్నది. వారు వూహించే ఒక జిల్లా నుండి మరో జిల్లాకు వ్యాపించుట వూహ గానే మిగిలిపోయింది.

# V

**5.1. భారత కమ్యూనిస్టు ఉద్యమంలోని మూడు స్రవంతులు** తమ పార్టీ కాంగ్రెసులను 1968-70లలో జరుపుకొని నూతన జాతీయ, అంతర్జా తీయ విధానాలను, కార్యక్రమాలను నిర్ణయించుకొన్నవి. సి.పి.ఐ. 8వ పాట్నా కాంగ్రెసు ఫిబ్రవరి 1968లో సి.పి.ఐ (ఎం) 8వ కొచ్చిన్ కాంగ్రెసు డిసెంబరు 1969లో, సి.పి.ఐ. (ఎం.ఎల్) కన్వెన్షన్ ఏప్రిల్ 1969, కాంగ్రెసు మే 1970లో కలకత్తాలో జరిగాయి.

**5.2. స్వాతంత్ర్య సమస్యపై** సి.పి.ఐ. 8వ పార్టీ కాంగ్రెసు ఆమోదిం చిన కార్యక్రమం "మన దేశ చరిత్రలో భారతదేశం స్వాతంత్ర్యాన్ని 15 ఆగస్టు 1947న సాధించుట, నూతన యుగానికి ప్రారంభం" అని స్పష్టంగా "ఇది మన దేశానికి, ప్రజలకేగాక మానవాళికి చారిత్రక ఘటనగా" పేర్కొన్నది. సామ్రాజ్య వాదపు యీ రాజీ, "తిరిగి దాడిచేయు లక్ష్యంతో వేసిన వ్యూహాత్మక వెనుకడుగు"గా తన పూర్వ అవగాహననే పునరుద్ఘాటించింది. ఈ చారిత్రాత్మక రాజీ, బ్రిటిష్ సామ్రాజ్యవాదం రెండవ ప్రపంచ యుద్ధంలో చావుదెబ్బ తినుట, జాతీయ కాంగ్రె సుకు నాయకత్వం వహించే బూర్జువా వర్గపు సహజ ద్వంద్వ పాత్రల వలన, జాతి స్వాతంత్ర్యోద్యమ నాయకత్వం బూర్జువా వర్గం వహించుటవలన సాధ్యమైంది.

"భారత జాతీయోద్యమ నాయకత్వం తమ చేతులలో వుండజాలదని కాంగ్రెసు, ముస్లింలీగు నాయకత్వాలు భయపడి బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో వొప్పం దానికి వచ్చాయి. ఫలితంగా దేశం రెండుగా చీల్చబడి ఇండియా పాకిస్తాన్‌ల రాజ్యాధి కారాలను కాంగ్రెసు, ముస్లిం లీగులకు ఆగస్టు 15, 14, 1947న బ్రిటిష్ ప్రభుత్వం బదలీ చేసింది. ఈ విధంగా భారతదేశంలో బ్రిటిష్ రాజకీయ పాలన అంతమొంది, బడా బూర్జువావర్గ పాలనలలో రాజ్యాంగాలు ఏర్పడినవి. దీనితో భారతదేశంలో జాతీయ సామాన్య ఐక్య సంఘటన ప్రధమద ప్రశధానంగా విదేశ సామ్రాజ్యవాద

వ్యతిరేక పోరాటం అంతమైంది" అని సి.పి.ఐ.(ఎం.) అధికార మార్పిడిపై విశ్లేషించి, భారతదేశం స్వాతంత్ర్యం పొందిందని చివరకు ఆమోదించింది.

సి.పి.ఐ. (ఎం.ఎల్) ఆగస్టు 15, 1947లో వచ్చిన స్వాతంత్ర్యాన్ని "బూటకపు స్వాతంత్ర్యంగా, బడా కంప్రెడరీ-నిరంకుశ బూర్జువా వర్గం, బడా భూస్వామ్య పాలక వర్గాలు, సామ్రాజ్యవాద యజమానులకు నమ్మకంగా సేవ చేస్తున్నారు. ఈ సామ్రాజ్యవాద బంట్లు బ్రిటిష్, అమెరికన్, రష్యన్ సామ్రాజ్యవాదులు మన దేశాన్ని పీడించే, దోపిడీలను కాపాడుతున్నారని" విశ్లేషించారు. భారతదేశం బ్రిటిష్, అమెరికా, సోవియట్ రష్యా సామ్రాజ్యవాద దేశాలకు నూతన వలసగా మారింది అనే అవగాహనలో సి.పి.ఐ. (ఎం.ఎల్) వర్గాలు ఉన్నవి.

సంక్షిప్తంగా సి.పి.ఐ., సి.పి.ఐ.(ఎం)లు భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని, ఆర్థిక స్వాతంత్ర్యం రావలసి వుందని అవగాహనకు వచ్చాయి. సి.పి.ఐ. (ఎం.ఎల్) మాత్రం వచ్చినది బూటక స్వాతంత్ర్యం అని అంటున్నది.

**5.3. సి.పి.ఐ. 8వ, పార్టీ కాంగ్రెసు** ఫిబ్రవరి 1968లో ఆమోదించిన కార్యక్రమం ప్రభుత్వపు వర్గ పొందికను,పాలలను"జాతీయ బూర్జువవర్గ మొత్తపు వర్గ పాలనప్రభుత్వ యంత్రంగా, అందులో బడా బూర్జువావర్గం శక్తివంతమైన ప్రభావం కలిగివుంది. ఈ వర్గ పాలనా యంత్రాంగం భూస్వాములతో బలమైన సంబంధాలను కలిగి వుంది. ఈ అంశాలు రాజ్యాంగ యంత్రంపై పనిచేస్తూ వున్నందున అభివృద్ధి నిరోధక అంశాలు వుద్భవించుతున్నవి, అని కార్యక్రమము నిర్వచించింది. పరిమితులున్నప్పటికి రాజ్యాంగ చట్టంలో వున్న హక్కులను వేదికగా, పోరాట ఆయుధంగా చేసి, ప్రజల ప్రయోజనాలు, హక్కులు విస్తరింపజేసి కాపాడవచ్చును అనేది సి.పి.ఐ. అవగాహనగా వుంది.

ప్రభుత్వం మితవాద అభివృద్ధి నిరోధక, ప్రతీఘాతక శక్తులతో కూడిన గుత్త బడా బూర్జువా, బడా భూస్వామ్య వర్గాల పాలన యంత్రాంగంగా, వర్గ పొందికను సి.పి.ఐ. (ఎం) 7వ, పార్టీ కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమంలో వివరించింది. ఈ దోపిడి వర్గాలు రెండూ మిలాఖతై, విదేశ గుత్త పెట్టుబడిదారి వర్గాలతో రాజీ పడి, ప్రజా దోపిడీని ముమ్మాటగా చేస్తున్నారని కాంగ్రెసు వివరించింది.

సి.పి.ఐ. (ఎం. ఎల్) "బ్రిటిష్ ప్రభుత్వం తప్పనిసరి పరిస్థితులలో దేశాన్ని విభజించి, భారత ప్రభుత్వాన్ని బడా దళారి బూర్జువా వర్గానికి, బడా భూస్వామ్య వర్గాలకు అధికారాన్ని అప్పగించిందని, విప్లవకారులు కాంగ్రెసులో ఆమోదించిన కార్యక్రమంలో పేర్కొన్నది. బ్రిటిష్ ప్రభుత్వం 1947లో ప్రకటించిన "బూటకపు సాతంత్ర్యం" వలస ఏర్పాటును "అర్ధవలస, సెమీ ప్యూడలు" ఏర్పాటుగ మార్చుట తప్ప మరొకటికాదు అన్నది.

ప్రభుత్వ వర్గ పొందికను సి.పి.ఐ. జాతీయ బూర్జువా శర్గం మొత్తంగా బడా భూస్వామ్య వర్గాల కలయికగ చెప్పి, బడా బూరువా వర్గాల ప్రభావానికి లోనగు-

తున్నదని చెప్పగా, సి.పి.ఐ.(ఎం) ప్రభుత్వ వర్గ పొందికను బడా బూర్జువా, బడా భూస్వామ్య వర్గాల పాలనగా చెప్పింది, బడా బూర్జువా నాయకత్వంలో వున్నదని చెప్పింది. సి.పి ఐ. (ఎం.ఎల్) బడా బూర్జువా, బడా భూస్వామ్య ప్రభుత్వంగా చెప్పుతూనే అర్థవలస, అర్థ సెమీ ఫ్యూడలుగ చెప్పుటద్వారా సామ్రాజ్యవాదపు ప్రభావంలో వున్నదని చెప్పుట స్పష్టము.

**5.4.** సి.పి.ఐ. **భారత బూర్జువా వర్గపు** సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేకతలకు ప్రాధాన్యత నిచ్చి, జాతీయ బూర్జువావర్గ నాయకత్వంలో స్వతంత్ర అర్థిక, పారిశ్రామిక విధానాన్ని చేబట్టి భారత ప్రభుత్వం బూర్జువా ప్రజాస్వామ్య కర్తవ్యాలను పూర్తిచేయ ప్రయత్నిస్తున్నదనే అవగాహనను కలిగియున్నది.

సి.పి.ఐ.(యం.యల్) ప్రభుత్వం బడా బూర్జువా, బడా భూస్వామ్య వర్గాల నాయకత్వంలో వుండుటవలన, ద్వంద్వ విధానంలో సామ్రాజ్యవాదం ముఖ్యంగా అమెరికా పొత్తులో నూతన వలస విధానంలో పడిపోతుందని, కాన స్వతంత్ర, ఆర్థిక, పారిశ్రామిక విధానాన్ని చేబట్టలేదని, ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాల పరిపూర్తి వొక్క జనతా ప్రజాస్వామ్య విప్లవ ప్రభుత్వం వలనే సాధ్యమంటున్నది.

సి.పి.ఐ.(ఎం.ఎల్) ప్రభుత్వం అర్థవలస, అర్థఫ్యూడలు శక్తుల ప్రభావంలో వున్నందున, ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలు జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం, సుదీర్ఘ రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాలద్వారా ఏర్పడిన నూతన ప్రభుత్వమే పరిపూర్తిచేయగలదని అంటున్నది.

అయితే ఒకటి నిజం పారిశ్రామికాభివృద్ధి జరుగవలసినంత జరుగకపోయినా జాగానే జరిగింది. ఫలితాలు మాత్రం ప్రజలకు చేరకుండా, బూర్జువా వర్గాలే పొందాయి.

**5. 5. మూడు కమ్యూనిస్టు శ్రేణుల పార్టీ కాంగ్రెసులు** వ్యవసాయ సమస్యల యెడల అవగాహనలు, అవలంబించిన వైఖరులు యీ క్రింది విధంగా వున్నవి. బ్రిటిష్ ప్రభుత్వం స్వాతంత్ర్యానికి పూర్వం, బర్మింగ్‌హాం, లాంగషైర్ గుడ్డల మిల్లులకు అవసరమైన ముడిసరకు ప్రత్తిపంటను పెంపొందించి, దానిని ఇంగ్లండులోని మిల్లులకు ఎగుమతిచేయుటకు అవసరమైన రోడ్డు, రైలు రవాణా సౌకర్యాలను ఏర్పాటుచేసి, వలసవిధానానికి అనుబంధంగా వ్యవసాయాన్ని అభివృద్ధిచేయుటను పెట్టుబడి సౌకర్యాలను కలుగజేసి, ఫ్యూడలు అవరోధాలను తొలగించి, ధనిక రైతు వ్యవసాయాన్ని పెంపొందించ ప్రయత్నించింది. ఆ విధంగానే పొగాకు, వేరుశనగ, తేయాకు, కాఫీతోటలు, సుగంధ ద్రవ్యాల పంటలు పెంపొందించింది. స్వాతంత్ర్యానికి పూర్వం, తదనంతరం కూడ మౌలికంగా అదే విధానాలను అనుసరించుతూ, ముఖ్యంగా దిగుమతి చేయబడుతున్న ఆహారధాన్యాలు పంచదార వలన విదేశమారక ద్రవ్యం ఖర్చుఅగుట, పారిశ్రామిక అభివృద్ధి ఆశిం

చిన విధంగా జరుగని కారణంగా ఆహారధాన్యాదుల, పంచదార వుత్పత్తులను అధికం చేయుటకు నీటిపారుదల, తదితర ఎరువుల ప్రోత్సాహకాలను పెంచుటకు, తగిన వ్యవసాయ సంస్కరణలు చేయసాగింది. ఈ విధంగా ప్రభుత్వం మౌలిక వ్యవసాయ భూముల సంస్కరణలుకాని, వ్యవసాయ పంటల అభివృద్ధి, మార్కెటింగు విధానాలను, పారిశ్రామిక విధానాలకు అనుబంధంగా చేసిందే కాని వొక స్వతంత్ర విధానంగా, మధ్యతరగతి రైతాంగ అభివృద్ధి దృక్పథం చేబట్టలేదు.

చట్టబద్ధంగా భూస్వామ్య విధానాన్ని రద్దుచేసినా సెమీ ఫ్యూడలు దోపిడి, తిరిగి హెచ్చుకౌలుకిచ్చుట, ఉత్పత్తితో పాలుపంచుకొనుట యింకా యధాతథంగా జరుగుతూనే వుంది స్వంత వ్యవసాయం కొంత పెరిగినా, కౌలుదారి విధానం విస్తారంగా సాగుతూనే వుంది.

వ్యవసాయ భూముల గరిష్ఠ పరిమితి చట్టాలు చేసినా, బినామీ ట్రాన్సఫరులు, అమ్మకాలు, ఆక్రమణలతో మిగులు భూములు ఏనుగుతిన్న వెలగపండు చందమైనాయి. అతిస్వల్ప భూమి మాత్రమే వ్యవసాయ కూలీలు, పేదరైతుల క్రిందికి వచ్చింది. ప్రభుత్వభూమి పంపకానికి మిగిలినది కానరాకుండా పోయింది.

ఆహారసమస్యను అధికోత్పత్తితో పరిష్కరించబడాలంటే అభివృద్ధికర వ్యవసాయ భూముల సంస్కరణలు చేసి, అమలు చేయుట ద్వారానే జరుగగలదని సి.పి.ఐ. ఐదు అంశాల కార్యక్రమాన్ని మిగులు భూముల పంపకాన్ని, రైతులకు ఆర్థిక సహాయం, బ్యాంకులు జాతీయం చేయుట, వ్యవసాయ పంటల టోకు వ్యాపారాన్ని జాతీయంచేయుట, వ్యవసాయ కూలీలకు కనీస వేతన నిర్ణయ చట్టాలుచేసి అమలు చేయాలని సూచించింది. సి.పి.ఐ.(యం) కూడ దగ్గరి దగ్గరిగా యిలాంటి కార్యక్రమాన్నే ప్రకటించింది. ఇట్టి నిర్మాణ కార్యక్రమాలతో పాటు దున్నేవానికే భూమి అనే సూత్రం ప్రాతిపదికపై జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం మాత్రమే భూస్వాముల భూములను స్వాధీనం చేసుకొని, భూములులేని రైతాంగానికి, వ్యవసాయ కూలీలకు పంపకంచేసి, అప్పులను రద్దుచేయగలదని పేర్కొన్నది.

**5. 6. భారతదేశం అవలంభించవలసిన విదేశాంగ** విధానంపై కమ్యూనిస్టు మూడు స్రవంతులు భిన్నాభిప్రాయాలను కలిగియున్నవి.

సి.పి.ఐ. 9వ పార్టీ కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమం "భారతదేశ ప్రభుత్వ విదేశాంగ విధానం ప్రధానంగా శాంతి, అణుబాంబు వ్యతిరేక, అలీన విధానంగా" పేర్కొంది. ఈ విధానం జాతీయ బూర్జువావర్గ ప్రయోజనాలకు, ఆర్థికాభివృద్ధికి అనుకూలంగా వుంది. ఈ విధానం వూగిసలాటలకు లోనగుతున్నా ప్రధాన రాజకీయ లక్ష్యాన్ని విడనాడకుండానే వుంది. ఆంగ్లో, అమెరికన్ సామ్రాజ్యవాదులు యీ విధానాన్ని ఎప్పుడూ హర్షించలేదు.

అలీన విధానం, 1961లో భారతదేశం పోర్చుగీసు సామ్రాజ్యవాదానికి

వ్యతిరేకంగా గోవా, డయ్యూ, డామనులను సైనిక చర్యతో విముక్తి చేసి, వలస వ్యతిరేక విధానమని చాటి చెప్పింది. దీనితో అలీన విధానం బలపడింది. పరోక్షంగా మన రాజకీయ స్వాతంత్ర్యాన్ని బలపడునట్లు చేయుటయే గాక, మిత్రదేశాలనుండి మన దేశాభివృద్ధికి అవసరమైన సహాయం లభించుటకు కూడా తోడ్పడింది. సామ్రాజ్యవాదం భారతదేశానికి వ్యతిరేకంగా పాకిస్తాన్ కాశ్మీర్‌లో ఉగ్రవాద చర్యలు పెచ్చరిల్లుటకు, ఐక్యరాజ్యసమితి సెక్యూరిటి కౌన్సిలుకు పాకిస్తాన్ సభ్యత్వాన్ని బలపరచి, ఎన్నుకొనబడునట్లు తన బలాన్ని వినియోగించింది. భారత–చైనా సరిహద్దు యుద్ధాన్ని రెచ్చగొట్టి మన శాంతి, అలీన, సామ్రాజ్యవాదవలస వ్యతిరేక విధానానికి పెద్ద పరీక్షపెట్టి అమెరికాచేసే వొత్తిడిలకు పరోక్షంగా సహాయపడింది.

సి.పి.ఐ.(ఎం.) "ఏ దేశ విదేశాంగ విధానమైనా ఆ దేశప్రభుత్వ దేశీయాంగ విధాన విస్తరణయేగాక, నాయకత్వం వహించే వర్గ ప్రయోజనాలకు ప్రతిబింబం" అనే అవగాహనతో విదేశాంగ విధానాన్ని విశ్లేషణ గావించి వ్యాఖ్యానించింది. అంతేగాక "మన ప్రభుత్వానికి నాయకత్వం వహించే బూర్జువావర్గపు సహజ ద్వంద విధానానికి ప్రతిబింబమని" నిర్ధారించింది. అంచేత అలీన విధానం, బూర్జువా వర్గం సామ్రాజ్యవాదంతో చేయు రాజీ ప్రతిపాదనల విధానంగా ఎంచింది.

సి. పి. ఐ. (ఎం.ఎల్) మన విదేశాంగ విధానం, అమెరికా, బ్రిటిష్ సామ్రాజ్యవాదాలకు వ్యతిరేకంగా, వాటి వలస సోదరుడు సోవియట్ యూనియన్ సోషల్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఐక్యసంఘటనను చైనాతో కలసి ఏర్పాటు చేయుట, ప్రధాన కర్తవ్యంగా పేర్కొని, భారతదేశం ఆ ఐక్యసంఘటనలో భాగస్వామి కావాలంటూ అలీన విధానాన్ని వ్యతిరేకించింది.

**5.7. భారత కమ్యూనిస్టు ఉద్యమ చారిత్రక అనుభవాలు,** గుణపాఠాలు, వివిధ కమ్యూనిస్టు స్రవంతులు తమ ముందున్నది సోషలిస్టు విప్లవం కాదని, తమ కర్తవ్యం ప్రజాస్వామ్య విప్లవాన్ని ప్రజాస్వామ్య ఐక్యసంఘటన పోరాటాల ద్వారా సాధించవలసి వుందని సూత్ర ప్రాయంగా ఆమోదించుట వాస్తవం.

మన విప్లవ పురోగమన పంథా విషయంలో సి.పి.ఐ., సి.పి.ఐ., (ఎం), సి.పి ఐ.(ఎం.ఎల్)లు మూడు విప్లవం ప్రజాస్వామ్య విప్లవమేనని, సోషలిస్టు విప్లవం కాదనే విషయంలో ఒకేవిధమైన అవగాహన కలిగి వున్నవి.

సి.పి.ఐ., సి.పి.ఐ.(ఎం)లు 1947లో స్వాతంత్ర్యం వచ్చిందనే విషయంలో కూడ చివరకు వొకే అభిప్రాయానికి వచ్చాయి. బూర్జువావర్గం సామ్రాజ్యవాదంతో రాజీ వొప్పందం పడిన కారణంగా సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక కర్తవ్యాలు పూర్తిచేయబడలేదని, కాన ప్రజాస్వామ్య విప్లవాన్ని కొనసాగించి, ఆ విప్లవ కర్త

వ్యాలను పరిపూర్తి చేయవలసి వుంటుందని, వొకే విధమయిన అవగాహనను కలిగి వున్నవి.

సి.పి.ఐ. నేటి పరిస్థితులలో విప్లవం పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి మార్గములో శాంతియుతంగా, ప్రజోద్యమాల ఫలితంగా పార్లమెంటరీ మెజారిటీ సంపాదించి, పార్లమెంటును సాధనంగా వినియోగించి, ప్రజాస్వామిక విప్లవశేష కర్తవ్యాలను పూర్తిచేయగలమని, ఆ క్రమంలోనే సోషలిస్టు విప్లవంవేపు పురోగమించగలమనే అవగాహన కలిగి వుంది.

సి.పి.ఐ.(ఎం) నాటి ప్రపంచ సోషలిస్టు ఆధిక్యతను, ప్రత్యేక పరిస్థితులను గుర్తించి, ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను, జనతా ప్రజాస్వామ్య విప్లవం, బడా బూర్జువా,భూస్వామ్య ప్రభుత్వాన్ని కూలద్రోసి, కార్మికవర్గ నాయకత్వంలో ఏర్పడిన జనతా ప్రజాస్వామ్య సంఘటనా ప్రభుత్వం మాత్రమే పూర్తిచేయగలదనే అవగాహనలో వుంది. పెట్టుబడిదారేతర పంథా భారతదేశానికి మూసివేయబడిందన్నది.

సి.పి.ఐ. (ఎం.ఎల్) దేశాన్ని అర్ధవలస, సెమీఫ్యూడలు సమాజంగా నిర్వచించి, సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక సుదీర్ఘ సాయుధరైతాంగం గెరిల్లా పోరాటాలద్వారావ్యవసాయ విప్లవవిజయంతోఏర్పడినసూతనప్రజాస్వామ్య ప్రభుత్వం వొక్కటే ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను పూర్తి చేయగలదని నిర్ధారించింది. స్వాతంత్ర్యం, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం "మోసం, కుట్ర, బూటకం"అని త్రోసిబుచ్చింది.

**5.8.** **కమ్యూనిస్టు స్రవంతుల విప్లవపంథా** అవగాహనలపై ఆధారపడే వారి వ్యూహాత్మక ఐక్యసంఘటనల రూపాలు, ఎత్తుగడలు నిర్ధారించబడినవి.

సి.పి.ఐ., సామ్రాజ్యవాద, బడా బూర్జువా, బడా భూస్వామ్య, ఫ్యూడలు వ్యతిరేక జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటన, జాతీయ ప్రజాస్వామ్య విప్లవాన్ని ఆవిష్కరించే సాధనం. ఇది ప్రధానంగా తన దాడిని సామ్రాజ్యవాదం.ఫ్యూడలిజం. గుత్త పెట్టుబడిదారీ,మితవాద అభ్యుదయ నిరోధక శక్తులపై కేంద్రీకరించుతుంది, జాతీయ ప్రజాస్వామ్య విప్లవంలోప్రయోజనంపొందే అన్నిదేశభక్తవర్గాలు కార్మికులు, కర్షకులు ధనిక రైతులతోసహా, వ్యవసాయ కార్మికులు, నగర గ్రామీణ మధ్యతరగతి వర్గాలు, అభ్యుదయకర మేధావి వర్గాలు, నగర గ్రామీణ బడుగువర్గాలు, గుత్తేతర జాతీయ బూర్జువావర్గం, కార్మిక-కర్షక ఐక్యత పునాదిగా జాతీయ ప్రజాస్వామ్య సంఘటన యేర్పడుతుందనేది సి.పి.ఐ. దృక్పథం.

సి పి.ఐ.(ఎం) భారతదేశంలో పెట్టుబడిదారి విధానం ఒకమాదిరిగా అభివృద్ధి చెందియున్నందున, పెట్టుబడిదారేతర పంథాలో ఆర్థికాభివృద్ధి అనేది అవాస్తవం అనే అభిప్రాయంతో వుంది. ఈ మౌలిక అవగాహనతో జనతా ప్రజాస్వామ్య లక్ష్యాన్ని జనతా ప్రజాస్వామ్య సంఘటనద్వారా చేరతలస్తున్నది. ప్రస్తుత బడా

బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వాన్ని తొలగించి, కార్మికవర్గ నాయకత్వంలో జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని యేర్పరచాలి. అందుకు సాధనమైన జనతా ప్రజా స్వామ్య సంఘటనను కార్మిక, కర్షక పునాదిపై, వ్యవసాయ కూలీలు, పేదరైతులు, నగర-గ్రామీణ చేతివృత్తులవారు, యితర బడుగువర్గాలు, మధ్యతరగతుల ఉద్యో గులు, నిరుద్యోగులు, విద్యార్థి యువజనులు, ఫ్యూడలు వ్యవసాయ సంబంధాలు కొనసాగుతున్న ప్రాంతాలలో ధనిక రైతులతోసహా యేర్పరచాలి. సామ్రాజ్యవాదం గుత్తపెట్టుబడివర్గాలచే సంక్షోభాలతో నెట్టివేయబడి జాతీయ బూర్జువావర్గం కూడ సంఘటనలో భాగస్వామి అయ్యే అవకాశాలున్నవి. బడాబూర్జువా భూస్వామ్యవర్గాలు జాతీయ బూర్జువాలమధ్య గల వైరుధ్యాల తీవ్రత, నిర్దిష్ట పరిస్థితులు, కేంద్ర-రాష్ట్ర సంబంధాల వైరుధ్య తీవ్రతలబట్టి ఐక్యసంఘటనలో వాని పాత్ర ఆధారపడి వుంటుంది.

సి.పి.ఐ.(ఎం.ఎల్) ప్రపంచ సోషలిస్టు విప్లవంలో భాగంగా నూతన జనతా ప్రజాస్వామ్య విప్లవాన్ని చివరికంటా తీసుకొని వెళ్ళుటకు ప్రజాసంఘటన అవసర మని, కార్మికవర్గ నాయకత్వంలోని అన్నివర్గాల సంఘటనయని స్పష్టం చేసింది. ఈ విప్లవం కార్మికవర్గ నాయకత్వంలో రైతాంగం ప్రధానశక్తిగా పేర్కొని, కార్మిక వర్గం వ్యవసాయ కూలీలు, భూమిలేని పేదరైతాంగంపై ఆధారపడి, మధ్యతరగతి రైతాంగం ఐక్యమై, ధనిక రైతాంగంలో కొంత భాగాన్ని కలుపుకొని, మిగిలినవారిని తటస్థులను చేస్తుంది. రైతాంగంలో చాలా కొద్దిమంది మాత్రమే విప్లవ వ్యతిరేకు లతో కలుస్తారు. నగర పెటీబూర్జువావర్గాలు, విప్లవ మేధావి వర్గాలు, విప్లవమిత్రులు చిన్న, మధ్యతరగతి బూర్జువా వర్గాలు, వ్యాపారులు, బూర్జువా మేధావివర్గాలు, వూగిసలాడే మిత్రులు, సహజంగా ద్వంద్వ వైఖరి కలిగి వుంటారు. కార్మిక, కర్షక ఐక్యతలో సాయుధ పోరాటక్రమంలో రాజ్యాధికారాన్ని యేర్పాటు చేసిన తరువాత యీ ఐక్యసంఘటన యేర్పడుతుందనేది సి.పి.ఐ. (ఎం. ఎల్.) అవగాహన. దీనినే సౌరిన్‌బోసుతో సంభాషణలలో చౌయన్‌లై వివరించారు. "అధికారాన్ని చేజిక్కించు కొన్న తరువాతే జనతా ప్రజాస్వామ్య సంఘటన యేర్పడుతుందనుట" సెక్టేరియన్ దుందుడుకు, అతివాద అవకాశవాదం. "గుర్రాన్ని బండివెనుక కట్టుట" అగు తుంది.

**5.9** సి.పి.ఐ., సి.పి.ఐ. (యం), సి. పి. ఐ. (యం. యల్.) ప్రజాభిప్రాయ మన్నన లక్ష్యంతో మౌలికంగా ఐక్యసంఘటనల వ్యూహ లక్ష్యాల దృక్పథంలో వివిధవర్గాల కోర్కెలను సాధించుటకై ఆచరణ కార్యక్రమాలను రూపొందించారు. వీటిలో సహజంగానే సారూప్యతలే ఎక్కువగా వున్నవి. విభేదా లున్నా పేర్కొన తగినవికావు.

# VI

**6.1 సి.పి.ఐ.(యం) నుండి అఖిల భారత స్థాయిలో** కమ్యూనిస్టు విప్లవకారులు చీలిపోయి "ఎ.ఐ.సి.సి.ఆర్"గాను, ఆంధ్రప్రదేశ్‌లో సి.పి.ఐ.(ఎం) నుండి మెజారిటి చీలిపోయి "ఎ. సి. సి. సి. ఆర్"గా యేర్పడిన నాటినుండి రెండు నిర్మాణాలమధ్య అంతర్గత సైద్ధాంతిక పోరాటం జరుగుతూనే వుంది. ఒకరి నొకరు "నియో సంస్కరణవాదులు", "ఉగ్రఅతివాద అవకాశవాదులు"అని తీవ్ర విమర్శలకు గురిచేసుకొంటూనే వున్నారు. ఇరుపక్షాలు నియోసంస్కరణవాదం, ఉగ్రఅతివాద అవకాశవాదాలు పూర్తి స్వరూపాన్ని సంతరించుకొనలేదని, ఆనాడు బహిరంగ చర్యలకు దిగకుండా ప్రారంభంలో నిగ్రహాన్ని ప్రదర్శించాయి.

ఎన్నికలను "ఎ.పి.సి.సి.సి.ఆర్." ఎత్తుగడల సమస్యగా పరిగణించి, అనేక చట్టబద్ధ పోరాట రూపాలలో అదికూడ వొక పోరాట రూపంగా నె చింది. "ఎ.ఐ. సి.సి.సి.ఆర్." అట్లుకాక ఎన్నికలను వ్యూహాత్మక సమస్యచేసి, విప్లవదశ అంతా, సాధారణ బహిష్కరణకు గురిచేయాలన్నది. ఆంధ్రప్రదేశ్ విప్లవకారులు దానిని తిరస్కరించారు. "మనం సాయుధ పోరాటం సాగిస్తూకూడ, సాయుధ పోరాటంలేని ప్రాంతాలలో పార్లమెంటులో కూర్చుంటామని" స్వీడిష్ పత్రికా విలేఖరికి నాగిరెడ్డి స్పష్టం చేసారు.

**6.2. చారుమజుందారు ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలు,** ప్రజాసంఘాలు ఆర్థికతత్వాన్ని పెంపొందించుటయే గాక సాయుధ పోరాటానికి అడ్డంకిగా వున్నాయని, గెరిల్లా యుద్ధ పద్ధతే ఏకైక ఎత్తుగడగా, గెరిల్లా యుద్ధం సాగించుటకు ప్రజా ఉద్యమాలు, ప్రజాసంఘాల అవసరం లేదని, జులై 1969లో ప్రకటించారు. ఈ అతివాద అవకాశవాద పోకడలతో అఖిలభారత శ్రేణులలో ప్రజా పంథావేపు పునరాలోచన, అంతర్గత పోరాటం ప్రారంభమయింది. ఫలితంగా అఖిల భారత నాయకత్వ ఆగ్రహానికి గురై బహిష్కరించబడ్డారు. "సాంస్కృతిక విప్ల వంతో భాగంగా" కలకత్తా విద్యార్థులు సంస్కరణవేత్తల రాజకీయ నాయకుల విగ్ర హాలను నాశనం చేయుటను, కాలేజీలు, ప్రయోగశాలలు నాశనం చేయుటను పొగిడి, ప్రోత్సహించారు.

చారుమజుందార్ "నక్సల్బరి రైతాంగ మిలిటెంటు పోరాటం మనకు నేర్పిన గుణపాఠం. ఆ పోరాటాలు పంట భూములకోసంకాదని, రాజ్యాధికారం హస్తగతం చేసుకొనుటకు మాత్రమే సాగించాలని" సిద్ధాంతీకరించి తెలంగాణా గుణపాఠాలను త్రోసివేసారు. ఫలితంగా అవే పొరపాట్లు పునరావృతమయ్యాయి.

**6.3. విప్లవకారులు అనుసరిస్తున్న** అతివాద అవకాశవాద విధా నాలు, తప్పుడు నిర్మాణ పద్ధతులతోపాటు చీలికలు అనివార్యం, చీలికలు మంచివే అన్న తప్పుడు సిద్ధాంత అవగాహన, ఆచరణల వలననే కమ్యూనిస్టు విప్లవకారుల

ఉద్యమం అనేక చీలికలకు గురయింది. విపరీత నష్టాలను కలిగించింది.

మరో అంశం, విభేదాలు మార్క్సిజం, మావోయిజాన్ని అర్థం చేసుకోనుటలో కాదు, వారి బోధనలను ఆచరణాంశాలుగా చేయుటలో వస్తున్నవి. ఇవే చీలికలకు ప్రధానకారణాలు. అభిప్రాయభేదాలున్నా ప్రజాపంథాను అనుసరించుతూ, కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రాలకు కట్టుబడి పనిచేసినంతకాలం విడిపోవలసిన అవసరం ఎంతమాత్రం లేదు, రాదు.

**6.4. ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులు** అతివాద అవకాశవాదంపై సాగించిన సైద్ధాంతికపోరాటం వెలుగులోనికి తెచ్చిన ప్రధానాంశాలు, భూస్వాములు, వారి గూండాల చర్యలకు వ్యతిరేకంగా సాయుధ రైతాంగ వ్యవసాయ విప్లవగెరిల్లా పోరాటాలుగా ప్రారంభమై ప్రజా యుద్ధరూపాన్నిపొంది, ప్రభుత్వ హింసా,నిర్బంధ ప్రజా ప్రతిఘటనా మార్గంలో సాగుతుంది. దళాల కార్యాచరణకూడ ప్రతిఘటనా రూపంలోనే గాని, చొరవతో ప్లానుక్రమంలో, దాడి రూపంలో ఉండదు. సి.పి.ఐ. (ఎం.ఎల్) ప్రజా ఉద్యమం లేని ప్రాంతాలలోకూడ దళ చర్యల కారణంగా, ప్రజల నుండి వేరగుట జరిగింది.

ప్రజాయుద్ధం ప్రతిఘటనా రూపం మాత్రమే. ఎదురుదాటి రూపం చేబట్టదు. సి.పి.ఐ.(ఎం.ఎల్.) ప్రజల కోర్కెలకు పోరాటాలకు సంబంధంలేదు. ప్రజా ఉద్యమం లేకుండానే భూస్వాములపై దాడి చర్యలు జరుపుతున్నారు. అవి అతివాద అవకాశవాద చర్యలు అవుతాయి.

సాయుధ పోరాటరూపం మౌలిక ప్రధాన పోరాటరూపమైనా సర్వత్రా, అన్ని కాలాలలో యిదొక్కటే పోరాట రూపంకాదు. ప్రజా చైతన్యాన్ని అన్ని పోరాట రూపాలను వినియోగించాలి. ప్రజల పాత్ర ప్రధానంగా ఉండాలి.

"భారత విప్లవకారులలో అతివాద అవకాశవాద ధోరణి" అన్న సుదీర్ఘ సమగ్ర విమర్శనను 1970 సెప్టెంబరులో ఆంధ్ర కమ్యూనిస్టు విప్లవకారులు ప్రజలముందుంచారు. విప్లవోద్యమాల వెలుగులో ప్రజా విప్లవ పంథా విశ్లేషణగా పేరొందింది.

**6 5. సి.పి.ఐ. (యం.యల్) రాజకీయ తీర్మానం,** కార్యక్రమాలలో ప్రధాన వైరుధ్యం, వ్యవసాయ విప్లవసూత్రీకరణల వైఫల్యాలను విశ్లేషించివివరించింది.మనవిప్లవదశలో ప్రధానవైరుధ్యం ఫ్యూడలిజానికి విస్తృతప్రజాబాహుళ్యానికి మధ్య యని,వ్యవసాయ విప్లవం శక్తివంతమైన సాధనంగావివరించింది.దేశంలో విప్లవ పరిస్థితి వుందని, కాని విప్లవోద్యమాల అసమానత వుందని, సి.పి.ఐ.(ఎం. ఎల్) రాజకీయ తీర్మానం, కార్యక్రమం విప్లవ పరిస్థితిని విప్లవోద్యమాలతో గందరగోళ పరచి బ్రహ్మాండమయిన విప్లవ పరిస్థితి వుందని అతివాద అవకాశవాదం చేసిన వాదనలను విమర్శించి, లోపాలు ఎత్తి చూపింది. ఆర్థికవాదాన్ని ఆర్థిక పోరాటంతో సమానంచేసి, గందరగోళ పరచిన "ఎ.ఐ సి.సి.సి.ఆర్" అతివాద అవకాశవాదాన్ని

తిరస్కరించింది. భూసమస్యకు సాయుధ పోరాటానికి వైరుధ్యాన్ని చూపే వైఖరిని తిరస్కరించింది. వ్యవసాయ విప్లవం సాయుధ పోరాటాల మధ్య పరస్పర సంబంధాన్ని గుర్తించి, వివరించుటలో విఫలమైంది. అన్ని రైతాంగ విప్లవోద్యమాలు, పోరాట రూపాలులో వ్యవసాయ విప్లవం కేంద్రస్థానమాక్రమించాలి. గెరిల్లా యుద్ధం వొకే వొక ఎత్తుగడ అనే సి.పి.ఐ.(ఎం.ఎల్) వైఖరిని "ఎ.పి.సి.సి.సి.ఆర్" విమర్శనాపత్రం ఖండించి తిరస్కరించింది. శతృనిర్మూలనా పంథాను, సూత్రీకరణలను విశ్లేషించి అవి మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానానికి వ్యతిరేకమని త్రోసిబుచ్చింది. సాయుధ పోరాటం సహజంగా దాడి స్వభావం కలదే అయినా విప్లవశక్తుల బలహీనత కారణంగా దీర్ఘకాల ప్రతిఘటనా సాయుధ పోరాట రూపంలో వుంటుందని, అతివాద అవకాశవాదుల సత్వర విజయవైఖరిని ఆంధ్ర పత్రం విమర్శించి, ఖండించింది. నక్సల్బరీలోనే మొట్టమొదటిసారిగా మావో ఆలోచనా విధానం అన్వయించబడిందనే అతివాద అవకాశవాదుల వాదన అవాస్తవమని, 1949లోనే తెలంగాణాలో సాయుధ రైతాంగ గెరిల్లా దళాలు ప్రజాయుద్ధ పంథాను స్థానిక పరిస్థితులకు అన్వయించి పోరాడే ప్రయత్నం చేసారని "ఎ.పి.సి.సి.సి.ఆర్" సుదీర్ఘ విమర్శనాపత్రం వివరించింది. అంతేగాక "చైనా ఛైర్మన్ మన ఛైర్మన్" అన్న నినాదానికి కార్మికవర్గ అంతర్జాతీయ ఐక్యతా భావానికి, ఆచరణకు ఎట్టి సంబంధం లేదు. పైగా యిది దాని వికృతరూపం. ఇంతేగాక మావో ఆలోచనా విధానాన్ని అనేక మౌలిక సమస్యలపై వక్రీకరించి, అసభ్యంగా మార్చివేసారని స్పష్టం చేసింది. "ఎ.ఐ.సి.సి.సి.ఆర్" విప్లవోద్యమాలకు సైద్ధాంతిక, ఆచరణ నాయకత్వాన్నిచ్చుటలో విఫలమై నిర్మాణ క్రమశిక్షణ చర్యలతో పై సమస్యల పరిష్కరించే ప్రయత్నంతో విచ్ఛిన్నకరపంథావైపు పయనించిందని "ఎ.పి.సి.సి.సి.ఆర్" విమర్శనాపత్రం స్పష్టం చేసింది.

**6.6. "ఎ.పి.సి.సి.సి.ఆర్" అగ్రనాయకత్వం** జైలులో వున్నపుడు, అంతకుముందే ఎన్నడో శ్రీకాకుళం విప్లవకారులు "ఎ ఐ.సి.సి.సి.ఆర్" నాయకత్వంలో పనిచేయుట, ఆంధ్రప్రదేశ్‌లో విప్లవకారులు పుల్లారెడ్డి నాయకత్వంలో గోదావరిలోయ ఉద్యమాన్ని సాగించుటతో వుద్భవించిన సైద్ధాంతిక, నిర్మాణ, ఆచరణ సమస్యలను సూత్రబద్ధ చర్చలద్వారా పరిష్కరించుకొనే క్రమాన్ని విడనాడి, రాష్ట్ర నాయకత్వానికి వ్యతిరేకంగా బహిరంగ తిరుగుబాటుచేసి, నిర్మాణంలో చీలికలు తెచ్చి తన గ్రూపును నిర్మాణం చేసారు. తీవ్రవాదంవైపు తన పయనాన్ని సమర్థించుకొంటూ "ప్రజలు చైతన్యవంతులై సాయుధ పోరాటాన్ని చేపట్టవలసిన అవసరాన్ని గుర్తించువరకు శతృవు చేతులు ముడుచుకొని కూర్చోదని, పోలీసులు, గూండాలు రంగంలోనికి ప్రవేశించినపుడు ప్రజల కొరకు వేచిచూడకుండా "ఆత్మ రక్షణ కొరకు సాయుధ పోరాటం ప్రారంభించవచ్చని, దళాల సైనిక శక్తిపై విశ్వాసం ఏర్పడితేనే రైతాంగం భూస్వాముల భూములను ఆక్రమించుకొనుటకు

ముందుకొస్తారని సూత్రీకరించి తన చర్యలను గ్రూపు సమర్థించుకొన్నది. ప్రజలు మూకుమ్మడి ఆత్మరక్షణకు సిద్ధమయ్యేవరకు, అగ్రగామి శ్రేణులకు ఆత్మరక్షణ వుండదనికూడ సమర్థించుకొన్నారు. "ఎ.పి.సి.సి.సి.ఆర్" అగ్రనాయకత్వం, పుల్లా రెడ్డి వాదన, చర్యలు తీవ్ర అతివాద దుందుడుకు చర్యలని మార్క్సిజం-లెనినిజం ఆమోదించదని స్పష్టం చేశారు.

ఆంధ్రప్రదేశ్ విప్లవ కమ్యూనిస్టు కమిటి రాష్ట్ర కాన్ఫరెన్సును 1973లో కా. పుల్లారెడ్డి నాయకత్వంలో యన్. రామచంద్రయ్య, పి. రామనర్సయ్యలు ప్రధాన పాత్ర వహించగా జరిగింది. ఆంధ్రప్రదేశ్ విప్లవ కమ్యూనిస్టుపార్టీని ఏర్పరచారు. పార్టీ వ్యవసాయ విప్లవ ప్రజా ఉద్యమ మార్గదర్శక సూత్రాలను ఆమోదించింది.

**6.7. చారుమజుందార్ అతివాద దుస్సాహసిక విధానాన్ని** తెగనాడిన యస్.యన్.సింగ్ నాయకత్వంలో సి.పి.ఐ. (ఎం.ఎల్.) వర్గాలు ప్రజా పంథాను చేబట్టిన మరో గ్రూపుగా ఏర్పడ్డారు. ఈ గ్రూపు పుల్లారెడ్డి గ్రూపుతో కలిసి, చారుమజుందార్ విధానాన్ని త్రోసిరాజని, యస్.యన్. సింగు నాయకత్వంలో సి.పి.ఐ (ఎం.ఎల్)గా ఏర్పడినవి. ఇందిరాగాంధి ఫాసిస్టు విధానాల వొత్తిడితో తదితర కొన్ని విప్లవ కమ్యూనిస్టు గ్రూపులు యన్. యన్. సింగ్, పుల్లారెడ్డిల నాయకత్వంలోని సి.పి.ఐ.(యం.యల్)లో చేరి వొక్కటిగా ఏర్పడినవి.

జనతాపార్టీ ప్రభుత్వం ఏర్పడిన తరువాత సింగుగ్రూపు పాలకపార్టీకి మద్దతు నివ్వుటతో యు.సి.సి.ఆర్.ఐ. సింగు లొంగుబాటు రాజకీయాలను తీవ్ర విమర్శకు గురిచేసింది. ఈ పరిణామాలు సింగు గ్రూపులో చీలిక ఏర్పడుట, అదే అఖిలభారత స్థాయిలో పుల్లారెడ్డి గ్రూపుగా, తతనంతరకాలంలో ఆ గ్రూపు మద్దతుతోనే సి.పి.ఐ. (యం.యల్) నాయకత్వాన్ని పుల్లారెడ్డి స్వీకరించుట జరిగింది.

**6.8. లిబరేషన్** గ్రూపు సి.పి.ఐ. (ఎం.ఎల్) నుండి విడిపోయి, 1970 దశకం ప్రారంభంలో కాన్ఫరెన్సు జరిపి సి.పి.ఐ. (ఎం.ఎల్) లిబరేషనుగా నిర్మాణ స్వరూపాన్ని పొందింది. కాని, డిశంబరు 1992లో మాత్రమే పార్టీ కాంగ్రెస్‌లో రాజకీయ పంథాను రూపొందించుకుంది. ఈ పంథా సి.పి.ఐ. పంథా కంటె అతివాదంవైపు మొగ్గుచూపునదిగాను, సి.పి.ఐ (ఎం) పంథాతో పోల్చిన మితవాదంవైపు మొగ్గుగా, అదేకాలంలో రెంటికి భిన్నంగా వుండి, కొన్ని ప్రధాన విషయాలలో అస్పష్టంగా వుంది. వినోద్‌మిశ్రా లిబరేషన్ గ్రూపు నాయకుడుగా "పెద్దన్న వైఖరి" సాగినందున నక్సలైట్లలోని మరికొన్ని గ్రూపులు కలువజాలక పోయ్యాయి.

సి.పి.ఐ. (ఎం.ఎల్) లిబరేషన్ 6వ, పార్టీ కాంగ్రెసు 1977లో నూతన లేక జనతా ప్రజాస్వామ్య విప్లవం లక్ష్యంగా, వ్యూహం, ఎత్తుగడలు రూపొందించబడినవి. మరోవైపున మిత, మతవాద, అభివృద్ధి నిరోధక శక్తులు, వేర్పాటువాదులు బల

బహుట, నూతన సరళీకృత విధానాలతో మధ్యేమార్గవాద శక్తులు పోరాట శక్తుల వాడిని, మొద్దుపారించుతున్నవి. నూతన నమూనా వామపక్ష ఐక్యత స్థిరపునాదిపై ఏర్పడవలసిన అవసరమేర్పడింది.

అదే లక్ష్యంతో లిబరేషన్ గ్రూపు "వామపక్షాల కాన్ఫెడరేషన్" రూపొందించుటను ప్రతిపాదించింది. సమస్య వెలుగులో ప్రధాన శత్రువును ఏకాకిని చేయుటకు ఐక్యసంఘటన ఎత్తుగడలు మంచి సాధనంగా ఎంచబడింది. వర్గశక్తుల పొందికను వివరించింది.

సి.పి.ఐ.(ఎం.ఎల్) 6వ, కాంగ్రెసు "రెండు ఎత్తుగడల పోరాట పంథాగా" ఎత్తుగడలను వివరించింది. పార్టీ స్వతంత్ర పాత్రను యితరులనుండి దూరమగు వరకు సాగదీయకుండుట, బూర్జువా పార్టీల తోక కానుండుటయే యీ ఎత్తుగడల సారాంశము. అయితే అతివాద వక్రీకరణకు గురికాకుండా వుండలేకపోయింది. అవకాశవాద ఎత్తుగడల అనుభవం విరుద్ధపాఠాలను నేర్పింది. అదేఖాలంలో రెడ్ ఫ్లాగు విమర్శనలకు గురికావలసి వచ్చింది.

**6.9. సి. పి. ఐ. (యం.యల్) రెడ్‌ఫ్లాగ్** 1979లో సి.పి.ఐ. (ఎం.ఎల్) నుండి విడిపోయి ఏర్పడింది."రివల్యూషనరీ కమ్యూనిస్టు ఆఫ్ సి.పి.ఐ. (ఎం.ఎల్)గా పిలువబడ్డారు. మావో మరణానంతరం అధికారంలోనికి వచ్చిన "డెంగుహువా గ్రూపు" "మూడు ప్రపంచాల సిద్ధాంతం" పేరుతో మార్క్సిజం-లెనినిజాన్ని వదలివేసి, వర్గ రాజీవిధానాన్ని అనుసరించుతున్నారని తీవ్రంగా విమర్శించింది. అత్యుగ్రవాద పంథాలో పయనించింది. మొదటి పార్టీ కాంగ్రెసు 1982లో జరిగింది. అప్పటినుండి "సి.ఆర్ సి., సి.పి.ఐ.(ఎం.ఎల్)గా పిలువబడుతున్నది. ఈ గ్రూపు ప్రజాస్వామ్య పార్టీ నిర్మాణ విధానాలను వదలివేయుట 1987లో చీలికకు దారితీసింది. ప్రత్యేక కాంగ్రెసు 1988లో జరిపి, మౌలిక అవగాహనలతో తిరిగి కార్యక్రమాన్ని రచియించేపనిని చేబట్టింది. పర్యవసానంగా 1993 ప్లీనంలో కార్యక్రమాన్ని సవరణలతో, మార్పులతో ఆమోదించి, చర్చలకు విడుదల చేసింది.

దేశంలోని వాస్తవ పరిస్థితులను అధ్యయనంచేసి ఏ ప్రాంతాలలో ఏ పోరాట రూపాలు చేపట్టాలో వాటినే చేపట్టుతుంది. ఈ కార్యక్రమం గెరిల్లా స్థావర, రైతాంగ సాయుధ పోరాటాలతో అనుసంధానం చేయబడాలని ప్లీనం, వ్యూహపు దీర్ఘకాలపు కార్యాచరణగా వివరించింది.

**6.10. కమ్యూనిస్టు లీగ్ ఆఫ్ ఇండియా** 3వ, కాన్ఫరెన్సు అక్టోబరు 1992లో జరిగింది. రాజకీయ పంథా, పార్టీ కార్యక్రమము, రాజకీయ తీర్మానం, అంతర్జాతీయ కార్మికవర్గ చారిత్రిక అనుభవాలు, ఐక్యతాభివృద్ధిలో నూతన పురోగమనంపై సైద్ధాంతిక పత్రాలను, సమీక్ష, తీర్మానాలను ఆమోదించింది. దేశం వలస, సెమీ ఫ్యూడలు సమాజంగా పెట్టుబడిదారి విధానం ఆధిక్యత కలదైనదిగా

వుంది. ప్రపంచంలో పెట్టుబడిదారి విధానం వెనకడుగు వేసిన దశలో, సామ్రాజ్యవాదపు పరిమితులతో అభివృద్ధి కుంటి నడకలో వుంది. మన సార్వభౌమాధికారంపై బడా బూర్జువా వర్గం, సామ్రాజ్యవాదంతో కలిసి చేయు దాడులకు గురిఅగుతున్నదనే విశ్లేషణ చేసింది.

లీగ్ బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని నాశనంచేసి, రాజ్యాధికారాన్నుండి దానిని తొలగించి, రాజ్యాధికారాన్ని కార్మికవర్గ నియంతృత్వం స్వాధీనం చేసుకొనాలి. ఇది కార్మికవర్గ నాయకత్వంలో పాలక వర్గాలకు వ్యతిరేకంగా అన్ని వర్గాల ఐక్యసంఘటన ద్వారా జరిగే విప్లవ విజయంతోనే సాధ్యమౌతుంది. విప్లవాత్మక వ్యవసాయ సంస్కరణల నినాదంతో రైతాంగాన్ని సమీకరించాలి. లీగ్ భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని నిర్ద్వందంగా ఆమోదించింది. పెట్టుబడిదారి విధానాన్ని రద్దుచేయు దీర్ఘ కాల లక్ష్యంతో వ్యూహాత్మక ఐక్య సంఘటన రూపొందించాలని నిర్ధారించింది. వ్యవసాయ విప్లవం ఇరుసులాంటిది, చోధక శక్తి అని ఎం.ఎల్. వర్గాలు ప్రధానంగా నొక్కిచెప్పినట్లు కమ్యూనిస్టులీగ్ చెప్పకుండుట, "సమాజంలో పెట్టుబడిదారి విధానం ఆధిక్యత వహించిందని" చెప్పియున్నందునకావచ్చు. అయితే సమాజం (సెమికలూనియల్) సెమి వలస, సెమీ ఫ్యూడలు అనే విశ్లేషణతో పెట్టుబడిదారి విధానం ఆధిక్యత నొందియుందనుటలో "వైరుధ్యం" స్పష్టము.

**6.11. సి.పి.ఐ. (యం.యల్.) పీపుల్సువార్** గ్రూపు 1980లో ఏర్పడింది. ఆంధ్రప్రదేశ్‌లో సి.ఒ.సి. నాయకులు కొందరు కొండపల్లి సీతారామయ్య నాయకుడుగా యీ గ్రూపు నేర్పరచారు. ప్రారంభంలో శ్రీకాకుళం జిల్లా నాయకత్వంతో కలసి వున్నారు. తమ దళాలతో మైదాన ప్రాంతాలలో కూడ గుంటూరు, కృష్ణా, వరంగల్లు, కరీంనగర్ జిల్లాలలో "వర్గ శత్రు నిర్మూలనా విధానాలను" చేపట్టారు. అత్యవసర పరిస్థితి ఎత్తివేసిన తరువాత లీగలుగా ప్రజా సంఘాలను ఏర్పరచి, పనిచేయు అవకాశాలు లభించినా, పూర్తి అతివాద సాహసిక వ్యక్తిగత హింసా విధానాన్నే కొనసాగించారు. పీపుల్స్‌వార్ ఉద్యమం 1980 లోనే వాక స్వరూపాన్ని పొందినా, 1978 లోనే ప్రారంభమైంది. వారు తమ ఉద్యమాన్ని కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలలో వ్యూహాత్మక ఉన్నత దశకు "గెరిల్లా జోన్ నిర్మాణ దశకు" అభివృద్ధి చేయు లక్ష్యంతో సాగించిన "మూడో ఉద్యమం"కలగానే వుండిపోయింది.

"చైనాలోని డెంగ్ ముఠాకు వ్యతిరేకంగా పోరాడండి","యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చండని" నినాదాలను, తీర్మానాలను రాష్ట్ర మహాసభ చేసింది. అదే కాలంలో ఎన్.టి.ఆర్. తెలుగుదేశంతో ఐక్య సంఘటనను సమర్థించుకొంటూ వ్రాసిన పత్రాన్ని ఆమోదించింది. "వాస్తవాల నుండి సత్యాన్ని గ్రహించాలనే సూత్రాన్ని విడనాడి," "దేశంలో విప్లవ పరిస్థితులు పరిపక్వమైనవని, ఉద్యమం సాయుధపోరాట

దశకు చేరిందని, ప్రజలు సాయుధ పోరాటానికి సంసిద్ధులై వున్నారని" స్వీయ మానసిక ప్రభావంలో అతిశయోక్తుల అంచనాలతో నిర్ధారణలు చేయుట పెద్ద తప్పిదము, అతివాద సాహసికవాదము తప్ప మరొకటి కాదు. లెనిన్ పేర్కొన్న "విప్లవ పరిస్థితి-పరిపక్వత" 1967కు కాని, తరువాతగాని మనదేశంలో రూపొందలేదు. పైగా పోరాటాల క్రమంలోనే అట్టి పరిస్థితులు ఏర్పడగలవని కూడ చెప్పి, సమర్థించుకొన్నారు. లెనిన్ విప్లవం, సాయుధ పోరాటంతో చెలగాట మాడరాదని చేసిన హెచ్చరికనూ మరిచారు.

పీపుల్స్‌వార్ రాష్ట్ర మహాసభ చేసిన నిర్ణయాలలో పరస్పర వైరుధ్యాలు గల అంశాలు అనేకం వున్నాయి. అంతర్జాతీయ సామ్రాజ్యవాదానికి, వెనుకబడిన వలస, అర్ధవలస దేశాలలోని ప్రజాసామాన్యానికి ప్రధాన వైరుధ్యమని మహాసభ రాజకీయ తీర్మానాన్ని ఆమోదించింది. అదే మహాసభ, సామ్రాజ్యవాదం, సోషల్ సామ్రాజ్యవాదం రెండూ వొకవైపున, వాటి బెదరింపులకు గురిఅగుతున్న దేశాలకు మధ్యగల వైరుధ్యం ప్రధాన వైరుధ్యంగా చెప్పుతున్న మూడు ప్రపంచ శిబిరాలు అన్న సిద్ధాంతాన్ని ఏకగ్రీవంగా ఆమోదించుటలోని పరస్పర వైరుధ్యం స్పష్టం.

పాలకవర్గాలలోని ఏ వొక్క సెక్షనుతోను ఐక్య సంఘటనను నిర్మించరాదన్న రాజకీయ తీర్మానాన్ని ఆమోదించిన మహాసభే, దానిని వ్యతిరేకించే మూడు ప్రపంచాల సిద్ధాంతాన్ని, తెలుగుదేశపు ఎన్. టి.ఆర్.తో ఐక్యసంఘటనను ప్రతిపాదించే పత్రాన్ని ఏకగ్రీవంగా ఆమోదించుటలోని వైరుధ్యం స్పష్టం. అదే విధంగా మనదేశం స్వతంత్ర దేశమా కాదా అన్న విషయంలో పరస్పర వైరుధ్యాంశాలు గల తీర్మానాలు చేయబడినవి.

**6.12. విప్లవదశకంతటికీ వ్యూహం మారదు,** రాజకీయ పరిస్థితుల బట్టి ఎత్తుగడలు మారుతవని, మరోవైపున ప్రపంచ పరిస్థితులలో సామాజిక సంబంధాలలో మార్పులు వచ్చిన వ్యూహం, ఎత్తుగడలు జంటగా మారుతవని ఆమోదించుటలోని వైరుధ్యము స్పష్టంగా కనబడుతున్నది.

ఎత్తుగడల పంథా, విప్లవోద్యమాన్ని మూడుదశలుగా విభజించింది. మొదటి దశలో విప్లవ ప్రచారం, మిలిటెంటు పోరాటాలు నిర్వహించుట ద్వారా, గెరిల్లా జోన్ నిర్మాణానికై జరిపే రెండవదశ పోరాటానికి రంగాన్ని సిద్ధం చేయాలి. మూడవ దశను విప్లవయుద్ధ స్థావర ప్రాంత నిర్మాణ పోరాట దశగా ఎత్తుగడల పంథా పేర్కొన్నది. మారుతున్న రాజకీయ పరిస్థితి, వర్గశక్తుల పొందికలపై ఆధారపడి, నూతన ఎత్తుగడలు రూపొందించాలనే ప్రాథమిక మార్క్సిస్టు-లెనినిస్టు అవగాహనా లోపం స్పష్టము. రాజకీయ, సామాజిక పరిస్థితులలోని చలనాన్ని చూడజాలక, ఎత్తుగడల పంథా జడాత్మకంగానే పీపుల్స్‌వార్ దృక్పథం సాగింది. వెనుదిరిగి సెక్టేరియనిజం 1947-50 లలో ప్రతిపాదిక ఆధ్రికి పోరాటాన్ని సార్వత్రిక

సాయుధ పోరాటంగా చేయాలనే ఎత్తుగడలతో అతివాద సాహసిక దుందుడుకు వాదంలో మునిగిపోయింది. పీపుల్స్‌వార్ ఎత్తుగడల పంథా మిలిటెంటు పాక్షిక ఆర్థిక పోరాటాలను విముక్తి పోరాటంకై జరిగే ప్రజాయుద్ధంగా మార్చాలనే విఫల యత్నాలు చేసింది. రెండూ అతివాద సాహసిక దుందుడుకు సెక్టేరియన్ పంథాలే మార్క్సిజం-లెనినిజం ఆమోదించదు. ఫలితాలు వేరుగా వుండవు.

# vii

**7.1.** "ఎ.పి.సి.సి.సి.ఆర్." ఆంధ్ర విప్లవ కమ్యూనిస్టులు అతి వాద అవకాశవాదం, సాహసికవాదంపై సైద్ధాంతిక పోరాటం ప్రారంభించుటతో పాటు సమానాంతరంగానే ఐక్యతా ప్రయత్నాలను ప్రారంభించారు. సరైన పంథా కోసం జరిగే పోరాటంతోపాటు ఐక్యతా పోరాటం కూడ ప్రారంభమైంది. అది ఎంతగాపురోగమించితే అంతగా, ఆ పంథాచుట్టూ విప్లవకారులందరూ ఐక్యమగుతారు. సైద్ధాంతిక పోరాటం నిజాయితీరు ఐక్యతకై జరిగే పోరాటం రెండూ విడదీయ రానివని, ఎవరైనా సరైన పంథా లేకుండా ఐక్యతను గురి-చి ఆలోచించితే అది వాస్తవికతపై ఆధారపడని వూహాజనితమే అగుతుంది, ఆచరణ ఆకాశసౌధ మగుతుంది.

"ఎ.పి.సి.సి.సి.ఆర్."ల కమిటి, తమ "భారత విప్లవకారుల్లో అతివాద ధోరణి" అన్న పత్రం విప్లవకారులు. గ్రూపులు ఎలా ఐక్యమవ్వాలో వివరించిందని తెలిపింది.

**7.2.** "ఎ.పి.సి.సి.ఆర్." విప్లవ మ్యూనిస్టు వ్యక్తులు కాని గ్రూపులుగాని ఐక్యమగు విధానాన్ని వివరించింది. క్లుప్తంగా ఇచ్చిపుచ్చుకొనే పద్ధ తిలో సంబంధాలు ఏర్పరచుకొని ఒకే నిర్మాణంలో ఐక్యమయ్యే కోరిక బలంగా వుండాలి. ఒక ఎత్తుగడగా వుండరాదు. పరస్పరం డాక్యుమెంట్లు అందజేసుకొనుట, పరస్పర అనుభవాలు, అభిప్రాయాలు తెలుసుకొనుట ఐక్యతకు తోడ్పడుతుంది. అధ్యయనాంతరం అన్ని ముఖ్యాంశాలపై తన లేక గ్రూపు అభిప్రాయాలను వ్యక్తం చేయాలి. గత మూడేళ్ళగా వారి కార్యకలాపాలపై ఆత్మవిమర్శనాత్మకంగా పరిశీ లించుకొనాలి. తగిన పార్టీ కమిటి మార్గదర్శకత్వంలో పాత తప్పులను సరిచేసు కొనాలి. పార్టీ పంథాను అమలుచేయుటకై రూపొందించబడిన డాక్యుమెంట్లను ఆమోదించి, అమలుచేయాలి. పంథా అమలుకు చేబట్టిన నిర్మాణ చర్యలను బలపర చాలి అమలుచేయాలి. మౌలిక పంథాకు, వ్యవసాయ విప్లవ రైతాంగ సాయుధ పోరాట అవగాహన వుండాలి. సాయుధ పోరాటం భూమి పంపక దశలోని పోరాట రూపం మాత్రమే కాని తక్షణ, పాక్షిక పోరాట రూపం కాదని తెలంగాణా అను భవం నిరూపించింది. మౌలిక పంథా, ఎత్తుగడల ప్రాతిపదికపై నిర్మాణ ఐక్యత సాధ్యం, అవసరం.

**7.3.** **కార్యక్రమం పంథా, నిబంధనావళి** ముసాయిదాలో మార్పులు చేయుటకు సంసిద్ధత వ్యక్తపరిచారు. ఐక్యతా సదస్సుకు సమాన ప్రాతినిధ్యసూత్రం పాటించబడంది. ప్రాతినిధ్యం నిర్ణయించే సమావేశంలో ఎ.పి.సి సి.సి.ఆర్. పశ్చిమ బెంగాల్ సి.సి.ఆర్.,యస్.జడ్.సి , పశ్చిమబెంగాల్ సి.యు.సి.లు పాల్గొన్నవి. ఐక్యతాసదస్సు 1975 ఏప్రిల్‌లో జరిగింది. కార్యక్రమం, పంథా, నిబంధనావళి, పనివిధానాలపై తీర్మానాలు ఆమోదించబడినవి. సదస్సు కేంద్ర కమిటీని కార్య దర్శిగా దేవులపల్లిని ఎన్నుకొన్నది. కార్యదర్శి వాస్తవ సమాచారం ఆధారంపై చర్చలద్వారా విభేదాలను పరిష్కరించుకొనాలన్నారు.

అఖిల భారత నిర్మాణాన్ని త్వరితంగా ఏర్పాటు చేయాలనే ఆతురతతో ఐక్యతాక్రమాన్ని సరళీకృతం చేయు ధోరణితో వ్యక్తమైన తప్పులను, అవకాశవాద ధోరణులపై శక్తివంతంగా పోరాడుటలో విఫలమైంది. ఉదారవాదానికి అవకాశ మిచ్చింది. అంచేత ఆనాడు ఎ.ఐ.సి.సి.సి.ఆర్.తో ఐక్యతను కోరుకొన్న సంస్థలు వేచిచూచే వైఖరి చేబట్టాయి. ఐక్యతా ప్రయత్నాలు సాధారణ పంథాను పరిరక్షించు కొంటూ, మితవాద-అతివాద అవకాశవాదాలపై నిరవధిక పోరాటం ద్వారానే మార్క్సిజం-లెనినిజం, కార్మికవర్గ అంతర్జాతీయత కాపాడబడుతుంది. విచ్ఛిన్నకర పెడ ధోరణులు, ప్రాక్షనులు వొకవైపున, ఐక్యతా నిర్మాణ శక్తులు మరో వైపున పని చేస్తున్నవి ఐక్యత నెలకొల్పుటలో విచ్ఛిన్నకారులకు పాత్ర వుండరాదు. మేజు వాణి ఐక్యతా ప్రకటనలు చాలవు. ఆచరణయే గీటురాయి కావాలి.

విప్లవకారులను ఐక్యంచేసి, భారత విప్లవానికి సమర్థవంతమైన విప్లవ పార్టీని, నాయకత్వాన్ని రూపొందించే కర్తవ్య నిర్వహణ ప్రయత్నాలలో కా. నాగి రెడ్డి రూపొందించిన దృక్పథం మార్గదర్శికంగా వుంది. వాటిని దృఢ చిత్తంతో అమలు చేసిన మేరకు సత్ఫలితాలనిచ్చాయి. పెడ ధోరణులు ఐక్యతా లక్ష్యాన్ని, గౌరవను దెబ్బతీసాయి.

**7.4.** **విడిపోయిన తరువాత** తిరిగి ఏర్పడే ఐక్యత స్థిరత్వంతో కూడి నదై వుంటుందనే సిద్ధాంతీకరణ, చీలికలను నివారించుటకుగాని, స్థిరత్వంతో కూడిన ఐక్యతను రూపొందించుటకుగాక మరిన్ని చీలికలకే దారితీసే ప్రమాదకర సిద్ధాంతీ కరణ తప్ప మరొకటి కాదు. పైగా చీలికలను సమర్థించుకొనుటకే యీ సిద్ధాంతీ కరణ వుపయోగపడే అవకాశాలే ఎక్కువగా వున్నాయి.

**7.5.** **సి.పి.ఐ. (ఎం. యల్) జనశక్తి** విప్లవకారుల ఐక్యతా విజ్ఞప్తికి సుముఖంగా స్పందించిన సి.పి ఐ.(ఎం.ఎల్) రెడ్‌ఫ్లాగ్ తాత్కాలిక కమిటీ 1993-'94 లలో తరచు సంప్రదింపులు జరిపి వొక అవగాహనకు రాగలిగారు. అదే విధంగా సి.పి ఐ. (ఎం.ఎల్) ఖాయిజీ గ్రూపు సంభాషణలు జరిపి, విప్లవ పంథా కార్యక్రమం, వ్యూహం, ఎత్తుగడలపై మౌలికాంగీకారం కుదిరి 1994లో సంయుక్త కన్వెన్షన్‌లో ఐక్యమై నిర్మాణాన్ని సి.పి.ఐ. (ఎం.ఎల్) జనశక్తిగానే

ఆమోదించారు. అట్టి సంయుక్త సమావేశం, రెడ్ఫ్లాగ్ గ్రూపుతో జరిగి మూడు ముఖ్య నిర్ణయాలు ఆమోదించారు. అవి, సి.పి.ఐ. (ఎం.ఎల్) జనశక్తి 1993లో ఆమోదించిన కార్యక్రమం, విప్లవ పంథా, నిర్మాణ సూత్రాలు, జాతీయ, అంతర్జాతీయ కర్తవ్యాలపై ఆమోదం, మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానాలను సైద్ధాంతిక ప్రాతిపదికలుగా, నూతన ప్రజాస్వామ్య విప్లవదశగా, వ్యవసాయ విప్లవం దాని ఇరుసుగా, దీర్ఘకాల ప్రజాయుద్ధ పంథాయే మార్గంగా, విప్లవకారుల ఐక్యత, విప్లవోద్యమాన్ని పునర్నిర్మించుట తక్షణ కార్యక్రమంగా చేబట్టుటతోపాటు, సామ్రాజ్యవాద శక్తులను, వారి అనుకూల అభివృద్ధి నిరోధక విధానాలు తిరుగగొట్టి, నూతన ప్రజాస్వామ్య విప్లవాన్ని ఆవిష్కరించుట కర్తవ్యంగా ఆమోదించారు. అదే విధంగా కమ్యూనిస్టు విప్లవకారుల ఐక్యతకై విజ్ఞప్తి చేసారు.

**7.6. పాక్షిక ఐక్యత, సంలీనం** మాత్రమే లక్ష్యంగా వుండరాదు. అది భవిష్యత్తులో యితర పార్టీలు, గ్రూపులు ఐక్యమగుటకు ప్రథమ సోపానాలుగా వుండి, అన్ని గ్రూపులు ఐక్యమగుటకు తోడ్పడునదిగా అదే లక్ష్యంగా వుండాలి. వివిధ విప్లవ కమ్యూనిస్టు గ్రూపుల మధ్య విప్లవ పంథాపై. వ్యూహంపై మౌలిక అభిప్రాయ భేదాలు లేనపుడు, పరస్పర ఆమోదం గల అంశాలే యెక్కువగా నున్నపుడు, అంత ముఖ్యంకాని అంశాలలో మాత్రమే భేదాభిప్రాయాలు వుండి, అవి చర్చలు, సంప్రదింపుల ద్వారా అధిగమించగల అవకాశాలే ఎక్కువగా నున్నపుడు ఒకే నిర్మాణంలో ఐక్యమగుటకు అంత అభ్యంతర ముండరాదు. మిగిలిన అభిప్రాయ భేదాలను ఐక్య కార్యాచరణలోని ఆచరణ అనుభవాలద్వారా సరిచేసుకొనుట శాస్త్రీయ విధానము.

**7.7. ఏడు కమ్యూనిస్టు విప్లవకారుల సంస్థలు,** సి.పి.ఐ. (ఎం.ఎల్) జనశక్తి, సి.పి.ఐ.(ఎం.ఎల్) ప్రతిఘటన-రెసిస్టెన్స్, యు.సి.సి.ఆర్. (ఎం.ఎల్), సి.పి.ఐ. (ఎం.ఎల్) పైలా, సి.పి.ఐ.(ఎం.ఎల్) కౌశిక్ బెనర్జీ-అగామి యుగ్, సి.పి.ఐ. (ఎం.ఎల్) కోకస్ మజుందార్, సి.సి.సి.ఆర్. పదిమళదాస్ గుప్తా, యు.సి.ఆర్. జితేన్ గుప్తా వర్గాల నాయకులు ప్రతినిధి వర్గాలతో ఐక్యతా సంప్రదింపులలో జులై 1992 చివరలో పాల్గొని జయప్రదం చేసారు. సంయుక్తంగా సి.పి.ఐ ( ఎం.ఎల్ ) జనశక్తిగా ఏర్పడుటకు వొప్పందానికి వచ్చి ఐక్యతా ప్రకటనను, విజ్ఞప్తిని విడుదల చేశారు.

**7.8. ఏడు యం.యల్. పార్టీల** సమిష్టి అవగాహనలు, దృక్పధాన్ని అనుసరించి, చేయబడిన నిర్ధారణల సారాంశం యిలా వుంది.

పూర్వ కమ్యూనిస్టు ఉద్యమ కొనసాగింపే, నేటి కమ్యూనిస్టు ఉద్యమం, సంస్కరణవాదం, నియో సంస్కరణ వాదాలను త్రోసిబుచ్చి నక్సల్బరీ వుద్యమంగా జన్మించి, యం. యల్. ఉద్యమంగా రూపొందింది. కమ్యూనిస్టు విప్లవకారులందరిని వొక్క గొడుగు క్రిందకు చేర్చి ఎ. ఐ. సి. సి. సి. ఆర్. ను

ఐక్య నిర్మాణంగా చేయ ప్రయత్నించుట సరియైన చారిత్రక నిర్ణయం. ఎ.ఐ. సి.సి.సి.ఆర్. ఏర్పడిన తరువాత పశ్చిమ బెంగాల్‌లో రెండు దృక్పథాలు వర్గాలుగా అగుట, ఆంధ్రప్రదేశ్‌లో చీలికవచ్చి ఎ.పి.సి.సి.సి.ఆర్. ఏర్పడుట జరిగింది. సి.పి.ఐ.(ఎం.ఎల్.) ప్రజాయుద్ధ పంథా ప్రాతిపదికగా 1999 ఏప్రిల్‌లో ఏర్పడింది. నక్సల్బరీ కమ్యూనిస్టు విప్లవకారులు, సి.పి.ఐ.(ఎం.ఎల్.) నాయకత్వాలు అతివాద దుందుడుకు సాహసికవాదాన్ని చేబట్టి వ్యక్తిగత హింసావాదులయ్యారని ఎ.పి.సి. సి.సి.ఆర్. తీవ్రంగా విమర్శించింది. ఫలితంగా ఎ.పి.సి.సి.సి.ఆర్. బహిష్కరించ బడింది.

సి.పి.ఐ.(ఎం.ఎల్.)లో అంతర్గతంగా, బయటా అతివాద సెక్టేరియనిజం, వ్యక్తిగత హింసావాద వ్యతిరేక పోరాటం ఫలితంగా, మౌలిక ప్రజాపంథా గ్రూపు ఏర్పడి, సైద్ధాంతిక, రాజకీయ పోరాటాన్ని సాగించింది. గత రెండు "దశాబ్దాల కాలంలో కమ్యూనిస్టు విప్లవకారులు వివిధ కలయికలకు, విడిపోవుటలకు లోన య్యారు. అతివాద వక్రీకరణ, వ్యక్తిగత హింసావాదం, సెక్టేరియనిజం, విచ్ఛిన్నకర నిస్పృహ, నిరాశావాదం వివిధ రూపాలలో ఏర్పడింది. మితవాద, అతివాద వక్రీ కరణలు ప్రమాదకరమైనవి అయ్యాయి.

పార్టీ నిర్మాణరంగంలో ముఠాతత్వం, పాక్షనలిజం, అధికార నియంతృత్వం, పార్టీ అంతర్గత చర్చలలో ప్రధాన సూత్రాలను వక్రీకరించుట, సైద్ధాంతిక పోరాటాన్ని నిందా, అపనిందలు, దూషణలతో ప్రక్కదారులు పట్టించుట జరిగి చీలికల మీద చీలికలు ఏర్పడినవి. అవకాశవాదం, అనారోగ్యకర పెడ ధోరణులు పెరిగిపోయి, క్రమశిక్షణపోయి, పార్టీ ఉక్కుశిక్షణ భగ్నమైపోయింది. ఫలితంగా కమ్యూనిస్టు విప్లవకారులలో సూత్రబద్ధ ఐక్యతా నిర్మాణం కుంటుపడింది.

**7.9. కమ్యూనిస్టు విప్లవకారులు** గత ఇరవై సంవత్సరాలలో వొకే వొక ఐక్యపార్టీ నిర్మాణావకాశాలను వినియోగించుకొనుటలో విఫలులయ్యారు. ఫలితంగా ఐక్యతా విచ్ఛిన్నం మరింతగా పెరిగి అనేక పార్టీలు, ఉప పార్టీలు, గ్రూపులుగా అయ్యారు. ప్రజాస్వామ్య కేంద్రీకరణ నిర్మాణ సూత్రమన్న పేరుతో ఆజ్ఞలు జారీచేసే నిరంకుశత్వాన్ని అనుసరించుతూ, భిన్నాభిప్రాయాలను చర్చించి సమిష్టి అవగాహనలను పెంపొందించుకొనుటకు మారుగ గ్రూపులు, ఉపగ్రూపులుగా చీలిపోయారు. కమ్యూనిస్టు విప్లవకారులలో ఏ వొక్క పార్టీ లేక గ్రూపు విప్లవకారు లలో మెజారిటిని తమ నిర్మాణంలోనికి తీసుకొని రాగలిగామని చెప్పే ధైర్యంలేదు. ఐక్యపార్టీ కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రాలను అనుసరించుతారని తెలిపింది.

ఈ మౌలిక అవగాహనతో విడివిడి పార్టీల, గ్రూపుల రద్దును వొకేవొక పార్టీగా పునర్నిర్మాణాన్ని చేబట్టగలమనే మా నిర్ణయాన్ని ప్రకటించుతున్నామని, అది సి.పి.ఐ.(ఎం.ఎల్.) జనశక్తిగా పిలువబడుతుందని, జనశక్తి పార్టీ కేంద్ర

కమిటీ పత్రికగా పనిచేస్తుందని ప్రకటించారు. కా. కె. రామచంద్రన్‌ను ఐక్యపార్టీ జనరలు సెక్రటరీగా ఎన్నుకొన్నారు.

**7.10. మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం** ఐక్యపార్టీకి మార్గదర్శికము. మన విప్లవం జనతా ప్రజాస్వామ్య విప్లవం, వ్యవసాయ విప్లవం దాని ఇరుసు. ఈ విప్లవం సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం, కంప్రెడరీ బూర్జువా వర్గం, పెట్టుబడిదారి వర్గాల వ్యతిరేక విప్లవం, మధ్యతరగతి, జాతీయ బూర్జువా వర్గం కార్మికవర్గ నాయకత్వంలో విప్లవ ప్రజాస్వామ్య కర్తవ్యాలను పరిపూర్తి చేస్తుంది ఒక్కమాటలో ఏడు పార్టీలు కలిసి వొకే వొక పార్టీగా ఏర్పడి చేసిన ఐక్యతా ప్రకటన సారాంశం యిది.

# ఉ ప సం హా రం

**1. కమ్యూనిస్టులు సాంప్రదాయంగా** ప్రతి పార్టీ కాంగ్రెసులో "ప్రపంచ పెట్టుబడిదారి విధానం "ఆర్థిక సంక్షోభం"లో మునిగిపోవుట, అనుబంధంగా దేశరిలో "ఆర్థిక సంక్షోభం" ఫలితంగా విప్లవ పోరాటాల విజృంబణ, విప్లవ పరిస్థితులు, దానిని విజయవంతం చేయుటకు విప్లవ కర్తవ్యాలు నిర్ధారించుట, మొక్కుబడి కార్యక్రమం అయింది. స్వతంత్ర జాతీయ, అంతర్జాతీయ ఆర్థిక, రాజకీయ, సామాజిక వాస్తవ పరిస్థితి, భౌతిక పరిస్థితుల అధ్యయనం, విశ్లేషణలు నుండిగాక విదేశీ అవగాహనలను దిగుమతి చేసుకొనుట సాంప్రదాయమైనందుననే, అట్టి అవగాహనలతో చేయబడిన నిర్ధారణలు ఆచరణ కార్యక్రమాలు అశాస్త్రీయం, ఊహాజనితంగానే వుండిపోయాయి. కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర నేర్పే మార్క్సిస్టు-లెనినిస్టు సత్యం, పాఠమిది. ఈ వైఫల్యం కారణంగానే సి.పి.ఐ. నుండి చీలి సి.పి.ఐ.(యం), అందుండి సి.పి.ఐ.(ఎం.ఎల్.) వివిధ గ్రూపులు ఏర్పడినవి. అంటే ఒక నిర్మాణంయొక్క సైద్ధాంతిక, ఆచరణ బలహీనతే మరో నిర్మాణ ఆవిర్భావానికి హేతువై బలాన్నిచ్చింది. మాతృసంస్థ చర్యలకు ప్రతిచర్యలుగా ఏర్పడిన నిర్మాణాలే కాని, స్వతంత్ర సిద్ధాంతం, స్వబలంపై ఏర్పడినవికావు. ఆ విధంగా ఏర్పడిన నిర్మాణాలు తమ ఊహాజనిత అశాస్త్రీయ, అవాస్తవికత పునాదులుగా "తమ తమ గాడి"లో పెడ సిద్ధాంతాలను రూపొందించుకొన్నవి.

**2. పాలకవర్గాల** ప్రతీఘాతక విప్లవశక్తుల రాజ్యహింసకు ప్రతిగా "ప్రసవ వేదన" సమయంలో "శస్త్ర చికిత్స" నినియోగించబడు విధంగా, దీర్ఘకాల ప్రభుత్వ హింసను అంతం చేయుటకై కార్మికవర్గం చేబట్టు సాయుధ బలప్రయోగాన్ని మార్క్సిజం-లెనినిజం బలపరుస్తుంది. అట్టి కార్మిక వర్గ సాయుధ విప్లవ పోరాటాలను దిగజార్చి, వ్యక్తిగత హింసా వాదానికి "వర్గ శత్రు నిర్మూలన" అని సిద్ధాంతీకరించి, చేబట్టే అరాచక హింసావాదాన్ని మార్క్సిజం-లెనినిజం ఆమోదించదు. ప్రజల పాత్రలేని ఏ పోరాట రూపాన్ని ఆమోదించదు.

**3. కమ్యూనిస్టు విప్లవకారులలో** 1968–72 మధ్య, మరో విడత 1980 దశకంలో అంతర్గత సైద్ధాంతిక పోరాటం ఫలిత గా, ఆచరణ అనుభవాలతో సైద్ధాంతిక వివరణలు, అవగాహనలలో కొంత స్పష్టత చేకూరింది. సన్యాల్ "తెరై నివేదిక"తో పాటు విప్లవ కమ్యూనిస్టు ఉద్యమంలో అతివాద అవకాశవాదం అనే ఆంధ్ర విప్లవకారుల పత్రం, ప్రథమ పునరాలోచనా ఫలితాలు. ఇవి మౌలికంగా 1951నాటి పత్రాల ప్రభావాలనుండి బయటపడకపోగా, వాటినే మరో మాటలలో పునరుద్ఘాటించుట జరిగింది. సాయుధ పోరాట రూపం మౌలిక రూపమే అయినా, సర్వత్రా యిదొక్కటే పోరాట రూపం కాదని, ప్రజల పాత్రగల అన్ని పోరాట రూపాలు, ఎన్నికల పోరాట రూపంతోసహా అన్నీ వినియోగించబడాలనే అవగాహన కూడ వుంది. ప్రజాయుద్ధం ఎదురుదాడి కాక ప్రతిఘటనా పోరాటరూపం అని వివ రించారు.

**4. విప్లవ పంథాకై** సైద్ధాంతిక పోరాటంతోపాటు, వివిధశ్రేణుల ఐక్యతా పోరాటం కూడ సమానాంతరంగానే సాగింది. నూతన ప్రజాస్వామ్య విప్లవానికి వ్యవ సాయ విప్లవం ఇరుసని, సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాలు సాధనాలని, భూమి పంపక దశలో సాయుధపోరాటం ప్రధానరూపమని, ప్రజలపాత్ర తప్పనిసరియని అన్ని పోరాటరూపాలు వినియోగించాలనే మౌలిక అంశాలపై, వొక్క పీపుల్స్‌వార్ గ్రూపుతప్ప అన్ని గ్రూపులలో వొక సాధారణ అవగాహన పెంపొందింది. విప్లవ కారులను ఐక్యంచేసి, సమాన ప్రాతినిధ్య ప్రాతిపదికపై భారత విప్లవానికి విప్లవ పార్టీని, సమర్థవంతమైన విప్లవ కమ్యూనిస్టు నాయకత్వాన్ని నిర్మించాలనే అవగా హన ప్రబలింది. ఆచరణ కొనసాగుతున్నది, పురోగమనం గణనీయంగానే వుంది. ఏడు కమ్యూనిస్టు విప్లవ సంస్థలు సి.పి.ఐ.(ఎం.ఎల్) జనశక్తిగా ఏర్పడుటయే నిదర్శనం. ఈ ఆలోచనా ధోరణి నూతన సహస్రాబ్దిలో మరింత పురోగమించి భారత కమ్యూనిస్టు ఉద్యమంలో పునరైక్యత ఏర్పడి, పునర్జీవం పొందుతుందని ఆశిద్దాం.

**5. ఐక్యతాక్రమానికి** గల అడ్డంకులను అదేకాలంలో విస్మరించజాలం. స్వాతంత్ర్యానంతర అర్ధశతాబ్దంలో భారతీయ సమాజంలో వచ్చిన మార్పులు శాస్త్రీయ అధ్యయనం, విశ్లేషణ, పరిశీలనలతో తాత్కాలిక సూత్రీకరణల రూపొం దించి, ఆచరణానుభవాలను శాస్త్రీయంగా సైద్ధాంతిక నిర్ణయాలను స్వతంత్రంగా చేయక, 1951 నాటి సూత్రీకరణలనే పిడిసూత్రాలనే కొనసాగిస్తే గత అర్థశతాబ్దిలో "మిస్సయిన రైలు" నూతన సహస్రాబ్దిలో శ్రీ. శ్రీ. చెప్పినట్లు మరో "జీవితకాలం లేటు" కావచ్చు. చరిత్ర పురోగతి అవిచ్ఛిన్నం, అది ఆగదు. పురోగమన వేగమే మారుతూ వుంటుంది.

—o—